# శ్రీ రామానుజ కీర్తి కౌముది



శ్రీ వైష్ణవ ధర్మ విజ్ఞాన సుమ పరిమళములతో వెల్లి విరియు

అపూర్వ గ్రంథము

సచిత్రము

మొదటి భాగము




సంపాదకుడు:

ధనకుధరం వరదాచార్యులు

శ్రీ లక్ష్మీ నారాయణ పురము

గుంటూరు — 4.




ప్రకాశకులు:

తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి

మొదటి ముద్రణము 1000 ప్రతులు

పరీధావి విజయదశమి
అక్టోబరు 1972

★

శ్రీ రామానుజ శకము

౯౫౪

★

మూల్యము
పది రూపాయలు

★

ముద్రణ
తిరుమల తిరుపతి దేవస్థానముల ముద్రణాలయము
తిరుపతి



# శ్రీ రామానుజ కీర్తి కౌముదీ ప్రకాశ ప్రశంస

'మహాకవి'

శ్రీమాన్ విక్రాల శేషాచార్యులు

श्री वेंकटेशाय नमो नमस्तात्
रामानुजार्याय नमो नमस्तात्
मतं यदीयं परमं विशिष्टा
द्वैतं यत स्त त्पुनरुद्धृतं च ॥

శ్రీ వేంకటేశాయ నమో నమస్తాత్
రామానుజార్యాయ నమో నమస్తాత్
మతం యదీయం పరమం విశిష్టా
ద్వైతం యతస్త త్పున రుధృతం చ.

(శ్రేష్ఠమైన విశిష్టాద్వైత మతము (శ్రీవైష్ణవ మతము) ఏ రామానుజులవారి చేత (ఆతంకములుగా ప్రబలిన దుర్మతములను ఖండించి) తిరిగి అభివృద్ధిఁ గావించఁ బడినదో – అట్టి శ్రీ వేంకటేశ్వరుని కొఱకు నమస్కారము లగుఁ గాత। ఆ రామానుజులవారి కొఱకును నమస్కారము లగుఁగాత।।

संतर्पयन्ती विबुधान्तरङ्गा
ण्यंतस्तमस्सन्तति मर्दयन्ती
तापोपशान्ति च समार्जयन्ती
विभाति रामानुज कीर्ति कौमुदी ॥

సంతర్పయన్తీ విబుధాన్తరంగా
ణ్యంతస్తమస్సన్తతి మర్దయన్తీ
తాపోప శాన్తిం చ సమార్జయన్తీ
విభాతి రామానుజ కీర్తి కౌముదీ.

పండితులయొక్క అంతరంగముల నానందింపఁ జేయునదియు - 'ప్రథమాం పిబతే వహ్నిః' అను ప్రమాణానుసారము ఆహారమై, దేవతల యుల్లములకు తృప్తి నిచ్చునదియు - హృదయము నందలి తమస్సు అయిన అజ్ఞాన సమూహమును హరించునదియు - భూనభోంతరస్థమైన కటిక చీఁకటిని బోఁగొట్టునదియు - అధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము అను తాపత్రయమును శమింపఁ జేయునదియు - ఆతప బాధను నివారింపఁ జేయునదియు నగు శ్రీరామానుజులవారి కీర్తి యనెడు కౌముది (శ్రీ రామానుజ కీర్తి కౌముది) ప్రకాశించుచున్నది.

सन्मार्ग संदीप्ति मुपार्जयन्ती
सम्यक् पवित्रा सकलोपसेव्या
सुदृक् प्रमोदं च विवर्धयन्ती
विभाति रामानुज कीर्ति कौमुदी ॥

సన్మార్గ సందీప్తి ముపార్జయన్తీ
సమ్యక్ పవిత్రా సకలోపసేవ్యా
సుదృక్ ప్రమోదం చ వివర్ధయన్తీ
విభాతి రామానుజ కీర్తి కౌముదీ.

సదాచారమునకు శోభనుఁ గూర్చునదియు - ఆకాశ పథమునకు వెలుఁగు నిచ్చునదియు మిక్కిలి పవిత్రమైనదియు - కళారాధకులైన విద్వాంసులచే నంసేవింపఁ దగినదియు - ప్రజలందఱి చేతను ప్రశాంతముగా బరిశీలింపఁ దగినదియు - మంచి జ్ఞానము గలవారికి సంతసమును బెంచునదియు - బాగుగా దృష్టి గలవారికి ఆనందమును ప్రసాదించునదియు నగు శ్రీ రామానుజ కీర్తి కౌముది ప్రకాశించుచున్నది.

विद्वच्चकोरावळि हर्षकारिणी
विद्वद्वरश्री वरदार्य चंद्रजा
अज्ञान भारांध तमः प्रमाथिनी
विभाति रामानुज कीर्ति कौमुदी ॥

విద్వచ్చకోరావళి హర్షకారిణీ
విద్వద్వర శ్రీ వరదార్య చంద్రజా
అజ్ఞాన భారాంధ తమః ప్రమాథినీ
విభాతి రామానుజ కీర్తి కౌముదీ.

పండితు లనెడు చకోరములకు హర్షదాయకమైనదియు - విద్వద్వరేణ్యులైన శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులవా రనెడు చంద్రునివలన జనించునదియు - అతిశయించిన అజ్ఞానమనెడి అంధకారమును హరింపఁ జేయునదియు నగు శ్రీ రామానుజ కీర్తి కౌముది ప్రకాశించుచున్నది.

त्रय्यंतं विविदिषतां निशांतशांत
स्वाचार्यं त्वनघतमा निकाम मिंधे
त्रय्यन्ते स्फुटयति यन्निगूढ मर्थं
श्री रामानुज गुरु कीर्ति कौमुदीयम् ॥

త్రయ్యంతం వివిదిషతాం నిశాంత శాంత
స్వాచార్యం త్వనఘతమా నికామ మింధే
త్రయ్యన్తే స్ఫుటయతి యన్నిగూఢ మర్థం
శ్రీ రామానుజ గురు కీర్తి కౌముదీయమ్.

పాపహరమైన ఈ శ్రీ రామానుజకీర్తి కౌముది - వేదాంత శాస్త్రమునందలి నిగూఢము లైన యర్థములను దెల్పునది కనుక, వేదాంతము నెఱుంగ గోరిన వారికి - గృహమునం దుండెడు సౌమ్యుడైన గురువువలె మిగుల ఒప్పుచున్నది.

आशाऽऽस्याऽधिक सुषमाऽऽकरत्वशंस्या
प्राचुर्या त्कुवलय मंगळ प्रदात्री
श्री रामानुज शुभकीर्ति कौमुदीद्धा
जीया त्सद्गुणहृदय प्रहर्षिणीयम् ॥

ఆశాఽఽస్యాఽధిక సుషమాఽఽకరత్వశంస్యా
ప్రాచుర్యా త్కువలయ మంగళప్రదాత్రీ
శ్రీ రామానుజ శుభకీర్తి కౌముదీద్ధా
జీయా త్సద్గుణ హృదయప్రహర్షిణీయమ్.

కోరదగిన అధికమగు (మంచికాగితములు, ముచ్చటగొల్పు ముద్రణము, చక్కని బైండు ఇత్యాదులచే) సౌందర్య శోభకు ఆస్పదమగుటచేత ప్రశంసింపదగినదియు, దిక్కులయొక్క ముఖములకు మిక్కుటమైన వెన్నెల (వెలుతురు)ను కలిగించునది గావున స్తుతింపదగినదియు - అధికముగ భూ మండలమునకు, కలువలకును, శుభములను చేకూర్చు నదియు - విద్వాంసులయొక్కయు, నక్షత్రమండలము యొక్కయు హృదయమునకు సంతోష మును గల్గించునదియు - ప్రకాశించుచున్నదియునైన శ్రీ రామానుజకీర్తి కౌముది సర్వోత్కర్ష ములతో నొప్పుచుండుగాక. (సభంగశ్లేష)

श्रीवासश्श्रिय माप्नुवन् समभवत् श्रीवेंकटेशो यत:
य: कल्याणमयीं सुदर्शनदरौ चाऽऽप्त्वा जहर्षप्रियौ
श्रीमद्वेंकटनायकस्य कृपया तस्य प्रकाशं गता
श्री रामानुज योगिनो विजयतां सत्कीर्ति सत्कौमुदी ॥

శ్రీవాసశ్శ్రియ మాప్నువన్ సమభవత్ శ్రీ వేంకటేశో యతః
యః కల్యాణమయీం సుదర్శనదరౌ చాఽఽప్త్వా జహర్షప్రియౌ
శ్రీమద్వేంకటనాయకస్య కృపయా తస్య ప్రకాశం గతా
శ్రీ రామానుజయోగినో విజయతాం సత్కీర్తి సత్కౌముదీ.

ఏ శ్రీ వేంకటేశ్వరుఁడు ఏ శ్రీ రామానుజులవారి మూలమున సువర్ణముతో నిర్మితయైనదియు, మంగళమయినదియు నగు శ్రీని పొందినవాఁడై, శ్రీనివాసుఁ డాయెనో - తనకు ప్రియములైన సుదర్శన పాంచజన్యములనుగూడ ఏ రామానుజుల వలన పొంది సంతసించెనో అట్టి శ్రీ వేంకటేశ్వరుని కృపచేత ప్రకాశము నొందిన ఆ శ్రీ రామానుజాచార్యులవారియొక్క కీర్తి కౌముది (శ్రీ రామానుజ కీర్తి కౌముది) సర్వోత్కర్షములతో నొప్పుఁగాఁత।

यत्कृत स्वमतोद्धारात् मुमुदे वेंकटेश्वरः
प्रकाशयति तत्कीर्ति कौमुदीं युक्तमेव तत् ॥

యత్కృత స్వమతోద్ధారాత్ ముముదే వేంకటేశ్వరః
ప్రకాశయతి తత్కీర్తి కౌముదీం యుక్తమేవ తత్.

ఏ శ్రీ వేంకటేశ్వరుఁడు ఏ శ్రీ రామానుజాచార్యులవారిచేతఁ గావింపఁబడిన తన (వైష్ణవ) మతోద్ధరణమువలన సంతసించెనో - ఆ రామానుజాచార్యులవారియొక్క కీర్తి యనెడు కౌముదిని (కౌముదివలె ధవళ సుందరమైన కీర్తిని - శ్రీ రామానుజ కీర్తి కౌముదిని) ప్రకాశ మొనర్చుచుండుట యుక్తమే యగును.

इत्यभिनंदति विद्या
वन पंचास्या द्यनेक बिरुदस्य
विक्राल रामचंद्रा
चार्यस्य सुतः कवि प्रिय श्शेषः ॥

ఇ త్యభినందతి విద్యా
వన పంచాస్యా ద్యనేక బిరుదస్య
విక్రాల రామచంద్రా
చార్యస్య సుతః కవిప్రియ శ్శేషః.

ఇట్లు విద్యారణ్య పంచానన మున్నుగాఁగల అనేక బిరుదములుగల శ్రీమాన్ విక్రాల రామచంద్రాచార్యులవారి (రెండవ) కుమారుఁడును - కవులకు ప్రియమైన వాఁడును నగు శేషాచార్యుఁ డభినందించుచున్నాడు.

★

श्रीः



श्रीवेङ्कटाद्रिनिलयः कमलाकामुकः पुमान् ।
अभंगुरविभूतिर्न स्तरङ्गयतु मङ्गलम् ॥

# शुभाशंसा

भोः मान्यमहोदयाः, सतत सन्तन्यमान श्रद्धा भक्तिप्रचयधनाः, भगवद्रामानुज-सिद्धान्त ग्रन्थ प्रचार परिदृढाः, कलिकलुषित सकललोकसमुत्तरणैकजीवितकृत्याः, सकलाभिमत सच्छास्त्र संवर्धन कुशलाः, आन्ध्र संस्कृताद्यनेकभाषावैदुष्य विशिष्ट सकलान्तरङ्गाः, कलापूर्णचंद्र सदृश कौमुदी विशद हृदयान्तरङ्गाः, तत्र भवन्तः श्रीमन्तः

## धनकुधरं वरदाचार्य महाशयाः !

भवतां निरवग्रहकार्यवर्ग परिश्रमं एवं भाषासु कलासु विशिष्य श्रीरामानुजसिद्धान्त-सत्संप्रदाये अनितरां भक्ति धिषणां दृष्ट्वा हृष्टा ; वयं श्रीमन्तं श्रीनिवासं केवल मिदमेव प्रार्थयामहे यत् विशिष्टाद्वैतसिद्धान्त प्रचाराय, भक्तिमार्गप्रतिष्ठापनाय च तत्र भवद्भ्यः अमोघं ऐश्वर्यं, दीर्घमायुः अमन्दानन्दयुक्तं आरोग्यं च अनुगृह्णातु स भगवान् श्रीशैलमेघः श्रीवल्लभ इति ।

भवदीयः
सलक्षणघनापाठि साहित्य शिरोमणिः
रा. कृष्णस्वामि अय्यङ्गार्
श्री वेंकटेश्वर वेदसंस्कृत पाठशालाध्यक्षः,
कार्य निर्वाहकः — श्रीवेंकटेश्वर आर्ष संस्कृति सदस्

तिरुमलै
२६-३-१९६६



శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమ త్పరమహంస – పరివ్రాజకాచార్య

శ్రీ శ్రీ శ్రీ (1008) శ్రీ త్రిదండి

శ్రీమ న్నారాయణ రామానుజ జీయరు స్వామివారి

# మంగళాశాసనము

★ ★ ★

శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులుగారికి :

శ్రీమతే నారాయణాయ నమః

శ్రీ భగవ ద్రామానుజులవారు - శ్రీ వేదార్థ సంగ్రహమును, శ్రీ భాష్యమును రచించి, శ్రీ శ్రీనివాసునకు సమర్పించిరి. తద్ద్వారా - జీవుని శేషత్వమును, సర్వేశ్వరుని శేషిత్వమును నలుగడల వ్యాపించినవి. శ్రీ తిరువేంగడముడైయాను ని పరత్త్వ మంతటను పరివ్యాప్త మయ్యెను.

అదియును గాక, శ్రీ భగవ ద్రామానుజులవారు శ్రీ శ్రీనివాసునకు అసాధారణము లగు శంఖు చక్రములను ప్రదానము గావించి, శ్రీ వేంకటేశ్వర శబ్దమును సార్థక బఱచిరి. మఱియు - శ్రీ లక్ష్మీప్రదానము గావించి, శ్రీనివాసునిగా నొనర్చిరి.

శ్రీ భగవ ద్రామానుజులవారు తమ విషయమై గావించిన యీ మహత్తర కైంకర్యమున కానందించి, శ్రీ శ్రీనివాసుడు నేడు వారి కీర్తిని కౌముదిగా ప్రకాశింపజేసి, తాను పరమానందము నందుటయేగాక, ఇతరులనుగూడ ఆనందింప జేయనెంచుట - ఆ పరాత్పరుని కృపా పరతంత్రకు ఒక చక్కని తార్కాణము.

'వరదస్తు సమర్థకః' అనురీతి - సార్థకాఖ్యులైన మీరు తలపెట్టిన శ్రీ రామానుజ కీర్తి కౌముదీ ప్రచారము కువలయోల్లాసి యగుగాక యని మీ సదుద్యమమునకు మంగళాశాసన మొనర్చు చున్నాము.

మకాం :- జానకీస్థాన్
దర్భాంగజిల్లా - బీహారు
8-7-1967.

श्रीमन्नारायण रामानुज जीयर्



ఆంధ్రప్రదేశ్ దేవాదాయ ధర్మాదాయశాఖ కమీషనరు
వేదాగమోద్ధారకులు – మాన్యమహోదయులు నగు
శ్రీ కొండపల్లి వాసుదేవరావు, B.A., LL.B., I.A.S. గారి

# ఆమోదము

* * *

శ్రీమాన్ త్రిదణ్డి శ్రీమ ద్భగవ ద్రామానుజులవారు భక్తులను అత్యంత సులభోపాయముల ద్వారా, వైకుంఠవాసుడైన శ్రీమన్నారాయణుని దివ్య సన్నిధిని జేర్చుటకై అవతరించిన మహాత్ములు.

లోకములను రక్షించుటకు వేత్రహస్తుడైన శ్రీ విష్వక్సేనుడే యతిరాజైన శ్రీ భగవ ద్రామానుజులవారుగా అవతరించిరని శ్రీమద్వేదాంతదేశికులు యతిరాజ సప్తతి యందు దిగువ విధమున చెప్పిరి :-

" నానాభూతైర్జగతి సమయై ర్నర్మలీలాం విధిత్సో
ర స్త్యం వర్ణం ప్రథయతి విభో రాదిమ వ్యూహభేదే
విశ్వం త్రాతుం విషయ నియతం వ్యక్షితానుగ్రహస్సన్
విష్వక్సేనో యతిపతి రభూ ద్వేత్ర సార ప్రిదణ్డః."

ఈ విధముగా అవతరించిన శ్రీ భగవ ద్రామానుజులవారు శ్రీ విశిష్టాద్వైత మును నల్దెసలకు చిరస్థాయిగా వ్యాపింపజేసిరి. ఇట్లు విస్తరింపజేసిన శ్రీవారి కీర్తి ఆచంద్రతారార్కమైనది. ఇటువంటి వైష్ణవ ధర్మములను అతిసామాన్యులలో సైతము పునరుద్ధరింపజేయ దలచుచున్నారు శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు గారు. వీరి ప్రయత్నము ఎంతయూ కొనియాడ తగినది.

HYDERABAD,
15—6—1972.

(Sd.) K. Vasudeva Rao,
Commissioner.

శ్రీనివాసాయ నమః
శ్రీమతే రామానుజాయ నమః



# సంపాదకీయము

"అస్మద్దేశిక మస్మదీయ పరమాచార్యా నశేషా న్గురూన్
శ్రీమన్ లక్ష్మణయోగిపుంగవ మహాపూర్ణౌ మునిం యామునమ్
రామం పద్మవిలోచనం మునివరం నాథం శఠద్వేషిణం
సేనేశం శ్రియ మిందిరాసహచరం నారాయణం సంశ్రయే."

శ్రీమంతము - పరమపావనము నగు మన భరతఖండమున ఆధ్యాత్మిక తత్త్వములను ప్రకాశింపఁజేయు దర్శనము లనేకము లున్నవి. అట్టివానిలో-శ్రీ విశిష్టాద్వైత దర్శనము వేద వేదాంత ఆగమాదులలో ప్రతిపాదింపఁబడిన తత్త్వ విశేషముతోఁ గూడి, అత్యంత విశిష్టమై, సకల చేతన సముద్ధరణ సమర్థమై, పరమార్థ ప్రదమై యలరారుచున్నది.

"చిదచి ద్విశిష్టుఁడగు శ్రీమన్నారాయణుఁ డొక్కఁడే తత్త్వము, సూక్ష్మ చిదచి ద్విశిష్ట మగు బ్రహ్మము జగత్కారణము. స్థూల చిదచి ద్విశిష్టమగు ఆ పర బ్రహ్మమే కార్యభూత మగు జగత్తు. విశిష్ట కార్య కారణములు రెండును అభిన్నములు. చేతనుల కతఁడే ప్రాప్యము; ప్రాపకము" అను అతి విశిష్టములగు తత్త్వములను బోధించుటచే, ఈ దర్శనమునకు 'విశిష్టాద్వైతము' అనుపేరు - ప్రసిద్ధి కలిగినవి. మఱియు - విశిష్టులచే విశిష్టక్రమమున నుపదేశింపఁబడిన ఉపనిష త్సిద్ధ మగు 'అద్వైత' మగుటచేతను ఇది విశిష్టాద్వైతమని వ్యవహరింపఁబడుచున్నది.

ఈ దర్శనమునకు - శ్రీ సంప్రదాయము, శ్రీవైష్ణవ సంప్రదాయము, శారీరక మీమాంసా దర్శనము, ఉభయ వేదాంత దర్శనము, శుద్ధాంత దర్శనము, భాగవత మతము, శ్రీ రామానుజ దర్శనము అని అనేక నామధేయము లున్నవి.

అనాది పరంపరాసిద్ధమై, ప్రమాణ - ప్రమేయ - బంధ - మోక్షాదుల పరమ తత్త్వములను బోధించుటచే నియ్యది నిఖిల దర్శన శిరోభూషణమై యుండుట

యటులుండ, భగవ న్నిర్హేతుక కృపా కటాక్షముచే ప్రవర్తితములగు సంస్కృత - ద్రావిడ - రహస్య - ఆగమ ప్రస్థానము లను చతుర్విధ ప్రస్థానములచే సకల చేతన హిత ప్రబోధకమై వెలుగొందుచున్నది.

అందు సంస్కృత వేదాంత ప్రస్థానము మొదటిది. అది ఉపనిష త్ప్రస్థాన మనియు, సూత్ర ప్రస్థాన మనియు, భగవద్గీతా ప్రస్థాన మనియు మూఁడు విధములై యున్నది.

ఉపనిషత్తులు ప్రతి కల్పమునందును సాక్షాత్తుగ పరమాత్మచే నుపదిష్టములే. బ్రహ్మసూత్రములు నారాయణుని అపరావతారుఁ డగు శ్రీ వేదవ్యాసునిచే ప్రణీత ములు. గీతా ప్రస్థానము శ్రీకృష్ణావతారుఁ డగు శ్రీమన్నారాయణునిచే ప్రవర్తితము.

ఇట్లు సంస్కృత ప్రస్థాన మంతయు సాక్షాత్తుగ సకల జగత్కారణకర్త యగు భగవంతునిచే ప్రవర్తితమై యున్నది. కనుకనే, శ్రీ విశిష్టాద్వైతమున 'ప్రథమాచార్యుఁడు శ్రీమన్నారాయణుఁడే' యని కీర్తింపఁబడుచున్నది.

అనాది నిధన మగు ఈ విశిష్ట ప్రస్థానము - బాదరాయణ, బోధాయన, టంక, గుహదేవ, భారుచి, ద్రమిడాచార్య, బ్రహ్మనంది, భర్తృమిత్ర, భర్తృప్రపంచ ప్రముఖు లగు ఆచార్యవర్యులచే విశిష్ట సంప్రదాయక్రమమున అవతరింపఁ జేయఁ బడినది.

శ్రీమన్నారాయణుఁడే తనకు అంతరంగ కైంకర్య నిర్వాహకు లగు నిత్య సూరులను నిఖిల చేతనోజ్జీవనార్థము నియమింప, వారలు భగవ న్నియమనాను సారము భూ లోకమున దక్షిణ భారతములో నవతరించిరి. వారలే దివ్యసూరులు. వారలు — 'ఆళ్వారులు' అను పేర సుప్రసిద్ధులు. వారలకు శ్రీమన్నారాయణుని యందలి నిరుపాధిక నిరవధిక ప్రావణ్యముచే, ఆ భగవంతుని యనుగ్రహమువలన ప్రాప్తము లగు పరభక్తి, పరజ్ఞాన, పరమభక్తులు మిక్కుటములు కాఁగా - భగవ దనుభవ పరీవాహ రూపముగ వారి దివ్య వదనారవిందములనుండి దివ్య ప్రబంధము లావిర్భవించినవి. అవియే ద్రావిడ వేదాంతములు.

అందు, శ్రీ విష్వక్సేనుని అపరావతారులును - ఇతర దివ్య సూరుల కెల్లఱకు అవయవి స్వరూపులును - ప్రపన్న జన కూటస్థులు నగు నమ్మాళ్వారుల వదనార విందమునుండి ఋ గ్యజు స్సా మాథర్వణము లను సంస్కృత వేద చతుష్టయము - తిరువిరుత్తము, తిరువాశిరియము, పెరియ తిరువన్దాది, తిరువాయిమొళి అను పేరు

లతో నవతరించెను. ఇట్టి వీరి ద్రావిడ వేదములకు - ఇతర దివ్య సూరులు ప్రసాదించిన దివ్య ప్రబంధము లన్నియు సంస్కృత వేదమునకు శిక్షాదులవలె అంగములుగా నమరి యున్నవి. ఇది ద్రావిడ వేదాంత ప్రస్థానము.

శ్రీమన్నారాయణుఁడు తాను ప్రవర్తింపఁజేసిన సంస్కృత వేదాంత ప్రస్థానము కేవలము శాస్త్ర విజ్ఞానము గలవారికి మాత్రమే తప్ప, ఇతరులకు గ్రహింప నలవిగాని వగుటచేతను, త్రిగుణాత్మకమైన ప్రకృతియొక్క పరిణామరూపమగు దేహము ననుసరించిన ఆత్మ ధర్మములను ప్రబోధించున వగుటచేతను, సకల చేతనుల కవి అందుబాటులో లేనందున, ఆబాల గోపాల మెల్లఱకును ఉజ్జీవనము గలుగజేయుటకై, అర్థపంచక జ్ఞానోపదేశములును - ఆత్మస్వరూపమున కనుగుణము లగు ధర్మములకు ప్రబోధకములు నగు రహస్యముల నుపదేశించెను.

అట్టి రహస్యములలో మూఁడు ముఖ్యములై యున్నవి. వానికే 'రహస్య త్రయము' అని ప్రసిద్ధి. అందు 'తిరుమంత్రము' అను మొదటి రహస్యమును బదరికాశ్రమమునందు తన యంశతో నవతరించిన నరుని వ్యాజీకరించుకొని, ఆ శ్రీమన్నారాయణుఁడే, నిఖిల లోకోజ్జీవనార్థము ప్రవర్తింపఁజేసెను. రెండవ రహస్య మగు ద్వయమును శ్రీ లక్ష్మీదేవిని వ్యాజీకరించుకొని, సకల లోకములకును ఉపదేశించెను. మూఁడవ రహస్య మగు చరమశ్లోకమును కురు పాండవ యుద్ధారంభ సమయమున కురుక్షేత్రమునందు అస్థాన స్నేహ కారుణ్యములచే ధర్మాధర్మ ధియాకులుఁడును - పరమ ప్రపన్నుఁడు నగు పార్థుని వ్యాజీకరించుకొని, నిఖిల ప్రపంచములకును బోధించెను. ఇట్టి రహస్యము లింకను అనేకము లున్నవి. దీనికే రహస్య ప్రస్థాన మని పేరు.

మఱియు - స్వాంతరంగ కైంకర్య నిర్వాహకు లగు అనంత గరుడ విష్వక్సేనాదులకు శ్రీ పాంచరాత్ర శాస్త్రమును ఆ శ్రీమన్నారాయణుఁడే ఉపదేశించెను. అష్టోత్తర శత సంహితాత్మక మగు ఆ శాస్త్రము భగవన్ముఖోద్గత మగుటచేతను, భగవత్సంబంధమైన విషయమును బోధించున దగుటచేతను 'భగవచ్ఛాస్త్రము' అనుపేర సుప్రసిద్ధమై యున్నది. దానికి ఆగమ ప్రస్థాన మని పేరు. అందు - శ్రీరంగము, శ్రీ వేంకటాద్రి, శ్రీ హస్తిగిరి మొదలగు దివ్య క్షేత్రములందు నిఖిల లోకోజ్జీవనార్థము అర్చారూపమున నెలకొనియుండు పరమాత్ముని దివ్య మంగళ విగ్రహ విభవ విభూత్యాదులు అభివర్ణింపఁబడియుండుటయే గాక, విశిష్టము లగు తత్త్వహిత పురుషార్థములు పరమ సులభముగ విపులీకరింపఁబడి యున్నవి.

ఇట్లు శ్రీ విశిష్టాద్వైతమునందలి ప్రస్థానము లన్నియు సాక్షాత్తుగ పరమ కారుణికుఁ డగు శ్రీ మన్నారాయణునిచే ప్రవర్తితము లగుటచే, ఇయ్యది పరమ వైదిక సిద్ధాంతముగ సుప్రసిద్ధమై, సకల చేతనులకు పరమార్థమును ప్రసాదించి, ముముక్షు జనులను తరింపఁజేయఁగల్గుచున్నది.

ఈ విధముగా అనూచానముగ అతి విలక్షణమై, విశాల భారతమున విలసిల్లు ఈ సంప్రదాయము - ఈ నడుమ, కలి ప్రాబల్యముచే నుచ్ఛిన్నమై, శోభ దక్కియుండుట తటస్థించెను. అట్టి తరుణమున, ఏత న్మత పునరుద్ధరణార్థమై, మహనీయులు కొందఱు అవతరింపవలసిన యవసర మేర్పడెను. అట్టి యవసర సమయమున, ప్రపన్న జన భాగధేయ పరిపాకముచే, తొలుత - 'శ్రీమ న్నాథమునులు' అను నొక మహా ప్రాజ్ఞు లవతరించిరి.

ఆ మునిచంద్రులు నిష్కళంక మగు తమ ప్రతిభా విశేషమువలనను - అష్టాంగ యోగానుష్ఠానాది తపః ప్రభావమువలనను నమ్మాళ్వారులను సాక్షాత్కరింపఁ జేసికొని, వారి వలన పూర్వోప దర్శితము లగు ప్రస్థానముల నన్నింటిని తత్త్వ రహస్యములతోఁ బాటు సాంగోపాంగముగ నధికరించి, తా మనుభవించిన పరమానుభవమును ఎల్లఱును అనుభవించి ఉజ్జీవింపవలె నను విశాలాశయము గలవారై, మహోదార మనస్కులై, పరమ కారుణికులై, సకల జన సముద్ధరణార్థము ఈ ప్రస్థానముల నెల్ల తాము లోకమున స్వయముగా ప్రవర్తింపఁ జేయుటయే గాక, తమ శిష్య ప్రశిష్యుల మూలమునఁగూడ ఈ సంప్రదాయమునకు తగిన ప్రాచుర్యమునుఁ గల్గింపఁజేసిరి.

అదియునుఁ గాక, శ్రీ విశిష్టాద్వైత దర్శన వైశిష్ట్యము నుగ్గడించుచు - 'న్యాయ తత్త్వము' అను పేర నొక మహాగ్రంథమును రచించి, ఈ సిద్ధాంత స్వరూపమును లోకమునకు బాగుగా దర్శింపఁజేసిరి. 'పురుష నిర్ణయము' అను పేర సంతరించిన మఱియొక గ్రంథములో - పరమ పురుషుఁడగు శ్రీమన్నారాయణుని అప్రతిమ ప్రతిభా విశేషములను, దివ్య వైభవమును తనివితీర అభివర్ణించుచు, పురుషోత్తముఁడును, షడ్గుణైశ్వర్య పరిపూర్ణుఁడు నగు ఆ శ్రీమన్నారాయణుఁడే సకల చేతనులకును ఆశ్రయణీయుఁ డని ప్రబోధించిరి. ఇఁక 'యోగ రహస్యము' అను మూఁడవ గ్రంథమున, అష్టాంగ యోగములకు సంబంధించిన విధి విధానములను విపులముగాఁ దెలుపుచు, ఆ యోగ ప్రభావములను అద్భుతముగా అభివర్ణించిరి. ఇట్లు శ్రీమ న్నాథమునులు లోక కల్యాణ కాంక్షతో తమ తపశ్శక్తిని బహుముఖములుగా వెచ్చించి, ఈ సంప్రదాయమునకు వన్నెను - వాసిని చేకూర్చి, చిరస్మరణీయులు కాఁగల్గిరి.

అనంతరము వీరి పౌత్రు లగు శ్రీ యామున మునీంద్రులు పండితోద్దండులై, ప్రచండమైన ప్రజ్ఞా ప్రాభవములు గలవారై, ప్రతిపక్షుల గర్వాటోపముల నణంచుచు, అసదృశ మగు తమ ప్రతిభా విశేషమున ఎల్లఱను సంభ్ర మాశ్చర్య పులకిత గాత్రుల గావించుచు, పరతత్త్వ నిర్ణయ మొనరించి, రాజాధిరాజులై, పరమయోగి పుంగవులై, దర్శన స్థాపనాచార్యులై, దిగ్విజయము గావించి, 'ఆళవందారులు' అనుపేర విఖ్యాతి గాంచిరి.

ఈ మునిపుంగవులు - వారి పితామహులవలె ఉభయ వేదాంత సంప్రదాయముగా ప్రసిద్ధిఁజెందిన శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంతమును తమ శిష్య ప్రశిష్యులకు ఉపదేశించుచు ప్రవర్తింపఁజేయుటయేగాక, సంప్రదాయ ప్రబోధకము లగు అనేక గ్రంథములనుఁగూడ రచించిరి.

అట్టివానిలో-'గీతార్థ సంగ్రహము' అను గ్రంథమున, శ్రీ విశిష్టాద్వైత మతానుసారముగ భగవద్గీతయందలి రహస్యములు తేట తెల్లము గావింపఁబడినవి. 'శ్రీ చతుశ్శ్లోకి' అను గ్రంథమున, శ్రీ వైష్ణవ ధర్మమునకు ప్రథమ ప్రవర్తిక యగు శ్రీ లక్ష్మీదేవి సంస్తుతింపఁబడినది. ఆత్మ సిద్ధి, ఈశ్వర సిద్ధి, సంవిత్ సిద్ధి అను త్రివిధ సిద్ధులతోగూడిన 'సిద్ధి త్రయము' అను గ్రంథమున, చిదచి దీశ్వర తత్త్వములు విపులముగాఁ దెలుపఁబడినవి. శ్రీ వైష్ణవ దర్శనమునకు మూలాధారమై, భగవచ్ఛాస్త్రముగా ప్రసిద్ధి జెందిన శ్రీ పాంచరాత్రాగమమునకుఁ గల ప్రామాణ్య ప్రాముఖ్యములు 'ఆగమ ప్రామాణ్యము' అను గ్రంథమున నిరూపింపఁబడినవి. మధుర మంజులములైన గంభీర భావములతో - లలిత కోమలములైన పద విన్యాసములతో నొప్పారుచు, ఎనుబది శ్లోకములు గల 'స్తోత్ర రత్నము' అను గ్రంథమున, శరణాగతి తత్త్వము అత్యంత విలక్షణముగా ప్రబోధింపఁబడినది. ఇది 'ఆళవందార్ స్తోత్రము' అనుపేర వ్యవహరింపఁబడుచు, నిత్యపారాయణ యోగ్యమై విలసియున్నది.

శ్రీ యామునముని విరచితము లగు ఈ విశిష్ట గ్రంథములు శ్రీ విశిష్టాద్వైత సంప్రదాయ సౌధమునకు మూలస్తంభములుగా రూపొంది, ప్రశస్తి గాంచియున్నవి. ఇట్లు శ్రీ యామున మునిచంద్రులు ఈ సంప్రదాయ వైశిష్ట్యమును లోకమున బహు ముఖములుగా వెల్లడించి, అఖండ యశమును బడయగల్గిరి.

మఱియు, అనంతాపరావతారులును - శ్రీ వైష్ణవ ఘంటాపథ నిర్ధారకులు నగు శ్రీ రామానుజ మునిపుంగవులకు, ఏకలవ్యునకు ద్రోణాచార్యులవలె సాక్షాత్తుగ ఆచార్య శేఖరులై, వారిచే శ్రీ విశిష్టాద్వైత సంప్రదాయానుసారముగ, బాద

రాయణాది ప్రణీతము లగు బ్రహ్మసూత్రాదులకు శ్రీ భాష్యాదుల నవతరింపఁజేసి, వ్యాస పరాశర నామములకు సుప్రసిద్ధిని గల్గించి, ఈ సంప్రదాయమునకు పరమా చార్యులై విరాజిల్లిరి.

అటుపిమ్మట ఈ విశిష్ట సంప్రదాయమును సంస్థాపించుటకై - "అనంతః ప్రథమం రూపం, ద్వితీయం లక్ష్మణ స్తథా, తృతీయం బలభద్ర స్స్యాత్, కలౌ కశ్చి ద్భవిష్యతి" అను పురాణ వాక్యానుసారముగ, సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును భగవంతుని నిరంతర కైంకర్య నిర్వాహకు లగు ఆదిశేషులే, భగవ న్నియమనాను సారముగ, దక్షిణ భారతమునఁ గల భూతపురీక్షేత్రమునందు శ్రీకాంతిమతీ కేశవ యజ్వులకు పుత్రరత్నమై, 'శ్రీరామానుజులు' అను పేర నవతరించిరి.

వీరు బాల్యదశనుండియు శ్రీమన్నారాయణ చరణారవింద ద్వంద్వ రుకైమ్రిక వ్యాముగ్ధులై, పరభక్తి-పరజ్ఞాన-పరమ భక్తు లతిశయింప, పరమాత్మునియందు పరమ రతులై, ఇతర విషయములందు విరక్తులై, పాపధ్వాంతములను శమింపఁ జేయుచు, పుణ్యాంభోజముల వికసింపఁజేయుచు, అతి విలక్షణ దివాకరులై విరా జిల్లుచు, శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత స్థాపనమునకై దీక్ష వహించి, లక్ష్యమును సాధించి, విజయ ధ్వజమును సంస్థాపించిరి.

ఈ యతి సార్వభౌములు బోధాయనవృత్తి, ద్రమిడభాష్య, సిద్ధి త్రయాదుల ననుసరించి సూత్రప్రస్థానమునకు విశిష్టమగు శ్రీ భాష్యమును రచించి, కాశ్మీర దేశ మున సుప్రసిద్ధముగాఁ గల సరస్వతీ పీఠమున 'శ్రీభాష్యకారులు' అను బిరుదముతోఁ బాటు - బంగారుమయమైన శ్రీ లక్ష్మీహయగ్రీవ విగ్రహమును బహుమాన పురస్సర ముగా బడయఁగల్గిరి. మఱియు - 'వేదాంత సారము' 'వేదాంత దీపము' అను రెండు గ్రంథములను బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యాన ప్రాయములుగా రచించిరి. ఉపనిషత్తు లలో అద్వైతులకు - విశిష్టాద్వైతులకు భేదాభిప్రాయములుగాఁ గల వాక్యములకు అర్థమును తమ శేముషీ విశేషముచే సముచిత విధానమున సమన్వయించి, ఆ వాక్య ములలోని గంభీర భావములను, రహస్యములను విపులీకరించుచు - 'వేదార్థ సంగ్రహము' అను గ్రంథమును రచించిరి. భగవద్గీతా ప్రస్థానమునకు భావ మధుర మైన శైలిలో భాష్యమును రచించుచు - అందు భగవ ద్వైభవమును, భక్తి ప్రపత్తుల వైలక్షణ్యమును విశదీకరించిరి. 'శరణాగతి గద్య' 'రంగనాథ గద్య' 'వైకుంఠ గద్య' అను పేర గద్యత్రయమును రచించుచు, అందు పరమపదనాథుని అప్రాకృత దివ్య మంగళ విగ్రహమును - కల్యాణ గుణములను - అఖిల జగ న్మాతయు, అపార

కరుణా స్వరూపిణియు నగు శ్రీలక్ష్మీదేవియొక్క విభవ విభూత్యాదులను తనివితీర అభివర్ణించుచు, ఆ శ్రీ శ్రియః పతులను బహు భంగుల సంస్తుతించిరి. భగవదారాధనా విధానమును బోధించుచు 'నిత్య గ్రంథము' అను గ్రంథమును రచించి, ముముక్షువులకు తరణోపాయముఁ జూపిరి.

మఱియు - ఆసేతు శీతాచలపర్యంతము దిగ్విజయ యాత్ర జేయుచు, శ్రీ వైష్ణవమతమునందలి పరమ సౌభాగ్యమును - సకల చేతన శుభదాయకత్వమును వెల్లడించి, దేశమం దంతటను శ్రీ వైష్ణవ మత సంఘములను సంస్థాపించి, ఆ సంఘములలో సర్వవర్ణములవారికిని ప్రవేశములను లభింపఁజేసి, విశ్వ విఖ్యాతి గాంచిరి.

అదియునుఁగాక, నిఖిల లోకోజ్జీవనార్థమై శ్రియఃపతి స్వయముగా నవతరించుటచే, స్వయం వ్యక్త స్థలములుగా ప్రశస్తి గన్న శ్రీరంగ, శ్రీ వేంకటాద్రి, హస్తిగిరి, యాదవాద్రి ప్రముఖము లగు దివ్య దేశము నెల్ల సమీకరించి, అనేక విధములగు కట్టుబాట్ల నేర్పఱచి, నిత్యోత్సవ - పక్షోత్సవ - మాసోత్సవ - సంవత్సరోత్సవాది మహోత్సవాదుల నేర్పఱచి, మఠ మందిరములను నెలకొల్పి, సకల జనులకు ఒక నూతన చైతన్యమును గల్గించి, ఈ సంప్రదాయమునందు అభిరుచిని - అభినివేశమును సముద్భవింపఁజేసి, తద్ద్వారా శ్రీ వైష్ణవ సిద్ధాంతమునకు విశేషముగ పరిపుష్టిని చేకూర్చుటయేగాక, ఈ విశిష్టాద్వైతమత ప్రచారమునకై, డెబ్బదినాల్గు సింహాసనముల నేర్పఱచిరి.

బహుముఖములైన ఇట్టి మహోద్యమములను నిర్వహించి, విజయ తేజముతో విరాజిల్లుచు, శ్రీవైష్ణవ ధర్మ సుమ సౌరభమును దేశమం దంతటను ఈ యతి సార్వభౌములు వెల్లివిరియఁజేసిన కారణమువలననే, ఈ దర్శనమునకు 'శ్రీ రామానుజ దర్శనము' అను అన్వర్థనామ మేర్పడి, సుప్రసిద్ధమై యున్నది.

శ్రీ రామానుజులవారి యనంతరము ఆచార్యవర్యు లనేకులు ఈ సంప్రదాయమును ప్రచార మొనరించిరి. శ్రీ పిళ్ళ లోకాచార్యులు ఈ విశిష్టాద్వైతమునందలి ప్రస్థానముల నన్నింటిని సామాన్య జనులకు సైతము కరతలామలక మొనరించుటకై, ద్రవిడ భాషామయము లగు సులలిత మధుర రమణీయ సూత్రములుగ అష్టాదశ రహస్యములను రచించి, ఈ సంప్రదాయమునకు ఒక నూతన తేజమును సంతరించిరి. వీరి గ్రంథములలో - ద్రావిడ వేదాంతముల యందలి పరమ విలక్షణము లగు భగవ ద్దివ్య కల్యాణ గుణ గణ వైభవాదులు ప్రతిఫలించుచుండుట కడుంగడు విశేషము.

శ్రీ శేషాచలాధీశుని దివ్య ఘంటావతారు లగు శ్రీ వేదాంత దేశికులు భగవ దను గ్రహ విశేషముచే సర్వతంత్ర స్వతంత్రులై, ముప్పదిసారులు శ్రీభాష్యమును అధిక రించినవారై, తత్త్వటీక, శతదూషణి, గీతాభాష్యవ్యాఖ్యానము, అధికరణసారావళి, తత్త్వముక్తాకలాపము, న్యాయసిద్ధాంజనము, న్యాయపరిశుద్ధి మొదలగు అనేక గ్రంథ ములను రచించి, సంస్కృత వేదాంత ప్రస్థానమునకు ఒక నూతనోత్తేజమును గలుగ జేసిరి. మఱియు - ద్రమిడోపనిషత్తాత్పర్యరత్నావళిని రచించి ద్రావిడ వేదాంత ప్రస్థానమునకును, ద్వాత్రింశ ద్రహస్యములను రచించి రహస్య ప్రస్థానమునకును, పాంచరాత్రరక్ష మొదలగు వానిని రచించి శ్రీ పాంచరాత్ర ప్రస్థానమునకును విశేష ప్రాచుర్యమును గల్గించుటయేగాక, సంస్కృత భాషామయము లగు నిరరళ ప్రౌఢ గంభీర స్తోత్రజాలములవలె ద్రావిడ భాషామయము లగు దివ్య ప్రబంధములనుఁ గూడ రచించిరి. వీనికే 'దేశిక ప్రబంధము' అను వ్యవహారము ప్రసిద్ధము. వే యేల ! వీరు రచింపని గ్రంథములు ఏ విభాగమునను లేవన్న, అతిశయోక్తి కానేరదు. ఇట్లు శ్రీ వేదాంత దేశికులు బహు గ్రంథకర్తలై, 'కవి తార్కిక సింహ' అను బిరుదమును బడసి, అఖండ యశమును సముపార్జించిరి. శ్రీ విశిష్టాద్వైత మత వికాసమునకై వీ రొనరించిన నిరుపమాన సేవా త్యాగములు శ్రీ వైష్ణవ లోకమునకు చిరస్మరణీయ ములై యున్నవి.

శ్రీ మద్రామానుజ యతి సార్వభౌములు ఈ లీలా విభూతిలో నూట యిరువది సంవత్సరములు నివసించి, నిమిషమాత్రమైనను వ్యర్థము చేయక, ఈ సంప్రదాయ మునకు అతి విశిష్టమగు సంస్కరణమును. నిస్సమాభ్యధికమగు అభ్యుదయమును గలుగఁజేసిరి. కాని, ద్రావిడ వేదాంత ప్రస్థానమునకు విశిష్ట వైశద్యమును గలుగఁ జేయుటకై, వారికి తగిన అవకాశము లేకపోయెను. కావున, మఱల భగవ న్నియమ నానుసారము వారే, పాండ్య దేశమున 'మణవాళ మహా మునులు' అనుపేర నవత రించిరి. వీరు శ్రీ యతివర పునరవతారభూతు లగుటచే, సంప్రదాయార్థముల నెల్ల సులభముగా గ్రహించినవారై, వాని నెల్ల సర్వతోముఖముగ ద్రావిడ వేదాంత ప్రస్థాన సమభ్యుదయమునకే వినియోగము గావింపవలెనని సంకల్పించి, నమ్మాళ్వారు లనుగ్ర హించిన ద్రావిడ దివ్య ప్రంబంధములకు వ్యాఖ్యాన ప్రాయము లగు ఈడు ముప్ప త్తారాయిరప్పడి (భగవ ద్విషయము) మొదలగు గ్రంథములను పరిశీలించి, పరిష్క రించి, ప్రమాణాకర నిర్దేశాదుల సంతరించి, శ్రీ పెరియవాచ్చాన్‌పిళ్ళ కృత మగు 'పెరియాళ్వార్ తిరుమొళి వ్యాఖ్యానము' శిథిలము కాఁగా - ఆ దివ్య ప్రబంధమునకు మఱల సులలిత మగు శైలిలో వ్యాఖ్యానమును రచించియు, ద్రావిడ వేదాంత

ప్రస్థానమునకు సముచితము లగు సరళ గంభీర వ్యాఖ్యానముల ననుగ్రహించి, శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంతమును దేశమునం దంతటను వ్యాపింపఁ జేయుటయేగాక, శ్రీమద్రామానుజులవలె దేవాలయములందును - శ్రీ వైష్ణవ సంఘముల యందును అనేక విధములగు సమీకరణముల నొనర్చి, శ్రీరంగనాథుని కృపా విశేషమునకు పాత్రులై, ఆ శ్రీరంగనాథునిచే 'పెరియ జీయర్' అని కొనియాడబడినవారై, యశశ్చంద్రికలతో విరాజిల్లిరి.

ఇట్లు ఈ విలక్షణ సిద్ధాంతము శ్రీమన్నారాయణుని వద్దనుండి శ్రీ మణవాళ మహామునుల వఱకును అవిచ్ఛిన్నముగ ప్రచలితమై ప్రకాశించినది. ఈ సంప్రదాయము ననుసరించి తెలుఁగులో ఆచార్య సూక్తి ముక్తావళి, ఆముక్త మాల్యద, ముముక్షు జన కల్పకము మొదలగు అనేక గ్రంథములు వెలువడినవి. తద్ద్వారా - శ్రీవైష్ణవ సంప్రదాయ వైశిష్ట్యమును తెలుఁగు మహాజనులు కొంతవఱకు గుర్తించి, ఈ సంప్రదాయమును సమాశ్రయించి, సత్ఫలితములను పొందియే యున్నారు. ఐనను, సంస్కృత - ద్రావిడ - రహస్య ఆగమ ప్రస్థానములలోఁ గల విశిష్ట విషయములతో, సంప్రదాయ విశేషములతో ఒక సమగ్ర గ్రంథమును తేటతెన్గున సర్వాంగ సుందరముగా రూపొందించి, తెలుఁగు మహాజనులకు అందఁజేయవలసిన యవసర మెంతగనో ఉన్నది. అట్టి యవసరమును గుర్తించియే, ఈ సంప్రదాయ విశేషముల నన్నింటిని సర్వతో ముఖముగ సమీకరించి, వాని నెల్ల ఒక మహా గ్రంథముగా సిద్ధ మొనరించి, తన్మూలమున ఆంధ్ర మహా జనులకు ఆత్మసంతర్పణము గావింపవలెనని మేము సంకల్పించితిమి. ఇది యొక మహా సంకల్పము. ఈ మా మహా సంకల్పము కలియుగ ప్రత్యక్షదైవ మగు తిరుమల శ్రీనివాస భగవానుని కృపా కటాక్షమున కార్యరూపమును ధరించుట - మా సుకృత ఫలముగను, ఆంధ్ర మహా జనుల భాగ్య విశేషముగను సంభావించుచున్నాము.

శ్రీ వైష్ణవ సంప్రదాయమునకును, తిరుమల (తిరుపతి) దివ్య క్షేత్రమునకును సహజముగా ఎంతయో సన్నిహిత సంబంధ మున్నది. తిరుమల తిరుపతి దేవస్థానముల వైభవము, కార్య నిర్వహణము మున్నుగాఁ గల వన్నియు శ్రీ విశిష్టాద్వైత మతోపజ్ఞములై యుండుట జగ ద్విదితము. మఱియు - ఋగ్వేద, పురాణ ఇతిహాసాదులయందేగాక, ఆళ్వారుల దివ్య ప్రబంధములందును - ఆచార్యవర్యుల గ్రంథరాజములయందును ఈ దివ్య క్షేత్ర వైభవము అతి విశిష్ట క్రమమున అభివర్ణితమై యున్నది.

ద్రావిడ దివ్య ప్రబంధములకు శిరోభూషణ స్థానీయమైన తిరువాయిమొళిలో ప్రాప్య ప్రాపక నిష్కర్షములగు రెండు దశకములలో, శ్రీ శేషాచలాధీశుని చరణార విందములనే పరమ ప్రాపకములుగను, పరమ ప్రాప్యములుగను నమ్మాళ్వారులు నిర్ధారణ చేసియున్నారు. శ్రీమద్రామానుజ యతిసార్వభౌములకును ఈ శ్రీనివాస భగవానునియందే విశేష ప్రావణ్యము గలదని, వారు శ్రీభాష్యారంభమున మంగళా చరణముగా నుల్లేఖించిన శ్లోకములో-"బ్రహ్మణి శ్రీనివాసే" అనుటనుబట్టి, శ్రీనివాసుఁడే నిఖిల నిగమాంత ప్రసిద్ధ పరతత్త్వమని నిష్కర్షించియుండుటచే స్పష్ట మగుచున్నది. అదియునుఁ గాక, వేదార్థ సంగ్రహమును ఈ శ్రీశైలాధిపతి దివ్య సన్నిధినే ఉపన్యసించిరి. ఇఁక, శ్రీ వేదాంతదేశికులు మొదలగు ఆచార్య వర్యులు దయా శతకాదులయందు శ్రీ వేంకటాచలాధీశునే పరతత్త్వముగ నిర్ణయించి యున్నారు. కావున, ఈ విశిష్టాద్వైత సిద్ధాంతము 'శ్రీనివాసుఁడే పరతత్త్వము' అను ప్రధాన విషయముపై ఆధారపడియుండుటనుబట్టి, ఈ సంప్రదాయమునకును తిరుమల (తిరుపతి) క్షేత్రమునకునుఁ గల సన్నిహిత సంబంధము సుస్పష్టము.

ఇట్టి సన్నిహిత సంబంధమును, ఈ సంప్రదాయమును సర్వవిధముల పరిపాలించి సముల్లసింపఁజేయవలసిన బాధ్యతను తిరుమల తిరుపతి దేవస్థానముల పాలకవర్గమువారు ఇటీవలనే గుర్తించియున్నారు. తత్ఫలమే ఈ కౌముది.

ఇది శ్రీ రామానుజ కీర్తి కౌముది. ఇయ్యది పదునారు కళలతో ప్రకాశించి, రసజ్ఞు లగువారికి మోద ప్రమోదములను చేకూర్పగలదు. ఇపు డీ ప్రతిపత్కళలో-సుప్రసిద్ధులును, వైష్ణవ హృదయులు నగు కవి పండితులు సంతరించిన పదునారు రచనలు పొందుపరుపఁబడియున్నవి. ఈ రచనలలో - ఆద్యంతములయందు శ్రీనివాసస్తుతిగా రెండు పద్య రచన లుండుట విశేష విషయము. ఇట్టి వైశిష్ట్యముతో నొప్పారు ఈ ప్రతిపత్కళయందలి పరమార్థమును సహృదయులు గుర్తించి, పరమాహ్లాదమును పొందగలరనియే భావించుచున్నాము.

ఇట్లే, శేషించిన కళలుకూడ, శ్రీనివాస భగవానుని కృపాకటాక్షమువలనను - దేవస్థాన పాలకవర్గమువారి ఆదరాభిమానము వలనను - దేవస్థానాధికారుల సంపూర్ణ సహకారము వలనను వరుస వరుసగా, వెంట వెంటనే, సర్వాంగ సుందరముగా వెలువడగల వనియు - అచిరకాలములో నిట్లు ఈ శ్రీరామానుజ కీర్తి కౌముది షోడశ కళాపరిపూర్ణమై ప్రకాశించి, సర్వాత్మసంతర్పణము గావింపఁగలదనియు గాఢముగా విశ్వసించుచున్నాము.

★

# మహాప్రసాదము



శ్రీ నిలయుండు - శేషగిరిసీమ వసించు దయార్ద్రమూర్తి - భా
వానఘులైన సజ్జనుల కచ్యుత దివ్యపదంబుఁజూప రా
మానుజ కీర్తి కౌముదిని ఆంధ్రములో వెలయింపఁజేయఁగాఁ
బూనె - మహా ప్రసాద మిది - పుణ్యఫలంబుగ స్వీకరింపుఁడీ.

వరదుండై విలసిల్లు శేషకుధరావాసుండు - శ్రీ వేంకటే
శ్వరుఁ డానందము గూర్చు షోడశ కళావాసంబు నీ కౌముదిన్
వరుసన్ వర్ధిలఁజేయ నెంచి - 'ప్రతిపత్' ప్రారంభ సత్కాంతులన్
ధర నావిష్కరణం బొనర్చె నిటు లిద్దానన్ మహోల్లాసమా.

తిరుమల వేంకటేశ్వరుని దివ్య పదాబ్జ మరంద బిందువుల్
కరము స్రవింపఁజేసి, తన కాంతి కరమ్ముల నెమ్మిమై పరం
పరగ నొసంగు కౌముదిని భద్రముగా హృదయాబ్జసీమలో
వరలఁగఁజేసి, మీరలు ప్రపన్నులు నౌచు శుభంబు గాంచుఁడీ.



# విషయానుక్రమణిక

* * *

★



శ్రీ వేంకటేశ్వరస్వామివారు.

# శ్రీనివాసోదాహరణము

శ్రీ 'కరుణశ్రీ'

[ ప్రథమా విభక్తి ]

శ్రీశుఁ డుదార పాద సరసీరుహయుగ్మ వినమ్ర నాక లో
కేశుఁ డశేషపుణ్యవలయాకృత తీర్థవిశేష శేషశై
లేశుఁడు బ్రహ్మ రుద్ర హృదయైక నివేశుఁడు కోటిసూర్య సం
కాశుఁడు వేంకటేశుఁడు జగంబుల నేలు స్వయంప్రకాశుఁడై.

[ కళిక ]

ఉపనిష న్మానస సరస్సున నుదయ మందిన వారిజాతము
అపరిమితమగు భుక్తిముక్తుల నాశ్రితుల కిడు పారిజాతము
మేలుగా జగ మేలుకొను అలమేలుమంగా ప్రాణనాథుఁడు
నీలమేఘశ్యాముఁడౌ కమనీయకాంతి కళానాథుఁడు
వైజయంతీ దివ్యపరిమళవాసితం బగు ప్రభువక్షము
శ్రీజయాభ్యుదయోన్నతులు దయచేయు తత్కరుణాకటాక్షము
ఏడుకొండలస్వామియై యారేడు భువనము లరయువేలుపు
ఏడుగడయై భక్తజనముల నేలుకొను తరిగట్టుదాలుపు.

[ ఉత్కళిక ]

వైభవంబు లొసంగువాఁడట - శోభనంబులు గూర్చువాఁడట
ప్లవగ గణ సేవాభిరాముఁడు - భువనసంచయ సార్వభౌముఁడు
చక్రమును ధరియించుదేవుఁడు - శక్రవినుత మహాప్రభావుఁడు
నీలజలద తనూవిలాసుఁడు - జాలిగుండెల శ్రీనివాసుఁడు.

[ ద్వితీయా విభక్తి ]

నల్లనివాని - మేలిచిఱునవ్వులుచిందెడువాని - బాధలన్
గిల్లెడువాని - కాంతు లొలికించు కమంగవవాని - కంటికిన్
చల్లనివానిఁ గొల్తు విలస న్నవరత్నకిరీట సుప్రభా
వేల్లితమౌళివాని - ప్రభవిష్ణువిలాసుని - శ్రీనివాసునిన్.

[ కళిక ]

స్వామిపుష్కరిణి పార్శ్వమున వెలసినవాని
ప్రేమతో గొంతెత్తి పిలువ పలికెడువాని
కామితార్థము లిచ్చి కనికరించెడివాని
సామగానము మెచ్చి సంతసించెడివాని
పచ్చకర్పూరములు పరిమళించెడివాని
పచ్చికస్తురిసౌరభములు నించెడివాని
రంగారు నూర్ధ్వపుండ్రముల ఫాలమువాని
బంగారు జలతారు పట్టుచేలమువాని.

[ ఉత్కళిక ]

అందగా తన్నెంచి - కొండ లధిరోహించి
రెండుచేతులు చాచి - దండమిడు ప్రజఁ జూచి
గుండియలు పులకించి దుండగములు క్షమించి
నిండు కనికరమూని దండచేర్చెడువాని.

[ తృతీయా విభక్తి ]

చనుఁడీ కొండకు - స్వామిపుష్కరిణిలో స్నానంబు కావింపుఁడీ
జనులారా! కనులారఁ గాంచుడి విభున్ - సాష్టాంగముల్ చేసి వ
చ్చిన కష్టంబులు విన్నవించుకొనుఁడీ శ్రీశేషశైలేశుతో
ఘనతేజోనిధితో - జగత్ప్రభువుతో - కారుణ్యవారాశితో.

[ కళిక ]

ముజ్జగాలు బొజ్జనిముడు ముద్దులొలుకురూపుతోడ
సజ్జనులను బుజ్జగించు చల్లనైన చూపుతోడ
ఉరమునందు వలపుగొలుపుచున్న వైజయంతితోడ
శిరమునందు తళుకులొలుకు స్నిగ్ధమకుటకాంతితోడ
కనకకాంతికలిత లలిత కటక కంకణములతోడ
మణిమయూఖసహిత మహిత మకరతోరణములతోడ
చెలువుమీటి కొలువుదీఱు శ్రీనివాసమూర్తితోడ
పులకరించి పలుకరించు భువనచక్రవర్తితోడ.

[ ఉత్కళిక ]

ఉభయపార్శ్వములను గ్రాలు - అభయ వరద శుభకరాలు
ఆర్తజనుల భయము దీర్ప - స్ఫూర్తినొసగి జయముగూర్ప
తాల్చి శంఖచక్రములను - చీల్చి క్రూరవిక్రములను
జగతి నెసఁగు విభునితోడ - సుగతి నొసఁగు ప్రభునితోడ.

[ చతుర్థీ విభక్తి ]

విరికైతుమ్మెదలీల, నా హృదయ మువ్విళ్ళూరు నెల్లప్పుడున్
హరికై, సత్కరుణాసుధాలహరికై, యానందమందాకినీ
ఝరికై, నిత్య నివాస శేషగిరికై, సందృప్తదైత్యేభ కే
సరికై, సుందర మందహాస సుషమా సౌభాగ్యసంచారికై.

[ కళిక ]

సనక సనందన సంసేవ్యునకై
జనగణమంగళ సంభావ్యునకై
వకుళమాలికా వరపుత్రునకై
సకల జగన్నుత చారిత్రునకై
దళదంభోరుహదళ నయనునకై
కలితకలశసాగర శయనునకై
శరణాగత శుభసంక్రమణునకై
కరుణజూపు వేంకటరమణునకై.

[ ఉత్కళిక ]

మ్రొక్కినవారిని చక్కనిదారిని
నిరతము నడపుచు దురితము లడపుచు
చిక్కులుదీఱగ మక్కువ మీఱగ
నరసెడు దొరకై - గిరిదేవరకై.

[ పంచమీ విభక్తి ]

నవ నళినాయతాక్షువలనన్ జయముల్ సమకూరు మాకు - మా
నవగణ కల్పకమ్మువలనన్ ప్రియముల్ చెలువొందు మాకు - దా
నవ దళదర్పహారివలనన్ భయముల్ లయమౌనుమాకు - ఈ
నవరస చక్రవర్తివలనన్ ఫలియించును మా కభీష్టముల్.

[ కళిక ]

పద్మావతీదేవి ప్రాణ ప్రియునివలన
పద్మజార్చితపాద పద్మద్వయుని వలన
కరిరాజవరదుఁ డగు గరుడధ్వజునివలన
స్మరణీయ వరణీయ చరణాంబుజుని వలన
బ్రహ్మాండ పూర్ణ శోభాసముద్రునివలన
బ్రహ్మోత్సవానంద పట్టభద్రునివలన
గణనీయ కల్యాణ కాంతిమండలు వలన
మణిఖచితసౌవర్ణ మకరకుండలు వలన.

[ ఉత్కళిక ]

రాకేందు తేజునకు - ఆకాశరాజునకు
గారాబములపట్టి కోరి చేకొనినట్టి
దివ్యసౌందర్యమ్ము - నవ్య లావణ్యమ్ము
కల మనోహరువలన - కలి తమోహరు వలన.

[ షష్ఠీ విభక్తి ]

ధిక్కారం బొనరించు ఖేదముఁ, బ్రసాదించుం బ్రమోదమ్ము - పే
రెక్కెన్ స్వామి ప్రపన్నకల్ప తరువై యీరేడు లోకాలలో;
దక్కెన్ మీకిటు, మ్రొక్కులిందు జగ దంతర్యామికిన్ - పెక్కులౌ
చిక్కుల్ దీర్చు విహంగగామికి - మహాశేషాచలస్వామికిన్.

[ కళిక ]

పాలకడలి తరంగములపయి పవ్వళించిన శేషశాయికి
జాలితో మొర లాలకించెడి సాధుజన సంతోషదాయికి
కోరిచేరినవారలకు ముంగొంగు బంగారైన శౌరికి
క్రూరదైత్య నికాయముల బొరిగొను సుదర్శన చక్రధారికి
పే రురంబున పసిడికాసుల పేరుమెఱసెడి నిత్యభోగికి
తారహారములను గళంబునఁ దాల్చివెల్గు సదానురాగికి
సత్యసౌందర్యములు కలిసిన సకలభువన శివప్రదాతకు
నిత్యకల్యాణముగ వెలసిన నిఖిలమానవ జయవిధాతకు,

[ ఉత్కళిక ]

గ్రుడ్డివారికి కన్నులిచ్చుచు - వడ్డికాసుల కిచ్చమెచ్చుచు
నిత్యపూజలు స్వీకరించుచు - అత్యయముల నిరాకరించుచు
అందమగు 'ఆనందనిలయము' నందువెలసిన కాంతివలయము
కందళించిన కల్పశాఖకు - మందహాస మనోజ్ఞరేఖకు

[ సప్తమీ విభక్తి ]

ఈ హృదయంబు నవ్యనళినేక్షణ వీక్షణ దివ్యదీప్తి స
మ్మోహితమై సదా మునుగుచున్నది నా ప్రభునందు - నా జగ
న్మోహనునందు - నా మధురముగ్ధ కపోలునియందు - నా చతు
ర్బాహునియందు - నా పతితపావన మంగళమూర్తియందునన్.

[ కళిక ]

జగములను సృజించి పెంచి సంహరించు ప్రభునియందు
భృగుమహర్షి గర్వ మపహరించు విశ్వ విభునియందు
యుగయుగాల దీనజనుల నుద్ధరించు సదయునందు
జగతి నవతరించు సరస సానురాగ హృదయునందు
మొగమునందు నగవు చిందు ముగ్ధ మధురమూర్తియందు
నిగమవీథులందు మెఱయు నిత్యసత్యకీర్తియందు
గగనవాహినీమరంద కలిత పద సరోజునందు
సుగతినొసఁగి తమము లణచు సూర్యకోటి తేజునందు.

[ ఉత్కళిక ]

అల వికుంఠపురిని వదలి - కలశజలధినుండి కదలి
దీనజనుల దిగులు బాప - మానవులకు వెలుఁగుచూప
వేంకటాద్రి నవతరించి - కింకరుల ననుగ్రహించి
సేవలందు దేవునందు - పావనప్రభావునందు.

[ సంబోధన విభక్తి ]

వేదోద్ధారణ ! మందరాభరణ ! పృథ్వీధర్మ నిర్మాణ ! ప్ర
హ్లాద త్రాణ ! బలిప్రతారణ ! నృపాహంకార నిర్వాపణా !
వైదేహీరమణా ! ధనంజయ జయవ్యాపారపారీణ ! క్షో
ణీ దీవ్యత్కరుణా ! తమోహరణ ! తంద్రీ ! శ్రీనివాసప్రభూ !

[ కళిక ]

ఆపదబ్రొక్కుల ఆశ్రిత బంధూ !
కాపాడంగదె కరుణాసింధూ !
ఆలింపుము మొఱ లాదివరాహా !
పాలింపుము ప్రియ భక్త సమూహా !
ఆదుకొనుము వృషభాచలసదనా !
చేదుకొనుము సరసీరుహవదనా !
మందర మెత్తిన మాయిలువేల్పా !
వందన మిదె గొను వలమురిదాల్పా !

[ ఉత్కళిక ]

నిస్తులదీక్షా ! కౌస్తుభవక్షా !
త్రిజగన్మోహన ! ద్విజరాడ్వాహన !
అరిజనమర్దన ! శరణు జనార్దన !
పంకజనయనా ! వేంకటరమణా !

[ సార్వవిభక్తికము ]

నీ వానందరసైకమూర్తివి - శ్రుతుల్ నిన్నుం బ్రశంసించు - నీ
చే వెల్గున్ జగమెల్ల - నీ కొఱకు పుష్పించున్ త్రయీవల్లికల్;
నీ వల్లన్ సిరులబ్బు - నీకు సరి లేనేలేరు - నీ యందె నా
భావం బైక్యమునొందె - భక్తసులభా ! పద్మావతీవల్లభా !

[ నమస్సమర్పణము ]

కరుణశ్రీ రచియించి తెచ్చె నొక కావ్యాన్, గుండెలోనుంచి నీ
చరణాబ్జమ్ముల చెంత నుంచె నిదిగో స్వామీ ! గ్రహింపంగదే;
యిరవై త్వత్కరుణా రసప్లుతికి. నా యీ చిన్ని కావ్యం 'బుదా
హరణం' బై వెలుగొందుగాక మన యన్యోన్యానురాగాంకమై.



# హిందూ సనాతన వేదమత వైభవము

"కవిత్రయ మిత్ర - కవితా కళానిధి - కవికంఠీరవ - విమర్శక శిరోమణి - విద్యారత్న"

శ్రీమాన్ గొట్టుముక్కుల రమాకాంతాచార్యులు, బి. ఏ.

* * *

## భగవత్ స్తుతి

నమోఽస్తు చిద చిన్మిశ్ర జగ జ్జన్మాది హేతవే

శ్రీవిష్ణవే ముముక్షూణాం సంసారార్ణవసేతవే.

## భగవన్ (భాగవత మత) ప్రశంస

జయతు జయతు విష్ణుః 'పాంచరాత్రస్య' వక్తా

జయతు జయతు భక్తిః శ్రీశపాదనుషక్తా

జయతు జయతు రక్షా 'పంచసంస్కార దీక్షా'

జయతు జయతు తత్త్వజ్ఞానినాం ముక్త్యపేక్షా.

## పరమ భాగవత స్తుతి

"ప్రహ్లాద నారద పరాశర పుండరీక

వ్యాసాంబరీష శుక శౌనక భీష్మదాల్భ్యాన్

రుక్మాంగ దార్జున వసిష్ఠ విభీషణాదీన్

పుణ్యా నిమాన్ పరమ భాగవతాన్ స్మరామి."

## శ్రీవేదాంత గురు పరంపర

"నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తించ తత్పుత్ర పరాశరం చ వ్యాసం శుకం" వృత్తికరం మహాంతం బోధాయనం ద్రామిడ భాష్యకారం టంకం గుహం భారుచి దేశికేంద్రం శ్రీమ త్కపర్దాఖ్యగురుం వరేణ్యం నాథంమునిం యామున మార్యచంద్రం రామానుజం నౌమి గురుప్రకాండాన్.

## వ్యాస స్తుతి

"వ్యాసం వసిష్ఠ నప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్."

## శ్రీ రామనుజ భాష్యకార స్తుతి

"శ్రీ భాష్యకారో జయతు రామానుజ జగద్గురుః
ముముక్షూణాం చ సర్వేషాం శ్రీమ దష్టాక్షరప్రదః
"తస్మైరామానుజార్యాయ నమః పరమయోగినే
యశ్శ్రుతి స్మృతి సూత్రాణా మంతర్జ్వర మశీశమత్."

## వేదమతసనాతనత్వము

శ్రీ భారతీయ జ్యోతిశ్శాస్త్రప్రమాణము వలననే గాక, పాశ్చాత్య విజ్ఞాన శాస్త్రప్రమాణము వలనఁ గూడ నేఁటికి సుమారు 195 కోట్ల సంవత్సరముల క్రింద జగత్సృష్టి ప్రారంభ మయ్యెనని నిశ్చయింపఁ బడినది.

దేవవాణీ మయమగు మన వేదవాఙ్మయము సృష్టి ప్రభాతమున శ్రీమన్నారాయణుఁడు తన బొడ్డుఁదామరఁ బుట్టిన పుత్త్రుఁడగు చతుర్ముఖబ్రహ్మకు ఉపదేశ పురస్సరముగ నొసఁగబడుటచే, ఈ వాఙ్మయ మంతయు 'అపౌరుషేయ' మని ఆస్తికులగు భారతీయు లందఱిచేతను విశ్వసింపఁబడుచున్నది.

ఈ వేదకలాపము, ఐతిహాసికదృష్టిచే గూడ ఇప్పటికి పదివేల సంవత్సరములకు ముందే మన భరతఖండములోఁ బ్రచారమున నున్నదని కీ. శే. శ్రీ బాల గంగాధరతిలకమహాశయులు సోపపత్తికముగ స్థాపించియుండుటచే, ప్రపంచ మందలి సమస్త ప్రసిద్ధ మతములలో, ఈ వేదమతమే 'అత్యంత ప్రాచీన' మని రూఢి యగుచున్నది. ఏలనఁగా, లోకములో బహుసంఖ్యాకు లగు మానవులచే ఆశ్రయింపఁబడుచున్న బౌద్ధ - క్రైస్తవ - మహమ్మదీయ మతకర్తలలో, గౌతమ బుద్ధుఁడు కలియుగమున 2638-వ సంవత్సరముననను, క్రైస్తవ మతకర్త కలియుగ మున 3101 - వ సంవత్సరముననను, మహమ్మదీయ మతకర్త కలియుగమున 3672-వ సంవత్సరముననను జన్మించిరని ప్రపంచ మతేతిహాసమువలన సుస్పష్టమగుచున్నది.

## మహాభారతకాలము

భారతీయుల ఇతిహాసప్రవాహమున మహాభారతయుద్ధకాలము ఒక మహాఘట్టమని తెలియవలయును. అది ద్వాపర యుగాంతమునకును, కలియుగారంభమునకును సంధికాలము. సృష్టిప్రారంభమునుండి ద్వాపర యుగాంతమునకు 195,58,80,000 సంవత్సరములు గతించెను. కలియుగ ప్రవేశమగునాఁటికి శ్రీకృష్ణావతారసమాప్తి యయ్యెను.

## భగవద్విభూతి

సత్యమగు ఈ భగవద్విభూతిలో మూఁడుపాదములకు [1] త్రిపాద్విభూతియనియు, మిగిలిన ఒక పాదమునకు ఏకపాద్విభూతియనియు పేరులు. త్రిపాద్విభూతియనఁగా, శాశ్వతమును-పునరావృత్తిరహితమును నగు విష్ణుభగవానుని పరమపదస్థానము. ఇది సత్యమేగాక, త్రికాలాబాధ్యమును - నిత్యమును నగు స్థానవిశేషము. ఏకపాద్విభూతి యనఁగా, పరిదృశ్యమానమగు విశ్వప్రపంచమంతయును. ఇది త్రిపాద్విభూతివలెనే సత్యమేయైనను, అనిత్యమని తెలియవలయును. ఈ రెండు విభూతులమధ్యగా ప్రవహించుచుండు విరజానదియే ఈ విభూతి ద్వయమునకు మధ్యయెల్ల. ఏకపాద్విభూతిలో జరుగు సృష్ట్యాది భగవల్లీలలకు క్రీడాపరికరమయి, త్రిగుణాత్మికయగు మాయకు ఏకపాద్విభూతిలోనే ప్రచారము. త్రిపాద్విభూతిలో అడుగుపెట్టుటకు అధికారములేదు. ఏకపాద్విభూతికి అవిద్యాపాదమని పేరు. ఏకపాద్విభూతినుండి దాని ప్రక్కగాఁ బ్రవహించు విరజానదిని దాఁటినముక్తాత్మలు, విరజానదికి ఆవలనున్న త్రిపాద్విభూతిలో అడుగుపెట్టు మొదటిపాదమునకు సువిద్యాపాదమనియు, దాని కవ్వల ఆనందపాదమనియు, ఆనందపాదమునకు పైన తురీయపాదమనియు పేరులు. ఈ మూఁడు పాదములు నిత్యమైనను, భగవన్నారాయణునితో ముక్తులు బ్రహ్మానందము ననుభవించుపాదము తురీయపాదము.

## భగవదవతరణము

అవతరణమనఁగా — 'దిగుట' అని యర్థము. సృష్టి ప్రారంభము నుండి, శాశ్వతధర్మగోప్తయగు శ్రీమన్నారాయణుఁడు ద్వాపరయుగాంతములోఁగా, వేద శాసనము నుల్లంఘించు స్వభావముగల అసురులబారినుండి సాధువులఁ బరి

1. త్రిపాద్విభూతిని గూర్చి మహానారాయణోపనిషత్తు చూడుఁడు.

రక్షించుటకుఁగా ధరించిన అవతారములలో, మత్స్య - కూర్మ - వరాహ నారసింహ - వామన - పరశురామ - శ్రీరామావతారములు ముఖ్యములు. భగవానుని సాధుపరిత్రాణ శక్తికి క్రియాశక్తియని పేరు. ఈ యవతారములలో క్రియాశక్తిని వినియోగించి, దుష్టులవధించి, సాధులఁ గాపాడుటయే జరిగెఁగాని, ఈ అసురుల చేతిలో గ్లానిఁ జెందిన స్వ (భాగవత) ధర్మమును సంస్థాపించుట మాత్రము జరిగియుండలేదు.

సృష్టి ప్రభాతసమయమున శ్రీమన్నారాయణుఁడు చతుర్ముఖ బ్రహ్మకు వేద వాఙ్మయ మొసఁగుటయే గాక, ఆ వేదముల యర్థమంతయును 108 సంహితల వ్యాఖ్యతో ఆయనకు విశదీకరించెను.

ద్వాపరాంతమున వేదోక్త స్వధర్మోద్ధరణ మొనరింప సాత్త్వత వంశమున నవతరించిన శ్రీకృష్ణభగవానునకు కుడిభుజముగ నిల్చిన బ్రహ్మర్షులలో శ్రీ వ్యాస - పరాశర - శుక బ్రహ్మర్షులు ముఖ్యులు. రాజర్షులలో భీష్మాచార్యులు ఏకైక వీరుఁడు.

## సాత్త్వికోపబృంహణ వాఙ్మయము

కృతయుగమునుండి ద్వాపరాంతమువఱకును, ఈ లోఁగా, వేదోక్త బృంహణాత్మకముగా — సన్మార్గదర్శకముగా లభించిన గ్రంథములలో — (౧) శ్రీమన్నారాయణ ముఖోద్గతమగు 108 సంహితల పరిమితమగు శ్రీపాంచరాత్రశాస్త్రము, (౨) బ్రహ్మచే నిర్మింపఁబడి మనువుకు ఉపదేశింపఁబడిన మనుధర్మ శాస్త్రము, (౩) శ్రీ పాంచరాత్ర శాస్త్రప్రవర్తకుఁడును, దేవర్షులలో నుత్తముఁడు నగు నారదుని ఉపదేశ ఫలముగా వాల్మీకిమహర్షిచే రచింపఁబడిన శ్రీరామాయణేతిహాసము ఈ మూఁడును ముఖ్యములు. వేదోక్తభాగవతమత విరుద్ధమగు కాపిల సాంఖ్యాద్యవైదిక దర్శనములవలెనే, వేద మతానురోధము గాని పురాణ వాఙ్మయము గూడ నుండెను గాని, అవి వ్యాస పరాశరాదులకు సమ్మతము గాకపోయెను.

## వేదోక్త భాగవతమత సంస్థాపనము

వేదోక్తభాగవతమత పునః ప్రతిష్ఠాపనమునకుఁగా శ్రీకృష్ణ భగవానుఁడు కురుక్షేత్ర సంగ్రామమున అర్జునుని నిమిత్తీకరించి, సర్వవేద వేదాంత మతసార సర్వస్వ సంగ్రహముగా శ్రీమద్భగవద్గీతాశాస్త్రము ననుగ్రహించెను. శ్రీకృష్ణ

భగవానుఁడు వేదవేద్యుఁడు—వేదార్థ విదుఁడు—వేదాంత సంప్రదాయక ర్తగదా! (శాం.గీ.భా. 15-15) వేదాంతులకు పరమాచార్యుఁడగు జగద్గురువు. (శాం.గీ భా. 3-31, 13-18, 18-68) శ్రీకృష్ణభగవ దనుగ్రహ పాత్రుఁడగు శ్రీపరాశర మహర్షి, వేద వేదాంత తత్త్వ విశదీకరణ ప్రవృత్తముగా శ్రీవిష్ణుపురాణమును రచించెను. భగవదావేశావతారమూర్తియగు వేదవ్యాస మహర్షి, భగవత్పరి పూర్ణావతారమూర్తియగు శ్రీకృష్ణుని భగవద్గీతామార్గమును తన పితృపాదులగు శ్రీపరాశరమహర్షి పురాణోపదేశము ననుసరించి, ద్వాపరాంతములోఁగా ఆ యా కాలములయందు వేద వేదాంత వాఙ్మయమునకు కుత్సితులచేఁ జొప్పింపఁబడిన కృతక భాగములను తొలఁగించి, వేదవాఙ్మయ మంతయు సంస్కరించి, యావద్వేద వాఙ్మయమునకు వ్యాఖ్యానముగా నుపకరించుటకుఁగాను — మహాభారతమును రచించి, వేదాంతర్భాగమగు ఉపనిషత్తుల యర్థము సంశయ విపర్యయ రహిత ముగా జిజ్ఞాసువులకు లభించుటకుఁగాను బ్రహ్మసూత్రము లను పేర వేదాంత దర్శనమును రచించి, ఈ సూత్రములు మరల దురర్థముల పాలుగాకుండ, తానే పరమకృపతో సూత్రములకు సరియైన వ్యాఖ్యానముగా నుపకరించుటకుఁగాను శ్రీమద్భాగవత మహాప్రబంధమును గూడ ననుగ్రహించెను.

## భగవన్ (భాగవత) మత వైభవము

తన బొడ్డుఁదామరఁ బుట్టిన చతుర్ముఖునకు సృష్టిప్రబంధరచనా కౌశలము లభించుటకుఁగాను, వేదార్థమును సరహస్యముగా—సంగ్రహముగా ఐదురాత్రులు భగవన్నారాయణుఁ డుపదేశించుటచే, ఈ రహస్యశాస్త్రమునకు 'పాంచరాత్ర' మనిపేరు గల్గెను. భగవానునిచే ఈ శ్రీపాంచరాత్రధర్మము కృతయుగ ప్రారంభమున ప్రచారిత మగుటచే, ఈ ధర్మము ఆద్యము - సనాతనము - చతుర్వేద సమ్మతము - కర్మజ్ఞానసముచ్చిత ప్రవృత్తి నివృత్తి మార్గద్వయాత్మకము - యతుల చేతను, వైఖానసులచేతను, ముముక్షువులగు సర్వాశ్రమీయులగు సాత్త్వతుల చేతను ఉపదేశపరంపరగా అనుష్ఠేయమని తెలియవలయును. (మహాభారత శాంతిపర్వాంతర్గత మోక్షధర్మపర్వము : 340-11, 12; 346-9, 10; 347-1; 349-2, 11 మొ 18 వఱకు; 30, 34, 39 మొ 53 వఱకు, 55, 56; 351-67) 108 సంహితల పరిమితమగు ఈ విపులగ్రంథమును వేదవ్యాసుఁడు సంగ్రహించి వేదార్థసర్వస్వముగాఁ దా రచించిన మహాభారతమునకు సారమగు శాంతి

పర్వములో, తత్సారభూతమగు మోక్షధర్మపర్వమునకు చరమవాక్యముగా 'నారాయణీయ ధర్మ' మనుపేర నిబంధించుటచే, ఇది – 'వేదసారసర్వస్వ' మని ప్రమాణతమముగా ఆస్తికులందఱి చేతను శిరసా వాహ్యామని స్పష్టమగుచునే ఉన్నది. ముముక్షువులగు సాత్త్వికుల కుపాదేయ మగుటచే, ఈ శ్రీపాంచరాత్ర శాస్త్రమునకు సాత్త్వతమని పేరు. (శాంతి : 343-49)

"ఏవ మేష మహాన్ శబ్దః మైత్రేయ భగవా నితి
పరమబ్రహ్మభూతస్య వాసుదేవస్య నాన్యగః."

— (విష్ణుపురాణము : 6-5-79)

అను శ్రీపరాశరీయ శ్రీసూక్తిచే, భగవచ్ఛబ్దము నారాయణునియందే ముఖ్యవృత్తిగా నన్వయింపవలయునను ఆర్షశాసనముచే – 'నారాయణీయధర్మ' 'భాగవతధర్మ' శబ్దము లన్యోన్య పర్యాయవాచకములై, శ్రీపాంచరాత్ర శాస్త్రోక్త మతమునకు 'భాగవతమత' మను వ్యపదేశముకల్గినది. వేదార్థ సర్వస్వము శ్రీపాంచరాత్ర రూపమున భగవానునిచే ఉపదేశమును బొందిన చతుర్ముఖుఁడు దాని ననుసరించి రచించిన స్మృతిని, విరాట్టుద్వారా–మనుమహాముని ద్వారా–భృగుముఖముగా దశ ప్రజాపతుల కుపదేశించెను. (మనుస్మృతి : 1-32 మొ 35; 58 మొ 50 వఱకు; భ. గీ. 4-1 మొ 3 వఱకు) కృతయుగీయమగు ఈ మనుధర్మశాస్త్రమునకును, ద్వాపరాంతమునందు శ్రీకృష్ణభగవానునిచే ననుగ్రహింపఁబడిన భగవద్గీతా శాస్త్రమునకును, మాతృక శ్రీపాంచరాత్రశాస్త్రమే యని తెలియవలయును.

## శ్రీ గీతాచార్య వైభవము

శ్రీకృష్ణభగవానుఁడు శ్రీమన్నారాయణుని పరిపూర్ణావతారమని కీర్తింపఁబడుచున్నాఁడు. కారణ మేమని విచారింపఁ దగినది. మొదటికారణ మేమనఁగా– మాండూక్యోపనిష దుక్త చతుష్పాత్ప్రణవ స్వరూపుఁడగు పరవాసుదేవుఁడు (తురీయమూర్తి) అఖిలహేయప్రత్యనీకజ్ఞాన శక్త్యాదిషాడ్గుణ్య పూర్తితో సంకర్షణ సోదర (ప్రాజ్ఞమూర్తి) ప్రద్యుమ్నానిరుద్ధ కుమారాత్మక (తైజస వైశ్వానర మూర్తి) సమేతముగా, మనుజ నయన గోచరుఁడై అవతరించుటయే, (విష్ణు సహస్రనామ శంకర భాష్యము : 185, 332, 639, 640, 695, 709 నామములు చూడుఁడు.) శ్రీకృష్ణావతారమునకు ముందు సాక్షాత్కరించిన అవతారములలో

శ్రీమన్నారాయణుని చతుర్వ్యూహాత్మకమగు ఔపనిషద పురుషుని సేవ ముముక్షువులకు లభించియుండలేదు. తాను వేద వేద్యుఁడనని - వేదవేద్యుఁడనని - వేదాంతసంప్రదాయక ర్తనని (శాం. గీ. భా. 15-5) ప్రకటించుకొని, వేదస్వరూపుఁడగు గరుఁడుని తన రథమునకు ధ్వజముగాఁ బెట్టుకొని, వేదప్రతి భటములగు దుర్మతముల ఖండించుటకై స్వధర్మ ప్రస్థానము గావించి, తన ప్రకృష్ట జ్ఞాన శక్తిని ప్రదర్శించి, సాధుపరిత్రాణముఁ జేసిన అవతార మిదియొక్కటియే! శ్రీమద్భాగవతమత ప్రకాశముగ తన వేదాంత సూత్రములకు భాష్యముగా రచించిన శ్రీమద్భాగవత పురాణముయొక్క మంగళ శ్లోకములో — శ్రీకృష్ణ భగవానునే, వేదాంతదర్శనములోని 'జన్మాద్య' స్యేత్యాది ప్రతిష్ఠిత పరబ్రహ్మ ముగా - గాయత్రీగీయమాన ముముక్షువరేణ్యునిఁగా - వ్యాసభగవానుఁడు వేద వేదాంతోక్త సకల దేవతా సార్వభౌమునిగా ప్రకటించుట గొప్పకారణము. కృతయుగమునుండి ద్వాపరాంతము దనుక, నారదాచార్యకముగ, అవిచ్ఛిన్న పరంపరగా వచ్చుచున్న సాత్త్వత వంశములో శ్రీకృష్ణుఁడవతరించుట మఱియొక కారణము. వేదాంతు లంతటికిని పరమాచార్యుఁడైన ఈ భగవానుఁడు శ్రీ కృష్ణరూపమున నవతరించి, 'కృష్ణస్తుభగవాన్‌స్వయమ్' 'భగవాన్ సాత్త్వతాం పతిః' అను బిరుదములు ధరించి, సాత్త్వతులకు (= పాంచరాత్రులకు, భాగవత మతస్థులగు వైష్ణవులకు) యోగక్షేమకరుఁడై, తన శ్రీపాదములను శరణించిన మాత్రముననే, స్త్రీ పురుషులని — బ్రాహ్మణులని — క్షత్రియులని — వైశ్యులని— శూద్రులని — దురాచారులని — పాపయోను (అంత్యజు) లని— ధర్మాధర్మపరులని ఏభేదము నెంచక, ఆర్తులు—జిజ్ఞాసులు—అర్థార్థులు—జ్ఞానులు అను భేదము నెంచక, నిర్హేతుక కృపచే, చతుర్విధ పురుషార్థములలో ఏది కోరుకొనిన ఆ యా వర ములఁ నొసఁగుదునని ప్రపన్నుల కందఱికిని వాగ్దానముఁ జేసిన భగవదవతార మూర్తి ఎందుఁ గలఁడు? (శాం. గీ. భా. 7-14, 16 మొ 20 వఱకు; 9-22 మొ 34 వఱకు; 18-61, 62, 65, 66) నా భక్తుఁడు నశింపడని ఏ దేవాది దేవుడు ఇట్లు ప్రతిజ్ఞపట్టెను? (శాం. గీ. భా. 9-31) భగవానుఁడు భక్త్యైక సులభుఁడు. (శాం. వి. స. నా. 818 భా.) ముముక్షువులకు ఈయనకంటె వేఱుగతి లేదు. (శాం. వి. స. నా. 450 భా.)

## అవతార రహస్యజ్ఞానము మోక్షప్రదము

సామాన్య మానవుల జన్మ. కర్మాధీనము. గర్భదుఃఖ సహితమైనది. ప్రాకృతమానవుల జన్మ చేష్టితము గాదు. భగవదప్రాకృత దివ్యావతారములు "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" 'ధర్మసంస్థాపన నిమిత్తము

ఆ యా యుగములందు నే నవతరింతు ' నను గీతోక్తిలోని (శాం: గీ: భా: 4-8) 'సంభవ ' అను పదమునకు (విష్ణుసహస్రనామము 31, శాం: భాష్యములో–) "స్వేచ్ఛయా సమీచీనం భవన మస్యేతి సంభవః." అనఁగా, భగవానునకు 'సమీచీనమగు జన్మము స్వేచ్ఛగా జరుగు ' ననియు —

"అథ దుష్టవినాశాయ సాధూనాం రక్షణాయ చ
స్వేచ్ఛయా సంభవా మ్యేవం గర్భదుఃఖ వివర్జితః."

'దుష్టవినాశము కొఱకును – సాధు రక్షణ కొఱకును స్వేచ్ఛగా నవతరింతును ' అని భగవానుఁడు తనకు ఇచ్ఛగల్గినప్పుడు త్రిపాద్విభూతి నుండి ఏకపాద్విభూతికి దిగుటయే అవతార మనఁగా. నృసింహావతారము 'అచిత్తు ' అగు స్తంభము నుండియు – శ్రీరామకృష్ణావతారములు ధన్య 'జీవుల 'లో నుండియు ఆవిర్భవించినవి. ఇందువలన, భగవానుఁడు అంతర్యామిబ్రాహ్మణ ముద్ఘోషించునట్లు చిదచిదంతర్యామి యగు అమృతస్వరూపుఁడు గదా! శ్రీకృష్ణభగవదవతారమును చేష్టితము – అప్రాకృతము – దివ్యము అని ఎవఁడు తెలిసికొనునో అట్టివాఁడు దేహపాతానంతరమే 'పునర్జన్మము 'ను పొందఁగలఁడని భగవానుఁడే ఆనతిచ్చుచున్నాఁడు (శాం. గీ. భా. 4-9).

## దేవర్షి నారదుఁడు శ్రీ భాగవత (పాంచరాత్ర) శాస్త్ర ప్రవర్తకుఁడు

"ధర్మ బ్రహ్మప్రతిపాదకం అపౌరుషేయం స్వతః ప్రమాణవాక్యం వేదః." అనఁగా, ధర్మబ్రహ్మప్రతిపాదకమై – అపౌరుషేయమై – స్వతః ప్రమాణమగు వేదమునకు తత్పూర్వభాగోక్త ధర్మమును – తదుత్తర భాగోక్త బ్రహ్మమును రెండు పక్షము లనుట ఉచితమే గదా! శ్రీభాగవతశాస్త్రప్రవర్తకుఁ డగు నారద మహర్షి భగవానునిచే త్రిలోకాచార్యత్వము నెఱపుటకు అధికృతుఁడై, ధర్మమును ప్రజలచే ననుష్ఠింపఁ జేయు విధిగల రాజర్షులను – బ్రహ్మవిద్యను ప్రకాశింపఁజేయు విధిగల బ్రహ్మర్షులను పరిపాలించుచు, గడచిన మూఁడు యుగములలో విశ్వ రంగమున జరుగు మహాసంఘటనములలో ఉచితరీతిని ఐక్యము గలుగఁ జేసికొనుచుండెనని పురాణేతిహాసములవలనఁ దెలియనగును. గర్భస్థుఁడగు ప్రహ్లాదునకు ఈయన చేసిన భగవన్మంత్రోపదేశఫలముగానే, 'విశ్వాంతర్యామియు ' 'అమృత స్వరూపుఁడు ' నగు భగవానుఁడు నృసింహరూపమున నవతరించి, భాగవతోత్తముఁడగు ప్రహ్లాదుని, తదితర సాధువులను అసురుఁడగు హిరణ్యాక్షుని బారినుండి

పరిరక్షించెను. ఇది కృతయుగపుమాట. త్రేతాయుగమున పరశురాముఁడు ముయ్యేడుమాఱులు దుష్టక్షత్త్రియ వధ గావించినపిదప, రావణాది ఘోరరాక్షసుల వధించి, సాధువులగు ఋషులను, భక్తులను రక్షించిన కారణమున, శ్రీరామచంద్రమూర్తి 'రామో విగ్రహవాన్ ధర్మః' 'రాముఁడు రూపము దాల్చిన ధర్మము' అను స్తోత్రమునకు పాత్రుఁడు కాఁగా, శ్రీమన్నారాయణునకు శయ్యయగు అనంతుఁడు లక్ష్మణస్వామిగా – శ్రీదేవి శ్రీ సీతామహాదేవిగా – శంఖచక్ర దివ్యాయుధములు భరత శత్రుఘ్నులుగా నవతరించిన ఈ రామచంద్రభగవానుఁడు —

"రమన్తే యోగినో యస్మిన్ నిత్యానందే చిదాత్మని
ఇతి రామపదే నైతత్ 'పరంబ్రహ్మ' భిధీయతే."

అను పద్మపురాణోక్తి ప్రకారము (విష్ణు. స. నా. శాం. భా. 394) సాక్షాద్భగవదవతారమని యెఱిఁగి, తచ్చరితమును రామాయణ మహాకావ్యముగ నిబంధింపవలయునని వాల్మీకిమహామునికి ఉపదేశించుటయు, నారదుని 'ధర్మాచార్యత్వ'మును ప్రకాశింపఁజేయుచున్నది. ఈ రామచంద్రమూర్తి ఇక్ష్వాకు మహారాజర్షి వంశములో నవతరించిన పరబ్రహ్మమూర్తి. శ్రీరాముని కాలము నుండి శ్రీకృష్ణభగవాఁ డవతరించిన ద్వాపరాంతమునాఁటికి కొన్ని కోట్ల సంవత్సరములు గతించెను. భగవానునుండి మనుమహాముని ద్వారా దశరథమహారాజు వఱకు వచ్చిన 'వైదికకర్మయోగము' శ్రీరామచంద్రుని రాజ్యములో చక్కఁగా నిర్వహింపఁబడుటచే, ఆదర్శరాజ్యమునకు 'రామరాజ్య' మను నామము సార్థకమగుచున్నది. శ్రీరాముని కాలమునుండి, శ్రీకృష్ణుని కాలమువఱకును గడచిన కోట్ల కొలఁది సంవత్సరములలోఁగా, రాజర్షులచే భాగవతమతసంప్రదాయము సరిగా పరిపాలింపఁబడని హేతువుచే, 'నష్టప్రాయ'మై పోయెనని వేదోక్త స్వధర్మమగు భాగవతమత సంప్రదాయము నుద్ధరించుటకే తాను శ్రీకృష్ణ భగవానుఁడుగా నవతరించితినని, గీతాశాస్త్రములో తాను ప్రతిపాదించుచున్న వైదికకర్మయోగము ఉత్తమమైన గీతారహస్యమని భగవానుఁడు సెలవిచ్చెను. (శాం. గీ. భా. 4-1 మొ 9 వఱకు) శ్రీకృష్ణభగవానుఁడు పరబ్రహ్మమూర్తి యొక్క పరమావతారమనియు, వేద వేద్యుఁడనియు పైన సోపపత్తికముగ ప్రతిపాదింపఁబడినది. త్రేతాయుగమున 'ధర్మస్వరూపు'డగు శ్రీరామచంద్ర భగవానుని వైభవమును శ్రీరామాయణ మహాప్రబంధముగ నిబంధింప నుపదేశించిన

త్రిలోకాచార్యుఁడగు శ్రీ నారదమహర్షియే మఱల ద్వాపరాంతమున 'బ్రహ్మ స్వరూపుఁ' డగు శ్రీ కృష్ణభగవానుని వైభవమును శ్రీమద్భాగవత మహాప్రబంధ మున నిబంధింప శ్రీ వేదవ్యాసమహర్షికి ఉపదేశించెను. 'అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః.' అను శ్రుతి ప్రకారము శ్రీ పరబ్రహ్మమూర్తి యొక్క బాహ్యస్వరూపము శ్రీరామచంద్ర 'ధర్మమూర్తి', ఆంతస్స్వరూపము 'శ్రీకృష్ణబ్రహ్మమూర్తి.' ఈ మూర్తిద్వయ కల్యాణగుణ సంపదయే ముముక్షు వులకు భుక్తి ముక్తిప్రదమని భగవత్ప్రపన్నులు తెలియవలయును.

## వేదాంత దర్శనము

వేదాంతదర్శన ప్రవర్తకాచార్యులగు వేదవ్యాసమహర్షి, భగవద్గీతకును-మనుస్మృతికిని మాతృకయగు శ్రీ పాంచరాత్రశాస్త్రమును తన దర్శన నిర్మాణ మునకు మణిదీపికాశ్రయముగ పరిగ్రహించెను. (బ్ర. సూ. 1-2-6; 2-2-1; 2-2-42 మొ 45 వఱకు) భగవద్గీతలకును – మనుస్మృతికిని శ్రీ పాంచరాత్ర శాస్త్రమే 'మాతృక' యని చెప్పఁబడినది. ఈ మూఁడింటికినిగల ఐకకంఠ్యము ఈ క్రింద ప్రదర్శింపఁబడును. ఇది దిఙ్మాత్రసూచకమే.

## శ్రీ పాంచరాత్ర – భగవద్గీతా శాస్త్రముల ఐకకంఠ్యము

ఈ రెండు శాస్త్రములకును ఉపనిషత్తు లని వ్యవహారము. (శాంతి. 340-111, 112; గీతాధ్యాయాంతము.) రెంటికిని కర్త శ్రీమన్నారాయణుఁడే. (శాంతి. 336-50; భ. గీ. 18-68) రెండును రహస్యోపదేశైక గమ్యములే. (శాంతి. 336-50; 18-68) రెండును సామవేదమూలములే. (శాంతి. 348-10; భ. గీ. 10-22) భగవన్నారాయణుని భక్తులుగానివారికి ఉపదేశింపరాదు. (శాంతి. 345-125; భ. గీ. 18-67) శ్రీమన్నారాయణుఁడే శాశ్వతధర్మగోప్త. (శాంతి. 336-5; భ. గీ. 11-18) 'నారాయణపరంబ్రహ్మ తత్త్వం నారాయణః పరః' — 'స ఆత్మా అంగాన్యన్యా దేవతాః' అను వేదాంతవిధి ప్రకారము నారాయణుఁడే పరాత్పరుఁడు. బ్రహ్మరుద్రేంద్రాదిత్య వినాయక శక్త్యాది దేవతలు అయనకు అంగదేవతలు. (శాంతి. 342-29, 30, 31, శాం. గీ. భా. 4-5, 40; 5-29; 6-47: 8-4; 11-32, 46; 15-17) మాయ యనఁగా – విష్ణునకు స్వభావభూత త్రిగుణాత్మికయగు శక్తివిశేషము. (శాంతి. 337-4; 340-45; శాం. గీ. భా. 4-6, 7-14) కేవల భగవచ్ఛరణైకపరాయణులే మోక్ష

మునకు అధికారులు. (శాంతి. 337-40; శాం. గీ. భా. 2-7, 4-1; 7-14; 9-22; 11-4; 15-19, 20; 18-62) విష్ణుతత్త్వజ్ఞులును - దేవతాంతరవిముఖులును నగు పరమైకాంతులే చతుర్విధ భక్తులలో శ్రేష్ఠులు. (శాంతి. 342-33, 34; 349-69, 70; శాం. గీ. భా. 7-16, 17) భగవన్నారాయణ పరాయణైక శరణులకే పరబ్రహ్మ సాక్షాత్కారము. (శాంతి. 334-46, 338-31; 343-49; భ. గీ. 11-54) విష్ణు యజనశీలురగు వైష్ణవులకే పరమపద (= మోక్ష) లాభము. (శాంతి. 349-3; శాం. గీ. భా. 4-11, 7-25) దేవతాంతర భక్తులకు పరబ్రహ్మ సాక్షాత్కారము లేదు. (శాంతి. 337-52; శాం. గీ. భా. 11-47, 48, 52, 53) కర్మజ్ఞానములతోఁగూడిన భక్తిచేతను, ప్రపత్తిచేతను మోక్షప్రాప్తి గల్గును. (శాంతి. 337-40, 43; 338-40, 43, 45; శాం. గీ. భా. 18-56, 57) యజ్ఞేశ్వరుఁడు విష్ణువే. (శాంతి. 341-50, 102; శాం. గీ. భా. 9-27) భగవత్ప్రపన్నులే మహాత్ములనఁగా. (శాంతి. 336-25; శాం. గీ. భా. 7-19) అనన్య భక్తిచే లభించు దివ్యదృష్టిచేతనే భగవత్సాక్షాత్కారము లభింపఁగలదు. (శాంతి. 337-32; భ. గీ. 11-18.)

## శ్రీపాంచరాత్ర - భగవద్గీతా - మనుధర్మశాస్త్రముల ఐకకంఠ్యము

శ్రీమన్నారాయణుఁడే జగత్సృష్ట్యాది కర్త. (శాంతి. 248-90; భ. గీ. 7-6, మను. 1-వ అధ్యాయము 1 మొ 10 వఱకు కుల్లూక వ్యాఖ్య) మోక్ష మన విష్ణుని పరమపదస్థానమే. (శాంతి. 349-3; శాం. గీ. భా. 2-51; 5-5; 8-21; 11-38; 13-28; 12-20; 15-6; 18-56, 62; మను: 6-75; 12-125, 127) ప్రీతిపూర్వక ధ్యానముచేతనే మోక్షప్రాప్తి. కేవల జ్ఞానముచేఁ గాదు. (శాంతి. 338-30, 31; శాం. గీ. భా. 7-14, 15, 17, 19; 9-13, 25; 11-54; 13-10; 18-65; మను. 6-72, 73. 79, 82) ప్రవృత్తి నివృత్తి మార్గద్వయాత్మక వైదిక కర్మయోగము పరబ్రహ్మోపాసనారూపము, చతుర్విధ పురుషార్థ ప్రదము. (శాంతి: 348-82, 349-73, 77; శాం. గీ. భా. 9-20 మొ 25 వఱకు; మనుస్మృతి 12-87 మొ 90 వఱకు కుల్లూక వ్యాఖ్య) వేదముఖ ప్రకాశిత సర్వయజ్ఞములలో (శాంతి. 340-60; 341-66, 102; భ. గీ. 3-9, 10, 12, 15; 4-23. 25 మొ 28 వఱకు; 30 మొదలు 33 వఱకు; మను. 1-22, 25; 2-85, 87; 3-70, 118. 285; 4-21; 6-60) జపయజ్ఞమే శ్రేష్ఠము; మోక్షప్రదము.

"జపస్తు సర్వధర్మేభ్యః పరమో ధర్మ ఉచ్యతే, అహింసయా చ భూతానాం జపయజ్ఞః ప్రవర్తతే." ఇతి భారతోక్తిః; శాంకర విష్ణు సహస్రనామభాష్యమ్ 8-వ శ్లోకము; మను. 2-85, 86, 87) ఇందువలన, శ్రీ భాగవత మతము నిరవద్యమని సిద్ధాంతమగుచున్నది.

## భాగవతమత గురుపరంపరా వైభవము

ఈ వ్యాస ప్రారంభమునఁ జేయఁబడిన పరమ భాగవత స్తుతినిఁ బరిశీలించినచో—దేవర్షులలో శ్రేష్ఠుఁడును (భ.గీ. 10-26) భగవదావేశావతారమూర్తియు నగు (శ్రీభాగవతము: 1-3-8) నారదమహర్షియు, త్రేతాయుగమునందలి ఇక్ష్వాకువంశ గురువగు వసిష్ఠమహర్షియు, (శాం. గీ. భా. 11-15) ద్వాపరాంతమున శ్రీకృష్ణభగవానుఁ డవతరించిన సాత్త్వతవంశీయులగు రాజర్షులకు ఆచార్యత్వము చేయుచు వచ్చిన శ్రీ వసిష్ఠబ్రహ్మర్షి వంశపరంపరోద్భవులయిన శ్రీ శక్తి-పరాశర-వ్యాస-శుక బ్రహ్మర్షులును, కృతయుగ ప్రారంభమునుండి శ్రీ కృష్ణ భగవదవతారమువఱకును, ఈ మధ్యకాలములోను, ఇతిహాస పురాణ ప్రసిద్ధులగు పుండరీక - అంబరీష - రుక్మాంగద - దాల్భ్యాది రాజర్షి పుంగవులును, ప్రహ్లాద - విభీషణాది దైత్యకుల పవిత్రులును, శ్రీ కృష్ణభగవత్సమకాలీనులగు భీష్మార్జునులును - 'భాగవతమతస్థు'లని విస్పష్టముగాఁ దెలియఁగలదు.

## వేదోక్త 'భాగవతమత' స్వరూపము

"ఏవ మేకం సాంఖ్యయోగం వేదారణ్యకమేక చ
పరస్పరాంగా న్యేతాని పాంచరాత్రం తు కథ్యతే."

— (మ. భా. శాం. 349-80.)

సాంఖ్యము, యోగము, (సంహితాత్మకమగు) వేదము, వేదశిఖరమగు వేదాంతము ఇవి నాల్గును ఒకే తత్త్వమును ప్రతిపాదించు సందర్భమున పరస్పర సాహాయ్యమును గోరుచున్నవి. ఈ శాస్త్రము లన్నియు పరస్పరాంగములుగాఁ జేరిన ఏకైక శాస్త్రమునకే శ్రీ పాంచరాత్రమని పేరు. ధర్మస్వరూప ప్రతిపాదకము వేదము. బ్రహ్మస్వరూప ప్రతిపాదకము వేదాంతము. (ఆరణ్యకములు) ఆత్మస్వరూప యాథార్థ్య ప్రతిపాదకము సాంఖ్యము. ధర్మప్రకాశిత కర్మాంగభూత యమ - నియమ - ప్రాణాయామ - ప్రత్యాహార - ధ్యాన - ధారణాది పర

మగునది యోగము. కృతయుగమున భగవన్నారాయణునిచే ప్రవర్తింపఁబడినప్పుడుగల ఈ పాంచరాత్రస్వరూపము ద్వాపరాంతమగుసరికి భగవన్ (భాగవత) మతాంగభూతములగు ఈ నాల్గు శాస్త్రములును - వేదప్రామాణ్య విముఖులును, స్వోత్ప్రేక్షితార్థ ప్రవణులును, స్వతంత్ర ప్రజ్ఞులు నగు తీర్థకరుల చేతులలోఁబడి, విరూపము నొంది, భగవన్మత విరుద్ధములగు సిద్ధాంతములను ప్రచారములోనికిఁ దెచ్చెను.

## అవైదిక దర్శన విమర్శనము

ఇంద్రియ ప్రత్యక్షసిద్ధమగు జగత్తు సత్యమే. ఇందు ప్రకృతి (అచిత్తు) కంటె వేఱగు ఆత్మవంటిగాని, బ్రహ్మమువంటిగాని వేఱు తత్త్వములు లేవని చార్వాకులు నిర్ణయించిరి. పూర్వమీమాంసక (= కేవల వైదిక) దర్శనము, కాపిలసాంఖ్యము, పాతంజలీయ యోగము (తర్క దర్శనములగు న్యాయవైశేషికములుసహా) పాశుపతమును ఆత్మస్వరూప నిరూపణ చేయుటలో వేదాంత సిద్ధాంతమునకు అనుగుణముగానే యుండెనని, అందువలన ఈ విషయములో ఏవియో యుక్తులు చెప్పి, ఈ మతములను తత్త్వ జిజ్ఞాసువులు ఖండింపరాదని –

"సాంఖ్యోయోగః పాంచరాత్రం వేదాః పాశుపతం తథా
ఆత్మ ప్రమాణా న్యేతాని న హంతవ్యాని హేతుభిః."

అని వేదాంతదర్శనకారుఁడగు వేదవ్యాసుఁడు తన మహాభారతమున సెలవిచ్చియున్నాఁడు. (శాంతి: 350-63) వేదవ్యాసుఁడు భాగవతాగ్రగణ్యుఁడు. శ్రీ పాంచరాత్రమును, శ్రీపాంచరాత్రశాస్త్ర రూపాంతరములగు శ్రీభగవద్గీతను, మనుస్మృతి ననుసరించి, ఉపనిషద్వాక్య సమన్వయము చేసి, తత్ఫలముగా బ్రహ్మసూత్రముల రచించిన భాగవత మతస్థుఁడు. వేదాంత సూత్రములలో పరబ్రహ్మము జగజ్జన్మాది లక్షణ లక్షితుఁడని, (1-1-2) బ్రహ్మ ఇట్టి లక్షణములు గలవాఁడని తెలిసికొనుటకు ఒక్క వేదమే ఆధారమని (1-1-3) శ్రుతు లన్నియు బ్రహ్మస్వరూపముల నిరూపించునని (1-1-4) ఈ పరబ్రహ్మము స్వ సంకల్పముచే జగత్సృష్టి చేసెనని (1-1-5) సంకల్పములేని జడ పదార్థమగు ప్రకృతి, సృష్టి చేయఁజాలదని నిర్ణయము చేసెను. సృష్టికర్తను ధ్యానించినచో మోక్షము లభించునని వేదము చెప్పుచున్నది. ప్రకృతిని ధ్యానించినచో జడపదార్థము మోక్ష మిచ్చుననుట అసందర్భము గదా! (1-1-7) జగత్సృష్టికి పరబ్రహ్మము

యొక్క బహు భువన సంకల్పమే కారణమని ఇట్లు చెప్పఁబడిన వేదాంత మతమునకు విరుద్ధముగా – జగత్తు ప్రవాహతః నిత్యమగుటచే, జగత్సృష్టికిఁగా ఈశ్వరుఁడే అవసరములేదని కేవల వైదికులగు పూర్వమీమాంసకులు చెప్పిరి. ప్రకృతియే సృష్టికి కారణమని కాపిల సాంఖ్యులు చెప్పిరి. సేశ్వర సాంఖ్యులగు యోగులు - నైయాయికులు - వైశేషికులును ఈశ్వర తత్త్వమును ప్రతిపాదించిరి గాని, 'అతడు సృష్టికర్తకాఁడు; ముక్తిప్రదుఁడు కాఁ' డనుటచే, వేదాంతుల దృష్టిలో ఆ ఈశ్వరుఁడు ఘృతకోశాతకీ కల్పుఁడు. ఇంతేగాక, కాపిల సాంఖ్యులవలెనే, సేశ్వర సాంఖ్యులును సృష్టికి కారణము ప్రకృతి యని చెప్పిరి. పాశుపతుల ఈశ్వర కల్పన 'వేదబాహ్యా'మని వేదాంతుల అభిప్రాయము. (శాం. సూ. భా. 2-2-37) మఱియును, జగత్తునకు నైయాయికులు - పాశుపతులు - పరమాణువులు ఉపాదానకారణమనుట వేదాంత మత విరుద్ధము. ఇట్లు వివిధ దార్శనికుల మధ్య రేఁగిన వాదోపవాద ధూళిలో – పరస్పర స్పర్థకారణముగా, వేదాంతులకు పరమతములయం దుపాదేయ భాగములను గ్రహింప వలయుఁగాని, త్యాజ్యములతోఁబాటుగా ఉపాదేయములఁ ద్రోసిపుచ్చుట దోష మని వేదాంతదర్శనకారులు పై శ్లోకములో మందలించిరి. వేదాంతదర్శన కారుని దృష్టిలో – పూర్వమీమాంసకాది పూర్వోక్తదర్శనము లన్నియు ఆత్మ విషయమై చేసిన సిద్ధాంతము వేదాంతమునకు అనురోధమని మందలించుటయే గాక, వేదాంతులపై (= భాగవతులపై) ఆత్మస్వరూప నిరూపణ వేదాంతానురోధముగా లేదని, తదితర దార్శనికులుచేయుట గూడ అన్యాయమని తెల్పుటకుఁగా, పాంచరాత్రమును గూడ పై శ్లోకములో వ్యాసమహర్షి చేర్చియుండె నని తెలియవలయును. ఇట్లే, కల్లోల స్థితి వేదాంత (భగవన్) మత ప్రచారములో గల్గుటకు కారణమేమన – ఉపనిషత్తులును, శ్రీపాంచరాత్రమును రహస్యశాస్త్రములై, గురుపరంపరా ముఖతః ఉపదేశైక గమ్యము లగుటయు–స్వతంత్ర ప్రజ్ఞులగు తీర్థకరులు అట్టి గురుపరంపరాయాతజ్ఞానము నుండి చీలిపోయి, స్వోత్ప్రేక్షిత సిద్ధాంతములను ప్రాయికముగా వేద వేదాంతవిరుద్ధము లగునవి స్థాపించుటయే యని తెలియనగును.

## భాగవతమతపరంపరా విచ్ఛేదము - తదుద్ధరణము

నారదునివంటి మహాజ్ఞాని సనత్కుమారుని యొద్ద (ఛాందోగ్యము 1-2) నర నారాయణ మహర్షులయొద్ద గురూపసదనముఁజేసినట్లు కానవచ్చుచున్నది.

ఇది కృతయుగపు మాట. కాని, ద్వాపరాంతమున వేదవేదాంత ప్రకాశక భగవన్మతప్రతిపాదితమై, పరబ్రహ్మోపాసనాపరమగు వైదిక కర్మయోగమునకుఁ గల్గిన పరంపరావిచ్ఛేదము భగవానుఁడు జ్ఞానయోగారంభమున సెలవిచ్చి, తాను సర్వజ్ఞుఁడును, శ్రీమన్నారాయణుని పూర్ణావతారము నగుటచే. మఱల వేదోక్త భాగవత ధర్మాంగముగా ఈ యోగము నుద్ధరించుచున్నాఁడ నని సెలవిచ్చెను.

## భాగవతమత గురుపరంపర పునః విచ్ఛిత్తి గాకుండఁ జేయఁబడిన జాగ్రత్తలు

ప్రథమ జాగ్రత్త :—

"ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్
బిభే త్యల్ప శ్రుతా ద్వేదః మా మయం ప్రతరిష్యతి."

దురవగాహాగంభీరమగు వేదమునకు తన పితృపాదులగు శ్రీ పరాశరు లనుగ్రహించిన విష్ణుపురాణమును, తాను రచించిన భారతేతిహాసమును వ్యాఖ్యానములనియు, ఈ వ్యాఖ్యానముల సహాయము చేతనే బహు శ్రుతులగు పండితులు వేదార్థమును గ్రహింపవలెనని, వీఁడు నన్ను మోసగించుటకు వచ్చినాఁడని, అల్ప శ్రుతినిఁ జూచి వేదము భయపడునని, వ్యాస భగవానుఁడు తత్త్వ జిజ్ఞాసువులను హెచ్చరించియున్నాఁడు. మఱియును, ఉపనిషద్వాఙ్మయమునకు శ్రీకృష్ణ భగవానునిచే అనుగ్రహింపఁబడిన శ్లోకమయ వ్యాఖ్య యగు భగవద్గీతలకును - భగవ దవతారమూర్తియును, భాగవతమత ప్రవర్తక శిఖామణియును నగు తాను రచించిన సూత్రమయ వ్యాఖ్యకును వేదాంతసూత్రములకు అన్యార్థకల్పన జరుగకుండ రక్షణకై తాను సొంతముగా భాగవతప్రబంధము ననుగ్రహించుటయే గాక, తన శిష్యుఁడగు బోధాయన మహర్షిచే, భగవద్గీతలకును - తన వేదాంత సూత్రములకును 'వృత్తు' లను పేర విపులవ్యాఖ్యానము రచింపఁజేసెను. (భగవద్గీతను ఇంగ్లీషులోనికి తర్జుమా చేసిన మహాదేవశాస్త్రిగారి గీతా ప్రారంభోక్తులఁ జూడుఁడు.)

ద్వితీయ జాగ్రత్త :—

మోక్షవిద్యా (దహరవిద్యా) రంగములగు భగవద్దివ్యాలయ ప్రతిష్ఠ సృష్టి ప్రారంభమునుండి శ్రీ పాంచరాత్రాగమ ప్రసిద్ధమైన మన్వాది మహర్షులకాలము

నుండి జగద్వ్యాపకముగా నున్న ఈ మహాసంస్థ, ద్వాపరాంతమగుసరికి దురర్థములపాలై, బహు దేవతారాధనకు దారి తీసెను. ఇది తుదముట్టించుటకే విష్ణుపారమ్యము నారాయణీయ ధర్మములో సుష్ఠుగా ప్రతిష్ఠింపఁబడెను.

## మాయ

'మాయ' యనఁగా. భగవానుఁడగు విష్ణువునకు స్వభావభూతయగు శక్తి విశేషము. దాని నతిక్రమించుటకు ఎట్టివానికిని శక్తి చాలదు. ఎవఁడు భగవానుని చరణములయందు శరణించునో, అట్టివాఁడు 'సర్వధర్మాన్ పరిత్యజ్య' ఇత్యాది చరమ వాక్యోక్తిలో చెప్పఁబడినట్లు మోక్షము చూఱఁగొనఁగలఁడని (శాం. గీ. భా. 7-14) గీత లుద్ఘోషించుచున్నవి.

## నిర్గుణము

గుణ శబ్దమునకు సత్త్వరజస్తమోగుణములని పారిభాషికార్థము. (శాం. గీ. భా. 14-5) సర్వేశ్వరుఁడు అమృతస్వరూపుఁడు. అమృతము నిర్మల మన్నప్పుడు అమృతము మాలిన్యరహితమని అర్థమేగాని, అమృతమునందు సహజముగా నున్న మాధుర్యాది గుణములు లేవని కాదుగదా! అట్లే, అమృత స్వరూపుఁడగు భగవానుఁడు నిర్గుణుఁ డన్నప్పుడు క్షుత్పిపాసాది ప్రాకృత గుణములు లేవనియేగాని, ఆయనకు సహజసిద్ధమగు సత్యకామత్వ-సత్యసంకల్పత్వాది కల్యాణ గుణములు లేవని కా దనుట విశదమగుచునే యున్నది. పరబ్రహ్మభూతుఁడగు పరవాసుదేవుని స్వరూపమును భగవన్మత ప్రవర్తకుఁడగు శ్రీ పరాశర మహర్షి ఇట్లు వర్ణించియున్నాఁడు:—

"జ్ఞానశక్తిబలైశ్వర్యవీర్యతేజాం స్యశేషతః
భగవచ్ఛబ్దవాచ్యాని వినా హేయై ర్గుణాదిభిః."

అనఁగా, భగవానుఁడు అఖిలహేయ ప్రత్యనీకజ్ఞానశక్తి బలైశ్వర్య వీర్య తేజః ప్రభృతి సమస్త కల్యాణగుణాకరుఁడని యర్థము. సహస్రనామస్తోత్రము లోని నిర్గుణేతరమగు 999 నామములును భగవానుని అసంఖ్యాక దివ్యగుణ సంకీర్తనము చేయుచున్నవి గదా! భగవన్మత ప్రతిష్ఠాపకమగు శ్రీమద్భాగవత ప్రబంధములో — 'మన్నిష్ఠం నిర్గుణం స్మృతమ్' 'మన్నికేతం తు నిర్గుణమ్'

'నిర్గుణో మదుపాశ్రయః' 'శ్రద్ధా మత్సేవాయాం నిర్గుణా' (స్కం. 11-25, 24 మొ 27 వఱకు) అని నిర్గుణశబ్దము 'ప్రాకృతగుణరహితము' అను అర్థములో ప్రయోగింపఁబడినది.

## మోక్ష స్వరూపము

మోక్ష మనఁగా, అర్చిరాదిగతిగమ్యము -- శాశ్వతము -- నిత్యము -- అవ్యయము -- పునరావృత్తిరహితము నగు విష్ణుని పరమస్థానమని 'సోఽధ్వనః పారమాప్నోతి' 'తద్విష్ణోః పరమం పదగ్ం సదా పశ్యంతి సూరయః' ఇత్యాది శ్రుత్యనుగుణముగా, భగవద్గీత యందును -- బ్రహ్మసూత్రముల యందును -- స్పష్టీకరింపఁబడినది. (శాం. బ్ర. సూ. భా. 3-3-32) (శాం. గీ. భా. 2-51, 5-5; 8-21, 26; 11-38; 12-20; 13-28; 15-6; 18-56, 62) (శాం. బ్ర. సూ. భా. 1-3-33; 4-3-10).

## తత్త్వత్రయ వివేచన

లోకమున నాశవంతమగు సర్వభూతజాతమును 'క్షర' మనఁబడును. కూటస్థుఁడగు జీవాత్మ 'అక్షరుఁ' డనఁబడును. పరమాత్మ ఈ క్షరాక్షర తత్త్వములకంటె విలక్షణుఁడును -- అతీతుఁడు కూడను. చిదచిన్మయమగు లోకత్రయమందు వ్యాపించి దానిని భరించుచున్నాఁడు. క్షరమునకంటె అతీతుఁడై, అక్షరునకంటె గూడ ఉత్తముఁ డగుటచేతనే, ఆయనకు లోకమందును - వేదమందును గూడ పురుషోత్తముఁ డను విఖ్యాతి గలదని శ్రీకృష్ణభగవానుఁడు తన స్వరూపమును గుఱించి సెలవిచ్చియున్నాఁడు. (శాం. గీ. భా. 15-16, 17, 18).

## భగవానుఁడు చిదచిద్విశిష్టుఁడు

తానే జగత్కారణుఁ డని, తన స్వరూపమందే భూమా ద్యష్టధా భిన్నమును, సంసారహేతుకము నగు అపరా (=స్థూల) ప్రకృతియు, క్షేత్రజ్ఞలక్షణమును, జీవసముదాయరూపమును నగు పరా ప్రకృతియును, ఈ రెండు ప్రకృతులును సూత్రమందు మణిగణముల వలె, నాయందు అనుస్యూతములు (గ్రుచ్చఁబడినవి) గా నున్నవి (శాం. గీ. భా. 7-4 మొ 7 వఱకు) అనియును, భగవానుఁడు సెలవిచ్చియున్నాఁడు.

## మోక్షవిద్య 'దహర' విద్యయే

పరబ్రహ్మోపాసనకుఁగా, 32 విధములయిన విద్యలు ఉపనిషత్తులయందుఁ జెప్పఁబడియున్నవి. వేదసారము సామవేదము. (భ. గీ. 10-22) సామవేద శిరోభూతమగు ఛాందోగ్యోపనిషత్తులో 13 విద్యలు గలవు. మొదటి విద్య అంతరాదిత్య విద్య. ఇందు, పరబ్రహ్మము ఆదిత్యమండలములో హిరణ్మయ విగ్రహుఁడై, రవికిరణ వికసిత పుండరీక నయనుఁడుగ వర్ణింపఁబడి యున్నాఁడు. (ఛాం. 1-6-6, 7) ఛాందోగ్యోపనిషన్మధ్య విద్య యగు మధు విద్యలో (ఛాం. 3-11-4) ఉపాస్యుఁడు మాధవుఁడు. (విష్ణు. స. నా. 72, 167, 735 శం. భా.) తచ్చరమ విద్య దహర విద్య. (ఛాం. 8-15-1) దహర విద్య యనగా – హృదయ విద్య, ఛాందోగ్యోపనిషచ్చరమవాక్యమగు 'న చ పునరావర్తతే న చ పునరావర్తతే' అను వాక్యము, మోక్షమన పురావృత్తిరహితమైనదని వర్ణించుచున్నది. ఈ వాక్యమే, వేదాంతసూత్రములలో – 'అనావృత్తిశ్శబ్దాత్ అనావృత్తిశ్శబ్దాత్' అను 'వేదాంతదర్శన' చరమసూత్రమునకు విషయవాక్యముగనున్నది. ఇందువలన 'దహర విద్యయే మోక్ష ప్రదమగు విద్య' యని స్పష్టమగుచున్నది. మోక్షమనగా, విష్ణుని పరమపదస్థానమే యని పైన నిరూపింపఁబడినది. పరబ్రహ్మముతోసహా, సరిసమానముగా ముక్తాత్మలు శాశ్వతానందము ననుభవించుటకుగాను, శ్రుతిస్మృతులలో ప్రశంసింపఁబడిన విష్ణుని పరమపదస్థానమును స్థాపించుటకుఁగా వేదాంతసూత్రములలోని చరమసూత్రమునకు మొదటి నాల్గు సూత్రములును (శాం. బ్ర. సూ. భా. 4-4-17 మొ 21 వఱకు) ప్రవర్తింపఁగా. ఆ శాశ్వతలోకమునకుఁ జనినముక్తులు తిరిగి సంసారమునకు రారని చరమ (22 సూ.) సూత్రము స్థాపించుచున్నది. ఈ దహరవిద్యయు, తత్ఫలమగు మోక్షమును, భగవద్గీతలలో ఇట్లే వ్యాఖ్యానింపఁబడియున్నవి. (శాం. గీ. భా. 18-61, 62)

## దహరవిద్య - ప్రపత్తి - మోక్షము

"ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశే ఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా."

"త మేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత!
త త్ప్రసాదా త్పరం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్."

— (శాం. గీ. భా. 18-61-62)

ఈశనశీలుఁడగు శ్రీమన్నారాయణుఁడు సర్వభూతములను శరీరము లనెడి యంత్రములపై నెక్కించి, తన మాయచే వానిని తిరుగునట్లు చేయుచు, ఆ భూతముల హృదయ దేశమందు వసించియున్నాఁడు. ఓయి భారతా! సంసారార్తిహరణార్థము, సదాత్మనా ఆయనను ఆశ్రయింపుము. ఆయన ప్రసాదముచే ఉత్కృష్టశాంతికి స్థానమగు విష్ణుని పరమపదస్థానమును పొందఁగలవు — అను ఈ రెండు శ్లోకములలో, శాస్త్రసార మంతయు ఇమిడియున్నదని తెలియవలయును.

## ప్రపత్తి వైభవము

మనూక్త వైదిక కర్మయోగము. సంసారుల కుపాదేయమగు ప్రపత్తి మార్గమును, ముముక్షువుల కుపాదేయమగు నివృత్తి మార్గమును కల్గియున్నది. ఈ రెండు మార్గములను అసురు లెఱుఁగరు. (శాం. గీ. భా. 16-7) ఈ వైదిక కర్మయోగము శ్రీకృష్ణభగవానుఁడు గీతలలో ననుగ్రహించిన రహస్యాష్టకములో ప్రప్రథమమును — ఉత్తమమును నగు రహస్యము (శాం. గీ. భా. 4-3) ప్రవృత్తి మార్గము 'బంధ' హేతువనియు, నివృత్తిమార్గము 'మోక్ష' హేతువగు సన్యాస మార్గమనియు, ఈ సంగతి అర్థము చేసికొన్న బుద్ధి—సాత్త్వికమని భగవదభిప్రాయము. (శాం. గీ. భా. 18-30) భగవద్గీతా శాస్త్ర మంతయు రహస్య శాస్త్రమే. (శాం. గీ. భా. 18-67) అందులో నుత్తమ రహస్యము కర్మయోగమే. (శాం. గీ. భా. 4-3) ఈ కర్మయోగము యొక్క పరమ రహస్యమును — కర్మయోగ నిష్ఠాఫలమును — సర్వవేదాంతసార విహితమును — అగు సమ్యగ్దర్శనమే 'సర్వధర్మాన్ పరిత్యజ్య' ఇత్యాది గీతా చరమ వాక్యోక్త భగవచ్ఛరణాగతి యను శ్రీ శంకర భాష్యముచే, వైదిక కర్మయోగ ప్రాశస్త్యము విశదమగుచున్నది. (శాం. గీ. భా. 18-66) బహుజన్మములయం దాచరింపఁబడిన వైదిక కర్మయోగాంగభూత 'నివృత్తినిష్ఠ'కు ఫలముగా తయారైన జ్ఞాని చేయవలసినది భగవచ్ఛరణ ప్రపత్తియని, అట్టి పరిశుద్ధ ప్రపన్నుఁడు వాసుదేవుఁడే ప్రాప్యప్రాపకముగా సర్వవిధముల నధ్యవసించుననని, గీతయే ఉద్ఘోషించి, అతఁడే 'మహాత్ముఁ'డని, అట్టివాఁడు సుదుర్లభుఁడని ప్రశంసింపఁగా, (శాం. గీ. భా. 7-19) ఎట్టివానికిని అతిక్రమించుటకు దుర్ఘటమై, సర్వేశ్వరుఁడును - విష్ణువును అగు తనకు స్వభావభూతమై, త్రిగుణాత్మికయు - సర్వభూత మోహినియు నగు మాయను

'సర్వధర్మాన్ పరిత్య' జ్యేత్యాది చరమ వాక్యోక్తరీత్యా (శాం. గీ. భా. 18-66) సర్వాత్మనా తనయందే ప్రపత్తి చేసినవాఁడు ఆ మాయనుఁ దాఁటి, మోక్షము చూఱఁగొనవచ్చునని ఉపదేశించి, సర్వేశ్వరుఁడును నారాయణుఁడును నగు తనను మూఢులు - పాపకర్ములు - నరాధములు - మాయచే జ్ఞానమును కోలు పోయినవారు - అసురులు తన చరణారవిందముల శరణింపరని, ఆ యా కామములచే, జ్ఞానము గోలుపోయినవారు అన్యదేవతలయందు శరణింతురని, భగవానుఁడు కఠినముగా నిందించియున్నాఁడు. (శాం. గీ. భా. 7-14, 15, 20) ఈ సందర్భమున 9-వ అధ్యాయము 20 మొ 27 వఱకు శంకరభాష్యము గూడ చూడుఁడు.

## సన్యాసాశ్రమీయులకును ఈ ప్రపత్తియే తారకము
## ప్రపత్తి శ్రుతిసిద్ధము

సన్యాసాశ్రమీయు లందఱికిని త్రికాలహరిపూజయు – తచ్చరణ ప్రపత్తియును ధర్మశాస్త్రము విధించుచున్నది. (నిర్ణయసింధువులోని యతిధర్మ నిర్ణయమును చూడుఁడు.)

"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై
తగ్ంహ దేవ మాత్మ బుద్ధి ప్రకాశం ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే."

అనఁగా – పూర్వము చతుర్ముఖ బ్రహ్మను సృజించి, అతనికి వేదము లొసఁగినట్టి ఆత్మ బుద్ధి ప్రకాశకుఁడగు భగవానుని ముముక్షువునై శరణించుచున్నాఁడ' నను శ్వేతాశ్వతరోపనిషద్వాక్యములను స్మరించుచు, హరిచరణముల యందు సన్యాసాశ్రమీయుఁడు 'ప్రపత్తి' చేయవలయును. ఇందువలన, హరి చరణ ప్రపత్తి శ్రుతి సిద్ధమని విశదమగుచునే యున్నది. ఈ ప్రపత్తి, సర్వాధికారమని పైన నిరూపింపఁబడినది. (శాం. గీ. భా. 9-30 మొ 33 వఱకు) నిష్కామ కర్మయును సర్వాధికారమే. (శాం. గీ. భా. 18-46) బహుజన్మానుష్ఠిత నిష్కామ కర్మయోగమువలన జ్ఞానసిద్ధి, జ్ఞానమునుండి ప్రపత్తియు సిద్ధించుటయే గీతా సిద్ధాంతము (శాం. గీ. భా. 7-19.)

## పరబ్రహ్మము ఆనందమయ స్వరూపుఁడు

తైత్తిరీయోపనిషదుక్తములగు అన్నమయ - ప్రాణమయ - మనోమయ - విజ్ఞానమయ - ఆనందమయ కోశము లైదింటిలో, ఆనందమయ కోశమే శిఖరము.

'రసో వై సః' అను వేదాంత వాక్యము ఆనందమయ కోశమున కన్వయించు చున్నదిగదా! ఆనందమయకోశము క్రిందనున్న విజ్ఞానమయకోశములోని 'విజ్ఞాన' శబ్దము జీవునకు అన్వయించునని, ఈ కోశముల ఆరోహక్రమము సూచించుచున్నను - 'మయట్' శబ్దసామ్యముచేఁ గల్గు సందేహమును దీర్చుటకై, ఆనందమయకోశములోని 'మయట్' శబ్దము ప్రాచుర్యార్థముగాని, వికారార్థము గాదనియు —(1-1-13) జీవునకు ఆనందహేతువగువాఁడు పరబ్రహ్మమని శ్రుతి చెప్పుటచే, ఆనందప్రచురుఁడైనఁగాని, బ్రహ్మము జీవుని ఆనందింపఁజేయఁజాలఁడు గదా యని (1-1-14) శ్రుతిలోనే, 'విజ్ఞానమయా దన్యోంతర ఆత్మానందమయః' విజ్ఞానమయునకంటె ఇతరుఁడే ఆనందమయుఁడని ఉన్నది గదా!

## పరబ్రహ్మము - తదంశయగు అక్షరుఁడు (జీవుఁడు)

పరబ్రహ్మమును సూర్యునితోఁ బోల్చిన, జీవుఁడు సూర్య కిరణములతోఁ బోల్పఁదగినవాఁడు. మోక్షమును గమ్యస్థానముగఁ బెట్టుకొన్న ముముక్షువు మోక్షము చేరవలయు నన — బ్రహ్మోపాసనయా, అక్షరోపాసనయా ఎక్కువ ఉపయోగకారి యన, అక్షరోపాసకుల కంటెను, పరబ్రహ్మోపాసకులే యోగవిత్తములని భగవానుఁడు తీర్మానించియున్నాఁడు. (శాం. గీ. భా. 12-1, 2) గమ్యస్థానము చేరఁబోవు ఇద్దరిలో ఒకఁడు - పగలు సూర్యప్రకాశము నాశ్రయించి ప్రయాణము చేయువాఁడు. మఱి యొకడు — రాత్రివేళ ఒక లాంతరో, దివిటీయో సహాయముగాఁ బెట్టుకొని ప్రయాణించువాఁడు. సూర్యప్రకాశము నాశ్రయించి పోవువంటివాఁడు బ్రహ్మోపాసకుఁడు. అక్షరోపాసకుఁడు రాత్రి వేళ దివిటీ వెల్గున ప్రయాణించువాఁడని తెలియవలయును.

## పరబ్రహ్మముయొక్క వ్యక్తాఽవ్యక్త స్వరూపము

'మానుష చర్మచక్షుర్గోచర' మగు శ్రీకృష్ణుని కిరీటచక్రగదావిభూషితమగు స్వరూపము 'వ్యక్తరూపము.' విశ్వరూపమునందు 'దివ్యదృష్టి సహాయముతో' భగవత్ప్రియన్నులచే సేవింపఁదగిన అప్రాకృత దివ్యతేజోమయ కిరీట చక్ర గదా విభూషిత, దివ్యమాల్యాంబర, దివ్య గంధానులేపనాలంకృత దివ్య మంగళ స్వరూపము శ్రీకృష్ణ భగవానుని 'అవ్యక్త' స్వరూపము. ఎప్పుడును సేవింపవలయునని కాంక్షించు బ్రహ్మాది దేవతలకుఁ గూడ 'సుదుర్దర్శ' మగు ఈ దివ్యరూపము (శాం. గీ. భా. 11-11, 17, 18, 46, 52) ఋగ్యజుస్సామాది

చతుర్వేదములచేఁగాని, చాంద్రాయణాద్యుగ్ర తపస్సులచేఁగాని, గో భూ హిరణ్యాది దానములచేఁగాని, యజ్ఞయాగాదులచేఁగాని సాక్షాత్కరింపఁదనియును - (శాం. గీ. భా. 11-53) శ్రీకృష్ణ భగవానునియందలి అనన్యమును — అవ్యభిచారమును నగు భక్తిచేతనే సాక్షాత్కరింపఁగలదనియు, ఇట్లే మోక్షము లభింపఁగలదనియు (శాం. గీ. భా. 11-54 ; 13-10) గీత స్పష్టీకరించుచున్నది. ఇట్లే — అనన్య భక్తిగల ప్రపన్నుల 'దివ్యచక్షువు' అర్జునాదులకువలె ఉన్మీలనము కాఁగా; భగవత్సాక్షాత్కారము లభింపఁగలదు. (శాం. గీ. భా. 11-8) శ్రీకృష్ణభగవానుని మానుష దేహమున చర్మ చక్షువులకు వ్యక్తమయిన కిరీట చక్ర గదాదిభూషిత స్వరూపమే, అర్జునాదుల 'దివ్యదృష్టి'కి సాక్షాత్కరించిన భగవ ద్దివ్య 'తేజో' మయ విగ్రహము. భగవానునియందు అనన్యభక్తిలేనివారల మానుష దృష్టికి (దివ్యదృష్టిలేని హేతువుచే) భగవ ద్దివ్యమంగళవిగ్రహము పవిత్రార్థము.

## తత్త్వత్రయ విమర్శ

చిదచిదీశ్వరులకు తత్త్వత్రయమని పేరు. వేదాంతులతో పాటుగా — ఆత్మస్వరూపమును వేదమున కనుకూలముగానే సాంఖ్య, యోగ, న్యాయ, వైశేషిక, పూర్వమీమాంసక, పాశుపత మతస్థులు ఉపవర్ణించిరని చెప్పఁబడినది. అట్లే, జగత్తు సత్యమైనదనియే వీరి సిద్ధాంతము. తత్త్వత్రయములో ఒక్క అచిత్తుమాత్రమే కలదుగాని ; చిత్తుగాని, ఈశ్వరుఁడుగాని 'నాస్తి' అన్నాఁడు చార్వాకుఁడు. ఈశ్వర విషయములో, యోగ — న్యాయ — వైశేషికుల ఉపవర్ణనము వేదాంతులకు సమ్మతముగాదు. పాశుపతుల ఈశ్వర కల్పన వేద బాహ్యమే. భాగవత మతస్థులగు వ్యాస పరాశరాదులు తత్త్వత్రయ స్వరూపము ఉపనిష దనురోధముగా చిత్రించిరి. జగత్తు అసత్యమనియు, అది ధర్మమందు ప్రతిష్ఠితము కాదనియు, జగత్తును పాలించు ఈశ్వరుఁడే లేఁడనియు, నేనే ఈశ్వరుఁడననియు అనువారు అసురులని భగవానుఁడు నిందించి యున్నాఁడు. ఇట్లే, భగవ చ్చరణములయందు శరణు చేయనివారిని అసురులనియే నిందించి యున్నాఁడు. ప్రవృత్తి నివృత్త్యాత్మక కర్మయోగము నంగీకరింపనివారును అసురులే. జ్ఞానులలోఁగూడనైన తనయందు శరణించినవారినే మహాత్ములని స్తుతియించియున్నాఁడు. (శాం. గీ. భా. 7-14, 15, 19; 16-7, 8, 14.)

## వేదోక్త భాగవత మతోద్ధరణము – శ్రీరామానుజ భాష్యకారోదయము

క్రీ. శ. 1017-వ సంవత్సరమున శ్రీకృష్ణ పునరవతారభూతుఁడగు శ్రీ రామానుజాచార్యులు 'వేదోక్త భాగవత మతమును' భాష్యరచనచే పునరుద్ధరించి, భగవత్ప్రపన్నులకు సన్మతమార్గమును ప్రదర్శించి, ఉభయవిభూతివాసుల కృతజ్ఞతకు పాత్రుఁడాయెను.

అనాదిసిద్ధముగా తెనుఁగుదేశమైన చెన్నపురికి సుమారు 26 మైళ్ళ దూరమున నున్న శ్రీ పెరుంబూదూరు అను గ్రామములో శ్రీ రామానుజాచార్యులు అవతరించెను. ఆ గ్రామవాసులలో కొందఱు అరవదేశమునకు వలస వెళ్ళిన బ్రాహ్మణులను వడమలు (ఉత్తరాదివాండ్లు) అని పిల్చుచుండిరి. శ్రీ రామానుజాచార్యులు వడమ వైష్ణవ కుటుంబములో జన్మించినవాఁడు. శ్రీ శంకర భాష్యకారులు తన వేదాంత భాష్యత్రయమునందును, విష్ణుసహస్ర భాష్యమునందును విష్ణుపారమ్యమును బహుముఖముల స్థాపించిన పరమ వైష్ణవ శిఖామణి. భాగవత మతములోని వేదాంత తత్త్వభాగము బోధాయన వృత్తి కారునిద్వారా, రామానుజుని తండ్రి వఱకును అవలంబింపఁబడిన భాగవత సంప్రదాయములోని వాఁడే – శ్రీ రామానుజులు. రామానుజుని తండ్రిపేరు కేశవ భట్టారకుఁడు. ఈయన ఇప్పటి రామానుజీయ సంప్రదాయములోని వడగల శ్రీవైష్ణవులవలె శ్రౌత యజ్ఞము లొనర్చి, సోమయాజి యను బిరుదము గల యజుర్వేద బ్రాహ్మణుఁడు. యజుర్వేద శిక్షాశ్రౌతములమీఁద ననేకములగు ఉద్గ్రంథములను రచించిన విద్వాంసుఁడు. ఈయన యింటిపేరు ఆసూరి వారు. మేనమామలు తిరుమలవారు. భాగినేయులు కందాడవారు. తిరుమల యనఁగా తిరుపతి. తిరుపతి వలెనే 'కందాడ' యనునది గ్రామనామధేయము శ్రీవారి యింటిపేరు ఆసూరివా రనుట చూడఁగా, వీరి వంశము విద్వద్వంశమే యని తోఁచుచున్నది. తండ్రిగారు విద్వాంసుఁడనుట సత్యమేగదా! ఆయన తల్లిగారి పేరు కాంతిమతీదేవి. ఆ కాలములో భరతఖండమున విద్యాపీఠములలో కాంచీపురము ఒక విద్యాపీఠముగా నుండెడిది. 15 సంవత్సరముల వయస్సు వఱకు తండ్రియొద్దనే వేద వేదాంగముల నధ్యయనము చేసి, అటుపిమ్మట తండ్రిగారు పరమపదింపఁగా – కాంచీపురికి వెళ్ళి, అచటి విద్యాపీఠములో వేదాంతశాస్త్ర ప్రవచన చేయుచున్న యాదవప్రకాశుఁడను అద్వైత యతి యొద్ద శంకరీయ వేదాంత భాష్యమును పఠించుచుండెను. ఒకనాఁడు చేయు ఉపనిషత్ప్రవ

చనములో – ఛాందోగ్యోపనిషత్తునకు శ్రీ శంకర వ్యాఖ్య ననుసరించి – 'కప్యాసం పుండరీక మేవ మక్షిణీ' అను వాక్యమునకు (ఛాందోగ్య. 1-6-7) అర్థము చెప్పుటలో, శ్రీ యాదవప్రకాశులు – కోఁతియొక్క ఆసనము వలె ఎఱ్ఱగా నున్న తామరలవంటి కన్నులుగలవాఁడు పరబ్రహ్మ మని చెప్పఁగా, విన్న రామానుజులు వేఁడి నిట్టూర్పుతో అశ్రుబిందువులు రాల్చెను. గురువు కారణ మడుగగా, 'పరమపురుషుని వర్ణించుచున్నది – శ్రుతిపురుషుఁడు, భగవన్నేత్రములను కోఁతి ఆసనమునకు అశ్లీలముగా నుపమించునా?' యని తన విచారకారణమును వ్యక్తము చేయఁగా – 'ఏదీ! నీవు అర్థము చెప్పు' మని పృచ్ఛచేయుటయు – 'కం పిబతీతి కపిః, అస్ వికసనే' అని కప్యాస శబ్దమునకు విలక్షణార్థము చెప్పి, 'కప్యాసం పుండరీక మేవ మక్షిణీ' అనఁగా – 'రవికిరణ వికసిత పుండరీక నయనుఁ' డని వాక్యార్థము వినిపించుటతో – గురువునకు సంతోషము గలుగుటకు బదులుగా ఆగ్రహము కలిగెను. అంతటితోఁ దనివిఁజెందక, కాశీయాత్రమిషచే రామానుజునిఁ గూడ దీసికొనిపోయి, మధ్యఁ జంపవలెనని యోచనచేయఁగా, కాంచీ వరదరాజ కరుణచే తప్పించుకొని వచ్చెనని కథ కలదు. ఈ కథమాట యెట్లున్నను, రామానుజులు యాదవప్రకాశునియొద్ద చదువు చాలించి, ఉపనిషణ్మత వివేచనను స్వతంత్రముగాఁ జేయుచు, విశిష్టాద్వైతమతమును బోధాయన వృత్తికారులు తచ్ఛిష్యపరంపరలో నాథ యామునా ద్యాచార్య వర్గము తచ్ఛిష్యపరంపర నుండి గ్రహించి, యామున మునివరుల శిష్యులగు మహాపూర్ణులకు శిష్యులై, తిరుక్కోట్యూరు నంబి వలన చరమవార్త ఉపదేశమంది, తిరుక్కోట్యూరు గోపురము నుండి తిరుమంత్రార్థమును జగత్తులోని ముముక్షువుల కందఱికిని ప్రకాశింపఁజేసి, పిదప శ్రీరంగములోను, మేల్కోటలోను చిరనివాసము చేసి, వేదోక్త భగవన్మతోద్ధరణకై, శ్రీ(బ్రహ్మసూత్ర) భాష్యము, గీతాభాష్యము, వేదార్థసంగ్రహము, గద్యత్రయము, నిత్యగ్రంథము మొదలగు దార్శనిక గ్రంథముల నను గ్రహించి, విశిష్టాద్వైత సిద్ధాంతమును స్థాపించిరి.

జయతు జయతు కృష్ణో వేదవేదాంత వేద్యః
నిఖిల నిగమమౌళి న్యస్తపాదాబ్జ హృద్యః
జయతు జయతు వేదవ్యాస యోగీంద్ర చంద్రః
ప్రకటిత నిగమాంత స్వాంతర జ్ఞాన సాంద్రః.

---

# భువనసుందరమూర్తి

శ్రీమాన్ మేడేపల్లి వరాహ నరసింహస్వామి, బి. ఏ.
తెలుఁగు విజ్ఞాన సర్వస్వ గౌరవనీయ ప్రధాన సంపాదకులు.

బాహ్యప్రపంచ మందలి వస్తు నియత సౌందర్యమును గుర్తెఱింగి, ప్రత్యక్షముగా ననుభవించ గల సామర్థ్యము ప్రతి మానవునకు గలదు. కాని, సంస్కృత శేముషీవంతుఁడైనను – 'సౌందర్య మన నేమి? ఆ సౌందర్యము ప్రేక్షావచ్చిత్తము నెట్లాకర్షించ గల్గును?' అను ప్రశ్నలతో ఎదుర్కొనినప్పుడు, అతఁడు ముషితధియుఁ డగును. ఏలయన, సౌందర్యమీమాంస అతి క్లిష్టమైనది. ఈ ప్రశ్న మానవలోకమం దతి ప్రాచీనమైనది. వివిధ నాగరికత లీ ప్రశ్నకు వివిధములగు సమాధానముల విస్తరించి యున్నవి. ఈ వైవిధ్యము స్థూలముగా రెండు తరగతులుగా నున్నది. సౌందర్యోపలబ్ధి కేవల మానసిక కల్పనయని, కాల్పనిక వాదుల (Idealists) సిద్ధాంతము. బాహ్యార్థాలంబము నపేక్షింపకయే ఈ ఉపలబ్ధి సాధ్యమని వీరి మతము. మఱియొక తెగవారు యథార్థవాదులు (Realists). సౌందర్యము బాహ్యార్థనిష్ఠమనియు – వస్తువుయొక్క అంగ ప్రత్యంగ సౌష్ఠవాస్పదమగు అవయవ సంస్థానవిశేషము, స్నిగ్ధత మొదలగు గుణములపై అది ఆధారపడియుండుననియు అభిప్రయించుచున్నారు. ప్రకృతిలో గన నగు జంతువుల మనోహరాకృతుల సవిమర్శానుశీలనమును గావించిన జంతుశాస్త్రజ్ఞులు కూడ, ఈ రెండవ తరగతికి చెందినవారే. సౌందర్యోపలబ్ధి స్త్రీ పురుష సంయోగమున కుపోద్ఘాతముగా నాచరించునని వీరి మతము. మఱికొందఱు మన తత్త్వశాస్త్రవేత్తలు – "సు ఉనత్తి ద్రవీకరోతి, ఉందీక్లేదనే, బాహుళకాదరః ఇతి సుందరః (శకన్ధ్వాదిః)" అను సుందరపద వ్యుత్పత్తి ననుసరించి, ఏది చిత్తానందకరమో అదియే సుందర మని నిర్వచించుచున్నారు. అత్యుత్కృష్ట మానసికానుభవమగు సౌందర్యమును నికృష్టహేతువులచే నిరూపించ యత్నించు నీ వాదములు – 'శుద్ధాదేశ వశంవదీకృతయతిక్షోణీశవాణీశత' పరికర్మితస్వాంతులగు శుద్ధాంత సిద్ధాంతుల కుపాదేయములు కావు.

పారమార్థికముగా కాల్పనికు లనుకొనినట్లు సౌందర్యము కేవల మానసిక సృష్టికాదు. అట్లైనచో, భగవ దనుభవ నితాంత విముఖులగు శిశుపాలాదులు – భువన

మోహనుని సౌందర్యముచే నెట్లు జితు లగుదురు? యథార్థవాదు లూహించిన ట్లది ప్రేక్షకానందహేతువగు వస్తుప్రతినియతగుణమును కాదు. అదియొక దర్శన సమకాలీనేహా రహిత భావనాప్రకర్షోన్నమితమైన అవిలంబితాధ్యాత్మికాను భవము. అటు లగుటనే సౌందర్యమీమాంస పరతత్త్వశాస్త్రాంతరితమై, సౌందర్య మును పరబ్రహ్మయొక్క స్వరూప లక్షణముగా వ్యాఖ్యానించుచున్నది. గ్రీకు దేశపు విజ్ఞాని 'ప్లేటో', పరతత్త్వమును సౌందర్య సోపాన పరంపరగా నిరూపించి. 'నిరతిశ యౌజ్జ్వల్య సౌందర్య దివ్యరూప' వైభవమును చూరగొన్న యతిపత్యా దేశమునకు దగ్గఱగా వచ్చియున్నాఁడు. విశిష్టాద్వైత మందలి ఈ సౌందర్య మీమాంస, కాల్పనిక వాదులయొక్కయు – యథార్థవాదులయొక్కయు కోటి ద్వయమును త్యజించి, సౌందర్యమును ప్రకృత్యంతర్భవముగాను (Immanent in nature) అతీంద్రియాపరిచ్ఛేద్యవిషయముగాను నిరూపించుచున్నది. 'ప్లేటో' యొక్క సౌందర్య సోపానపంక్తిని విశిష్టాద్వైతసిద్ధాంతము అతిలోక సుందర మూర్తియగు బ్రహ్మయందు పర్యవసింపఁజేసినది. ప్రకృతియందు గన్పట్టు సౌందర్యము అంతర్యామి యగు భువనమోహన సుందరుని సౌందర్యలేశము. "తస్య భాసా సర్వమిదం విభాతి." – వేదాంతప్రతిపాద్యుఁడగు పరబ్రహ్మను – ఆగమశాస్త్రప్రతిపాద్యుఁడగు ఈశ్వరుని — శ్రీమద్భాగవతము భువన సుందర మూర్తిగా పరివర్తించి, పరతత్త్వమును సౌందర్యపరసీమగా పరిష్కరించినది.

"అళకియాన్ తానే అరియురువన్ తానే
పళకియాన్ తాళే పణిమినీ
కుళవియాయ్ మీనాయ్ ఏళులకుక్కుం విత్తు."

— (అందాది 22 - తిరుమళిశై ఆళ్వార్.)

భువనమోహనుని సౌందర్యమే సృష్టికి బీజము.

మనుజున కీ సౌందర్యతృష్ణ ఎట్లు లభించినది? చరాచర సృష్టికర్త జీవాత్మకు కరణ కళేబరములను కృపఁజేసి, కార్యప్రపంచమందు మానవుని అవత రింపఁజేసినాఁడు. మనుజుఁడు కేవలము కరణ కళేబరా ద్యుపహితమగు జీవన వ్యాపారముచే తృప్తిని పొందలేదు. తన జీవనము దుఃఖోపహతమైనదని గుర్తెఱింగి, దుఃఖాసంభిన్నజీవనమువైపు అతని దృష్టి మరలినది. కాని, అది ఈ దృశ్యలోకమునం దతనికి లభించలేదు. అట్టి లోకమును గుఱించి స్వప్నముల గనిననాఁడు – ఆ స్వప్నలోకము నొకదానిని కాల్పనికముగా తన పరిసరము

లందు సృజింపఁదలఁచినాఁడు. తక్కుంగల జంతువులకు లేని వీని అసంతృప్తి వీనిని దివ్యునిగా మార్చినది. తన స్వప్నములలో తనచే ననుభూతమైన ఆనంద ప్రపంచమే తన ఆత్మయొక్క స్వదేశమని గుర్తెఱింగినాఁడు.

"యత్రైతత్ పురుషః స్వపితి నామ సతా సౌమ్య తదా సంపన్నో భవతి."

ఆ దేశమునుండి ప్రకృతము తాను భ్రష్టుఁడై, తన తొంటి సుఖమయ జీవనమును జ్ఞప్తికి దెచ్చికొని, ఆతఁ డారాటపడుచున్నాఁడు. జాగ్ర దవస్థలో నట్టి యానందమయ ప్రపంచమును, తన వాఙ్మయమందు – తన లలితకళలయందు సృజించి, తన స్వప్నమందు యథార్థముచేయ నుంకించుచున్నాఁడు.

కాని, ఈ స్వప్నదృష్టదేశ మెక్కడిది? ఎందుచే మానవాత్మ ఆ దేశము నుండి పరిభ్రష్టమైనది? ఈ దేశోదంత మొక మహత్తర రహస్యము.

సత్తా (Being), పరిణామము (Be-comming) అను కోటిద్వయాంతర్గత మైన ఈ రహస్యమును గుఱించియే నచికేతుఁడు యమునినుండి తెలియఁ గోరినాఁడు.

విశ్వమందు అత్యాశ్చర్యకరమగు సృష్టివైవిధ్యము మన కనుభవగోచర మగుచున్నది. మనము ప్రత్యక్షముగా ననుభవించు ఈ సమస్త వైవిధ్యమునకు ప్రచోదకము, ధారకము నగు తత్త్వము నొకదానిని గ్రహించుటకు మానవబుద్ధి ప్రసారమైనది. ఈ తత్త్వమునే మానవుఁడు సత్తని గ్రహించినాఁడు. "సన్మూలాః సౌమ్య ఇమాః సర్వాః ప్రజాః సదాయతనాః సత్ప్రతిష్ఠితాః." ఈ తత్త్వము – 'స్వే మహిమ్ని ప్రతిష్ఠితః.' దీనికే అనేక మతములు అనేక నామము లిడినవి.

చంద్రబింబమును చూచినచో – మన కొక పార్శ్వమే గోచర మగును. అయినచో – దానికి రెండవ పార్శ్వము లే దనుట యెట్లు? అట్లే - ఈ ధారక, ప్రవర్తక తత్త్వమును సందేహించుట కవకాశము లేదు.

"అసన్నేవ స భవతి అసత్ బ్రహ్మేతి వేదచేత్."

అని తైత్తిరీయోపనిషత్తు (2-6-1). కాని,. కేవల సత్పదార్థమును అవ్యక్తము, నామరూపానర్హముమై యున్న దశలో – అసత్తునుండి వేరుగా గ్రహించుటకు వీలులేదు. కార్యప్రపంచమం దవతరించని శక్తిని మనము గ్రహించు టెట్లు?

పలువిధములుగ నున్న ఈ విశ్వమందు సత్పదార్థము ప్రచ్ఛన్నమైయున్నది. అందుచే, మానవబుద్ధి కది అనుభవగోచరము కానేరదు. అది వికారమును చెంది, స్థూలకార్యప్రపంచావస్థను స్వీకరించినపుడుగాని మన అనుభవములోనికి రాదు. దిక్కు, కాలము అనువానిచే అవచ్ఛిన్నమై, పరిణామమును చెందినపుడే అది మనకు గోచరించును.

కనుక, సత్పదార్థమునకు రెండు ధ్రువములు గలవు. అవ్యక్తము – దిక్కాలా ద్యనవచ్ఛినము – స్వయంప్రకాశము నగు 'సత్' మొదటిది. ప్రచయానుబద్ధమై, వ్యక్తమగు పరిణామము రెండవది.

సత్పదార్థద్వైధ్రువ్యమున కనుగుణముగ సృష్టియందున్న ప్రతివస్తువునకు వృత్తులు రెండు గలవు. అవి చేష్టాసాహిత్యము, చేష్టారాహిత్యము అనునవి. మానవుఁడు కూడ ఈ వృత్తిద్వయాంతరితుఁడే! వీటినే మనము జాగ్రదవస్థ, సుషుప్త్యవస్థ యని వ్యవహరింతుము. నిద్రాగతుఁడైన మనుజుని, సజీవముగ నున్నట్లే మనము భావింతుము. వానిని నిద్రనుండి లేపి, చేష్టావంతునిగఁ జేసినఁగాని, వాని నైజప్రకృతిని మనము గ్రహించలేము. చేష్టను స్వీకరించి నపుడే వాని స్వభావము బహిర్గత మగును.

ప్రతి ఆత్మయు తనకొఱకే జీవించును. "ఆత్మనః కామాయ సర్వం ప్రియం భవతి." కాని, తన జీవిత పరిణామమునకు తనయం దణగియున్న శక్తులను ప్రకటించుటకు తక్కుఁగల పరిసర ప్రపంచ మావశ్యకము. ప్రతి మనుజుని ఉనికియు, ఇతరుల సంబంధమునఁగాని సార్థక్యమునకు రానేరదు.

సత్పదార్థావబోధనకే సృజింపఁబడిన జీవాత్మ కన్నువిప్పి కనుగొనినపుడు దానికి గోచరించినది వికారస్వభావము గల ప్రపంచము. వికారవాగురలలో తగుల్కొనిన మానవబుద్ధి – సదవబోధన సాధించుటకు వికారప్రపంచమును అవిద్యోపహితము, అధ్యాసితము అని నిరాకరించుట కూడ కలదు. కాని, ఈ అధ్యస్త ప్రపంచమే ఆత్మానుభవము నార్జించు ప్రదేశము. ఈ ప్రపంచమే జీవాత్మ కవదానక్షేత్రము. దీనియందే జీవాత్మయొక్క స్వరూపము గానగును. ఈ స్వరూపావిర్భావమునకే జీవాత్మ సృజించఁబడినది. ప్రతి జీవాత్మకును స్వీయస్థితి ఎంత ముఖ్యమో, ఇతరాత్మలతోటి కూటమికూడ అంత ప్రధానమే.

ఆత్మయొక్క ప్రభవస్థానము పరతత్త్వము. అగ్నినుండి మిణుఁగురులు పైకుబికి ప్రసరించునట్లు — జీవాత్మ లన్నియు పరబ్రహ్మమునుండి ఉద్భూతమై, పరతత్త్వమునుండి విడివడినవి. జీవాత్మయొక్క జీవాత్మత్వము ఈ విడివడుట యందే ప్రకటిత మగుచున్నది. సత్తునం దణఁగియున్న అవస్థగల వస్తువు ప్రకృతిలో లేదు. జీవాత్మకు ఈ చేష్టారహితస్థితి తృప్తికరము గాదు. అది చేష్టావంత మగుటకై ఆరాటపడును. ప్రపంచమందు తానుకూడ సృష్టిప్రయోజనమును పొందుటకు ఉబలాటపడును. అది కారణముగా — జీవాత్మ అవ్యక్తమునుండి వేరై, ప్రపంచమును జొచ్చినది. దీనినే భగవల్లీల యని మనవా రందురు. సత్తునుండి జీవాత్మల ఈ యాతాయాతమే ప్రపంచసృష్టిలయములుగా పరిణమించినది. లయము, సృష్టి ఈ రెండు ధ్రువముల మధ్య జీవాత్మ స్పందించు చున్నది. విశ్వమం దంతట ఈ యాతాయాతము — ఈ పౌనః పున్యము — ఈ పునరావృత్తి — ఈ లయము — ఈ స్పందము మనకు గోచరించుచున్నవి. అహో రాత్రములు — ఋతు సంచారములు — ఖగోళగతులు — జాగ్ర త్సుషుప్తులు — జనన మరణములు ఈ ప్రకృతియొక్క పర్యాయచర్యకు, మహావృత్తికి ఏకదేశావతార ములు. ఈ స్పందనమే అచి ద్విశ్వస్వభావ రహస్యమని కూడ ప్రకృతిశాస్త్రము లుద్ఘోషించుచున్నవి. ఆత్మలు కూడ ఈ పర్యాయ చర్యాంతర్గత ద్వైరూప్యమునే ప్రకటించుచున్నవి. సద్వస్తువునుండి విడివడి, కొంతకాలమైన తర్వాత ఆత్మ తన జన్మభూమికై వగచుచుండును. ఈ వగపే కళారూపముగా పరిణమించును. కళోపాసన ద్వారమున జీవాత్మ తన గమ్యస్థానమును చేరఁజూచును.

అయినను — ఈ జీవాత్మయొక్క ఈ ద్వైరూప్యమునకు, సౌందర్యమునకుఁ గల సంబంధ మేమియను ప్రశ్న కింకను సమాధానము రావలసియున్నది. ఈ సమాధానమే ప్రస్తుత సిద్ధాంతముయొక్క హృదయము. ఆత్మకును, విశ్వ మందలి ఈ ద్వైరూప్యస్పందనమునకును స్వరూపసంబంధమేర్పడినది.

> "అఙ్గప్రత్యఙ్గకానాం యస్మిన్నివేశో యథోచితమ్
> సుస్నిగ్ధ సంధిబంధస్స్యా త్త త్సౌందర్య మితీర్యతే."

ప్రపంచమందలి సుందరవస్తువుల సౌందర్యమున కీ ఆవృత్తి, ఈ పర్యాయ కల్పన, ఈ పౌనఃపున్యరూపమే బీజము.

సౌందర్యావతారములగు లలితకళలు, దేశావృత్తి ప్రధానములు — కాలా వృత్తి ప్రధానములు అని రెండు తరగతులుగా నున్నవి. చిత్రలేఖనము — విగ్రహ

శిల్పము — వాస్తుశిల్పము మొదలగునవి దేశాత్మకావృత్తిమూలములు. ఇచ్చట ఆవృత్తి మనకు అంగ ప్రత్యంగ సమ విన్యాసముగా గోచరించును.

గానము కాలావృత్తి ప్రధానము. అదియే లయాత్మకమగు తాళముగా ప్రకటితమగుచున్నది. కవితకూడ ఛందోబద్ధమై, కాలాత్మకావృత్తిమయమై యుండును.

మన ఆత్మలు మహావృత్తి స్వభావము గలుగుటచేతనే బాహ్యప్రపంచమందలి లయతో, ఆవృత్తితో ఏకస్వరత నొందుచున్నవి. సృష్టియందలి లయ, లయాత్మకములగు ఆత్మల నాకర్షింపఁగలుగుచున్నది. ప్రపంచము — ఆత్మ ఈ రెండును సమాన స్వభావములే! అందుచేతనే విశ్వవ్యాపార లక్షణమగు స్పందనమునకు ఆత్మలును స్పందించును.

'ప్రకృతిని, గానమును పరతత్త్వముయొక్క ద్వైరూప్యావిర్భావముగా పరిగణింపవచ్చు' నని షోపనార్ అను జర్మను తత్త్వశాస్త్రవేత్త పల్కినాఁడు. ఇందణుమాత్రము అతిశయోక్తిలేదు. ప్రకృతి, విశ్వగాయకుని మురళీనాదము. దానితో అనురణించుచున్నది జీవాత్మ.

ఈ యనురణన వ్యాపారమందు ఆత్మకు విశ్వముతో స్వభావసంబంధ మేర్పడినది. లయ ప్రచురమగు ఈ నాదమే విశ్వము పలుకునట్టియు, ఆత్మ గ్రహించునట్టియు భాష. ఇంద్రియ నిరపేక్షముగా జీవాత్మ ఈ భాషను గ్రహించగలదు. ఇంద్రియజన్య ప్రత్యక్షజ్ఞానము సత్పదార్థావబోధనకు తోడ్పడదు. ఆ యవగతికి సాధన మొక్కటియే. అది సౌందర్యోపాసన. పరతత్త్వము నావరించియున్న జవనికను సౌందర్యోపాసన ఛేదించగలదు.

అందుచే—సౌందర్యోపలబ్ధి ఆత్మయొక్క భాష. 'ఒక సత్యమును ప్రత్యాఖ్యానభయరహితముగా గద్యమునకంటె పద్యములో మిక్కిలి రసవంతముగ, నిశ్చయావహకముగ చెప్పవచ్చు' నని ఎమర్సన్ అను అమెరికన్ కవిబ్రహ్మ పల్కినాఁడు.

సౌందర్యము, ఈ ఆవృత్తి స్వభావ సంబంధముచే అనురణించు మన ఆత్మలను ముగ్ధులను చేసి, సమాధి నిమగ్నులను గావించును. దుఃఖోపహత సంసృతిమార్గమునుండి మనలను సద్యః పరనిర్వృతికి చేర్చును. ఆ సమాధిలో

జీవాత్మకు సత్సంపత్తి చేకూరును. కేవలము బోధ కలవడని పరతత్త్వము సౌందర్యతపమునకు లోఁబడును. సుందరదృశ్యము గాంచునపుడు – మధుర గానము నాలకించునపుడు – సుకవితారసము నాస్వాదించునపుడు ఆత్మకు పరతత్త్వసాక్షాత్కారము చేకూరును. త్యాగరాజస్వామి మొదలగు భక్తగాయకులు ఈ యాత్మభాషయందే పరవస్తువుతో సంవదించిరి. ప్రతి మానవజీవితమందును ఇట్టి సత్సంపత్తిఘట్టము లనేకము లుండును. ఇట్టి యనుభవములు సామాన్య మానవునకు కాదాచిత్కముగా సంభవించును. ఈ యనుభవము నిత్యమై నిలచి నపుడు మానవుఁడు జీవన్ముక్తుఁ డగును. ఇట్టివానిని గుఱించియే వేదాంత దేశికులు సంకల్పసూర్యోదయమందు – "అంగాన్యస్య ముహుర్ముహుః పులకితా న్యంతర్ముఖం మానసమ్" అని ప్రస్తావించిరి.

ఈ పైని వివరించిన సౌందర్యమీమాంసనే విశిష్టాద్వైతమతము సిద్ధాంతీక రించినది. ఈ సిద్ధాంతములో – విజ్ఞానము, కళ, బ్రహ్మజ్ఞానమునకు – బ్రహ్మా నందమునకు మార్గములు. శృంగార రసచర్చయగు అలంకారశాస్త్రచరమార్థము బ్రహ్మయొక్క సౌందర్య, ఆనంద స్వరూపముల అవగతియే. విశ్వమును ప్రకా శింపఁజేయు బ్రహ్మయొక్క సౌందర్యము అతీంద్రియ సౌందర్యముయొక్క పరమావతారము. ఐహిక ప్రపంచమునందు భగవదవతారప్రయోజనము జీవా త్మను తన సౌందర్య ప్రదర్శనచే మోహింపఁజేసి, సంసారమునుండి ఉద్ధరించుట. లేకున్న సంకల్పమాత్రముచే సృష్టిని నెలకొల్పఁగల విశ్వమయుని పరాశక్తి తా నవతరింపకయే లోకపాలనఁజేయ సమర్థమగును. జీవాత్మ నుద్ధరించు కేవల లౌకిక మన్మథోన్మాదము భువనసుందరమూర్తియొక్క అలౌకిక సౌందర్యముచే పరాజిత మగును. అందుచే–బ్రహ్మకు మన్మథ మన్మథుఁ డనియు, మదనమోహనుఁ డనియు నామములు. లౌకికకామమును భగవత్కామముగా మార్చు స్పర్శవేది బ్రహ్మయొక్క భువనమోహన సౌందర్యము. విశిష్టాద్వైత సిద్ధాంతములో పరబ్రహ్మయొక్క సౌందర్యసోపానము లైదు. అవి పర - వ్యూహ - విభవ - అంతర్యామి - అర్చావతారములు. అందు మొదటిది —

"తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతిః."

"య ఏషో ఽంతరాదిత్యే హిరణ్మయః పురుషః."

"తస్య మాహారజనం వాసః."

"తస్య యథా కప్యాసం పుండరీకమేవ మక్షిణీ."

అని దిఙ్మాత్రముగా సూచింపఁబడినది. వేదాంత ప్రతిపాద్యుఁడగు బ్రహ్మ, ధీ విషయమగుటచే – ఉపనిషత్తులు బ్రహ్మయొక్క సౌందర్యమును హార్దరీతి నభివర్ణించలేదు.

బ్రహ్మోపనిషత్తనఁ బరగు పాంచరాత్రాగమమున వ్యూహ వాసుదేవుని సౌందర్యము నిరూపింపఁబడినది. ఈ సౌందర్యదర్శన ప్రతిధ్వనియే —

"తేజోమయం పరమసత్త్వమయం ధ్రువం యత్
ఆనందకంద మతిసుందర మద్భుతం యత్."

అను కూరత్తాళ్వాన్ అనుభవము.

పురాణములలో నిదియే క్షీరాబ్ధిశాయి సౌందర్యముగా మారినది. అంతర్యామియొక్క సౌందర్యము దహర పుండరీక మధ్యస్థమై – నిత్యసేవ్యమై మోహింపఁజేసి, ప్రతి నిమేషము తన ఆనందములో – తన సృజ్యశక్తులలో భాగమిచ్చి, మోక్షార్హమగునట్లు చేసి, సూత్రానుబద్ధ శకుని క్రమతః ఆత్మను తన వైపు కాకర్షించును.

శ్రీమద్రామాయణము, మహాభాగవతము పరాత్పరుని అవతార సౌందర్యమును అత్యంత మభివర్ణించినవి. అవతార ప్రయోజనము భువన సుందరమూర్తి యొక్క సౌందర్యావిష్కరణమే!

"కాంతాం ప్రాప్య విచిత్రకర్మరచితాం పర్యాయతో భూమికాం
కేనా ప్యద్భుత నాటకేన కమపి శ్రీమంత మానందయన్
కృత్వా శాస్త్రముఖే మనఃప్రతిముఖం గర్భావమర్శాత్పరం
విద్యా నిర్వహణేన లబ్ధవిభవో హృద్యేష విద్యోతతే."

— (జీవపరిచ్ఛేదాంతే - న్యాయసిద్ధాంజనే.)

దండకారణ్యవాసులగు ఋషులు రాముని అతిలోక సౌందర్యమునకు ముగ్ధులై, తమ నియత కృత్యములను విడనాడిరి.

"మణి విడంబిని తస్య మనోహరే
వపుషి మగ్నమనా మునిమండలీ
జప మముంచత హోమ మముంచత
తప మముంచత స్నాన మముంచత."

మరచుటకాదు, విడచుట. సుకరోపాయము హస్తగతమై యుండగ దుష్కరోపాయము నెవఁడు స్వీకరించును?

రామాయణ మందలి శీలప్రదర్శనపారమ్యమగు రాముని యతివేల సౌందర్యము భాగవత మందలి కృష్ణలీలలో పరమావధిని స్పృశించినది.

"తాసామా విరభూ చ్ఛౌరి స్మయమాన ముఖాంబుజః
పీతాంబరధరస్రగ్వీ సాక్షా న్మన్మథ మన్మథః."

తుదకు కృష్ణుని జగన్మోహన సౌభాగ్యపరీవాహమునందు మునకలెత్తు గోపికల ఆనందోన్మాదముక్రింద మూరినది. సౌందర్యసమ్రాట్ జారచోర శిఖామణి యైనాఁడు. భక్తజనహృదయ నవనీతమును దొంగిలించి, వారిని సంసారమునుండి ఉద్ధరించువాఁ డైనాఁడు.

భువనసుందరమూర్తియొక్క సౌందర్యమునకు చరమస్థానము అర్చామూర్తి. అర్చామూర్తి భక్తిప్రేరితుఁడైన మానవునిచే సృష్టింపఁబడిన విగ్రహమూర్తి కాదు. పరిచ్ఛిన్నావస్థను పొందిన అనంతమూర్తియు కాదు. ఇంద్రియగ్రాహ్యప్రపంచమం దవతరించిన సౌలభ్యవిశిష్టమైన భువనసుందమూర్తియొక్క సంపూర్ణావతారము. తన యానంత్యమున కావంతయైన కొఱంతలేకుండ పరిమితమగు ప్రతిమలో — కృచ్ఛ్రాసికను స్వీకరించినది విభవావతారము.

ఈ అర్చావతారసౌందర్యమే మునివాహనులను ఉఱ్ఱూత లూగించినది. తిరుప్పాణులు శ్రీరంగనాథుని సౌందర్యమును దర్శించ యత్నము చేయలేదఁట!

"కమలపాదంగళ్ వందు ఎన్కణ్ణినుళ్ళన ఒక్కిన్రవే."
"వళివందానుం తానే పణినానుం దానే."

అర్చామూర్తిసౌందర్యము మునివాహనుల నేత్రములయందు బలాత్కారముగ దూరినది.

శ్రియఃపతియొక్క సేవాయోగ్యత్వము భోగ్యత్వము కూడ ఆయన సుభగ తనుత్వముపై ఆధారపడియున్నట్లు నమ్మాళ్వారులు తిరువాయ్మొళి మూఁడవ శతకములో గానము చేసి యున్నారు. ప్రపంచమందు గల సుందర వస్తు సంతాన మంతయు గాలించినను, ఆయన సౌందర్యమున కెనను గానమిచే — "కూవు మాఱరియమాట్టేన్" (నిను చెప్పు విధము తెలియలే నైతిని) అని నిరాశ

చెందినారు. 'ఎమ్మావి'ట్టను పాశురములో – వీరు పరమపదమును నిరాకరించుటకు కారణము అర్చామూర్తి సౌందర్యమనియే తోచును. ఏలయన, దహరతత్త్వమును గుఱించి ఉపనిషత్తుచే నిరూపింపఁబడినట్లు "యచ్చాస్యేహాస్తి యచ్చ నాస్తి సర్వం తదస్మిన్ సమాహిత మస్తి" అనునది అర్చామూర్తి విషయమున గూడ నన్వయించును.

ఇట్లు విశిష్టాద్వైతసిద్ధాంతము బ్రహ్మయొక్క భువనసుందరమూర్తిత్వమును, వాని యాధారత్వ – శేషిత్వ – నియంతృత్వము లను మూటికిని మూలబీజముగా ప్రస్తుతించినది. ఈ త్రితయములో చేరనప్పటికిని – ఈ సుందర మూర్తిత్వమే ఆ మూటి పనిని నిర్వహింపఁగలదు. పైనుదాహరింపఁబడిన తిరుమళిశైయాళ్వారుల "అళకియాన్ తానే" అను పాశురములో – భగవంతుని సౌందర్యము ప్రపంచమునకు ఉపాదానకారణమైనట్లు తెలిసికొంటిమి. సౌందర్య మెట్లు ధారకమో వారే మఱియొక పాశురములో నిట్లు చెప్పుచున్నారు:—

"కార్మేకమన్నకరుమాల్ తిరుమేని
నీర్వానం కళన్దు కాట్టుమ్."

దీనికి పిళ్ళైగారి వ్యాఖ్యాన మిది:—

"రుచి పిఱన్ద పిన్బు ప్రాప్తియళవుం నామ్ ధరిక్కైక్కు అవన్ తిరుమేనిక్కు పోలియుండెన్నై."

అనఁగా – వర్షాకాలమేఘమందు గన్పట్టు శ్రియఃపతి శరీరసౌందర్యసాదృశ్యము వీరికి ధారకమైనది. ఇట్లే, నియంతృత్వ శేషిత్వాదులును ఊహించుకొనఁదగును.

శ్రీ విశిష్టాద్వైతసిద్ధాంతము – బ్రహ్మను భువనసుందరమూర్తిగా నిరూపించి, ప్రకృతి సౌందర్యమును బ్రహ్మ సౌందర్యముయొక్క ప్రతిబింబముగా వ్యాఖ్యానించుచున్నది. సౌందర్యమును ఆనందమునకు మార్గముగా నిరూపించి, నిర్గుణవాదమును నిరాకరించుచున్నది. ఇదియే దీనికిగల వైశిష్ట్యము.

---

# శ్రీవైష్ణవమతము - తద్వైశిష్ట్యము

'విద్యాభూషణ - సాహిత్యరత్న - వేదాంతరత్న - పండిత శిరోమణి - మహావిద్వాన్'
శ్రీమాన్ పండిత - వేదాంతం జగన్నాథాచార్యులు
తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన పండితులు.

* * *

## మంగళాచరణము

"ప్రతద్విష్ణు స్తవతే వీర్యేణ
మృగో న భీమః కుచరో గిరిష్ఠాః
యస్యోరుషు త్రిషు విక్రమణేషు
అధిక్షయ న్తి భువనాని విశ్వా."

— (ఋగ్వేదము: 1-154-2.)

## శ్రీ వైష్ణవ మతోదయము

శ్రీ వైష్ణవమతము అతి పురాతనమైనది. ఇది — నారాయణీయ మత మనియు, విశిష్టాద్వైత మతమనియు వ్యవహరింపఁబడుచున్నది. ఈ మతములో ప్రధాన దైవము శ్రీ మహావిష్ణువు. అందువలన — ఈ మతము అన్వర్థనామ ధేయము గలదై, శ్రవణ మాత్రముననే ఆస్తికుల హృదయప్రాంగణమున ప్రచారము చేయుచున్నది. సిద్ధాంతములను చవిజూడ నాసక్తి గల్గించుచున్నది. ఆ సిద్ధాంతములు మధురభావములతో నొప్పారుచు, ఆశ్రితులకు బ్రహ్మానందమును చేకూర్చుచున్నవి.

## మహర్షులు - మతవ్యాప్తి

ఋషికుల గరిష్ఠుఁడగు వసిష్ఠమహర్షి — ఈ వైష్ణవ మతమునే పరిగ్రహించి, శ్రద్ధాసక్తులతో నత్యాదరమున నందఱకును ఈ మత ప్రాశస్త్యమును వెల్లడించి, సంతృప్తి నందెను. పరదేవతా పారమార్థ్యవేత్తయగు పరాశర మహర్షియు — ఈ వైష్ణవమతమునే ఆశ్రయించి, తన పౌరాణిక వాక్కులచే, ఈ మతము నందలి తత్త్వమహత్త్వమును వ్యక్తీకరించి, చరితార్థుఁడయ్యెను. బ్రహ్మసూత్ర ప్రణేతయగు వేదవ్యాస మహర్షియు — విష్ణుసహస్రనామ సంకీర్తన, భగవద్గీతా

తత్త్వప్రబోధములచే ఈ వైష్ణవమత చైతన్యమునే తరతమభావములు పాటింపక ప్రజానీకమునఁ గల్గించి, గౌరవభాజనుఁ డయ్యెను. యోగికుల చక్రవర్తి యగు శుకమహర్షియు — ఈ వైష్ణవమతమునందలి ప్రధాన సాధనము లగు భక్తి ప్రపత్తులను భాగవత గాథల మూలమున హృదయంగమముగా లోకమున కుపదేశించి, పరమానందభరితుఁ డయ్యెను. భగవన్నామామృత రసపాన వ్యసనుఁ డగు వాల్మీకి మహర్షియు — తన వాక్సుధాలహరిని ప్రపంచమున ప్రసరింపఁజేసి, ఈ వైష్ణవ మతమునకే పట్టాభిషేక మొనరించి, శాశ్వతకీర్తి నార్జించెను. మునికుల మూర్ధన్యుఁడగు భృగుమహర్షియు — సర్వర్షి సమాదృతమగు తన నాయకత్వమున సర్వలోకప్రచారము గావించి, సర్వతత్త్వములను సవిమర్శముగా సమాలోకించి, మహర్షి మండలములో — ఈ వైష్ణవమతమునే స్థిరీకరించి, వన్నె కెక్కించి, వాసి గాంచెను. లోకత్రయ సంచారశీలుఁడగు నారదమహర్షియు, తన గానామృతముచే శిశు పశ్వాదులకుఁ గూడ నైపుణ్యమున ఈ వైష్ణవ మతమునే హృదయవేదికలయం దధిరోహింపఁజేసి, అఖండ యశమును సముపార్జించెను. ఈరీతిగా — అతిపురాతనమై, దేవర్ష్యాదుల హృదయసీమలలో విహరించు ఈ వైష్ణవమతము — భారతదేశమున నాఁటినుండి నేఁటివఱకు ప్రచారములోఁగల వైదికములైన ఆస్తికమతములలో మేటియై ప్రకాశించుచున్నది.

## వైష్ణవమత వాక్య వ్యుత్పత్తి

'వైష్ణవమతము' అను వాక్యము — రెండు పదములతోఁ గూడియున్నది. మొదటిది:—'వైష్ణవ' అను పదము. రెండవది:—'మతము' అను పదము. ఇందు 'వైష్ణవ' అను పదము — 'తస్యేదం' అను పాణినీయ సూత్రము (4-3-120) ననుసరించి, 'విష్ణోరిదం వైష్ణవమ్' అను వ్యుత్పత్తిచే, ఇది విష్ణువునకు సంబంధించిన మతమని స్పష్టమగుచున్నది. ఈ విష్ణుశబ్దము — సువర్ణ, సుధాకరాది శబ్దముల వలె, స్వార్థమందలి మహత్త్వమును, సర్వవ్యాపకత్వాకారమును ప్రబోధించుచు, సర్వేశ్వరునియందు రూఢమై యొప్పుచున్నది.

## వేదప్రామాణ్యము - వైష్ణవమతము

మన భారతదేశము నందలి ప్రమాణములలో — ప్రథమ ప్రమాణముగాను. ప్రధాన ప్రమాణముగాను, ప్రబల ప్రమాణముగాను ప్రకాశించుచున్నది వేదము,

ఆ వేదము — ఋగ్యజుస్సామాథర్వణములుగా చతుర్విధము. 'అనంతా వై వేదాః' అనునట్టుల, ఆ వేదము లనంతములుగా నున్నవి. అట్టి వేదము లన్నింటిలో – ఈ విష్ణుశబ్దము ఇతర పర్యాయపదముల వలె గాక, అధిక ప్రచారము గలదై విరాజిల్లుచున్నది.

సర్వేశ్వరునకు మోక్షప్రదత్వము — ముముక్షూపాసత్వము – జగత్కర్తృత్వము (జగద్వ్యాపారము)— లక్ష్మీపతిత్వము మొదలగు అసాధారణధర్మము లనేకములు ప్రబోధించు సందర్భమున, వేదములు తఱచుగా— ఈ విష్ణుశబ్దమును పురస్కరించుకొని చెప్పుటకే ప్రారంభించినవి. ఋగ్వేదములో — ఐతరేయ బ్రాహ్మణ ప్రారంభమున —

"అగ్నిర్వై దేవానా మవమః, విష్ణుః పరమః
త దంతరేణ సర్వా అన్యా దేవతాః."

అని యున్నది. దేవతలలో అగ్ని దేవత తక్కువవాఁడనియు, విష్ణువు — దేవత లందఱికంటెను గొప్పవాఁడనియు, వా రిరువురి మధ్యలో బ్రహ్మ రుద్రేంద్రాది దేవత లందఱును నిలిచియున్నారనియు ఈ మంత్ర తాత్పర్యము. అదియునుఁ గాక, సావధారణన్యాయముచే విష్ణువు యెప్పుడును — యే దేవతను బట్టియు తక్కువవాఁడు కాఁడనియు, అగ్ని యెప్పుడును — యే దేవతను బట్టియు గొప్పవాఁడు కాఁడనియు, ఇతరులగు బ్రహ్మ రుద్రేంద్రాది దేవతలు విష్ణువు కంటెను తక్కువవారనియు, క్రింది దేవతలకంటెను గొప్పవారనియు పై వేద వాక్యము విశదీకరించుచున్నది. ఇందువలన, విష్ణువునకు పరమత్వమే (ఉత్తమత్వమే) కాని, అవమత్వము (అధమత్వము) లేదనియు, అగ్నికి అవమత్వమే (అధమత్వమే) కాని, పరమత్వము (ఉత్తమత్వము) లేదనియు గ్రహింపనగును. ఇట్లే, యజుర్వేదమునందలి పంచమ కాండములో పంచమ ప్రశ్నమున —

"అగ్నిరవమో దేవతానాం విష్ణుః పరమః."

దేవతలలో 'అగ్ని — అవముఁడు; విష్ణువు పరముఁడు' అని యున్నది. ఇంకను యజుర్వేదములో నచ్చటచ్చట భంగ్యంతరముగ నిట్లే విష్ణువైశిష్ట్యము విపులీకరింపఁబడియున్నది. యజుర్వేదములో నాల్గవ కాండమందలి నాల్గవ ప్రశ్నాంతమున —

"అస్యేశానా జగతో విష్ణుపత్నీ."

అని యున్నది. ఈ వచనము – సర్వప్రపంచమునకు విష్ణుపత్నియే నియంత్రి (రాణి) యని తెల్పుచున్నది. ఇందువలన, విష్ణువే సర్వజగత్తునకు నియంత (ప్రభువు) అని స్పష్టమగుచున్నది గదా! అదియునుఁగాక —

"సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్."

అని కఠ శాండిల్యోపనిషత్తులు – సమీచీన విజ్ఞానశాలియై, ఇటుపై చెప్పఁబడు నటుల ప్రవర్తించెడు జీవుఁడు సంసారాధ్వపారభూతమగు పరమాత్మయైన విష్ణువు యొక్క స్థానమైన పరమపదమును (మోక్షమును) పొందుచున్నాఁడని వ్యక్తీకరించుచున్నవి. ఇట్లే – తక్కినవేదములు కూడ, ఈ విశేషములనే పేర్కొనుచున్నవి. కావున, విష్ణుసంబంధమైన వైష్ణవమతమునకును వేదములే ప్రమాణములనుట – సుస్పష్టము.

## పురాణేతిహాసాదులలో వైష్ణవము

పురాణములు, ఇతిహాసములు మున్నగున వన్నియు ఆఖ్యానముల మూలముగను, విధివచనముల ద్వారమునను విష్ణుపరత్వమునే పల్కుచున్నవి. నిఘంటుకర్తలలో ప్రధానతముఁడు, ప్రాచీనుఁడు నగు అమరసింహుఁడు కూడ పర్యాయవాచకము లగు శబ్దము లన్నింటికంటెను, విష్ణుశబ్దమును ముందుగా పేర్కొనుచు, వైదికాశయమును వెల్లడించుటయేగాక, ఆ పదముచే – అనేక భావములను ప్రబోధించుచున్నాఁడు. ప్రాజ్ఞు లీ ప్రబోధములను గుర్తింపఁగలరు.

## వైష్ణవమతమే విశిష్టాద్వైతము

ఇట్లు సర్వప్రమాణములందును అగ్రగణ్యమైన వైదికమగు ఈ విష్ణు శబ్దమును, త దర్థమగు విష్ణుదైవమును పురస్కరించుకొని వెలువడిన ఈ వైష్ణవ మతము – ఆ దైవముయొక్క సర్వవ్యాపకత్వముతోఁబాటు సర్వదేశవ్యాపకత్వము కూడ కలదై, విశిష్టాద్వైత తత్త్వమును ప్రబోధించుచున్నది.

శ్రీ మహావిష్ణువే చిదచి ద్విశిష్టాద్వైత తత్త్వమనియు, భక్తి ప్రపత్తులచే ప్రసన్నుఁడగు శ్రీ మహావిష్ణువే ఉపాయమనియు, అప్రాకృతదేశవిశిష్టుఁడగు శ్రీ మహావిష్ణువే ఉపేయమనియు సంప్రదాయవేత్తలు సిద్ధాంతీకరించియున్నారు.

ఇట్లు విశిష్టాద్వైతప్రబోధకమై, దిన దినప్రవర్థమానమై ప్రకాశించుచున్న ఈ వైష్ణవమత సిద్ధాంతమునందలి కొన్ని ప్రధానాంశములు — ప్రకృత మిట నుట్టంకింపఁబడుచున్నవి.

## శ్రీ వైష్ణవ సిద్ధాంత స్వరూపము

చిత్తు, అచిత్తు, ఈశ్వరుఁడు — అను మూఁడు పదార్థములు సత్యము లనియు, నిత్యము లనియు శ్రీ వైష్ణవమతము సిద్ధాంతీకరించుచున్నది. ఇందులకు — వేదములను, వేదాంతములను ప్రమాణములుగా పేర్కొనుచున్నది. చిదచిదీశ్వరు లనఁబడు తత్త్వత్రయమును గుఱించి. శాస్త్రకారులు — ఈ క్రింది రీతిగా విశదీకరించియున్నారు.

చిత్తు అనఁగా — జీవులు. 'జ్ఞానమున కాశ్రయభూతులు. ఆత్మలు' అని వ్యవహరింపఁబడుచున్నారు. వీరు — నిత్యులు, ముక్తులు, బద్ధులు అని మూఁడు విధములుగా నుందురు.

నిత్యులనఁగా — ఎన్నఁడేనియు సంసార సంసర్గములేక, జ్ఞానసంకోచములేక పరమపదమునందే నిత్యనివాసము జేయు ఆత్మలు. వారు — అనంత గరుడ విష్వక్సేనాదులు.

ముక్తులనఁగా — మొదట సంసారసంబంధము కలవారై, అనంతరము నివర్తింపఁబడిన సంసారసంబంధము కలవారు. అనఁగా — ఈ లీలావిభూతిలో ప్రాకృతములై, చతుర్దశలోకయుక్తములగు బ్రహ్మాండములయందు — అనాది కర్మబద్ధులగు జీవాత్మలు ప్రారబ్ధము ననుభవించుచు, నిత్యములు — నైమిత్తికములు నగు భగవదాజ్ఞానుజ్ఞాకైంకర్యరూపములైన కర్మలను స్వప్రయోజనమునకై ఆచరించుచు —

> "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
> ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః."
>
> — (భగవద్గీత. 4-34.)

అను ప్రమాణానుసారముగ జ్ఞానము నార్జించి, కర్మజ్ఞానముల నంగములుగా నిడుకొని, వివేక విమోకాది నియమయుక్తుఁడై, దర్శన సమాకారము - ప్రీతిరూపాపన్నము - అవిచ్ఛిన్న స్మృతిసంతానరూపమునైన భక్తిని సముపార్జించి,

ఆ భక్తినిఁగాని, లేక — గురూపసదనసంసిద్ధమగు ప్రపత్తినిఁగాని ఉపాయముగా గైకొని, క్రమముగా — దేహావసానకాలమందు తన సుకృత దుష్కృతములను మిత్రామిత్రులం దుంచి, హార్ద పరమాత్మానుగ్రహముచే ముక్తికి ద్వారభూతమగు సుషుమ్నా నాడిని * ప్రవేశించి, ఆ నాడీ మార్గముననే బ్రహ్మరంధ్రమును భేదించుకొని బయలుదేరి, సూర్యకిరణముల ద్వారముగా అగ్నిలోకమున కేగి, దిన - పూర్వపక్ష - ఉత్తరాయణ - సంవత్సరా ద్యభిమానదేవతలచేతను, వాయు దేవునిచేతను ముక్తిమార్గమందు గౌరవింపఁబడినవాఁడై, సూర్యమండలమును భేదించుకొని, సూర్యలోకమునకుఁబోయి, చంద్ర - విద్యుత్ - వరుణ - ఇంద్ర - ప్రజాపతులు అనఁబడు మార్గదర్శకులగు ఆదివాహక గణముచే నుపచరింపఁబడిన వాఁడై, ఆ యా లోకముల నధిగమించి, ప్రకృతిమండల మనెడు లీలావిభూతికి — నిత్యవిభూతికి మధ్య సరిహద్దుగాఁ గల విరజానదిని దాఁటి, సూక్ష్మశరీరమును వదలినవాఁడై, అచట — అమానవకర స్పర్శము వలన, అప్రాకృత దివ్యమంగళ విగ్రహమును — చతుర్భుజములును — బ్రహ్మాలంకారములును గలవాఁడై, ఇంద్ర - ప్రజాపతి అను నామధేయములు గల వైకుంఠనగర ద్వారపాలకుల యనుజ్ఞచే శ్రీ వైకుంఠనగరమును ప్రవేశించి, సర్వాలంకార సంశోభితమగు గోపురమును దాఁటి, ఐరమ్మద మను అమృత సరస్సును, సోమవనమును అశ్వత్థమును పరిశీలించి, పంచశత (500) దివ్యాప్సరోగణములచే నుపచరింపఁబడినవాఁడై, బ్రహ్మగంధాదులచే నలంకరింపఁబడి, అనంత గరుడ విష్వక్సేనాదులకు నమస్కరించి, వారిచే నాదరింపఁబడినవాఁడై, మహామణిమండపమును ప్రవేశించి, పర్యంక సమీపమునకుఁ జేరి, ధర్మాధిపీఠోపరికమలమున అనంతునియందు విమలాది

---

* సుషుమ్నానాడిని గుఱించిన వివరణము :—

శరీరమునందు 101 ప్రధాన నాడులు కలవు. అవి — ప్రతి శాఖలతో, ఉపశాఖలతో గలసి 72, 72, 10, 201 నాడు లగుచున్నవని ఆనందగిరి వక్కాణించియున్నాఁడు. కాని, తదితరుల అభిప్రాయములో — అన్నియు 72,000 నాడులే యని. వీనిలో ప్రధానములగు 101 నాడులకు నాభి కందమే ఉత్పత్తిస్థానమని కొందఱు యోగులును, హృదయమే కేంద్రస్థానమని మఱికొందఱు నిర్ధారణ చేసియుండిరి. ఏది యేమైనను — ఈ మొత్తము నాడులలో 101 నాడులే ప్రధానము లనియు, వానిలో - ఇడా, పింగళా, సుషుమ్నా అను మూఁడు నాడులు అతి ప్రధానములనియు, ఆ మూఁడు నాడులలో సుషుమ్నా నాడి అగ్రగణ్యమైనదనియు, అత్యుత్తమమైనదనియు, ఈ నాడి — హృదయము నుండి బ్రహ్మరంధ్రము వఱకు వ్యాపించియుండుననియు, ఇదియే బ్రహ్మనాడి యనియు అందఱును ఏకగ్రీవముగ నంగీకరించియే యుండిరి. ముక్తపురుషుఁడు పరమపదమునకు ప్రయాణముచేయు నాడి — ఈ సుషుమ్నా నాడియే యని, వేదాంతము లుద్ఘాటించుచున్నవి.

చామర గ్రాహిణులచే సేవింపఁబడుచున్న శ్రీ భూ నీళా సమేతుండును – శంఖ చక్రాది దివ్యాయుధోపేతుండును – కిరీటా ద్యపరిమిత దివ్యభూషితుండును, అఖిల హేయ ప్రత్యనీక కల్యాణగుణాకరుండును నగు భగవంతుని దర్శనభాగ్యమును పొంది, వారి పాదారవిందములకు ప్రణమిల్లి, వారిచే కటాక్షింపఁబడినవాఁడై, సర్వదేశ సర్వకాల సర్వావస్థలచే సర్వవిధకైంకర్యములయందు పరమానురక్తితో నావిర్భవించిన గుణాష్టకముచే విరాజిల్లువాఁడై, ఉత్తరావధిలేని బ్రహ్మానుభవము కలవాఁడే ముక్తుఁడని, వేదవేదాంతములు స్పష్టముగా చెప్పుచున్నవి. కావున, భగవత్ప్రాప్తియే మోక్షమనియు, మోక్షము గలవారే ముక్తులనియు తెలియవలెను.

బద్ధులనఁగా – అనాదికర్మబంధముచే అనువృత్త సంసారముగలవాఁరై చతుర్దశ భువనములతోఁ గూడిన బ్రహ్మాండ కటాహమందు గల బ్రహ్మాది తృణ పర్యంతమగు జీవాత్మలు. అనఁగా – బ్రహ్మ, రుద్రుఁడు, సనక సనందనాది యోగులు, నారదాది దేవర్షులు, వసిష్ఠాది బ్రహ్మర్షులు, పులస్త్య మరీచి దక్ష కశ్యపాది ప్రజాపతులు, దేవతలు, దిక్పాలకులు, ఇంద్రులు, మనువులు, అసురులు. పితృదేవతలు, సిద్ధులు, గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు, విద్యాధరులు, వసువులు, రుద్రులు, ఆదిత్యులు, అశ్వినీదేవతలు, దానవులు, యక్షులు, రాక్షసులు, పిశాచములు, గుహ్యకులు మొదలగు దేవయోని విశేషులు, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాది జాతిభేదయలతోఁగూడిన వివిధ మానవులు, పశు పక్షి సరీసృప గుల్మ లతా వీరు తృణాదిభేదములు గల స్థావరములు – ఇటుల దేవ, మానవ, తిర్యక్, స్థావర భేదములతోఁ గూడిన జీవాత్మలన్నియు – 'బద్ధులు' అని చెప్పఁబడుచున్నారు.

ఇట్టి బద్ధులు – బీజాంకుర న్యాయముగ, అనాదికాలమునుండియు ప్రవర్తించెడు అవిద్యా, కర్మ, వాసనా, రుచి, ప్రకృతి సంబంధులచే – గర్భ జన్మ బాల్య యౌవన జాగర స్వప్న సుషుప్తి మూర్ఛా జరా మరణాది రూపములగు బహు విధములైన విచిత్రావస్థలు గలవారగుచు, అతి దుస్సహములగు ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికము లనెడు తాపత్రయముచే అభితప్తులగుచు, భగవదనుభవ విచ్ఛేదము గలవారును అగుచున్నారు. ఇట్టి బద్ధజీవులు – చతుర్దశ లోకములతోఁ గూడిన ఈ బ్రహ్మాండమందే కాక, ప్రతి బ్రహ్మాండమునందును

అసంఖ్యాకముగ నున్నారు. ప్రతి బ్రహ్మాండము – పదునాల్గు లోకములతోఁ గూడి, ఉత్తరోత్తరము పదిరెట్లు గల సప్తావరణములతో నావరింపఁబడి, ఇవి యన్నియు భగవత్సంకల్పముచే జలబుద్బుదముల వలె నున్నవి. ఇట్టి బ్రహ్మాండ ములు అసంఖ్యాకములుగా నున్నవని పరాశరమహర్షి స్పష్టీకరించుచున్నాఁడు.

"అణ్డానాం తు సహస్రాణాం సహస్రా ణ్యయుతాని చ
ఈదృశానాం తథా తత్ర కోటి కోటి శతాని చ."

— (విష్ణుపురాణము 1-7-27.)

బద్ధజీవులలో – తిర్యక్ స్థావరములు గాక, ఇంద్రియసిద్ధమైన జ్ఞానము గల బద్ధాత్మలయందు శాస్త్రములు ప్రవర్తించుచున్నవి. తిర్యక్ స్థావరములయందు శాస్త్రములు ప్రవర్తింప నేరవు కాన, మానవులు ముఖ్యముగా శాస్త్రజ్ఞానమును పొంది, త దనుసారముగ ప్రవర్తింపవలసియున్నదని మహర్షులు ప్రబోధించి యున్నారు. ఇందువలననే ఈ బద్ధజీవులు – శాస్త్రవశ్యు లనియు, త దవశ్యు లనియు ఇరు తెగలుగా నుందురని శాస్త్రకారులు చెప్పియున్నారు. శాస్త్ర వశ్యులగు బద్ధులు – బుభుక్షువు లనియు, ముముక్షువు లనియు రెండు విధములుగా నుందురు.

బుభుక్షువు లనఁగా – ధర్మార్థకామమోక్షము లనెడు చతుర్విధ పురుషార్థ ములలో – ధర్మార్థకామము లనెడు త్రైవర్గిక పురుషార్థనిష్ఠులై యుండువారలు. ఐహికములగు అనిత్యసుఖములయం దభిలాషగలవారుగాగాని, ఆముష్మికమగు స్వర్గా ద్యనిత్యసుఖములయం దాకాంక్షగలవారుగాగాని ప్రవర్తించుచుండువార లని ఇందలి సారాంశము.

ముముక్షువు లనఁగా – బుభుక్షువులు కోరెడు అనిత్యసుఖముల నొల్లక, నిరవధికమై - నిరవచ్ఛిన్నమై - అవాఙ్మానసగోచరమై - ఆముష్మికమైన నిత్య సుఖము నాకాంక్షించు వారలు. పర్వభేదముచే బుభుక్షువులును - ముముక్షువు లును పలు తెరంగులుగా నుందురు.

అచిత్ అనఁగా – అచేతన ద్రవ్యము. ఇది – వికారముల కాలవాలమై, జ్ఞానశూన్యమై యుండునది. చైతన్యము లేనిదని దీని తాత్పర్యము. ఇది – శుద్ధ సత్త్వము. మిశ్రసత్త్వము, సత్త్వశూన్యము అని మూఁడు విధములుగా నుండును.

శుద్ధసత్త్వ మనఁగా — రజస్తమోగుణములతోఁ గలియక, కేవలసత్త్వము గలది. ఇదియే 'నిత్యవిభూతి' యని చెప్పఁబడుచున్నది. ఇది — నిత్యము, జ్ఞానానందజనకము, కర్మలేకనే భగవ దిచ్ఛామాత్రమున — విమాన గోపురమణ్డప ప్రాసాద ప్రాకారాది రూపములుగా పరిణమించినది. నిరవధిక తేజోరూప మైనది. నిత్యులకు, ముక్తులకు, భగవంతునకు నివాసస్థానమై యున్నది.

మిశ్రసత్త్వ మనఁగా — సత్త్వరజస్తమోగుణములతోఁ గూడియుండునది. ఇది — బద్ధచేతనుల జ్ఞానానందములకు అవరోధకమై, విపరీతజ్ఞానజనకమై, నిత్యమై, పరమాత్మకు క్రీడాపరికరమై ప్రదేశభేదముచేతను — కాలభేదముచేతను సదృశ వికారములను, అసదృశవికారములను గలుగఁజేయుచుండును. ఈ అచిత్పదార్థమే మహదాది వికారములకు కారణమగుటచే, ఇది 'ప్రకృతి' యని చెప్పఁబడుచున్నది. ఈ అచిత్పదార్థము గుణత్రయాత్మక మగుటవలన, రజస్తమోఽంశములచే బద్ధచేతనుల జ్ఞానానందములను అడ్డగించుచున్నది. ఇందువలన నిది — 'అవిద్య' యని చెప్పఁబడుచున్నది. ఈ అచిత్పదార్థము — పరిదృశ్యమానములగు పరస్పర విలక్షణ విస్మయనీయ విచిత్రకార్యసృష్టిని చేయుటవలన — 'మాయ' అని వచింపఁబడుచున్నది. ఈ మిశ్రసత్త్వమను అచిత్పదార్థము — 'మూలప్రకృతి' యనియు చెప్పఁబడుచున్నది. సర్వేశ్వరునకు సృష్టిచేయవలెనను సంకల్పము కలిగినపుడు, ఈ మూలప్రకృతియందు — అవిభక్త తమస్సు, విభక్త తమస్సు, అక్షరము, అవ్యక్తము అను నాల్గు వికారములు క్రమముగా నేర్పడుచుండును. చివరిదగు అవ్యక్తావస్థవలన మహత్త్వావస్థ యేర్పడును. ఆ మహత్త్వావస్థవలన, క్రమముగా అహంకారత్త్వావస్థ యేర్పడును. ఆ అహంకారమువలన — త్వక్ చక్షు శ్శ్రోత్ర జిహ్వా ఘ్రాణము లను జ్ఞానేంద్రియము లైదును, వాక్ పాణి పాద పాయూపస్థ లను కర్మేంద్రియము లైదును, మనస్సు అను దానితో పదునొకండు ఇంద్రియము లేర్పడును. క్రమముగా — శబ్ద స్పర్శ రూప రస గంధము లను పంచ తన్మాత్రలును, పృథి వ్యాప స్తేజో వాయు రాకాశము లనెడు పంచ భూతములును యేర్పడును. ఇట్లు — ప్రకృతి, మహ దహంకారములు, పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, మనస్సు, పంచ తన్మాత్రలు, పంచ భూతములు మొత్తము చతుర్వింశతి (24) తత్త్వము లేర్పడుచున్నవి. ఈ మిశ్రసత్త్వ మను అచిత్తు (ప్రకృతి) సర్వేశ్వరునకు క్రీడాపరికర మగుటచే — 'లీలా విభూతి' యనియు, శుద్ధసత్త్వమను

అచిత్తు – 'నిత్య విభూతి' యనియు వ్యవహరింపఁబడుచుండును. ఊర్ధ్వభాగముగ నిత్య విభూతియు, అధో భాగముగ లీలా విభూతి (ప్రకృతి) యు గలవు. ఈ రెంటికిని మధ్యభాగమున విరజానది యున్నది. ఈ విరజానది – ఈ రెండు విభూతులకును సీమగా వెలయుచుండును. ఈ విరజానదికి అధోభాగమునఁ గల ప్రకృతికి (లీలా విభూతి) కి అధోభాగమున అంతము లేదు. ఈ విరజకు ఊర్ధ్వ భాగమున అంతము లేదు.

సత్త్వశూన్య మనఁగా – కాలము. ఇది – సత్త్వశూన్యమే కాక, రజస్తమోగుణశూన్యము కూడ నగుటచే, గుణత్రయశూన్యమనియు గ్రహింపనగును. ఈ కాలము – ప్రకృతికి (అవ్యక్తమునకు), ప్రాకృతమునకు, అనఁగా – ప్రకృతిసిద్ధములగు పదార్థములకు పరిణామమును గలుగఁజేయుచున్నది. ఈ కాలము – కలా కాష్ఠా ముహూర్త అహోరాత్రాది రూపములుగా ప్రవర్తించుచున్నది. ఇది - నిత్యమని నిర్ణయింపఁబడినది.

ఈశ్వరుఁ డనఁగా – సర్వకల్యాణగుణాకరుఁడు, సర్వజ్ఞుఁడు, సర్వవ్యాపకుఁడు, సర్వాంతర్యామి, సర్వకారణభూతుఁడు నగు శ్రీమహావిష్ణువు. ఇతఁడు మఱియు సర్వశేషిత్వము, సర్వేశ్వరత్వము, సర్వకర్మ సమారాధ్యత్వము, సర్వకర్మ ఫలప్రదత్వము, సర్వాధారత్వము, సర్వశబ్దవాచ్యత్వము, సర్వజ్ఞానవిషయత్వము ఇత్యాది లక్షణములను గల్గియున్నాఁడు. అదియునుఁగాక సూక్ష్మ చిదచి ద్విశిష్టత్వ జగత్తునకు ఉపాదానకారణముగ నున్నాఁడు. సంకల్పవిశిష్టత్వ వేషముచే జగత్తునకు నిమిత్తకారణముగా నున్నాఁడు. ఈ సర్వేశ్వరుఁడు – పర వ్యూహ విభవ అంతర్యామి అర్చారూపములచే అయిదు విధములుగ నున్నాఁడు.

పరస్వరూప మనఁగా – కాలకృతమగు పరిణామములేని నిత్య విభూతి యందు మహామణి మండపమున, విశాలజ్ఞానము గల అనంత గరుడ విష్వక్సేనాదులచేతను, లీలా విభూతియం దుండి, భక్తి ప్రపత్త్యుపాయములచే క్రమముగా అర్చిరాది మార్గమున నిత్యవిభూతిని ప్రవేశించిన ముక్తపురుషులచేతను అనుభవింపఁబడుచు, శేషపర్యంక భాగమున దివ్యమంగళవిగ్రహ విశిష్టుఁడై, శ్రీ భూ నీళాసమేతుఁడై వేంచేసియుండు స్వరూపము.

వ్యూహస్వరూప మనఁగా — లీలా విభూతికి సంబంధించిన సృష్టిస్థితి సంహార ముల నిర్వహించుటకును, ముముక్షువులను — ఉపాసనచేయు జీవకోటిని అనుగ్ర హించుటకును వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధరూపములుగా వేంచేసి యున్న స్వరూపము.

విభవస్వరూప మనఁగా — సాధుపరిత్రాణము, దుష్టశిక్షణము, ధర్మసంస్థా పనము గావించి, లోకము ననుగ్రహించుట కవతరించిన శ్రీరామకృష్ణాది స్వరూపము.

అంతర్యామి స్వరూప మనఁగా — జీవాత్మలకు ధ్యానాసక్తి గల్గినపుడు ధ్యానగోచరుం డగుచు, అంతర్నియంతయై, హృదయకమలమున నధివసించి యుండు స్వరూపము.

అర్చాస్వరూప మనఁగా — ఆశ్రితుల కభిమతములగు ద్రవ్యములం దావిర్భ వించి, విభవావతార వైలక్షణ్యముగా - దేశ కాలాది నియమములు లేక, సర్వ సహిష్ణువై, అర్చక పరాధీనుఁడై, ఆలయ గృహాదులయం దుండు స్వరూపము.

ఇట్లే — ఈ తత్త్వత్రయ విభాగ విశేషములను శాస్త్రములు వేనోళ్ళ చాటుచు, విజ్ఞానసంపదను సమకూర్చునవియై ప్రకాశించుచున్నవి. కావున, అభిలాషగలవారలు — ఆ యా శాస్త్రములను ఆమూలాగ్ర మవలోకించి, సమ రసమున తద్విజ్ఞానసంపదను సముపార్జించి, సంతృప్తి నందవచ్చును,

జీవాత్మలు ప్రకృతి పరిణామములగు శరీరములను ఇంద్రియములకు సహాయముగ గైకొని, వేదశాస్త్ర ప్రచోదితములగు కర్మ జ్ఞాన భక్తి ప్రపత్తి యోగములను సాధనములుగ నిడుకొని, ఫలాపేక్ష వదలి, పరమాత్మ నుపాసింప వలెను. అట్టి యుపాసనములో నుత్తీర్ణులైనవారలు — క్రమముగ దేహావ సానమున పుణ్యాపాపములనుండి విముక్తులై, ప్రకృతిమండలమును దాఁటి, నిత్య విభూతికి చేరి, భగవత్సన్నిధానమున నిత్యానంద మనుభవించుచుందురు.

ఫలాపేక్ష గలిగి, వివిధ సాధనోపాయములతో పరమాత్మ నుపాసించు వారు — క్రమముగ దేహావసానమందు పుణ్యలోకములఁ జేరి, ఆ పుణ్యము క్షయ మగువఱకును అచ్చట సుఖ మనుభవించి, పుణ్యశేషముతో మఱల ఈ లోకమున కేతెంచి, జనన మరణముల నొందుచు, జలకుండికా న్యాయమున ప్రకృతియందే యుండి, సుఖదుఃఖముల ననుభవించుచు, సంసారబద్ధులై యుండగలరు.

శరీరేంద్రియముల సహాయ మందియు – వేదశాస్త్రముల నుల్లంఘించి. స్వేచ్ఛాచారులై, కామాచార కామవాద కామభక్షముల నాదరించుచుండు వారలు – దేహావసానమున పాపఫలదాయకములగు నరకలోకములఁ జేరి, అచ్చట పాపక్షయ మగువఱకు నానావిధములైన యాతనల ననుభవించి, పాపశేషముతో మఱల ఈ లోకమునుఁ జేరి, జన్మ జరామరణముల నొందుచు, ఈ ప్రకృతియందే సుఖదుఃఖముల ననుభవించుచు, సంసారబద్ధులై యుండగలరు.

## యోగమార్గములు

ముముక్షువులకు సాధనోపాయములు బహు విధములుగా చెప్పఁబడి యున్నవి. అట్టి సాధనోపాయములలో – కర్మ జ్ఞాన భక్తి ప్రపత్తియోగములు అతి ప్రధానములైనవి; అత్యుత్తమములైనవి.

కర్మయోగ మనఁగా – గురూపదేశము వలన జీవాత్మ పరమాత్మల యాథార్థ్య జ్ఞానముగలవాఁడై, శక్త్యనుసారముగ చేయదగినవి – ఫలాపేక్ష లేనివి – నిషేధింపఁబడినవి యగు కామ్య కర్మలను, నిత్య కర్మలను, నైమిత్తిక కర్మలను ఆచరించుట. అనఁగా – దేవపూజలు, తీర్థయాత్రలు, తపస్సులు, దానములు, యాగములు మున్నగు సత్కర్మలను చేయుట. ఇట్టి కర్మ యోగము – జీవునియందుఁ గల పాపసంచయమును తొలఁగించి, జ్ఞానయోగ ద్వారమునఁగాని, సాక్షాత్తుగాఁగాని భక్తియోగమును గలుగఁజేయును.

జ్ఞానయోగ మనఁగా – కర్మయోగాచరణముచే నిర్మలమైన అంతఃకరణము గలవాఁడై – 'నేను పరమాత్మకు దాసుఁడను; శేషభూతుఁడను; కింకరుఁడను' అను భావము గల్గి, ప్రకృతి (శరీరము) తో విడబడిన ఆత్మస్వరూపమును గుఱించిన సమాలోచన విశేషము. ఈ జ్ఞానయోగము – సాక్షాత్తుగా భక్తియోగమును గలుగఁజేయును.

భక్తియోగ మనఁగా – వివేక విమోక అభ్యాస క్రియా కల్యాణ అనవసాద అనుద్ధర్షము లనెడు సాధన సప్తకజన్యమై, యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ధ్యాన సమాధిరూపముచే అష్టాంగయోగయుక్తమై తైల ధారవలె అవిచ్ఛిన్నమగు భగవ ద్విషయ స్మృతిపరంపరయే. ఇది క్రమముగా – దర్శన సమాకారమును, ప్రీతిరూపమును అగును. అటుల ప్రతి

రూపమగు భగవ త్స్మృతియే భక్తి యని తాత్పర్యము. ఈ భక్తియే – వేదన మనియు, ధ్యానమనియు, ఉపాసనమనియు చెప్పఁబడుచున్నది. ఇట్టి భక్తియే మోక్షమునకు ముఖ్యసాధనమని శ్రీ భగవద్రామానుజ యతిసార్వభౌములు సంభావించి, లోకమున కుపదేశించియుండిరి.

సాధన సప్తక వివరణము :—

వివేక మనఁగా – జాతిచేతను, ఆశ్రయముచేతను. నిమిత్తముచేతను; కాలముచేతను దోషములేని ఆహారము వలన శరీరశుద్ధిని సంపాదించుట.

విమోక మనఁగా – ఇతరములగు కోరికలు లేకుండుట.

అభ్యాస మనఁగా – అనుక్షణము తన అభిమాన (ఉపాస్య) దైవమును జ్ఞప్తియం దుంచుకొనుట.

క్రియ యనఁగా – శక్తిసామర్థ్యముల ననుసరించి, ప్రతిదినము పంచమహా యజ్ఞముల * నాచరించుట.

కల్యాణ మనఁగా – సత్యము, ఆర్జవము, దయ, దానము, అహింస మొదలగు గుణములు గల్గియుండుట.

అనవసాద మనఁగా – దైన్యము లేకుండట.

అనుద్ధర్ష మనఁగా – అతి సంతోషము లేకుండుట.[1]

అష్టాంగయోగ వివరణము :—

యమ మనఁగా – అహింస, సత్యము, అస్తేయము. బ్రహ్మచర్యము, అపరిగ్రహము అను అయిదు గుణములు గలిగియుండుట.

ఎప్పుడును – ఏ భూతమునకును ద్రోహము చేయకుండుటయే అహింస.

ఎటుల తలంచితిమో - ఎటుల చూచితిమో - ఎటుల వింటిమో - ఎటుల చెప్పితిమో అటులనే చెప్పుట, చేయుట సత్య మనఁబడును.

పరద్రవ్యము నపహరింపకుండుటయే అస్తేయము.

---

* ౧. బ్రహ్మయజ్ఞము ౨. దేవయజ్ఞము ౩. పితృయజ్ఞము ౪. భూతయజ్ఞము ౫. మనుష్యయజ్ఞము అనునవి పంచమహా యజ్ఞములని చెప్పఁబడును.

1. అతి సంతోషము కూడ విరోధము గల్గించునని శాస్త్ర తాత్పర్యము.

పరస్త్రీలను సాభిలాషముగఁ జూచుట మొదలగు యెనిమిది విధములగు దోషములు[1] లేకుండుటయే బ్రహ్మచర్యము.

విషయములకు (ద్రవ్యములకు) ఆర్జనము, రక్షణము, క్షయము, సంగము. హింస మొదలగు దోషములు సహజముగ నుండును గనుక. ప్రయత్నములేక లభించినను, అశాస్త్రీయములగు విషయములకు నిందిత ప్రతిగ్రహాది రూపమగు ఆర్జనదోష మేర్పడును. శాస్త్రీయములైనను - ఉపార్జితములగు విషయములకు క్షయాది రక్షణ దోషములుండును. ఇందువలన, విషయములను స్వీకరింప కుండుటయే అపరిగ్రహ మని తెలియవలెను.

నియమ మనఁగా — శౌచము. ఇది — సంతోషము. తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము అను అయిదు గుణములు కలిగియున్నది.

మృజ్జలాదులవలన బాహ్యశుద్ధి, చిత్తమలములగు మద మాన అసూయాదులను తొలగించుట అభ్యంతర శుద్ధి. ఇటుల దేహశుద్ధి, మనశ్శుద్ధి కలిగి యుండుటయే శౌచము.

ప్రాణరక్షకములగు విషయములకంటె నధికములగు విషయములను స్వీకరింప నిచ్ఛ లేకుండుటయే సంతోషము.

శీతోష్ణాది ద్వంద్వములను సహించుటయు — చాంద్రాయణాదుల నాచరించుటయు తపస్సు అని చెప్పఁబడును.

మోక్షరూప సాధనాది ప్రతిపాదక శాస్త్రముల నధ్యయనము చేయుటయే స్వాధ్యాయము.

సర్వకర్మ సమారాధ్యుఁడును — పరమగురువు నగు సర్వేశ్వరునియందు సర్వకర్మలను సమర్పించుటయు — సంసార బీజక్షయము నపేక్షించినవాఁడై, సర్వకాలములయందును సర్వేశ్వరుని సంస్మరించుచుండుటయును ఈశ్వర ప్రణిధానము.

---

1. ౧. స్మరణము ౨. కీర్తనము ౩. కేళి ౪. ప్రేక్షణము ౫. గుహ్యసంభాషణము ౬. సంకల్పము ౭. అధ్యవసాయము ౮. క్రియానిర్వృత్తి అనునవి బ్రహ్మచర్యమునకు అష్టవిధ దోషములు.

ఇటుల యమ రూపాంగమునకు అయిదు గుణములును, నియమ రూపాంగమునకు అయిదు గుణములును వెరశి పది గుణములు గలవాఁడే యోగమున కధికారి యగుచున్నాఁడు. యమమునకు పది గుణములు, నియమమునకు పది గుణములు మొత్తము ఇరువది గుణములు గలవాఁడే యోగమున కధికారియని మరీచి మహర్షి, శాండిల్య మహర్షి మున్నగువారు నిర్ణయించియున్నారు. పతంజలి, పరాశరుఁడు మొదలగు మఱికొందఱు మహర్షులు — పది గుణములు గలవాఁడే యోగమున కధికారి కాఁగలఁడని వక్కాణించినారు. ఇట్లు యోగాధికారమును గుఱించి భిన్నాభిప్రాయములు గలవు, పది యెట్లున్నను, యోగము నభ్యసించువానికి మాత్రము కొన్ని అర్హతలుండుట అవసరమని ఇందు మూలమున స్పష్టమగుచున్నది. ఈ వివరణమునకు ముందు — యోగాంగ విభాగములు ముఖ్యముగా తెలియఁదగియున్నవి.

ఆసన మనఁగా — కూర్చుండుట. ఇట్టి ఆసనములు తొమ్మిది విధములుగా నుండును. అవి — (1) బ్రహ్మాసనము, (2) స్వస్తికాసనము, (3) పద్మాసనము, (4) గోముఖాసనము, (5) సింహాసనము, (6) ముక్తాసనము, (7) వీరాసనము, (8) భద్రాసనము, (9) మయూరాసనము అనునవి. ఈ ఆసనములలో — బ్రహ్మాసన ప్రభృతి, పద్మాసన పర్యంతము గాఁగల మూఁడు ఆసనములు ఉత్తమాసనములుగా పరిగణింపఁబడుచున్నవి.

ప్రాణాయామ మనఁగా — ప్రాణాపానములకు సమాన యోగము. ఇది — రేచక, పూరణ, కుంభకము లని మూఁడు విధములుగా నుండును. ఈ మూఁడును కలిసి, ఒక ప్రాణాయామ మగును.

ప్రత్యాహార మనఁగా — ఇంద్రియములను సర్వవిషయముల వలనను బలాత్కారముగ మఱలించుకొని, చిత్తమున కనుసరింపఁ జేసికొనుట. ప్రాణాయామముచేత వాయు జయమును, ప్రత్యాహారముచేత ఇంద్రియ జయమును యోగాధికారి పొందనగును.

ధారణ యనఁగా — ప్రాణాయామముచే వాయువును, ప్రత్యాహారముచే ఇంద్రియములను వశమొనరించుకొనిన యనంతరము, శుభాశ్రయమందు (సర్వేశ్వరునియందు) చిత్తమును లగ్నము చేయుట. ఈ ధారణా విషయమున

మహర్షులలో మత భేదములు కలవు. ధారణ, ధ్యాన రూపములగు యోగాంగముల పూర్వోత్తరభావములందును మతభేదము లున్నవి. అవి – అనుభవము వలననే తెలియవలసియున్నవి. అన్యథా అవగాహము కాఁజాలవు.

ధ్యాన మనఁగా – పరమాత్మను గుఱించి జీవాత్మ చేయు చింతనము. ఇది – నిష్కలమనియు, సకలమనియు రెండు విధములు. ఇట్టి ధ్యానమే తైల ధార వలె అవిచ్ఛిన్నమగు భగవద్విషయక స్మృతిపరంపరా రూపముగ నుండును. యోగాంగము లగు యమ నియమాదు లారింటిచేతను, ఉపాసనా సోపాన క్రమముచే నారూఢమగు భగవ ద్దివ్యమంగళవిగ్రహ విషయకమగు స్మృతిసంతతి యని దీని తాత్పర్యము.

సమాధి యనఁగా – ప్రత్యగాత్మకు పరమాత్మతో సమానమైన అవస్థా విశేషము. అనుష్ణమైన పాషాణశకలము సూర్యకిరణ సంపర్కమువలన ఉష్ణత్వము పొందు పగిది, పరమాత్మ సందర్శనమువలన జీవుఁడు శక్తియుక్తుఁడై, పరమాత్మ యగు శ్రీమన్నారాయణుని సాక్షాత్కరించుకొని, ఆనందము ననుభవించు చుండును. ఇదియే సమాధి యనఁబడుచున్నది.

ప్రపత్తియోగ మనఁగా – న్యాసవిద్య. ఇతర సాధ్యముకాని స్వాభీష్ట సిద్ధికై, మహా విశ్వాసముతో – ఇది యొకటియే ఉపాయమని విశ్వసించి, యాచించుట. స్వాభీష్టభూతుఁడగు భగవంతుఁడు – ఇతరసాధ్యముకానివాఁ డగుచుండ, ఆ భగవంతుఁడే ఉపాయ మను ప్రార్థనాబుద్ధియే ప్రపత్తి యని తాత్పర్యము. ప్రపత్తికి సంబంధించిన అనుష్ఠాన ప్రకారము – 'ఉపేయభూతుఁడ వగు నిన్ను పొందుటకు, నిన్నే ఉపాయముగ వరించుచున్నాను' అని సంభావింపవలెను.

"నిక్షేపాపరపర్యాయః న్యాయః పంచాంగసంయుతః."

అను ప్రమాణముచే, ఇదియే ఆత్మనిక్షేపరూపమైనది గాన, న్యాసవిద్య యని చెప్పఁబడుచున్నది. ఈ న్యాస విద్యకు – ఆనుకూల్య సంకల్పము, ప్రాతికూల్య నివృత్తి, రక్షణవిశ్వాసము, గోప్తృత్వవరణము, కార్పణ్యము అను అయిదు అంగములు కలవు. ఇవి – అంగములుగాను, ఆత్మనిక్షేపము అనునది అంగిగాను సంప్రదాయవేత్తలు ప్రవచించుచున్నారు.

ఆనుకూల్య సంకల్ప మనఁగా — సర్వము భగవ చ్ఛరీరభూతము గాన, సర్వపదార్థములగు చరాచరములయందు సర్వమునకు ఆత్మభూతుఁడగు భగవంతునియందు ఆనుకూల్యము గల్గియుండవలెనను నిశ్చయము.

ప్రాతికూల్య నివృత్తి యనఁగా — తనకు స్వామియగు భగవంతునియం దెటుల ప్రాతికూల్యము లేకుండునో, అట్లే—సర్వభూతము లందును ప్రాతికూల్యము లేకుండుట. ఇవి — విహితానుష్ఠాన, నిషిద్ధపరిహారములలో పర్యవసించుచున్నవి.

రక్షణవిశ్వాస మనఁగా — 'దయాసాగరుఁడగు భగవానుఁడు శేష భూతుఁడ నగు నన్ను తప్పక రక్షించి తీరు' నను దృఢతరమగు నమ్మకము.

గోప్తృత్వ వరణ మనఁగా — కరుణాసముద్రుఁడైనను, శక్తి సంపన్నుఁడైనను, ప్రభువైనను ప్రార్థనచేయక రక్షింపఁడని తెలిసి చేయు "గోప్తారం త్వా మహం వృణే" అను ప్రార్థనము.

కార్పణ్య మనఁగా — శ్రుత శీలాదులవలనఁ గలిగిన గర్వముయొక్క త్యాగము. అంగసంపత్తి లేకయు, శక్తిలేకయు, అధికారము లేకయు కలిగిన గర్వముయొక్క త్యాగము - దైన్యమనియు, కార్పణ్యమనియు చెప్పఁబడును.

ఆత్మనిక్షేప మనఁగా — స్వస్వాతంత్ర్య ప్రతిపత్తి నివృత్తిపూర్వకముగా భగవ దధీన ప్రతిపత్తి కలిగియుండుటయే.

పైఁ జెప్పఁబడిన కర్మ జ్ఞాన భక్తి ప్రపత్తియోగములు — అధికారిభేదముచే ప్రత్యేకముగ మోక్షసాధకము లనియు, గురు — లాఘవ వికల్పము లేదనియు, సంప్రదాయవేత్తలు స్పష్టీకరించుచున్నారు. అదియునుఁగాక, కర్మ జ్ఞాన భక్తి యోగములు మూఁడును — పరస్పర సాహచర్యముచే పురుషార్థసాధకము లగునని శాస్త్రములు వక్కాణించుచున్నవి.

"జ్ఞాన భక్త్యన్వితం కర్మ జనకాదిషు దృశ్యతే
కర్మ భక్త్యన్వితం జ్ఞానం ప్రాయేణ భరతాదిషు
కర్మ జ్ఞానాన్వితా భక్తిః ప్రహ్లాదప్రముఖాశ్రయాః."

జ్ఞాన భక్తులతోఁగూడిన కర్మయోగము — జనకమహారాజు మొదలగు వారియందు కనఁబడుచున్నది. కర్మ భక్తులతోఁగూడిన జ్ఞానయోగము —

తఅచుగా జడ భరతాదులయందు కనఁబడుచున్నది. కర్మ జ్ఞానాన్వితమగు భక్తియోగము – ప్రహ్లాదుఁడు మొదలగు శ్రీముఖులయందు కనఁబడుచున్నది ' అని పై శ్లోకము ధృవపఱచుచున్నది. అందుచే, అచ్చటచ్చట - ఆ యా యోగములు ప్రాధాన్యము వహించుచుండునని గ్రహింపనగును. ఈ త్రివిధోపాయములే కాక, ప్రపదనమును నాల్గవ ఉపాయముగా లక్ష్మీతంత్రము చెప్పుచున్నదని సంప్రదాయవేత్త లుద్బోధించుచున్నారు. ఇటుల - వేద వేదాంత సిద్ధములగు సిద్ధాంతములతో విరాజిల్లు ఈ వైష్ణవమతము – ఆస్తిక మతములలో నగ్రగణ్యమై, మహోదశ ననుభవించినది.

## బౌద్ధయుగము — ఆస్తికమత విపర్యయము

విధి బలీయము. కావుననే, బౌద్ధయుగము ఆస్తికమతములకు పరీక్షా సమయ మయ్యెను. ఆ కాలమున బౌద్ధులధాటి కోర్వలేక, ఆస్తికమతము లన్నియు–కూర్మపాదన్యాయమున స్వధర్మములను సంకోచించుకొని, గిరి గుహాలయందు ప్రవేశించియు - ప్రయోజనము కానక, సత్పురుషుల హృదయ కుహరములలో డాగియుండవలసివచ్చెను.

బౌద్ధమతములో బుద్ధుఁడు ప్రధానమైన గురువు. ఉపదేష్ట ఒక్కఁడే యైనను – శిష్యు లనేకులు. అందు - మాధ్యమికుఁడు, యోగాచారుఁడు. సౌత్రాంతికుఁడు, వైభాషికుఁడు అను వారలు ముఖ్యులు. ఈ నల్గురు శిష్యులును - నాల్గు విధములగు భావములు గలవారగుటచే, బౌద్ధమతము నాలుగు సిద్ధాంతములతో సిద్ధమయ్యెను.

గురు వగు బుద్ధుఁడు శిష్యులకు – ' సర్వం శూన్యం ' అని ఉపదేశించెను. ఆ సిద్ధాంతము నంగీకరించిన శిష్యుఁడు - మాధ్యమికుఁడు.

గురువునకు ప్రేమపాత్రుఁడు – యోగాచారుఁడు. ఇతఁడు గురూపదేశమును తన భావనలతో తర్కించుకొని, బాహ్యార్థశూన్యత్వవాదిగా, విజ్ఞానమాత్రాస్తిత్వవాదిగా తయారయ్యెను.

సౌత్రాంతికుఁడు – గురువుయొక్కయు, గురువునకు ప్రధాన శిష్యుఁడైన యోగాచారునియొక్కయు అభిప్రాయముతో నేకీభవింపక, తన భావనతో బాహ్యార్థానుమేయత్వవాది యయ్యెను.

వైభాషికుఁడు – గురువుయొక్కయు, పై శిష్యులయొక్కయు అభిప్రాయముల నంగీకరింపక, తన భావనలతో బాహ్యార్థ ప్రత్యక్షవాదియు, సర్వాస్తిత్వవాదియు నయ్యెను. ఈ బౌద్ధమతము —

"సర్వం క్షణికం క్షణికం దుఃఖం దుఃఖం
స్వలక్షణం స్వలక్షణం శూన్యం శూన్యమ్."

అను నాల్గు భావములు గల్గియున్నది. గురువు శూన్యవాది. ఆ గురువుకు ప్రధానశిష్యుఁడు మాధ్యమికుఁడు. మిగిలినవా రాతనికి సోదరప్రాయులు. అందుచే - నాస్తికమతము బహుముఖములుగా విజృంభించెను. ఈ బౌద్ధులు – ప్రచండ తార్కికులై, వైతండికులు కూడ నగుచు, ఇతర మతములకు నిలువ నీడలేకుండ చేయసాగిరి.

## ఆస్తిక మత పునరుద్ధరణము — శ్రీ శంకరయుగము

భగవ దనుగ్రహముచే – అట్టి సమయమున శ్రీ శంకరాచార్యు లవతరించి, ఆస్తికమత విధ్వంసకులగు ప్రచండ తార్కికులైన ఆ బౌద్ధుల నెదుర్కొని, వారి దుర్వాదములను వేదసాహాయ్యముతో - ప్రభుసాహాయ్యముతో - ఆత్మశక్తి సాహాయ్యముతో ఖండించి, తుదకు వేదప్రామాణ్యమును, బ్రహ్మాస్తిత్వమును స్థాపించి, వారి నందఱిని ఆస్తికుల గావింప సమకట్టిరి. బౌద్ధులు చెప్పెడు సర్వశూన్యత్వ మిథ్యాత్వములను బ్రహ్మపదార్థమునకు సత్యత్వ మను పేరుతో నొక నూతన మార్గము నేర్పఱచి, దానిని సుస్థిర మొనరించుటకై, రజ్జు సర్పాదులకు ప్రాతిభాసిక సత్యత్వ మనుపేర మఱియొక సత్యత్వమును నెలకొల్పి, వారిని సంతృప్తుల గావించుచు, యేదియో యొక విధమున సత్యత్వమును వదలకనే, అట్టి ప్రచండ తార్కికులగు బౌద్ధులను గూడ తమ వశము జేసికొని, ఆస్తికులను చేయఁదలంచుచు, జ్ఞానయోగమును ప్రచారములోనికి దీసికొని రాఁగలిగిరి. అప్పు డప్పుడు – శిష్యోపదేశము లందును, ఆప త్సమయము లందును, గోవింద భజనము - లక్ష్మీనృసింహా స్తవము మొదలగు వానిచే భక్తియోగమును ప్రబోధించుచు – 'వీరి హార్దభావ మిదియేనా?' అను కలకలమును ప్రజలలో గలిగించిరే కాని, అచిరకాలమున – ముప్పదిరెండు సంవత్సరముల ప్రాయముననే ఇంతటి తీవ్రప్రచారముఁ గావించి, దుర్వాదిమతములను పారద్రోలి, లోకమున నాస్తిక మతమును తొలఁగించి, లోకమును నిత్యసత్పదార్థాభిముఖముగా నొనరించి, అనిత్యశరీరమును చాలించివైచిరి.

## శ్రీ వైష్ణవమత పునరుజ్జీవనము - శ్రీ రామానుజయుగము

శ్రీ శంకరాచార్యుల యనంతరము సుమారు మున్నూరు సంవత్సరములకు శ్రీ భగవద్రామానుజాచార్యులవా రవతరించి, కేవలము బ్రహ్మమునకే కాక, ప్రకృతికి - జీవునకుఁ గూడ సత్యత్వమును సమకూర్చి, భక్తియోగమే ముక్తికి సాధనోపాయ మనియు, ప్రపత్తియోగము అతి లలితసాధన మనియు నిరూపించి, విశిష్టాద్వైత సిద్ధాంతమును లోకమున పునఃప్రతిష్ఠించి, శ్రీ వైష్ణవమతము నుద్ధరించి, ప్రజానీకమున కెంతయో మేలు చేకూర్చి, జగద్గురువులుగా విఖ్యాతి నార్జించిరి. ఈ రీతిగా వా రొనరించిన మహోపకారమునకు కృతజ్ఞతగా - త దనుయాయులు, శ్రీ వైష్ణవ మతమును 'శ్రీ రామానుజ మత' మను పేర ప్రశంసింపసాగిరి.

"పశు ర్మనుష్యః పక్షీ వా
యే చ వైష్ణవ సంశ్రయాః
తే నైవ తే ప్రయాస్యన్తి
త ద్విష్ణోః పరమం పదమ్."



# శ్రీ పాంచరాత్ర మత వైభవము

'సాహిత్య శిరోమణి - వేదాంత కోవిద -
రాష్ట్రభాషా భూషణ్ - విద్వాన్'

శ్రీమాన్ పొడిచేటి శ్రీరంగాచార్యులు

* * *

"నమ శ్శ్రీ వాసుదేవాయ సత్యజ్ఞాన స్వరూపిణే
స్వాశ్రితావన దీక్షాయ మోక్షైక ఫలదాయినే."

## అవతరణిక

ప్రపంచమందలి వివిధ ఖండములలో – ఆసియా ఖండము అతి ప్రాచీనముగా సువిఖ్యాతమైనది. ఇది – వివిధ మతములకు, సంస్కృతులకు, నాగరికతలకు, సంప్రదాయములకు ఆలవాలమైనది. మహర్షులకు జన్మస్థాన మగుటచే – 'ఆర్షీయదేశ' మని సంస్కృతమున వాడఁబడి, క్రమముగా వికృతమై, 'ఆసియా' యను పేరఁ బరగినది. ఇందలి సువిశాల భూభాగమునకే 'భారతవర్ష' మని నామాంతరము. మనము నివసించు భరతఖండము గంగాది పుణ్యనదులతోడను– హిమాలయాది మహోన్నత శైలరాజములతోడను – విరాజితమై, ఆర్యావర్తమై, పుణ్యభూమియై తనరారినది. బౌద్ధ క్రైస్తవ మహమ్మదీయాది మతము లన్నియు ఆధునికములు. రెండు మూఁడువేల సంవత్సరములలోపు చరిత్ర సంపద మాత్రమే కలవి. కాని, సృష్ట్యాదియందే సకల జగత్కారణ భూతుఁడగు శ్రీమన్నారాయణునిచే కోట్లకొలఁది సంవత్సరములకు పూర్వమే ఉపదేశింపఁబడి, పరంపరాగతమై, వివిధావస్థల నొంది, సంరక్షింపఁబడిన గ్రంథ జాతములే మన వేద సమామ్నాయము. మన దేశమున అన్ని మతములును గలవు. తత్తన్మతానుయాయులును గలరు. వైదిక, అవైదిక, ఆస్తిక, నాస్తిక మతావలంబులును గలరు. కాని, ద్వైతాఽద్వైత విశిష్టాద్వైత మతములు మూఁడు మాత్రమే శిష్టజనాంగీకృతము లైనవి. ఇవి ముఖ్యముగా వేదపారమ్యము నంగీకరించినందున, వైదిక మతములుగా పరిగణింపఁబడినవి. సర్వదేశముల యందలి ప్రాచీన సభ్యతలు, నాగరికతలు నశించినను, తన

పూర్వోన్నత్యమును సంరక్షించుకొని, అమరత్వము నందిన మహాగౌరవము వైదికధర్మమునకే చెల్లినది. ఇట్టి వేదము లన్నియు – 'అనంతా వై వేదాః' అనునట్లు – అనంతములుగా నున్నవి.

## భగవద్వైభవము

'వేదోఽఖిలో ధర్మమూలమ్' అని శాస్త్రప్రమాణము. సర్వధర్మముల కును వేదమే ప్రాతిపదిక. ఇట్టి శ్రుతుల నాధార మొనర్చుకొనియే – స్మృతులు, ఇతిహాసములు, పురాణములు, ఆగమములు, ద్వైతాఽద్వైతాది సంప్రదాయ భేదములు ఉద్భవించినవి. సమస్త వైదికమతానుయాయులయందును – విష్ణువును కీర్తింపనివారు లేరు. కాన, శ్రీమహావిష్ణువు సర్వజనాంగీకృతుఁడు. విశిష్టా ద్వైతులగు శ్రీవైష్ణవులు విష్ణుపరత్వమే నుడువుదురు. అద్వైతులు బ్రహ్మ విష్ణు మహేశ్వరులను ఒకే తేజముగా భావింతురు. పంచాయతనపూజలో విష్ణువుకు ప్రత్యేకస్థానము కల్పింపఁబడినది. ద్వైతులు శ్రీహరినే పరతత్త్వముగా గొల్చుచున్నందున, విష్ణువు సర్వజనాంగీకృతుఁ డనుటలో విప్రతిపత్తియే లేదు.

'హరిః ఓమ్' అని వేదములు ప్రారంభింపఁబడుటచే, ఓంకార మందలి అకార ఉకార మకారములలో మొదట గల అకారము–విష్ణుబోధక మగుటచేతను, రజస్సత్త్వ తమోగుణ స్వరూపులగు బ్రహ్మ విష్ణు మహేశ్వరులలో శుద్ధ సత్త్వ గుణోపేతుఁడు శ్రీమన్నారాయణుఁడే యగుటచేతను, శ్రీహరియే పరాత్ప రుఁడు ; ప్రధానతముఁడు ననుట నిర్వివాదాంశము.

"యేఽప్యన్యదేవతా భక్తా యజంతే శ్రద్ధయాన్వితాః
తేఽపి మామేవ కౌంతేయ ! యజ న్త్యవిధిపూర్వకమ్."
— (భగవద్గీత 9-23.)

అర్జునా! శ్రద్ధతో నితర దేవతల నారాధించుచున్నవా రందఱును న న్నారాధించుచున్నట్లే భావింపుము. కాని, అట్లితర దేవతల నారాధించుట కేవలము అజ్ఞాన మూలకము."

ఇది నారాయణ స్వరూపుఁడైన శ్రీకృష్ణభగవానుఁడు నరస్వరూపుఁడైన అర్జునున కుపదేశించిన పరమ రహస్యము. ఇందువలన, సర్వదేవతా రూప ములలో శ్రీమన్నారాయణుఁడే అంతర్యామిగా నున్నట్లు తెలియనగును. మఱియు —

"సర్వదేవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి."

'ఎవ రే దైవమునుగూర్చి నమస్కరించినను, ఆ నమస్కారము లన్నియు విష్ణు భగవానునకే చెందగలవు' అను ప్రమాణముకూడ ఇచ్చట సార్థక మగుచున్నది. జీవునకు రక్షణయే అత్యావశ్యకమై యున్నందున, సర్వరక్షకుఁడైన శ్రీమన్నారాయణుఁడే సర్వజనులకును సమాశ్రయణీయుఁడు.

"మోక్ష మిచ్ఛే జ్జనార్దనాత్."

అనెడి ప్రమాణోక్తరీత్యా, మోక్షాధికారి యగు శ్రీ మహావిష్ణువే భవ బంధములను నశింపఁజేయ సమర్థుఁడని స్పష్టమగుచున్నది గదా!

## పాంచరాత్ర శాస్త్రోదయము

ఇట్టి శ్రీమన్నారాయణుఁడు సృష్ట్యాదియందు బ్రహ్మకు వేదముల నుపదేశించెను. కాని, ఆ వేదములు అనంతములుగా — దురవగాహ గంభీరములుగా నున్నందున, లోక హితార్థమై, వేద సంప్రదాయము అత్యంత సులభముగా వ్యక్తమగునట్లు బోధింపుమని అనంత గరుడ విష్వక్సేన బ్రహ్మేంద్రు లైదుగురును వైకుంఠవాసుని ప్రార్థింపఁగా — శ్రీహరి ప్రసన్నుఁడై. అయిదు రాత్రులలో శాస్త్ర రహస్యములను వారికి సులభమార్గమున విపులముగా బోధించెను. ఇందు వలననే, ఈ శాస్త్రగ్రంథములకు 'శ్రీ పాంచరాత్రాగమ' మను అన్వర్థనామ మేర్పడినది. దీనికి ప్రమాణముగా నారదమహర్షి వాక్యములను పరిశీలించుఁడు :—

"శ్రూయతాం మునయ స్సర్వే య దుష్మాభి రపేక్షితం
భగవచ్ఛాస్త్ర రాహస్యం యథా శక్తి వదా మ్యహమ్
పురా త్వేత న్మహాశాస్త్రం లోకానుగ్రహ కామ్యయా
మమ పిత్రా విధాత్రే తు వైకుంఠనగరే శ్రుతమ్
శ్రీమన్నారాయణో శౌరిః హరిః పరమపూరుషః
పంచరాత్రిషు తత్సర్వం బ్రహ్మణే ష్వవద త్స్వయం
తదన్వేత న్మయాఽధీతం సమగ్రం మమ పిత్రుణా
స రహస్యం చ శ్రీవిష్ణో రారాధన పరం వరం
ఏతత్ జ్ఞాత్వా భవాంభోధి నిమగ్నా మానవా భువి
శాశ్వతం శ్రీహరే స్థానం ప్రాప్నువంతి న సంశయః."

— (పరమపురుష సంహిత : ప్రథమాధ్యాయము)

"మునులారా! వినుడు. మీరు కోరిన విషయములను యథా శక్తిగా వచించెద. ఈ మహా శాస్త్రమును ఆమూలాగ్రముగా మున్ను నా జనకుఁడగు బ్రహ్మదేవుఁడు లోకుల ననుగ్రహింపఁదలఁచి, శ్రీ వైకుంఠమున పరమపురుషుఁడగు శ్రీమన్నారాయణుని ప్రార్థింపఁగా, ఆతఁడైదు రాత్రులలో నిద్దానిని బ్రహ్మ కనుగ్రహించెను. పిమ్మట, నేను – సర్వశ్రేష్ఠములై వెలసిన శ్రీ విష్ణు భగవానుని ఆరాధించు విధానములతోఁ గూడిన రహస్యముల నన్నింటిని నా తండ్రి కడ సమూలముగాఁ దెలిసికొంటిని. ఈ శాస్త్రమును సంసారసాగర నిమగ్నులైన మానవు లవగాహ మొనరించుకొనఁగల్గిరేని, వారు నిస్సంశయముగా శాశ్వత విష్ణు సాయుజ్యమును పొందఁగలరు."

ఇట్లు పాంచరాత్ర శబ్దమునకు వివిధ వ్యుత్పత్త్యర్థములు ప్రచారములో నున్నవి.

"పాంచరాత్రం నామ, పంచరాత్రీయన్తే యస్మిన్ శాస్త్రే తత్ పాంచరాత్రం. యస్య దేహినః మహాభూతగుణాః శబ్ద స్పర్శ రూప రస గంధాత్మికాః పంచ సంఖ్యాకాః రాత్రీయన్తే ఇతి వా పాంచరాత్రం. అథ వా, యస్య దేహినః యస్మిన్ శాస్త్రే రాత్రయః సుఖప్రదాః జ్ఞాయన్తే తత్ పాంచరాత్రమ్."

"మహాభూతగుణాః పంచరాత్రయో దేహిన స్స్మృతాః
తద్యోగా ద్వినివృత్తేర్వా పాంచరాత్ర మితి స్మృతమ్,
భూత మాత్రాణి గర్వం చ బుద్ధి రవ్యక్తమేవ చ
రాత్రయః పురుషస్యోక్తాః పాంచరాత్ర మితి స్మృతమ్."

— (పరమ పురుష సంహిత: ప్రథమాధ్యాయము.)

"పాంచరాత్రస్య శబ్దస్య వక్ష్యే మ్యర్థ మతః పరం
వియ ద్వాయుశ్చ వహ్నిశ్చ ఆపశ్చైవ ధరా తథా
రాత్రయో దేహినాం ప్రోక్తాః అవిద్యా సంభవా స్స్మృతాః
తద్భోగా ద్విని వృత్తం తు కారయేయు ర్యత స్తతః."

ఇంతకును పాంచరాత్ర శబ్దమునకుఁ దేలిన అంతరార్థ మేమనఁగా – పాంచభౌతిక వికారజన్యములగు శబ్ద స్పర్శ రూప రస గంధాది విషయ సుఖ భోగములనుండి మానవుని విముఖునిఁజేసి, భగవత్సేవలో నిమగ్నత నొందించు నదియే శ్రీ పాంచరాత్ర శాస్త్రము. ఈ పాంచరాత్ర శాస్త్రమునకు తంత్రము,

ఆగమము, ఏకాయనము, ప్రకృతివేదము; మూలవేదము, సాత్త్వతవిధి, భగవచ్ఛాస్త్రము, మహోపనిషత్తు, ఏకాయనాఖ్యశ్రుతి అను నీ మొదలగు నామాంతరము లున్నవి.

## తంత్రము

తంత్ర మనఁగా — షోడశోపచార తంత్రములచే భగవానుని ప్రసన్న మొనర్చుకొనుట. లేక, ఉపచారాదులచే భగవ దనుగ్రహమును సాధించువానికి సకలాభీష్టముల నొసంగి, సంసారసాగరమునుండి తరింపఁజేయును గాన, తంత్ర మనియు పేరుఁ బొందినది.

## ఆగమము

"ఆగమో నామ ఆఙ్గిత్యుపసర్గాత్ గమ్ ధాతోః అచ్ ప్రత్యయే నిష్పన్నః తంత్రశాస్త్రావబోధకః."

అను సూత్రము ననుసరించి, ఈ శాస్త్రమే పాంచరాత్రాగమ మనియు వ్యవహరింపఁబడుచున్నది.

"సృష్టిశ్చ ప్రళయశ్చైవ దేవతానాం తథార్చనం
సాధనం చైవ సర్వేషాం పురశ్చరణ మేవ చ
షట్కర్మసాధనం చైవ ధ్యానయోగ శ్చతుర్విధః
సప్తభి ర్లక్షణై ర్యుక్తం త్వాగమం తద్విదు ర్బుధాః."

౧. సృష్టిక్రమము ౨. ప్రళయాదివర్ణనము ౩. నారాయణ - విష్ణు - వాసుదేవ - సుదర్శన - నృసింహ - హయగ్రీవాది సమస్త దేవతార్చనావిధానములు ౪. విద్య - రాజ్యము - ఐశ్వర్యము మొదలగు సర్వకామ్య సుఖప్రాప్తి సాధనా విధానములు ౫. సకల మహామంత్రముల పురశ్చరణక్రమములు ౬. వశ్యాకర్షణ - విద్వేషణ - మారణ - మోహనోచ్చాటనము అను షట్కర్మసాధనములు ౭. చతుర్విధ ధ్యానయోగములు అను నీ సప్తలక్షణములతోఁ గూడిన శాస్త్రమగుటచే నిది 'ఆగమ' మని చెప్పఁబడుచున్నది.

## ఏకాయనము

"శృణుధ్వం మునయ స్సర్వే వేద మేకాయనాభిదం
మోక్షాయనాయ వై పంథా ఏత దన్యో న విద్యతే
తస్మా దేకాయనం చేతి ప్రవదంతి మనీషిణః."

మోక్షప్రాప్తికి ఈ శాస్త్రమే ముఖ్య మార్గముగా నున్నందున నిది 'ఏకాయన' మనియు వ్యవహరింపఁబడుచున్నది.

## ప్రకృతి వేదము

"అస్మా చ్ఛాస్త్రం తు తంత్రాఖ్య మస్మా న్మన్వాదయోఽపి చ
ధర్మశాస్త్రా ణ్యనేకాని కరిష్యంతి యథా తథం
అన్యేషా మపి శాస్త్రాణాం యోని రేత ద్భవిష్యతి
ఋగాది మంత్రా స్సర్వేఽపి తథా చాస్మిన్ ప్రకీర్తితాః
ఏష ప్రకృతివేదేభ్యో వాసుదేవైక గోచరః
ప్రవర్తతే కృతయుగే తత స్త్రేతా యుగాదిషు
వికారవేదా స్సర్వత్ర దేవతాంతర గోచరాః."

మన్వాదిస్మృతులకును — బహుళశాస్త్రములకును ఇది కారణమైనందున, కృత - త్రేత - ద్వాపర యుగములలో పాంచరాత్రాగమమునకు 'ప్రకృతివేద' మనియు వ్యవహారము కల్గినది. మన్వాది మహర్షులు తమ ధర్మశాస్త్ర రచనకు పాంచరాత్ర శాస్త్రమునే ప్రాతిపదికగా గైకొనియున్నట్లు ఇందువలన సుస్పష్ట మగుచున్నది.

## మూల వేదము

"మహతో వేదవృక్షస్య మూలభూతో మహానయం
ఋగాద్యా స్కంధభూతా స్తే శాఖాభూతాశ్చ యోగినః
జగన్మూలస్య వేదస్య వాసుదేవస్య ముఖ్యతః
ప్రతిపాదకతా సిద్ధా మూలవేదాఖ్యతా ద్విజాః."

— (పురుషోత్తమ సంహిత : ప్రథమాధ్యాయము.)

వేద మొక మహావృక్షము. ఋగ్యజుస్సామాథర్వణములు నాల్గును దానికి శాఖాభూతములు. జగన్మూలకమైన ఇట్టి వేదము ముఖ్యముగా వాసుదేవ భగవానుని ప్రతిపాదించుచున్నది. ఇందువలన నిది 'మూలవేద' మనియు చెప్పఁబడుచున్నది.

ఈ వివరణములచే — ఈ పాంచరాత్ర శాస్త్రము భారతీయ తత్త్వ శాస్త్రములలో ప్రముఖస్థానము నాక్రమించి యున్నట్లును, పరమప్రమాణముగా పరిగణింపఁదగి యున్నట్లును విశదమగుచున్నది.

## ఉపనిషత్తులలో పాంచరాత్రము

ఈ శాస్త్రమునందలి యాదర్శములను, గంభీర భావములను, ప్రాచీనతను, ఛాందోగ్యోపనిషత్తునందలి భూమవిద్య ఇట్లు నిరూపించుచున్నది:—

"ఋగ్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదం సామవేదం అథర్వణం వాకో వాక్య మేకాయనం చేతి."

ఇందలి ఏకాయనశబ్దము పాంచరాత్రబోధకము.

## వేదములలో పాంచరాత్రము

"నాన్యః పంథా అయనాయ విద్యతే."

ఏకాయనశబ్దము పురుషసూక్తములో నిట్లు స్పష్ట మొనర్పఁబడినది. శతపథ బ్రాహ్మణమందును పాంచరాత్రశాస్త్ర ప్రశంస కలదు.

## వైదికమత ప్రవర్తకుల దృష్టిలో పాంచరాత్రము

శ్రీ శంకర - రామానుజ - వేదాంతదేశికాచార్యాది మహనీయు లందఱును పాంచరాత్ర శాస్త్రమునుండి ఉదాహరణము లనేకములను తమ గ్రంథములలో నుల్లేఖించి, శాస్త్ర ప్రామాణికతను బాగుగా చాటియున్నారు. పూజ్యులైన శ్రీ యామునాచార్యులవారు ఈ పాంచరాత్ర శాస్త్రమును పంచమవేదమని ప్రశంసించియున్నారు. ఈ శాస్త్రము సృష్ట్యాదినుండియు బహుళప్రచారములో నున్నది. అన్నియుగములయందును ఇది జీవించియున్నది. పదియవ శతాబ్దమున కాశ్మీరుదేశములో 'స్పాందప్రదీపికా' కారుఁడైన ఉత్పల వైష్ణవమహనీయుఁడు — ఈ పాంచరాత్రశాస్త్రమును మిక్కిలి ప్రశంసించియున్నాడు.

## ఇతిహాసములలో పాంచరాత్రము

"ఇదం శత సహస్రార్థ భారతాఖ్యానవిస్తరాత్
ఆవిధ్య మతిసంధానం దధ్నోఘృత మివోద్ధితం
నవనీతం యథా దధ్నో ద్విపదాం బ్రహ్మణో యథా
ఆరణ్యకం చ వేదేభ్యః ఓషధీభ్యో యథాఽమృతం
ఇదం మహోపనిషదం చతుర్వేద సమన్వితం
సాంఖ్యయోగకృతాం తేన పాంచరాత్రానుశబ్దితం

నారాయణముఖోద్గీతం నారదో శ్రావయన్ మునీన్
బ్రహ్మణ స్సదసే తాత యథా దృష్టం యథా శ్రుతం
ఇదం శ్రేయ మిదం బ్రాహ్మ్య మిదం హిత మనుత్తమం
ఋగ్యజుస్సామభి ర్జుష్ట మథర్వాంగిరసై స్తథా
భవిష్యతి ప్రమాణం వై ఏత దేవానుశాసనం
ఏతద్ధి సర్వశాస్త్రాణాం శాస్త్రముత్తమ సంజ్ఞితం
పంచరాత్ర మితిఖ్యాతం నారాయణ ముఖోద్గతం
తస్మాత్ ప్రవర్తతే ధర్మాన్ మను స్స్వాయంభువస్స్వయం
అన్యేషాం ధర్మశాస్త్రాణాం ఏత ద్యోని ర్భవిష్యతి."

— (మహాభారతము.)

ఇట్లు — ఇతిహాసపురాణాదు లన్నింటియందును పాంచరాత్ర శబ్దప్రశంస లనేకములు కలవు. ఇది సాక్షా న్నారాయణ ముఖోద్గతమైన ధర్మమనియు, హితకరమనియు, సర్వశాస్త్రములలో నుత్తమమైనదనియు బ్రహ్మసభలో నారదుఁడు విని, మహర్షులకు వినిపించెననియు, సకలధర్మముల కిది కారణభూతమైన దనియు బహువిధములుగా ఈ పాంచరాత్ర శాస్త్రప్రాశస్త్యము స్తుతింపఁబడినది.

## పాంచరాత్ర శాస్త్ర ప్రామాణ్యము

పాంచరాత్ర శాస్త్రము ప్రామాణికమా? కాదా? అను సంశయగ్రస్తులైనవారు — శ్రుతిస్మృతీతిహాసపురాణాదులు పాంచరాత్రశాస్త్రము నెట్లు పూజ్యభావముతో నిర్వచించియున్నవో ఉదాహరణపూర్వకముగా నుల్లేఖింపఁబడిన 'శ్రీ పాంచరాత్రరక్ష' 'ఆగమప్రామాణ్యము' 'తంత్రశుద్ధాఖ్యము' మొదలగు గ్రంథములను శ్రద్ధతోఁ బరిశీలించినచో, సంశయము లన్నియు సులభముగా సమసిపోగలవు,

## ఆగమములు — దేశవ్యాప్తి

ఈ యాగమములు నేఁడు దక్షిణభారతమున మాత్రమే విశేషప్రచారములో నున్నవి. ఇవి కొన్నిమాత్రమే ముద్రణభాగ్యము నందియున్నవి. ఇంకను అముద్రితగ్రంథము లశేషములుగా నున్నవి. అవి యన్నియు తాళపత్రగ్రంథములుగా నుండుటవలన, ప్రభుత్వ గ్రంథాలయములలో భద్రపరుపఁబడియున్నవి. ముద్రితగ్రంథములకు నేఁడు ప్రతులు లభించుట కూడ కష్టసాధ్యము.

ఉత్తర భారతములో 'నారద పాంచరాత్రము' విశేష ప్రచారములో నున్నది. ఈ గ్రంథమునకు జన్మస్థానము ఉత్తర భారతమనియే విమర్శకుల యభిప్రాయము. కాని, దీని యభివృద్ధి ప్రచారములు దక్షిణభారతమునందే విశేషముగా కాన నగును.

ఏది యెట్లున్నను, ఈ పాంచరాత్రశాస్త్ర మొక మహా సముద్రము. ఇదియొక గొప్ప ఆధ్యాత్మిక సాహిత్యము. దీనినుండి మన పూర్వులెంతయో ప్రయోజనమును సాధించియున్నారు. వర్తమాన - భావి తరములవారును దీనినుండి బహుళ ప్రయోజనములను సాధింపవలసియున్నది. పాశ్చాత్య పండితు లనేకులు ఈ పాంచరాత్రాగమముపై అత్యంతము పూజ్యభావమును ప్రదర్శించి యుండుట గమనార్హమైన యంశము.

విమర్శకు లీ యాగమమునందు దాదాపు 15 లక్షల శ్లోకములు (ఒకటిన్నరమిలియన్) ఉన్నవని తెలుపుచున్నారు. కాన నిది యెంత విస్తృతమైనదో గ్రహింపఁదగును. ఈ యాగమమును సమగ్రముగా పరిశీలింపఁ దలచినవారు తంజావూరు సరస్వతీమహాల్ గ్రంథాలయములో - మద్రాసు ప్రాచ్య లిఖిత గ్రంథాలయములో - అడయార్ గ్రంథాలయములో భద్రపరుపఁ బడియున్న తాళపత్ర గ్రంథములను సావధానముగ పరిశీలింపవచ్చును.

## సంహితలు — సంఖ్యానిర్ణయము

ఈ పాంచరాత్ర శాస్త్రమునకు సంబంధించిన సంహితలు నూటయెనిమిది కలవని చాలమంది అభిప్రాయము. కాని, ఈ సంఖ్య మనకు నిర్దుష్టముగాఁ దోచదు. ఏలయన —

"అష్టోత్తర శతంభేదం శాస్త్రస్యాస్య స్వరూపతః
ఆద్యం సనత్కుమారాఖ్యం చతుర్మూర్తిశ్చ సంహితా
నారదీయం చ కపిలం వారాహం శౌనకం తథా
విహగేంద్రం మహాతంత్రం పురుషోత్తమమేవ చ
ఏతాని నామధేయాని అష్టోత్తరశతాని చ
ఇత్యేవం కీర్తితం విప్ర మార్కండేయేన మే పురా."

ఇట్లు కపింజల సంహితలో మఱికొన్ని పేర్లు ఉదహరింపఁబడియున్నను, నూట యెనిమిది పేర్లు కానరావు. కొన్ని సంహితలలో 108 పేర్లు కలవు. మఱి కొన్నింటిలో కొన్ని పేర్లుమాత్రమే ఉదహరింపఁబడినవి. కొన్నింటిలో 108 సంఖ్య కూడ మించినది. ఉదాహరణకు – పద్మ తంత్రములో 112 సంహితల పేర్లు కనఁబడుచున్నవి. విష్ణు తంత్రములో 114 పేర్లున్నవి. హాయ శీర్ష సంహితలో 34 పేర్లు కలవు. జ్ఞానామృతములో 7 పేర్లు మాత్రమే ఉన్నవి. అగ్ని పురాణములో, 39-వ అధ్యాయమునందు 25 సంహితల పేర్లున్నవి. ఇట్లు లెక్కింపగా, మొత్తము 210 సంహితల పేర్లు కానవచ్చుచున్నవి. ఇవిగాక, 5 సంహిత లింకను గలవు. నేఁడు 215 సంహితల పేర్లు సంపూర్ణముగా లభ్య మగుచున్నవి. రాధారాధనము, శ్రీరామార్చనము మొదలగు విషయములను బోధించు సంహితలను కొందఱు కృత్రిమము లందురు. అట్టి పాశ్చాత్య విమర్శకుల వాదములు – ధర్మైకప్రాణులగు భారతీయ తత్త్వజ్ఞులకు రుచింపవు. జర్మన్ దేశస్థుఁడును, అడయార్ లైబ్రరీ డైరెక్టరు నగు స్కార్డరు మహాశయుఁడు ఈ శాస్త్రముపై అమూల్యమైన పరిశోధన గావించెను. 215 సంహితల పేర్లు తెలిసికొనఁగోరువారు – అహిర్బుధ్న్య సంహితకు ఆ స్కార్డర్ మహాశయుఁడు వ్రాసిన ఉపోద్ఘాతమును పరిశీలింపవచ్చును.

ఈ 215 సంహితలను మనము మూఁడు విధములుగా విభజింపవచ్చును. ఒకటి – మూల సంహితలు. ఇవి మిక్కిలి శుద్ధములును - ప్రాచీనములునై యున్నవి. రెండు – మూలాధారముగా ఉత్తర దేశమున నుద్భవించినవి. వీనిలో ఆధునిక విషయములు గలవనియు, కృత్రిమములనియు, నవీనము లనియు విమర్శకుల యభిప్రాయము. ఈ యభిప్రాయమునే సత్యముగా భావించి, ఈ శాస్త్రమునందలి విషయ గౌరవమునకు న్యూనత నాపాదించుట చాల పొర పాటు. వీని పవిత్రతనుగాని, ప్రయోజనమునుగాని శంకించుట అజ్ఞుల లక్షణము. ఈ సంహితలలో – ఏది ప్రాచీనమో, ఏది నవీనమో నిర్ణయించుట సులువైన పనికాదు. ఏలననఁగా – ఒక సంహిత పేరు రెండవ సంహితలోఁగూడ ఉల్లేఖింపఁ బడినందున, ఏది ప్రాచీనమో, ఏది నవీనమో గ్రహించుట కష్టతరము.

ఇందు చాల సంహితలు అధ్యాయములుగా విభాగింపఁబడియుండును. ప్రతిష్ఠ, సంకర్ష, లింగ, సౌర అను నాల్గు కాండలుగా హాయశీర్ష సంహిత విభాగింపఁబడినది. జ్ఞాన, క్రియా కాండలుగా పారమేశ్వర సంహిత విభజింపఁ

బడినది. ఈ సంహితలలో కొన్నింట – జ్ఞాన, యోగ, క్రియా, కార్యము లను నాల్గు పాదములు కాననగును. ఇందు జ్ఞానయోగముకంటెను, క్రియా - కార్యభాగములే బహుళవ్యాప్తి నందినవి.

## పాంచరాత్రము - తద్విశేషము

శ్రీమన్నారాయణునకు సంబంధించిన విజ్ఞానమే శ్రీ పాంచరాత్రాగమములోని ముఖ్యవిషయము. పరాత్పరుఁడగు శ్రీ మహావిష్ణువు అచింత్యాద్భుత శక్తియగు సుదర్శనరూపము గై కొని, తన దివ్యతేజమున, పర - వ్యూహ - విభవ - అంతర్యామి - అర్చారూపములుగా విభజించి, పాంచరాత్ర సత్ర మొనర్చి, బ్రహ్మాండ మంతయు వ్యాపించెనని తెలుపఁబడినది. భాగవతపురాణమున వర్ణింపఁబడిన రీతిగా, పాద్మ తంత్రము సృష్టిక్రమమును ఇంచుమించుగా వర్ణించినది.

## సంహితలు - విషయ విభాగము

ఈ పాంచరాత్రశాస్త్రము శ్రీవైష్ణవ మత సిద్ధాంతమునకు పరమప్రమాణము. ఇది సర్వ ప్రాచీన శ్రీవైష్ణవ మత సిద్ధాంతములకును మూలగ్రంథము. ఇందలి ముఖ్యవిషయములను మనము పది విధములుగా విభజింపవచ్చును.

౧. తత్త్వము ౨. మంత్రము ౩. యంత్రము ౪. మాయ ౫. యోగము ౬. మందిరనిర్మాణము ౭. ప్రతిష్ఠ ౮. సంస్కారాహ్నికము ౯. వర్ణాశ్రమ ధర్మము ౧౦. ఉత్సవము అనునవి.

ఇట్లు వివిధ విషయ బోధకములగు సంహిత లనేకము లున్నను, విష్ణు తంత్రములో —

"అష్టోత్తర సహస్రాణి అష్టోత్తర శతాని చ
పాంచరాత్రాణి తంత్రాణి సంతి మే కమలోద్భవ!"

అను భగవద్వచన మున్నందున, అష్టోత్తర శత సహస్ర సంఖ్యలో (1108) సంహిత లున్నవని గ్రహింపనగును. అయినచో – ఇవి యన్నియు భూలోకమున ప్రచారమునకు వచ్చినట్లు కానరాదు. వీనిలో, ప్రధానతమములైన 108 సంహితలు మాత్రమే భగవన్ముఖోద్గతములై, మానవలోకమునకు లభించుచున్నవి. పిదప, ఋషులు వివిధములుగా గ్రహించి, సంహితలుగా రచించియుండిరి. అట్టివే నేఁడు మనకు 215 సంఖ్యలో కానవచ్చుచున్నవి.

ఈ సంహితలను ప్రధానముగా రెండు విభాగములు చేయుట సమంజసము. ౧. తత్త్వము లేక దైవికములు. ఇవి సాక్షాత్తుగా భగవన్ముఖోద్గతములైనవి. ౨. కారణదైవములు. అనఁగా – భగవంతుని మూలమున దెలిసికొనిన పిమ్మట, ఆ శాస్త్రముల నాధార మొనర్చుకొని ఋషులు రచించినవి. ఇవి, విధి - ప్రయోగరూపములలో నుండును.

కొన్ని కొన్ని విషయములలో – కొన్ని కొన్ని సంహితలు ప్రముఖస్థాన మలంకరించినవి. మంత్రసిద్ధాంత మార్గములలో – ఈ క్రింద పేర్కొనఁబడిన సంహితలు ప్రధానములని భావింపఁబడుచున్నవి.

౧. పాద్మతంత్రము ౨. విష్ణుతంత్రము ౩. కపింజల సంహిత ౪. బ్రహ్మ సంహిత ౫. మార్కండేయ సంహిత ౬. శ్రీధర సంహిత ౭. భారద్వాజ సంహిత ౮. పరాశర సంహిత.

అష్టోత్తరశత సంహితలలో పంచరత్నములని ఈ క్రింది సంహితలకు ప్రసిద్ధి యున్నది.

౧. పాద్మ సంహిత ౨. సనత్కుమార సంహిత ౩. పరమ సంహిత ౪. పద్మోద్భవ సంహిత ౫. మహేంద్ర సంహిత.

కణ్వతంత్ర, అమృతతంత్రములను మఱికొంద ఱిందు చేర్చుచున్నారు. పై పరమ సంహిత శ్రీభాష్యకారులగు శ్రీమద్రామానుజులచే ఉత్పత్త్యసంభవాధికరణభాష్యమున పరమప్రమాణముగా గైకొనఁబడి, వారిచే రచింపఁబడిన నిత్యగ్రంథమున కిదియే మూలాధారమైనది.

అతి ప్రాచీనములనియు, అత్యంత ప్రధానములనియు ఎంచఁబడుచున్న కొన్ని సంహితల నామము లిట సూచింపఁబడుచున్నవి. వీనికి నవరత్నములని ప్రసిద్ధి యున్నది. పాశ్చాత్య విద్వాంసులు సైతము వీనిని సర్వశ్రేష్ఠములుగా సంభావించుచున్నారు.

౧. పౌష్కర సంహిత ౨. వరాహ సంహిత ౩. బ్రహ్మ సంహిత ౪. సాత్త్వత సంహిత ౫. అహిర్బుధ్న్య సంహిత ౬. పారమేశ్వర సంహిత ౭. పద్మ సంహిత ౮. ఈశ్వర సంహిత ౯. జయాఖ్య సంహిత.

ఇవి నవరత్నములనుట అతిశయోక్తి కానేరదు. ఇందలి 'జయాఖ్య సంహిత' అనేక సంహితలకు మూలభూతమైనందునను, విషయ ప్రాశస్త్యము చేతను నాయకమణి యనఁ దగియున్నది.

## పాంచరాత్ర శాస్త్ర ప్రయోజనము

ఈ మహాశాస్త్రము మొదట మోక్షోపాయ ప్రదర్శనముగా - అనంత గరుడ విష్వక్సేనాదుల కుపదేశింపఁబడినది. అయినను, పిదప వారు వారి శిష్యుల కుపదేశించుచుండ, వారు తమ ప్రియ శిష్యుల కుపదేశించుచుండ, వారు తమ ప్రియ శిష్యుల కుపదేశించుచుండగా నిది యిట్లు పరంపరాగతమై, ఛందోబద్ధమై, అనుష్టుప్ శ్లోకములుగా రూపొందినది. ఆ యా మహర్షులచే వారి వారి పేర్లతో అనేక సంహితలుగా ఉపదేశ సౌలభ్యమునకై రచింపఁబడియున్నవి. ఇవి — ౧. దివ్య సిద్ధాంతము ౨. మంత్ర సిద్ధాంతము ౩. తంత్ర సిద్ధాంతము ౪. తంత్రాంతర సిద్ధాంతము అను ప్రధాన ప్రభేదములతో లోకమునకు వెల్లడి యైనవి.

ఈ శాస్త్రమునందు వివిధ విషయములు ప్రసక్తానుప్రసక్తముగ ప్రవచింపఁబడినవి. వేదాంతము, యోగము, పాకము, శిల్పము, జ్యోతిషము మొదలగు ఉత్తమ శాస్త్రీయ విషయము లెన్నియో ఇందు ప్రతిపాదింపఁబడినవి. ముఖ్యముగా — విష్ణ్వారాధన విధానములు, ఆలయ - మంటపాది నిర్మాణములు, ఉత్సవ విశేషములు, ప్రతిష్ఠావిధులు, యంత్రోద్ధరణములు, మంత్ర పురశ్చరణములు, ప్రాయశ్చిత్తములు, శాంతి పౌష్టిక కర్మలు, కామ్యకర్మ సాధనములు ఇందు విశదీకరింపఁబడినవి. వీనికి అంగభూతములుగా — భూగోళ విజ్ఞానము, ఖగోళ విజ్ఞానము, రత్న పరీక్ష, శిలా పరీక్ష, భూ పరీక్ష మొదలగు ప్రకృతి శాస్త్ర సంబంధములైన పెక్కు విషయములు నిర్దుష్టముగను, నిష్కృష్టముగను అచ్చటచ్చట నిరూపింపఁబడినవి.

## సంహితలు - విషయ ప్రాశస్త్యము

ఇందు ఒక్కొక్క సంహిత ఒక్కొక్క విషయమును ప్రధానముగా మనకు బోధించుచుండును. మిగిలిన విషయములు అంగభూతములుగా నుండును. మఱియు — ఏదే నొక విషయమును కూలంకషముగా నెఱుంగవలెనన్న, కొన్ని సంహితలను బాగుగా పరిశీలించి, ఆ విషయమును గ్రహించవలసియుండును.

ఆరాధన విధానమునకు విష్ణు, పాద్మ, కపింజల సంహితలు ఆధారముగా గైకొనఁబడుచున్నవి. కొందఱు మఱికొన్ని సంహితలను స్వీకరింతురు. విష్ణ్వాలయములయందలి నిత్యోత్సవ విధానములు, బ్రహ్మోత్సవాదులు, ప్రతిష్ఠావిధులు ఈ యాగమముల ననుసరించియే నేఁడు దేశమున జరుపఁబడుచున్నవి, కపింజలాది సంహితలు కొన్ని ఆరాధన మార్గములను బోధించును. పురుషోత్తమ సంహితలో నూతన విగ్రహ ప్రతిష్ఠలకు సంబంధించిన విధానము లన్నియు విపులముగా గలవు. విష్ణు సంహితలో – విష్ణు దీక్షాపరాయణులగుట, అర్చనాది విధానములు, ఉత్సవములు, ప్రాయశ్చిత్తములు, ధ్యానాదులు, కామ్యకర్మ సాధనములు మొదలగునవి బోధింపఁబడును. విష్ణుతిలక సంహితలో – మహామంత్రోపాసనలను, ముఖ్యముగా అష్టాక్షరీ మహామంత్ర పురశ్చరణాదికము, దానికి వలయు నియమములు మున్నగునవి తెలియనగును. పరాశర సంహితయు మంత్రశాస్త్ర గ్రంథమే. ఇది వివిధ మంత్రములు, పురుష సూక్తాదులకు పురశ్చరణాదికములు, కేశవాది చతుర్వింశతి మూర్తులకును – ఇతర విష్ణుపరములగు అనేక మంత్రములకును జపాదికముల నెఱింగించును. దేవాలయ మెట్లుండవలయును? అర్చకులెందఱు? వారికి జీవనోపాధి యెట్లు? ఈ మొదలగు ఆలయ పరిపాలనా విధానములు, వాని లక్షణములు పరమపురుష సంహితలో నిరూపింపఁబడినవి. అహిర్బుధ్న్య సంహితలో – నారాయణాస్త్రమును సాధించుట, వివిధాస్త్రములు సుదర్శనమున కంగములుగానైన విధానము ఈ మొదలగు విషయములు కాననగును. సృష్టి క్రమ విధానములు కూడ ఇందు రమణీయముగ వర్ణింపఁబడినవి. శ్రీమద్రామాయణమున విశ్వామిత్రుఁడు శ్రీరామ లక్ష్మణుల కుపదేశించిన మహాస్త్ర సాధనము లన్నియు ఇందు గలవు. గారుడ సంహితలో – వైనతేయ సాధనము, విషవైద్య చికిత్సా విధులు విపులీకరింపఁబడినవి. భారద్వాజ సంహిత ముఖ్యముగా ప్రపత్తియోగమును ప్రతిపాదించును. జయాఖ్య సంహిత సర్వ విషయములను సంగ్రహముగాఁ దెలుపును. పాద్మ సంహిత సృష్టి క్రమాదులను, సర్వద్వీప – ద్వీపాంతర విషయములను వర్ణించును. ఈ పాద్మ సంహితలో అమూల్య విషయము లనేకములు గలవు. సర్వవిషయములను ఇది సూచించును. ఈ సంహితను అధ్యయనము చేయనివారి ఆగమజ్ఞానము అసంపూర్ణమే యగును. ఇట్లు సంహిత లన్నియు అనేక విషయములను బోధించుచున్నను, ముఖ్యముగా విష్ణుపరములైన సకలారాధములను, మంత్రోపాసనా విధానములను, విగ్రహ ప్రతిష్ఠలను, వైదికాచారములను నిరూపించుచుండును.

## పాంచరాత్రము - వైష్ణవమతము

ఇట్లు శ్రీ పాంచరాత్రాగమము భాగవత మతానుయాయులును, పరమ వైదిక శిఖామణులును, మహనీయులు నగు శ్రీ వైష్ణవులకు ప్రాణప్రదమైన శాస్త్రమని ఋజువగుచున్నది. ఈ శాస్త్రమే లేనిచో, వైష్ణవమతము లేదని చెప్పుట అత్యుక్తి కానేరదు. వైష్ణవమతమునకును, పాంచరాత్రశాస్త్రమునకును మిక్కిలి సన్నిహిత సంబంధ మున్నది. నిద్ర లేచినది మొదలు — మఱల శయ్యా నధిరోహించువఱకు నడచుకొనవలసిన విధుల నుపదేశించుట కిదియే మూలాధారము. శ్రుతి స్మృతులలోని విషయములు సర్వవర్ణసామాన్యములు. శ్రీ వైష్ణవమతదీక్ష, లేక పంచసంస్కారము, విష్ణ్వారాధన విధానములు, మహామంత్ర పురశ్చరణాదికములు మొదలగు విషయము లన్నియు పాంచరాత్రశాస్త్రమునుండియే గ్రహింపవలసియున్నది. విష్ణుభక్తుల నిత్య నైమిత్తిక కామ్యముల కిదియే కల్ప వృక్షమైనది. ఈ సంహిత లన్నియు ముఖ్యముగా - ఆచార, అనుష్ఠాన, ఆరాధన విధానముల బోధించుట కేర్పడినట్లు వానిని బాగుగా నవలోకించినచో నవగతము కాఁగలదు. ఈ యాగమ గ్రంథములలోని మిగిలిన విషయము లన్నియు, పై వానికే పుష్టిని గల్గించుట కేర్పడినవని గ్రహింపనగును. ఆచారానుష్ఠానములు రెండును ఆరాధనకు పుష్టి నిచ్చును. ఇట్టి శ్రీ పాంచరాత్రమతవైభవ మంతయు, శ్రీమన్నారాయణుని దివ్యచరణారవింద సంసేవలో, సందర్శనములో విలీన మగునని తెలియనగును.

౧. ఆచారము ౨. అనుష్ఠానము ౩. ఆరాధనము అను మూఁడు ప్రధాన విషయములలో మొదటిది యగు ఆచారమున, శ్రీ వైష్ణవులు నిర్వర్తించవలసిన స్నాన సంధ్యాది నిత్యనైమిత్తికాది విశేష విధు లన్నియు ఇమిడియున్నవి. వీనిని బోధించుట కీ శాస్త్రము కొంత విస్తరించినది.

## ఆలయములు - ఆరాధకులు

మంత్రానుష్ఠానములేని మానవజీవితము వ్యర్థము. మంత్రజపములేని అర్చకుని యారాధనము ఫలశూన్యము. అతఁ డారాధించు విగ్రహమునందు దైవశక్తి శిళవిషాణప్రాయము. మంత్రోపాసనాపరుఁడై, నియమపూర్వకముగా దేవతారాధనముచేయు మహనీయుని కుటీరముగూడ శ్రీరంగాది దివ్యక్షేత్రముల కంటెను మహా మహిమోపేతముగా విలసిల్లుచుండును. ఆచారహీనులై,

దంభాదులకు మంత్ర పురశ్చరణలు చేయుట నిరర్థకము. ఆరాధనము విధి విధానముగా ఒకే వ్యక్తిచే, కనీసము ఏకకాలమందైనను చేయఁబడుచున్నచో, అది విశేషఫలవంతము కాఁగలదు. పూఁట కొక అర్చకుఁడు మారుచు చేయఁబడు ఆరాధనము కేవల కార్యక్రమము నిర్వర్తింపఁబడినట్లు తృప్తినొందుటకేగాని, ఆలయ మహత్త్వమునకును, ఫలసిద్ధికిని సాధకము కాఁజాలదు. నియమ పూర్వకముగా జప ధ్యానములు సల్పుచు, ఆచారవంతుఁడై, అర్చకుఁడు ఆలయమున ఆరాధన చేయుచున్నచో, అట్టి – ఆలయమందు మట్టిముద్దను నిల్పినను, అది మహా మహిమోపేతముగాఁ గన్పడగలదు. అట్టి దేవతామూర్తులను అచంచల భక్తిభావముతో మూఁడు దినములు సేవించినచో – స్వప్న సాక్షాత్కారాదులను పొంది, అభీష్టసిద్ధిని బడయగలరు. ఆచారవంతుఁడును – మంత్రోపాసనాపరుఁడును నగు అట్టి యర్చకుని ఆశీర్వాదబలముచే, దేశము సుభిక్షమై, శాంతి సౌఖ్యములతో విలసిల్లగలదు. విగ్రహము లోహమైనను, పాషాణమైనను, పూజా బలముచే - తపోబలముచే - దైవశక్తికి కేంద్రము కాఁగలదు.

"అర్చకస్య తపోయోగాత్ పూజాయాశ్చాతి శాయనాత్
ఆభిరూప్యాచ్చ బింబస్య సదా సన్నిహితోఽస్మ్యహమ్."

అర్చకుని తపోబలముచేతను, అత్యధిక పూజాబలముచేతను, విగ్రహము శుభలక్షణము గల్గియుండుటచేతను అచ్చట సన్నిహితుఁడనై యుండగల 'నని భగవానుఁడు స్వయముగా వక్కాణించియున్నాఁడు.

## ఆలయములు - పరిపాలకులు

దేవాలయములు పై రీతిగా మహిమాన్వితములు కావలెనన్నచో, దైవ భక్తిగలిగిన ధర్మకర్త లుండుట యవసరము. కాని, నేఁటివలె కేవలము పదవులకు ప్రాఁకులాడువారి సంఖ్య అధికముగా నున్నంతవఱకు – ఆలయములు లేశమైనను అభివృద్ధి నొందఁజాలవు. ఆలయపరిపాలకులకు వలయునది ఆగమజ్ఞానముగాని, ఆంగ్లభాషావిజ్ఞానము కాదు.

## అనుష్ఠానము - ఆరాధనము

ఆరాధకులు ప్రథమమున ఏ యే మంత్రముల నెట్లు సాధించి వశ మొనర్చుకొని సిద్ధులు కావలయునో, ఆ విధానము లన్నియు పాంచరాత్రశాస్త్రమున

కాననగును. దేవాలయమున ముఖ్యమైనవి మంత్రానుష్ఠానము; ఆరాధనము. ఇవియే భక్తుల యభీష్టములఁ దీర్చుటకు సమర్థము లగును. మిగిలిన ఉత్సవాది కార్యక్రమము లన్నియు దేవాలయమునకు పవిత్రత నాపాదించుటకును, ప్రజానీకమును పరమార్థమునకు అభిముఖము చేయుటకును ఏర్పడియున్నట్లు తెలియనగును.

మంత్రముల నెట్లు జపింపవలయును? ఎన్ని పర్యాయములు జపింపవలయును? మంత్రసిద్ధికి గుర్తు లెవ్వి? మంత్రము లేయే కార్యములను సాధింపగలవు? మంత్రజపములు చేయువారికి సంభవించు విఘ్నము లెట్టివి? దీక్షాభంగమైనచో ఎట్టి ప్రాయశ్చిత్తము చేసికొనవలయును? ఈ మొదలైన విషయములను పాంచరాత్రశాస్త్రము విశదముగా నుపదేశింపఁగలదు. మంత్రానుష్ఠానపరులై, శాస్త్రజ్ఞానశూన్యులగు కొందఱకు గల్గిన దివ్యానుభూతులకును - పాంచరాత్ర శాస్త్ర ముపదేశించిన విషయములకును సమన్వయ మేర్పడినందున, ఈ శాస్త్రమును మహర్షులు బాగుగా పరిశోధించిరనియు, వారి యనుభవమును పురస్కరించుకొనియే మన కిట్లు బోధించిరనియు విశ్వసించుట కవకాశము గల్గుచున్నది. ఈ విధముగా అనుష్ఠానమునకై ఈ శాస్త్రము కొంత విస్తరించినది.

ఆలయమున నన్నింటికంటెను ముఖ్యమైనది ఆరాధనము. యోగము, ధ్యానము అను ప్రక్రియలకంటెను విలక్షణమై, సజీవమై, సార్థకమై, నయనానందకరమై, లౌకిక సాధనములతో చేయఁబడుచు, పండితులకు - పామరులకు - అందఱకు అలౌకికానందమును గల్గించునది అర్చనావిధానమే.

## సగుణోపాసనము - ప్రయోజనవిశేషము

నిరాకారుఁడగు ఈశ్వరుని ప్రార్థించుట ఎన్నటికిని పొసగదు. నిరాకారుఁడగు ఈశ్వరుని ప్రార్థించు హైందవేతరులకు దైవసాక్షాత్కారము పరమ దుర్లభము. ఈశ్వరుఁడు నిరాకారుఁడైనను భక్తజనులకొఱకు సాకారుఁ డగుచున్నాఁడు. అతఁ డెట్టి యాకారములను ధరించునో, అట్టి యాకారములకే మహర్షులు చక్కని ప్రార్థనలఁ గల్పించిరి. అట్టి రూపముల నర్చించుటయే సగుణోపాసనము. భారతీయ సంస్కృతిలో – సగుణ నిర్గుణోపాసనలు రెండును సమానములే. నిర్గుణోపాసనము జ్ఞానులకు మాత్రమే సుగమము; ఫలవంతము

నగును. సకలజనులకును సగుణోపాసనయే పరమప్రధానము; పరమప్రయోజన కరము. ఆగమములు సగుణోపాసనకే ప్రాధాన్యము నిచ్చియున్నవి. విష్ణ్వా రాధనమే పాంచరాత్ర శాస్త్రాంతర్గత పరమ రహస్యము. విష్ణ్వాలయములం దంతటను దక్షిణ భారతమున ముఖ్యముగా శ్రీ పాంచరాత్రగమ విధానము ననుసరించియే ఆరాధనములు జరుగుచున్నవి. భద్రాచలమునందలి యారాధన ననుసరించి ఆంధ్రదేశమున కొన్ని ప్రాంతములందును, హైదరాబాదు పరిసర ప్రాంతములలో చాలవఱకును అర్చనావిధానములు జరుపఁబడుచున్నవి. వైఖాన సాగమము ననుసరించి తిరుపతి మొదలగు కొన్ని పుణ్యక్షేత్రములలో ఆరా ధనములు జరుగుచున్నవి. ఇట్లు విభిన్నారాధన విధానములకు ఆలయములు కావలయును. విగ్రహములు కావలయును. దీనికై. ఆలయనిర్మాణయోగ్య ప్రదేశము, నిర్మాణవిధానము, వాస్తువిషయములు, శిలాపరీక్షలు, భూపరీక్షలు, శిల్పశాస్త్ర విషయము లనేకము లుద్భవించినవి. వీనిని విశదీకరించుట కీ శాస్త్రము విశేషముగా విస్తృతిఁ జెందినది.

## పాంచరాత్ర శాస్త్రము – దేశాభ్యుదయ సాధకము

ఈ పాంచరాత్ర శాస్త్రము దేశాభ్యుదయమును సాధించుటలో మిగుల సమర్థనీయమైనది. భారతీయ వైదిక ధర్మమందు బ్రహ్మ - విష్ణు - మహేశ్వ రులకును, శక్తికిని గొప్ప స్థాన మున్నది. బ్రహ్మకు ఆరాధనమే నిరసింపబడినది గనుక, ఆతనిఁగూర్చి విచారింపవలసిన యవసరమే లేదు. మహావిష్ణు - పరమేశ్వ రులకు లక్ష్మి - పార్వతీ రూపములతో శక్తి సూత్రబంధము చేయఁబడుచున్నది. ప్రత్యేక స్వరూపముతో నారాధించుటయు సంప్రదాయమైనది. కాఁబట్టి, వైష్ణ వాగమములను శక్త్యాగమములను పరిశోధించుట, సంరక్షించుట అత్యావశ్య కము. జైన - బౌద్ధములకును ప్రత్యేకాగమము లున్నవి. అవి వారిచే సంరక్షించుకొనఁబడుచున్నవి. వైదిక ధర్మవేత్తలు శివాలయములందు శైవా గమములను, శక్తిక్షేత్రములందు శక్త్యాగమములను చక్కఁగా గ్రహించి, ఆరా ధించి, బోధించువారుండి, ఆ శాస్త్రములు లుప్తములు గాకుండునట్లు చేయ వలసిన భారము రాష్ట్రనాయకుల, రాష్ట్రమహాజనుల భుజస్కంధములపై నున్నది. వారీ ధర్మసంరక్షణకై బద్ధకంకణు లగుదురు గాక!

ఈ శాస్త్రములలో ఉత్తమోత్తమమైన పాంచరాత్రాగమము మన భారతీయ సంస్కృతికి ఆత్మభూతమైనది. భారతీయ నాగరికతకు పరాకాష్ఠ యనఁదగిన మూర్తిపూజావిధానముల బోధించు వానిలో నత్యుత్తమమైనది. మనుజులు లేకున్నచో గృహమునకు శోభ కలుగదు. ఆలయము లేకున్నచో గ్రామమునకు సౌందర్యము లేదు. గ్రామమునకు, దేశమునకు ఆలయము ఆత్మవంటిది. యంత్రశాలలు భౌతికశక్తికి కేంద్రములైనట్లు—ఆధ్యాత్మికశక్తికి ఆలయములే బలమైన కేంద్రములు. భారత జాతీయ జీవనమున ఆధ్యాత్మిక శక్తికిఁ గల స్థానము ప్రజ లందఱకును సుస్పష్టమే. ఆలయములు నూతన దృష్టితో పునర్నిర్మింపఁబడనిచో — భారత జాతీయ జీవనము కలుషితమై, పాశవిక నాగరికతకు పరుగు లిడగలదు. పానశాలలు, వినోదశాలలు, కేళీమందిరములు ఉత్తమ సంస్కృతీ నిర్మాణమునకు, సాధనకు హేతుభూతములు కాఁజాలవు. విద్యావంతులు, విజ్ఞాననిధులు, పండితప్రకాండులు నగు వారెట్లో ధర్మైకపరాయణులు కానే కాఁగలరు. కాని, నూటికి ఎనుబది వంతులు గల నిరక్షరకుక్షులును - జ్ఞానదూరులు నగు పామర - స్త్రీ - బాలాదులను ధర్మనిష్ఠము చేయుటకు దేవాలయమే దివ్యమగు ప్రాచీన సాధనము. ఇతర మతస్థులు, విదేశీయులు అనుసరించని వినూతన విధానములతో మన దేవాలయములు శోభిల్లుచుండును. సమున్నతములైన శిఖరములతోడను, మహోత్తుంగములైన గోపురాగ్రములతోడను, నవంనవములైన శిల్పవిలసిత ప్రాకార కుండ్యాంతర్భాగ స్తంభాది వివిధాకృతులతోడను, రత్నఖచిత సువర్ణాభరణధారులై జీవకళలతో నొప్పు దివ్యసుందరములైన దేవతా మూర్తులతోడను తేజరిల్లు దేవాలయములను గాంచినప్పుడు ఎవ్వని యాత్మ ఆనందకందళితము గాకుండును?

## దేవాలయములు — ధార్మిక దుర్గములు

వేదఘోషలకును, పురాణశ్రవణములకును, హరికథా కాలక్షేపములకును, భరతనాట్యములకును, శాస్త్రప్రసంగములకును, వివిధ మహోత్సవములకును, శ్రవణానందకరములైన సంకీర్తనములకును, రుచ్యములగు దేవతాప్రసాదములకును, భక్తుల యావేశములకును నిలయమై, సంసారదుఃఖసంతప్తులగు మహాజనములకు ఆత్మసంతర్పణ మొనరించుచు, ఆధ్యాత్మిక శిక్షణ గఱపుచున్న దేవాలయముల మహామహిమను సహస్రఫణాన్వితుఁడగు శేషుఁడైనను సమర్థముగా వర్ణింపఁజాలఁడు. ఇట్టి దివ్యాదర్శములతో ఈ యాలయమును మనకు ప్రసాదించు పాంచరాత్రశాస్త్ర మెవనికి శిరోధార్యము గాకుండును?

రాజువలె బోధించు వేదములును, హితులవలె బోధించు పురాణాదులును మానవులలో ధర్మప్రవృత్తిని సులభముగా గల్గింపఁజాలవనియే మన పూర్వులు వ్యంగ్య వైభవముగల కావ్యమార్గము నాశ్రయించియుండిరి. అట్లే, కేవలము విరక్తులగువారికి మాత్రమే సాధ్యములగు జప ధ్యాన యోగాదులు సామాన్య ప్రజానీకమునకు ఉపయుక్తములు కాఁజాలవనియే మన పూర్వులు చక్కని శిల్ప నిర్మాణములతో - మహోత్సవములతో నేత్రేంద్రియములను, హరికథలతో - సంకీర్తనములతో శ్రవణేంద్రియములను, ప్రసాదాదులతో జిహ్వేంద్రియములను, హోమ ధూమ గంధములతో - పుష్పమాలికా పరిమళములతో నాసికేంద్రియ ములను, మందమారుతములతో - ప్రశాంత వాతావరణములతో త్వగింద్రియము లను ఆనందము నొందించుచు, పంచేంద్రియతర్పణ మొనరించి, బాహ్యావ్యాపార ములనుండి వానిని బంధించి, ఆధ్యాత్మికమార్గ పురోగాములుగా నొనర్చి, దైవ భక్తిని పెంపొందింపఁజేయు దేవాలయములను మనకు ప్రసాదించియున్నారు.

## ఆలయ భేదములు – ప్రభావ విశేషములు

దేవాలయములు దేశమున నేఁడు మూఁడు విధములుగా గనఁబడుచున్నవి. అవి - శక్త్యాలయములు, శివాలయములు, విష్ణ్వాలయములు. ఇందు శక్త్యా లయములు మద్య మాంసాదుల కాకరములై, శిష్టజనులకు జుగుప్సావహములఁ గల్గఁజేయుచున్నవి. శివాలయములు ఆకర్షణ శూన్యములై, ప్రతిభా రహిత ములై, ఉత్సవాదులులేక జీవకళ దక్కియున్నవి. ఇఁక ప్రధానముగా విష్ణ్వా లయములే ప్రజల నాకర్షించుటలో సమర్థములై, అత్యంత ప్రతిభాసంపన్నములై యలరారుచున్న వనుట అతిశయోక్తి కానేరదు.

రాజునకును, రాష్ట్రమునకును వృద్ధి గోరుచు, బ్రహ్మఘోషలు పలికి – 'సర్వే జనా స్సుఖినో భవన్తు' అని స్వస్తివాచకములు చెప్పుచు, ఆలయములు ప్రజలతో - రాష్ట్రములతో - తమ సంబంధమును దృఢతర మొనర్చుకొనుచున్నవి. ఈ యాగమములు, ఈ యాలయములు లేకున్నచో – మన విజ్ఞానము, కళలు, ధర్మములు, మతాచారములు, జాతీయత నష్టప్రాయములై యుండెడి వనుట నిర్వివాదాంశము.

శ్రీరంగాది పుణ్యక్షేత్రములు మన జాతీయైక్యతాబంధములను దృఢతర మొనర్చినవి. ఆలయములలో శిల్పము, నాట్యము, భాషలు, శాస్త్రములు,

వేద పురాణాదులు పోషింపఁబడినవి. ఆలయములలో సంస్కృత పాఠశాలలే లేకున్నచో, యేనాఁడో దేవభాష నష్టమై యుండెడిది. మన భవిష్యత్తును తీర్చి దిద్దుటకై ఆలయములు గొప్పగా సేవఁజేసియున్నవి. అట్టి యాలయములను ప్రవర్తింపఁజేయు సూత్రములే మన పాంచరాత్రాగమములు. కాని, నేఁడీ శాస్త్ర నిపుణులు తమ భవిష్యత్తుపై దివ్య స్వప్నములు గాంచలేకున్నారు. పర భాషాంగనా వ్యామోహ విషబంధములనుండి భారతీయ మహాజనుల దివ్యాత్మకు విముక్తి లభింపనంతవఱకును ఈ దుర్దశ మనకు తప్పదనియే భావింపవలసివచ్చుచున్నది. యావద్భారత ప్రశస్తిగల ఈ పాంచరాత్ర మహావృక్షము సర్వకాల సర్వావస్థలయందును నిరాబాధమై జీవించుగాక!

## కృతజ్ఞత

శ్రీ యామున - రామానుజులు, వేదాంత దేశికాది మహనీయులు, పిళ్ళలోకాంజీయరు మొదలగు ప్రవక్తలు, తాతాచార్య - రామానుజాచార్య - రంగభట్టాది మహా విద్వాంసులు, డాక్టర్ - యఫ్. ఆటోస్ర్కాడరు మున్నగు పాశ్చాత్య విద్వాంసులు, నృసింహ భట్టరు, అళహసింగరుసూరి, శ్రీ వైకుంఠ దీక్షిత, వైద్యనాథ దీక్షిత వైదిక సార్వభౌమాదు లనేకులు ఈ మహాశాస్త్రమును బాగుగా పరిశోధించి, ఎల్లఱకు సులభముగా బోధపడుటకై వ్యాఖ్యానములు. ప్రయోగ గ్రంథములు, దీపికలు, భాష్యములు మున్నగువానిని రచించి, ఎంతయో మహోపకారము గావించియున్నారు. వారి కీ సందర్భమున కృతజ్ఞతఁ దెల్పుట మన విధియై యున్నది

## నివేదన

ఈ రీతిగా – దేశమునకు, జాతికి, సంస్కృతికి, మతమునకు పరమ ప్రయోజన సాధనమైన ఈ పాంచరాత్ర శాస్త్ర వైభవము నెల్లఱును గ్రహించి, ఐహికాముష్మిక సుఖసాధనకై శాస్త్రము నుజ్జీవింపఁజేసి, లోక కల్యాణ సంధాయకు లగుదురుగాక!



# భక్తియోగప్రభావము

'కవిరత్న - కవిశేఖర - సుధీమణి'

శ్రీమాన్ గుదిమెళ్ళ రామానుజాచార్యులు

'భక్తి నివేదన పత్రిక' సహాయ సంపాదకులు.

* * *

శ్రీ రమణీయహార! మునిచిత్త విహార! మయూరపింఛకో
టీర! సురాసురేంద్రమకుటీతట దీప్రపదాంబుజ ప్రభా
వార! సుమేరుధీర! శ్రితపాపధరాధ్ర శతార! భక్త మం
దార! పరావతార! విబుధద్విటిలాజకుఠార! గోపికా
జార! యదుప్రవీర! విలస త్కరుణామృత వృష్టిసించితా
క్రూర! శ్రుతిస్ఫుర న్మకరకుండలహీర! సహస్రమన్మథా
కార! వ్రజాంగనా సమితి క్రమతరాంశుకచోర! శ్రీ యశో
దా రమణీకుమార! నిహతస్మయ కాళియభోగిభోగ సం
చార! శర న్నిశాసమయసాంద్రతుషార మయూఖచంద్రికా
సార జడీకృతప్రకృతి శాద్వలసైకతలబ్ధ రాస శృం
గార! కళిందజా కృ దవగాహవిధాచ్యుత వత్సచిహ్నితా
భీర! వధూకుచాగ్ర సురభిస్ఫుట కుంకుమపత్రభంగ సం
భార! భవాంధకార వినివారణసూర! సమస్తసద్గుణా
ధార! విలాసభావదయితాకరకీలిత కర్ణపూర! వం
శీరవ మాధురీ పరవశీకృత గోపకిశోర! సాంధ్యవే
ళా రభసప్రధావన ఘలంఘలరావ సువర్ణకింకిణీ
చారు సుకంఠ ధేను ఖురసంకులధూత రజోవిశేష రే
ఖా రుచిచిత్రఫాలఫలకచ్యుతకుంతలభార! ద్రౌపదీ
ఘోర విపన్నివార! నవగోపవధూ మధురాధరామృతా
హార! గభీరసార! సమరాంగణశూర! ఫలానుమేయ సం
స్కార! కళోల్లస త్తులసికాదళదామ నిగూఢపుష్పమా
లా రమణీయ సౌరభమిళి న్మకరంద రసాతిలోభ దు
ర్వార సమాగమ భ్రమరపంక్తిచలద్వన మాలికాప్రభా

పూరిత కౌస్తుభాభరణ ముగ్ధభుజాంతరసక్త సత్యభా
మా రమణీమణీహృదయమార! రతాంతనితాంతతాంత రా
ధా రతికృ త్సమీక్షణసుధారస సంచితతార! మిత్రవిం
దా రచితోపహార! సురదాపరిరంభణవైఖరీ మహో
దార! విదర్భభూపతిసుతాకలిత ప్రపదోపచార! భ
ద్రా రదనచ్ఛదామృత సురారసపాన విశేషవిస్మృతా
న్యారతిసార! మందహసనాదృత జాంబవతీ సతీ నమ
స్కార! నిషేవిత ద్యుమణిజా ఝర శీతలతీర! లక్షణా
ధార! శ్రుతిప్రచార! సుమనోజనసంకలితోపకార! కు
బ్జారచితాంగ పరివర్ధితకామవికార! రత్నకే
యూర! కుచేలసంస్కృతి మహోత్సవకార! నమో నమోఽస్తుతే.

* * *

పండితులార! శ్రీ పరమభాగవతోత్తములార! మీకు ప
ల్లాండు - హాయాననుండు సువిలక్షణ మొప్పు మదాత్మవీథిలో
తాండవమాడుచునుండ లలితమ్మగు శైలి నుపన్యసింపఁగా
నుండితి భక్తివైభవము - మదుక్తులు మీరలు సైపకుందురే?

వినుఁడిఁక ప్రకృతాంశంబును
ప్రణుతింతురు భక్తియన్న - 'భజ సేవాయాం'
మను ధాతువుంటఁ గల్గిన
దని విజ్ఞులు బల్కుచుందు రది సత్యమ్మౌ.

కావున - భక్తి సేవయని ఖ్యాతివహించిన దిట్టిసేవచే
సేవితుఁడైనవాఁ డటుల సేవయొనర్చెడువాఁడు కూడ ల
క్ష్మీవిభుఁ డీ ప్రకారముగఁ జెప్పుటకేమి ప్రమాణమన్న - గీ
తావచనంబె; చూడుఁడు - 'తథైవ భజామ్యహ' మన్నశ్లోకమున్.

ఈదృశభక్తి శూన్యమగు నేదియు కర్మమె కాదు - జ్ఞానమే
కాదు - త దన్యమేదయినఁగాని ఫలింపదు - జ్ఞాన కర్మ సం
పాదితభక్తిచేత భగవంతుఁడు గోచరుఁడౌ - పరానురా
గోదయ మంబుజాక్షుపయి నుండినచో నదె భక్తినాఁబడున్.

ప్రతిఫలమం దపేక్షను సవాసనగా విడనాడి - ప్రేమతో
సతము పరాత్పరున్ దలచి సల్పెడుసేవయె భక్తిగాన - దు
ర్మతు లిట సేవ నీచ మనుమాట నిరస్తము - తైలధారతో
ప్రతియగు గొప్ప సంస్కృతిపరంపరయేసుమి భక్తియన్నచో!

తాను దివానిశంబులు గదాధరుఁ బ్రేమ పురస్సరంబుగా
ధ్యానము సేయుచుండిన మహాత్ములు దానినె భక్తియందు ర
ద్దానినె ప్రాజ్ఞులెల్లరును తత్పరిచారక దాస దాస దా
సానుచరైకదాసచరమావధిదాసులుగాఁ దలంచుటల్.

జ్ఞానముకాని - కర్మములుకాని - సమాధులుగాని - యాగమే
గాని - తపంబుగాని - వ్రతకాండముగాని - పవిత్రతీర్థముల్
గాని సమానమెన్నటికిఁ గావు నిజంబుగ భక్తితో — 'న దా
నేన' 'న మేధయా' యనుట నిక్కము తత్త్వము పాఱజూడఁగన్.

ఉత్తమమైనబుద్ధి స్వకులోచితరీతి సమస్త నిత్యనై
మిత్తికకర్మముల్ ఫలముమీద నపేక్షనువీడి, యీశ్వరా
యత్తములంచుఁ జేయ నిహతాఖిల పూర్వభవార్జితాఘమై
చిత్తము పారిశుద్ధ్యమును జెందుఁ గ్రమంబుగ సత్త్వసంపదల్.

తాదృశసత్త్వవృద్ధి నిభృతంబగు చిత్తముతోడ - ఆత్మసం
వేదనపూర్వకంబుగ స్వభిన్నహృదంతరభాసమాన ల
క్ష్మీదయితా మనోహరుని జింతనొనర్చుచు జ్ఞానయోగ మీ
మాదిరి నిష్ఠనుండినఁ గ్రమమ్ముగఁ జెందు విరాగభావమున్.

ఆవిధి జ్ఞానయోగమున నబ్జిసుతాహృదయేశుఁ దైలధా
రావ దఖండ సంస్మృతి పరంపరతోడ దివానిశంబులున్
భావనసేయుచున్న నదె భక్తియనంబడు నిట్టియోగమే
పావన మన్యయోగము లపారపరిశ్రమసాధనీయముల్.

ఈదృశభక్తియోగముననే గద మున్ను విభీషణుండు, ప్ర
హ్లాదుఁడు, శ్రీగజేంద్రుఁడు, గుహప్పెరుమాళ్ళును, అంబరీషు డి
త్యాదులు ముక్తినొంది రొకరైనను బూనిరె జ్ఞానకర్మ సం
పాదనకై శ్రమంబు? సులభం బిది దేహికి భక్తియున్నచో.

కావున - భక్తియోగమున కన్న తరింపఁగ గోరువారి కే
త్రోవయు నింక లేదనుచుఁదోచు మనంబున - ఇట్టిభక్తికై
జీవుఁ డిఁకేమిసేయవలె? చేసినచో ఫలమేమియన్న - మే
లౌ వచియింతు నీ విషయమంతయు - శ్రద్ధగ నాలకింపుఁడీ!

జంతువులందు మానవునిజన్మ నిజంబుగఁ బొందుటన్న న
త్యంతము దుర్లభంబు - మన మందఱ మింతకుఁబూర్వ మెన్నియో
న్యంతర వాసయాతనల నందితిమో! పరమాత్మ సత్కృపా
వంతుఁడుగాన, నేటికొక ప్రక్కకు లాగె సహేతుకంబుగన్.

అరయ జ్ఞానమన్న విషయంబు మనుష్యున కుండదేని -
ఆహారము, నిద్ర, మైథున, భయంబులు కల్గిన జీవకోటిలోఁ
జేరిన రెండుకాళ్ళుగల జీవముకన్న విశేషమేమి? కా
నీ రుచిరాత్ములార! పశువేసరి వీనికిమించి కొన్నిటన్.

"ఏ ననఁగా నెవండ? నిఁటకెచ్చటనుండి ప్రయాణమైతి? నా
స్థానము పూర్వమేడ? యిట జన్మమునెత్తగ హేతువేమి? నా
మే నని దీనినందుగద! మేనికి నాకు విభేదమేమి? యీ
క్షోణితలంబునం దెచటఁజూచినఁ గన్పడు మోదఖేదముల్?

ఈ విధిఁబుట్టుచుండుటయు - నెప్పటికప్పుడె చచ్చుచుంట - ఈ
జీవుఁడు గమ్యమౌపథము సేరుట యెన్నడొ? యెన్నడబ్బె నా
కీ విడదీయరాని జని? మృత్యుపరంపర యెప్పు డంతమై
పోవునొ?" యీ విచారమును బొందుటయేసుమి జ్ఞాన మన్నచో.

అపహతపాప్ముఁడై - విజరుఁడై - అపిపాసుఁడునై - విమృత్యుఁడై -
అపగతశోకుఁడై వెలయు నాత్మ తనంతట దా ననాదిగా
నెపు డిట జిక్కెనో ప్రకృతినెట్లు తదాది ననేకయోనులం
దపరిమితంబుగా పుటుక లందుచునుండె సహస్రరీతులన్.

పారములేని యీ ప్రకృతిబంధముతో జని మృత్యురూప సం
సారమునందు జీవుఁడు - విచారణసేయఁగ, పంజరంబులో
దూరిన రామచిల్కవలె - మోసముసేయఁగ 'బందిఖానలోఁ'
జేరిన చోరునకైవడిగ జిక్కెనహో! మును దుస్స్వతంత్రతన్.

పాయఁగరాని యీ ప్రకృతిబంధముతో విడనాడియుండుటే
ధీయుతులంద్రు ముక్తియని - దీనినె మోక్షముగా వచింతు రీ
హేయపుమాయ దాటగలఁడే యెవఁడేనియు? సర్వకాల వి
స్ఫాయ దఖండభక్తి భగవంతుని దాను భజింపకుండినన్!

కావున — ముక్తి, మోక్షమనఁగా విడిపోవుట - దేనినుండి? యీ
చావులు పుట్టుకల్ గలుగు సంస్కృతిబంధమునుండి - యెవ్వ రీ
జీవుఁ డదెట్లు సాధ్యమగు? శ్రీహరిగూర్చి నిరంతరంబు సం
భావనయున్న నందు రదె భక్తిగ - దానికి లాభమేమనన్ —

ఆ కనుపించు చక్రమున - ఆకులలో తొలియా కదేదియో
వాకొనఁగా నశక్యమగు వైఖరి జీవుఁ డనాదికర్మచే
స్వీకృతుఁడయ్యె నెన్నఁడో! వచింపఁగ వే రది దానిచే నసం
ఖ్యాక శిలాతృణాది వివిధాద్భుత జన్మల నెత్తుచుండఁగా —

ప్రలయములోన స్వర్ణశకలంబులు మైనపు టుండలోపలన్
గలయువిధాన, ఈ ప్రకృతిగర్భములోఁబడి - నామరూప సం
చలనములేక జీవులు విచారమునన్ దపియించుచుండ - వా
రలపయిఁ జూపు సత్కృప పరాత్పరుఁ డున్నటులుండి యెన్నఁడో —

మరల ప్రపంచసృష్టిని క్రమంబుగఁజేయుచు - ఊర్ణనాభినా
కరణ కళేబరాదులనుఁ గల్పనసేసి యొసంగి - శాస్త్రముల్
గరపి - హృదబ్జపీఠమున కాపురముండి - సమస్తజీవులన్
సరిగ తనంతవారినిగ సల్పఁగఁజూచు ననేకరీతులన్.

అవయి సాధనాంతరములందు ప్రధానము భక్తి - దానిచే
పాపపు పంచభూతమయ బంధమునుండి విముక్తి నెంది, ని
క్షేపమువంటి మోక్షమునుఁ జెంది, పరాత్పర సన్నిధాన గో
ష్ఠి పరిపూర్ణ సౌఖ్యమునుఁ జెందుటయే సుమి ముఖ్య మాత్మకున్.

సగుణము నిర్గుణంబనుచు చర్చలుసేయ వృథా శ్రమంబు - శ్రీ
నిగమములున్ తదంతము లనేకపురాణము లేకరీతిగా
భగవ దుదారవైభవము వాకొనుచున్నవి - దీని నింతటన్
నిగమనసేసి నే నిపుడు - నిశ్చితవృత్తము నే వచించెదన్.

కావున - మర్త్యజన్మమును గాంచినవాఁడు — 'పరాత్పరుండు, న
న్నీవిధి నుద్ధరించుటకు నెంత శ్రమన్ బడుచున్నవాఁడో! నా
కై వివిధావతారముల నన్నియు నెత్తెను - నేనె వాని సం
భావనసేయనైతి'నని భావనమం దిటులెంచగావలెన్ —

'ఎత్తితి నీచజన్మముల నెత్తగనుంటి పునర్భవంబు గొం
క్రొత్తగ - నొక్కనాఁడయిన, కోరికతో నొకసారియైన నా
చిత్తము మాధవార్పణము సేయఁగనైతిని - కాలమంతయున్
రిత్తగజారె - ఎన్నడు తరింతును? నాకు శరణ్య మెద్దియో!

భాగవతాపచారము లపారము లార్యులసేవలేదు - యే
యోగము సేయనైతిని - కులోచితవృత్తిని మంటగల్పి, దు
ర్భోగసముద్రవీచికల మున్కలువేయుచు నీదు సన్నిధిన్
సాగిల వందనంబయిన సల్పగఁబోయితి నొక్కసారియున్.

నారకబాధలన్ దలచి నా హృదయంబు నిరంతరంబు దు
ర్వార భయంబునందె - ఇఁక, పాశములన్ బడగట్టి కింకరుల్
క్రూరముఁగా గళల్ నడిపి కూలగద్రోతురు రేపొ మాపొ - దు
స్సారభపూర్ణవైతరణిఁ జచ్చుట దేహికి నిత్యమేగదా!

పాడు కఫంబు కంఠమునుబట్టి వ్యధించెడువేళ - చేతులో
నాడుటలేదు నాడియని యాప్తుఁడు చెప్పెడువేళ - బంధువుల్
గోడున నొక్కపెట్టు పయిగూలినవేళ నెవండువచ్చి నా
యేడుపు నాలకించి విడిపించును త న్మృతికాలయాతనన్ ?

ఈ నిమిషంబునందు సుఖయించినవ్యక్తి యనుక్షణంబె యెం
తేని విచారమొందు - ఒకఁడిట్టె జనించు - మరొక్కఁడంతలో
ప్రాణముపీడు - ఈ ప్రకృతివైఖరి యెంత విచిత్ర మక్కటా!
మానవుఁడైన ఈ విషయమర్మ మెఱుంగఁ డదేమి చిత్రమో!

కావున, ముందు మేల్కొన సుఖంబగు - శ్రీహరిగూర్చి ద్రౌపదీ
దేవి విధానఁ బిల్చెదను - దిక్కుచలింప గజేంద్రుఁడట్టు లో
దేవర! కావవే యని యదేపనిగా మొఱబెట్టి యేడ్చెదన్
నావికుఁడౌ గుహుండువలె నమ్మి హరిన్ స్మరియింతు నిత్యమున్.

వ్రతములు సేయఁజాల - ఉపవాసము లుండగఁజాల - కర్మసం
తతుల నొనర్పజాల - ఇఁక జ్ఞానముతో నినుఁగొల్వజాల - నే
నతుల శ్రమైకసాధ్యనియమావళి నుండగఁజాల - గాని, నా
గతి పరమాత్మ నీవెయని గట్టిగ నమ్మెద నంతమాత్రమే.

నాలుకతోడ అబ్జనయనా! యని బిల్తును - చేతితోడ పు
ష్పాలను దెచ్చియిచ్చెదను - పాదముతోడ నహర్నిశంబు నీ
యాలయసీమలోన నడయాడుచునుందును - కంటితోడ నీ
లీలలు గల్గుచిత్రము నిరీక్షణసేయుదు నార్ద్రభక్తితో.

పాడుమనస్సు దుష్ప్రకృతివస్తువులన్ ప్రసరించుగాన, నిన్
జూడగనీక యడ్డుపడుచున్నది - దీని లయంబుకోసమై
వేడుచునుంటి - దీని విడిపింపకబోయిన, ఈ భవంపు దు
ష్పీడలు తప్పవెన్నడిది పీడుట కేవల భక్తిచే గదా!'

ఆ పరమాత్మయందు హృదయంబును నిల్పి, తదేకదృష్టితో
జూపుచునున్న 'ప్రేమ' మనుచుందురు దానిని 'భక్తి' యంచు - జా
రోపరిప్రేమచే నెదటనుండిన, నేమి భుజించుచున్న లో
లోపల వానిఁగూర్చి యవలోకనసేయు లతాంగిపోలికన్.

కావున, భక్తియోగమునఁగాని పరాత్మరుఁ డందరాఁడు - గీ
తావచనంబె సాక్ష్యముగదా! 'తవ దాస్య సుఖైక సంగి' త
త్పావన యామునోక్తి- 'దివి వా భువి వా' కులశేఖరుండు ని
క్లే వివరించు - భాగవత మింతకు మూలము భక్తియే గదా!

తాదృశభక్తియున్ నవవిధంబులచే నభివృద్ధినొందు - అం
దాదివిధానమే శ్రవణ మందుకుఁ గావలె సాధుగోష్ఠి - త
త్సాధనచేగదా భరతసత్కులమౌళి పరీక్షితుండు ప
ద్మాదయితాంఘ్రి నందెనుగదా శ్రవణంబున నేడురోజులన్.

జగమున సాధుగోష్ఠిగల సన్నిధికేగి వసించియున్న శ్రీ
భగవ దుదారగాథలను వాకొనుచుందు రహర్నిశంబు - త
త్సుగుణ పునఃపునశ్శ్రవణ తుందిలతన్ జిగురించుశ్రద్ధ శ్రో
త్తగ - అటుమీద ప్రేమక్రమశః పరిపాకము నెందు భక్తియున్.

శ్రవణముచేత తత్కథలు స్వాంతమునందు లగింప - ప్రేమతో
నవి పదిమందిచేరు సమయంబునఁ జెప్పుచు - వానియర్థ వై
భవము పురస్కరించుకొని పాడుచునున్న నహర్నిశంబు సం
భవమగుచుండు భక్తి - భగవంతునిమీద క్రమక్రమంబుగన్.

కలియుగమందు కీర్తనముకన్న తపంబులు, యజ్ఞయాగ ద
క్షలు, నియమంబులున్, వ్రతపుచర్యలుగాని, మరేవి శ్రీధరున్
సులభునిఁ జేయఁజాల విది సూచియెగా కులశేఖరాది భ
క్తులు హరికీర్తనంబుపయి కూరిమిసూపి తరించి రీ ధరన్!

మన మతిచంచలంబగుట - మాధవుగీర్తన మాచరింపలే
మని వచియించినన్, భగవదాలయసన్నిధి నూడ్చుటో - ప్రద
క్షిణమొనరించుటో - ఉదకసేచనమో - తులసీ సుపుష్పమా
లను రచియించుటో జరుప లభ్యమగున్ హరిభక్తి నెమ్మదిన్.

తులసియొ - పుష్పమో - ఫలమొ - తోయమొ శ్రీహరి కర్పణంబిడన్
గలుగు శ్రమంబులేకయె సుఖంబుగ సంపదలెల్ల, ఇంక వ్యా
కులత వహింపనేల? యొనగూడుటయౌను పవిత్రభక్తిరే
ఖలు హరిమీద నంచు మదిగల్గిన నిష్కలుషార్తి యెంతయున్.

శ్వాసలు ముక్కునందు బిగబట్టుటఁగాని - తపంబుసేయు నా
యాసముగాని - యాగములకై శ్రమజెందుటగానిలేక, వి
శ్వాసముతోడ నొక్కతరి స్వామిపయిన్ మన ముంచి, ధ్యానమున్
జేసినయంత, ముక్తి యరచేత లభించు నిఁకేమి చెప్పెదన్!

సానతశీర్ష భాగమున - సాంజలిబంధముగా - సగద్గద
స్వానముగా - సకంటకము సాశ్రుజలావృతదృష్టిగా - రమా
జానినిగూర్చి కీర్తనము సల్పుచునున్న సతంబు — 'కిం బహూ
క్తేన' యథార్థభక్తియని దీనినె వాకొనుచుందు రుత్తముల్.

ప్రాకృతమౌ పదార్థమునఁ బ్రాకిన ప్రేమను కామమందు ర
ప్రాకృత దివ్యదేహధరుపైఁ బ్రసరించినప్రేమ భక్తిగా
వాకొనుచుందు రేకమగువస్తువె వాడుటలో విభేదమౌ
లోకము ప్రేమమూలమున లోబడియున్నది తత్త్వమెన్నగన్.

దారసుతాది బంధువులఁ దార్కొను ప్రేమ నిరర్థకంబు - దు
ర్వార వియోగకారి క్షణభంగుర మా హరి ప్రేమయో మహా
పారసుఖప్రదంబు - నిరపాయము - కాననె ప్రేమచేత ఆ
ళ్వారులు తాము స్త్రీలనుచు స్వామిని భర్తనుగా వరించుటల్.

కామముగా నొకానొకటఁగల్గును - వైరముగాగమారు - ఈ
ప్రేమయె స్నేహమౌను - కనిపించు నొకానొకచో భయంబుగా
స్వామినిగూర్చి భావనము సల్పుట మేలెటులైనగాని కా
కేమి? ప్రధానమింతకు తదేకమనస్కత నుండుటే సుమా!

'అలమతి విస్తరేణ' పరమాత్మనుగూర్చి యెటులైనఁగాని లోఁ
దలపుఁడు - మృత్యు వల్లదిగొ దాపున నున్నది - వార్ధకంబు బె
బ్బులివలెవచ్చి మీదఁ బడఁబోవుచునున్నది - వార్ధివీచికల్
నిలువవు స్నానమాడుటకు - నేటికి నేఁడె స్మరింపుఁడా హరిన్.

భోగముమీద భ్రాంతిబడిపోక, మహాత్ముల యండఁజేరి బా
గోగులెఱింగి వర్తిలుచు నుత్తములయ్యు ఫలంబువీడి, స్వా
మీ! గతిలేదు - నీ చరణమే శరణంబన భక్తియోగమౌ
ఆగమసారమిద్ది - పరమార్థమొసంగు వరప్రసాదమే!



# భక్తితత్త్వము - వాఙ్మయము

ప్రొఫెసర్ : యస్వీ జోగారావు, ఎమ్. ఏ., పిహెచ్. డి.

* * *

మానవునిలో భక్తిభావ మతి సనాతనమైనది. ఏ నాడు మానవుడు తానీ యనంత ప్రకృతిలో నొక అణుమాత్రుడ నని గ్రహింప గలిగెనో – ఏ నాడీ నిత్యప్రత్యగ్రమగు ప్రకృతియొక్క ప్రతి పరమాణువునందును నిరంతరము, అనాది కూటస్థము, అనంతవర్త్మము, పరమభూతము నగు నొక మహోజ్జ్వల తేజః స్ఫూర్తిని, మానవాతీతమగు నొక మహత్తర శక్తి స్వరూపమును, బ్రహ్మాండ భాండోదరమగు భగవత్కళా ప్రగల్భతను గుర్తింపగలిగెనో – అట్లు గుర్తించియు, తన అవిద్యావరణమునుండి దుర్నిరీక్ష్యమగు నా సచ్చిదానందైక స్వరూపమునకు స్వీయ స్వభావానురోధముగ రూప గుణాద్యారోపణము గావించెనో – ఆనాడే, అతనిని భక్తి భావ మావహించినది. క్రమక్రమముగ నతనిలో, సగుణోపాసన ప్రణవత్వమును ప్రబలినది. ఆనాటి నుండియే మానవ భవతారక మార్గములలో – మహాయోగములలో భక్తియు నొక టైనది.

## భగవద్గీత – భక్తియోగము

పవిత్రమైన భారతీయ పరతత్త్వజ్ఞాన నవనీతమగు భగవద్గీతలో – ఏకాదశాధ్యాయము విశ్వరూపసందర్శనయోగము. ద్వాదశము భక్తి యోగము. నరునకు నారాయణుని విశ్వరూప సందర్శన యోగ మబ్బిన తరువాతనే భక్తియోగప్రబోధము కలిగినది. అనగా – మానవుడు తన కతీతమైన విశ్వరూపకమైన శక్తి యొకటి (భగవచ్ఛక్తి) యున్నదని గుర్తించిననే అతనిలో ఆ శక్తియెడ నొక ప్రగాఢమైన అనురక్తి, విశ్వాసము, నిరత్యయమైన ప్రత్యయము నేర్పడును. అదియే భక్తి, ఆస్తిక్యము. భక్తికిని, భక్తికి లక్ష్యభూతుడగు నాతని రూపమును గూర్చిన భక్తుని భావనకును ఒక ప్రబలమైన అనుబంధము గలదు. సగుణోపాసన రహస్య మిదియే. భగవద్గీత సగుణోపాసన తత్త్వమునుగూడ చక్కగా సమర్థించినది. ఇందులకు ద్వాదశాధ్యాయ మంతయు తార్కాణయే. అందు సగుణ నిర్గుణోపాసన పద్ధతులకు రెంటికిని గల తారతమ్యము విశదీకరింపబడినది.

"ఏవం సతతయుక్తా యే భక్తా స్త్వాం పర్యుపాసతే
యే చాఽప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః?"

అని నరుని పృచ్ఛ. అనగా – (రామానుజభాష్యప్రకారము) కల్యాణగుణ పరిపూర్ణు డగు భగవంతు నుపాసించువారలలోను, ప్రత్యగాత్మానుసంధానము చేయువారలలోను అనగా – సగుణ నిర్గుణోపాసకులలో నుత్తము లెవ్వరనుట.

అందులకు నారాయణుని సమాధానము:—

"మ య్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః."

అని యొకవంక సగుణోసకులు యుక్తతములని చెప్పుచు—

"యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే ....
తే ప్రాప్నువంతి మా మేవ .... ...."

అని నిర్గుణోపానకులును తన్నే పొందుచున్నారని చెప్పినాడు. అయితే—

"క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తా సక్త చేతసామ్
అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే."

అనగా – నిర్గుణోపాసన మార్గము మిక్కిలి క్లేశకారి యని వక్కాణించి నాడు. అందుచేత నది యెంత సర్వోత్తమమైన దైనను, నిరాలంబమగు నిర్గుణోపాసన కారంభమందు సగుణోపాసనయే అవశ్య మవలంబ్యమనియు పిదప సూచింపబడినది. (చూ. గీత. అధ్యా. 12 – శ్లో: 6, 7, 8 మొదలగునవి,) పురుషసూక్త – మంత్ర పుష్పాదులందును సగుణోపాసన, భక్తిధ్యానాదు లుపాదేయములని యుద్ఘాటింపబడినది. అందు విరాట్పురుషుని స్వరూప స్వభావములు విశదీకరింపబడినవి. ('సహస్రశీర్షా పురుషః, సహస్రాక్షః స్సహస్రపాత్ ...... ')

## భాగవతము - భక్తిమార్గము

భారతీయ భక్తి వాఙ్మయ పయః పారావారమున ప్రభవించిన అమృత భాండము భాగవతము. అది —

"భారతీ తీర్థంబు, బాదరాయణమౌని
సాధు మేధా సహస్రార ధార
శుక ముఖ వినిస్సృత సుధాపూరంబు
రస నిర్భర కవితారామ సరసి
భక్తి భావ తరంగ బంధురాపగ, భగ
వద్దివ్య గుణగణ వర్ణనా మ
హార్ణవమ్ము .... ....

అష్టాదశ పురాణములలో భాగవత మొకటి. కాని, అది పురాణ మాత్రము గాదు. గరుడపురాణమున దాని మహాత్మ్య మిట్లు ప్రశంసింపబడినది.

"అర్థోఽయం బ్రహ్మ సూత్రాణాం భారతార్థ వినిర్ణయః
గాయత్రీ భాష్య రూపోఽసౌ వేదార్థ పరిబృంహితః
పురాణానాం సారరూప స్సాక్షా ద్భాగవతోదితః
ద్వాదశస్కంధసంయుక్తః శత విచ్ఛేద సంయుతః
గ్రంథోఽష్టాదశ సాహస్రః శ్రీమద్భాగవతాభిధః."

అనగా – భాగవతము వేదపురాణ బ్రహ్మసూత్ర మహాభారత ప్రతిపాదితార్థముయొక్క జీవసార మనియు, గాయత్రీమంత్రమునకు మహా భాష్యము వంటిదనియు, పరమ భాగవతప్రోక్తమైన దనియు సారాంశము. అందుచేతనే– 'విద్యావతాం భాగవతే పరీక్షా' అను నానుని పుట్టియుండును. అందు భాగవతకథాఖ్యాతయు, పరమ భాగవతుండును అగు శుకమహర్షి – 'సంసార ప్రవిష్టుండైనవానికిఁ దపోయోగాదులయిన మోక్షమార్గంబులు పెక్కులు గల వందు భక్తిమార్గంబుకంటె సులభంబు లేదు' అని ఉద్ఘాటించియున్నాడు. (చూ. శ్రీమదాంధ్ర భాగవతము, ద్వితీయ స్కంధము : 34) అందే – తృతీయ స్కంధమున కపిలుడు దేవహూతికి భక్తియోగమునుగూర్చి తెలియజేయు సందర్భమున, భక్తి–తామస రాజస సాత్త్వికాది భేదములచే త్రివిధంబై యుండునని వివరింపబడినది. అందు, సాత్త్విక భక్తియోగము సాలోక్య - సార్ష్టి - సామీప్య - సారూప్య - సాయుజ్యేతి పంచవిధాపవర్గ ఫలప్రదమని వక్కాణింపబడినది. మరియు, భక్తులు నిజ మనోరథ ఫలదాయకంబులయినను-హరిసేవా విరహితంబులయిన యితర కర్మంబు లాచరింప నొల్లకుండుట యనునది ఆత్యంతిక భక్తియోగమని పేర్కొనబడినది.

భక్తితత్త్వము నిరూపించుపట్ల భాగవతము భగవద్గీతనే అనుసరించినది. భాగవతములో – 'విగ్రహదర్శన వినుతి పూజా వందన ధ్యాన సంశ్రవణము లు'ను – 'పాంచరాత్రోక్త హరి సమారాధన క్రియలు'ను ఆమోదింపబడినవి. పాంచరాత్ర మనగా – సనాతన శ్రీవైష్ణవ మత సిద్ధాంతముల కెల్ల ప్రమాణ భూతమగు ఆగమము. అందు – విష్ణ్వారాధన విధానములు, ఉత్సవ విశేషములు, ప్రతిష్ఠా విధులు మొదలగు సగుణోపాసన కర్మ కలాపము లన్నియు బేర్కొన బడినవి. వీని యన్నిటిని భాగవత మామోదించినట్లే. అయితే – అవి 'నిష్కామనంబున', 'కర్మ సంగి కా కుండుట' అను పరిస్థితులలో జరిగినప్పుడు మాత్రమే ఉపాదేయము లని యుద్ఘాటింపబడినది.

భాగవతమున ఉత్తమ భక్తి సంప్రదాయము లనేకము బహుధా మహా భక్తి కథా సుధామధురములుగా ప్రపంచింపబడినవి. త్రిపురాసురాదుల కథలలో తామస భక్తి, విదుర భీష్మాదుల యుదంతములలో సాత్త్విక భక్తి, గజేంద్ర మోక్ష కథలో శరణాగతి ప్రాశస్త్యము, ప్రహ్లాదాదుల కథలలో ప్రపత్తి, గోపికల వృత్తాంతమున మధుర భక్తి మొదలగు భక్తిమార్గము లనేకములు చక్కగా వక్కాణింపబడినవి. విపులముగా విశదీకరింపబడినవి. సర్వదా సర్వథా భారతీయ భక్తి తత్త్వ సంప్రదాయ సర్వస్వముగా విలసిల్లగలదు భాగవతము. భక్తిభావ మావిష్కృతమగు మార్గములలో భగవన్నామ కీర్తన మొకటి. దాని వలన దైవభక్తులే కాదు – పరమ పాపాత్ములును పరిశుద్ధు లగుదురని భాగవతము వక్కాణ.

"బ్రహ్మహా పితృహా గోఘ్నో మాతృహా చార్యహామవాన్
శ్వాదః పుల్కశకోవాఽపి శుద్ధ్యే రన్యస్య కీర్తనాత్." — (11-3-8)

యావజ్జీవితము పరమనాస్తికుడై, జీవిత చరమ క్షణములో నిజముగా గాక, నిమిత్తాంతరమున నొక్కపరి హరిస్మరణ చేయువాడును పరమపదము బ్రాపించునట. ఇందుల కజామిళోపాఖ్యానమును తార్కాణగా చూపుచున్నది భాగవతము. 'కలౌ సంస్మరణా న్ముక్తిః' అని ఆర్యు లందురు. భగవన్నామ స్మరణమేకాదు – శ్రవణమును మోక్షదాయకమే అనియు భాగవత ముగ్గడించు చున్నది.

"సంకీర్త్యమానో భగవా ననంత శ్శ్రుతానుభావో వ్యసనం హి పుంసామ్
ప్రవిశ్య చిత్తం విధునోత్యశేషం యథా తమోఽర్కోఽభ్రమివాతివాతః,"
— (12 - 12 - 47)

భాగవతమున విష్ణుభక్తికి - విశేషించి కృష్ణభక్తికి ప్రాముఖ్య మీయబడినది. పరమాదర్శప్రాయమగు నిర్మమ నిష్కర్మసంగి భక్తిమార్గ ప్రవర్తకులుగ సదా కృష్ణచేతనులగు వృష్ణివరులు పేర్కొనబడిరి. – (చూ. 10-90-46)

"లలితస్కంధము, కృష్ణమూలము, శుకాలాపాభిరామంబు, మం
జులతా శోభితమున్, సువర్ణ సుమన స్సుజ్ఞేయమున్. సుందరో
జ్జ్వలవృత్తంబు, మహాఫలంబు, విమలవ్యాసాల వాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై."
— (ఆం. భాగ. అవతారిక. 22)

నిజముగా భారతీయ భక్తి వాఙ్మయ నందనారామమున భాగవతము కల్పవృక్షమే యగును.

## విశిష్టాద్వైతము - భక్తియోగము

భాగవతమతమును, భక్తిమార్గమును, సగుణోపాసన తత్త్వమును బహుధా సమర్థించినది విశిష్టాద్వైతము. వేదాదులందు మోక్షసాధనములుగా ప్రతిపాదితములైన జ్ఞాన కర్మాదియోగములు రాను రాను జన సామాన్యమున కందని ద్రాక్షపండ్లయిపోయినవి. తర్కకర్కశములగు ననేక వ్యాఖ్యానములు వెలసి, వాని యర్థము దురవగాహమైపోయినది. అనుష్ఠానము పష్ఠాష్టకమే యైనది. అపుడు గహనములైన ఆ వేదాంతార్థములకు బోధనా సుగమములగు ఘంటాపథములు దీర్చుచు, పంచమ వేదమై వెలసినది మహాభారతము. భారత ప్రతిపాదితార్థ గ్రహణానుష్ఠానములును కాలక్రమమున కష్ట సాధ్యములుగా దోచినంతనే సర్వోపగమ్యమగు భక్తియోగమును ముక్తకంఠమున సముద్ఘోషించు భాగవతమతము బహుళప్రచారమునకు వచ్చినది. తత్ప్రచార ప్రాచుర్యమునకు పట్టుకొమ్మగా వెలసినాడు విశిష్టాద్వైత మత ప్రవర్తకుడగు శ్రీమ ద్రామానుజ సూరి. ఆయన, కర్మ జ్ఞానాది యోగములు భక్తియోగమున కంగభూతములే యని నిరూపించుచు —

"మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ."*

అను సిద్ధాంతమును సాంగోపాంగముగ నిరూపించి స్థాపించెను. ఈ సిద్ధాంతమే ఆయన శ్రీ భాష్యరచనా సముద్దేశ సారాంశము. శ్రీ భాష్యప్రార్థనా శ్లోకములోనే ఆయన —

"…. …. బ్రహ్మణి శ్రీనివాసే
భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా."

అని ప్రవచించియున్నారు.

## భక్తి-కవిత

అది యెంత ప్రౌఢమైన దైనను, భక్తి రస ప్రసక్తిలేని యొక సామాన్య కావ్యమును జదువునప్పటికంటె భక్తిభావోజ్జ్వలమగు నొక చిన్న కీర్తన విన్నను, ఒక శతకము చదివినను జాలును — ఆ యనుభూతి మేల్తరముగ నుండును. పరమనాస్తికులకును హృదయస్పందనము గలిగించు భక్తికావ్యములు గలవు. అయితే — ఇది భక్తి లేకున్నను స్వభావసిద్ధముగ భావుకప్రవృత్తిగలవారి మాట. భక్తికిని, కవితకును ఏదో సహజమైన మధుర బాంధవ్య మున్నది. రెంటికిని నిసర్గమధురమగు మౌగ్ధ్యము — నిగ్గుదేరిన ఆవేశము జీవగఱ్ఱ. భక్తియు కవిత వలెనే హృదయసంబంధమైన తత్త్వమగుట దానికి వాఙ్మయప్రతిపత్తి సులభసాధ్యము. కవితకు పుష్టిగూర్చు వస్తువులలో కడుదొడ్డది భక్తి. భక్తి వ్యక్తి విశిష్టమైన తత్త్వమగుట — ఆ కవితయు దరచు ఆత్మాశ్రయ ఫక్కికమైయుండును.

## భక్తి రస వాదము

ఉత్తమకవిత రసప్రధానమైనది. రసరాజము శృంగారము. ఆ రస స్థాయిభావము రతి. దైవ విషయికమగు రతి భక్తిరసమునకు స్థాయిభావము. తద్వివిధ కథా ప్రతిపాదిత మధురార్థములే ఉద్దీపన విభావములు. భగవత్ స్మరణ విరహా ద్యనుభవములందు గలుగు రోమాంచాశ్రుపాతాదు లనుభావములు. హర్ష నిర్వేద శంకాదులు వ్యభిచారులు.

"విభావాను భావ వ్యభిచారి సంయోగా ద్రసనిష్పత్తిః."

అని మునివచనము. అది రస రాద్ధాంతముపై భరతవాక్యము. రస జనకసామగ్రి భక్తిపట్ల సమృద్ధిగనే కలదు. భరతమతము భక్తిపట్ల అన్వయించు నట్లే యున్నది. కాని, భక్తి, రసత్వ యోగ్యత కలదనుట సర్వాంగీణమైన విషయముగాదు.

---

* శ్రీ శంకరాచార్యుల వివేక చూడామణి: — సంపాదకుడు.

"రతి ర్దేవాది విషయా వ్యభిచారీ తథాంజితః భావః ప్రోక్తః."

అనగా — దేవతావిషయకమగు రతియు వ్యభిచారులును భావమని చెప్పబడును — 'ఇతి ప్రాచాం సిద్ధాంతమ్' — అని ప్రాచీనసిద్ధాంతము. అందుచేతనే కాబోలు — ధనంజయ హేమచంద్ర మమ్మటాది ప్రాచీనాలంకారికు లనేకులు భక్తిని భావమాత్రముగనే పరిగణించిరి. పిదపకాలమున ఈపట్టు కొంత సడిలినది. మధ్యకాలమున కొందఱాలంకారికులు భక్తిని శాంత రసాంతర్భావముగా పరిగణించునట్లు తోచును. కాని —

"న చాఽసౌ శాంతరసే అంతర్భావ మర్హతి
అనురాగస్య వైరాగ్య విరుద్ధ త్వాత్."

అనగా — భక్తి శాంత రసాంతర్భావము కాజాలదు. ఏలయన, భక్తి రసస్థాయిభావము అనురాగరూప మగు రతి. శాంతరసస్థాయి వైరాగ్యము. ఆ రెండును పరస్పర విరుద్ధములు — అని రస గంగాధరకారుని అభిప్రాయము. ఆ పండితరాయ మహాశయుడే తొలుత భక్తిపక్ష మవలంబించిన ట్లొక ప్రౌఢ వాదము జేసియు, తుదకు భక్తిరసత్వాంగీకారమును గంగలో ముంచినాడు.

"భగవ దాలంబనస్య, రోమాంచాశ్రుపాతాదిభి రనుభావితస్య, హర్షాదిభిః పరిపోషితస్య, భాగవతాది పురాణ శ్రవణ సమయే భగవద్భక్తై రనుభూయమానస్య దురపహ్నవత్వాత్, భగవ దనురాగరూపా భక్తిశ్చాత్రస్థాయి భావః."

అని భక్తిరస సామగ్రీ సముద్దేశము విశదీకరించి —

"ఉచ్యతే భక్తి ర్దేవాది విషయ రతిత్వేన భావాంతర్గత తయా రసత్వానుపపత్తేః."

అనగా — భక్తి భగవద్విషయకమగు రతియగుట వలన భావమాత్రమేకాని, రసము గాదని చెప్పబడుచున్నది. అయితే —

"న తర్హి కామినీవిషయా యా అపి రతే ర్భావత్వమస్తు । రతిత్వాఽవిశేషాత్ । అస్తు వా భగవద్భక్తే రేవ స్థాయిత్వమ్ । కామిన్యాది రతీనాం చ భావత్వమ్ । వినిగమకాభావాత్."

అనగా — రతిత్వాభేదమువలన భగవ ద్విషయకమగు రతిభావమైనచో కామినీవిషయకమైన రతియు భావమే కావలెనుగదా! అసలు స్థాయి

భావములలో నొకటిగా పరిగణింపబడిన రతి – భగవ ద్విషయకమైన రతియే ఏల కారాదు? భామినీవిషయక రతియే యేల కావలెను? అనగా – శృంగారము రసము, భక్తిభావము మాత్రమే – అని కాక, భక్తియే రసము, శృంగారమే భావమాత్రము అని యేల యనరాదు? అన్నట్లుగా నిట్లొక ప్రశ్నపరంపర కురిపించియు, చిట్ట చివరికి —

"భరతమునివచనానామేవ అత్ర రస భావాది వ్యవస్థాపకత్వేన స్వాతంత్ర్య యోగాత్."

అని భక్తిరసవాదమును చల్లగా జారవిడచినాడు పండితరాయలు. అయితే యిక్కడ పండితరాయలు –

"రతి ర్దేవాది విషయా వ్యభిచారీ తథాంజితః భావః ప్రోక్తః,"

అను వాక్యమునే తన వాద చరమదశలో పరమ ప్రమాణముగా గ్రహించినట్లు తోచునుకాని, అసలైన భరతాచార్యుని రససూత్రమునే గ్రహించియైనను భక్తిరసవాదము నతడు సమర్థింపదలచుకొన్నచో సమర్థింపగల విదగ్ధు డాయన. అందు మార్గాంతరమును లేకపోలేదు. ఆ మార్గాంతర సౌలభ్యమును వినియోగించుకొనినవారు ఉజ్జ్వల నీలమణికర్తయగు రూపగోస్వామి, భగవద్భక్తి రసాయన కర్తయగు మధుసూదన సరస్వతి. భక్తిరసవాదముగూర్చి ఆంత దూరము పండితరాయలు ప్రౌఢవాదము చేసినా డనగా – అతని కాలములో ఆలంకారికులయందు భక్తి రస వాదమున కాలంబనము కొంత లభించియుండ వచ్చునని మన మూహింపవచ్చును. ఆ యాలంబనము రూపగోస్వామి మధుసూదన సరస్వతుల చేతులలో మరింత ప్రాబల్యము కూర్చుకొన్నది. ఇరువురును భక్తిని రసమాత్రముగా కాదు – రసరాజముగా నిరూపించినారు. అందులో భక్తిని రసముగా సరసముగా ప్రథమతః ప్రతిపాదించిన గౌరవము రూపగోస్వామిది. దాని రసత్వ యోగ్యతను సాంగోపాంగముగా – సవిస్తరముగా ప్రమాణ ప్రమేయోపన్యాస పూర్వకముగా నిరూపించి స్థాపించిన గౌరవము సరస్వతిది. ఆయన —

"శోక క్రోధ భయాదీనాం సాక్షాత్సుఖవిరోధినాం
రసత్వ మ భ్యుపగతం తథాఽనుభవమాత్రతః

ఇహాసుభవ సిద్దేఽపి సహస్రగుణితో రసః
జడే నైవ త్వయా కస్మా దకస్మా దపలప్యతే
రతిర్దేవాది విషయా వ్యభిచారీ తథాంజితః *
భావః ప్రోక్తో రసోనేతి యదుక్తం రస కోవిదైః
దేవాంతరేషు జీవత్వా త్పరానందాఽప్రకాశనాత్
తద్యోజ్యం పరమానందరూపే న పరమాత్మని
కాంతాది విషయా వా యే రసాద్యా స్తత్ర నే దృశం
రసత్వం పుష్యతే పూర్ణసుఖా స్పర్శిత్వ కారణాత్
పరిపూర్ణ రసా క్షుద్రరసేభ్యో భగవద్రతిః
ఖద్యోతేభ్య ఇవాదిత్య ప్రభేవ బలవత్తరా."

అని వక్కాణించియున్నాడు. అనగా — సాక్షాత్సుఖవిరుద్ధములయ్యు అనుభవ మాత్రముచేతనే శోకక్రోధభయాదులు రసములుగా పరిగణింపబడుచుండగా — అనుభవసిద్ధమై, సహస్రధా రస్యమానమగుచున్న భక్తిని రసముకాదని అపలపించుట తగదు. అది భావమాత్రమని రసకోవిదు లంద్రుగాక. జీవుని లక్షణములుగలిగి, పరమానందము గలిగింపజాలని యితర దేవతలపట్ల అది యట్లు కావచ్చును. కాని, పరమానంద స్వరూపుడగు పరమాత్ముని (శ్రీకృష్ణుని) పట్ల నట్లు కాదు (భావము కాదు, రసమే యగును). కాంతాదివిషయకము లగు రసములందు పూర్ణ సుఖములేదు. అవి యన్నియు క్షుద్రరసములు. భక్తి యొక్కటే పూర్ణ రసము. అది ఖద్యోతములకంటె సూర్యకాంతి వలె కడమ రసములకంటె బలవత్తరమైనది — అని తాత్పర్యము.

నిజముగా భావుకుడైనవాడు భక్తిని రసముగా అంగీకరించుటయే లెస్స. భాగవతాది గ్రంథములలో కండపట్టులగు కొన్ని ఘట్టములు చదువునప్పుడు కావ్యసామాన్యమైన అనుభూతికన్న మిన్నయగు తత్త్వమేదో హృదయమును తాకుచుండును. ఇది భావుకప్రవృత్తి సమృద్ధిగా నున్నవా రందరికిని అనుభవ సిద్ధమగు విషయము. ఆ యనుభవమును సర్వాతిశాయియై పరమానంద పర్యవశాయియగు రసస్వరూపమున జాలువారుచుండును.

* 'తథోర్జితః' అనియు పాఠాంతరమున్నది. — సంపాదకుడు.

## మధురభక్తి

రూపగోస్వామి మధుసూదన సరస్వతు లిరువురును భక్తిరస త్వాంగీకార విషయమున కృషివిషయకమైన రతి మాత్రమే ఉపాదేయమని యుద్ఘాటించిరి. కృష్ణభగవానుడు రసజగ త్సమ్రాట్టు, అతని గూర్చిన భావన–భక్తి శృంగార ముల సంగమస్థానము. ఆ రసముల కది పరసీమ, రూపగోస్వామి పరిభాషలో మధురము, ఉజ్జ్వలము నను పదములు భక్తిరస పర్యాయ వాచకములు శృంగారము మధుర రసరాజ మనుట సర్వాంగీణమైన విషయము. ఉజ్జ్వలశబ్దము శృంగార పర్యాయ వాచి. (చూ. అమరకోశము) కృష్ణసంబంధమైన భక్తి శృంగారముల భావబాంధవ్యము నిసర్గమధురము, మనోహరము. అదే భార తీయుల భక్తి సంప్రదాయ మార్గములలో సర్వోత్కృష్టమైన మధురభక్తికి మూలప్రకృతి; సార్థకమైన ఆ మహారస రహస్యము. భగవంతునే పరమ ప్రాప్యుడైన ప్రియునిగా వలచి ఉపాసించుటయే మధురభక్తి పరమార్థము. భక్తులైన కవుల ప్రవృత్తిగతమైన శృంగార లాలసయే భగవ త్పరముగ ఆవిష్కృతమగుట, లేక శృంగారము సర్వప్రాణిహృదయ సద్యోగోచరమగునది కావున, అదియొక ఎఱగా పాఠకహృదయములను భక్తి వైపాకర్షించుట అనునవి ఆ భక్తిరచనల యుద్దేశము కావచ్చును. మధుర భక్తి నిర్భరమైన హృదయము నుండి ప్రాదుర్భవించిన కవిత మధురాతిమధురము. అట్లు ప్రాదుర్భవించుటలో ఆ కవిత తరచు ఆపాతమధురమగు గీతిధర్మము నాశ్రయించుచుండును. ఆ కోవకు చెందిన రచనలలో పదములు, కీర్తనల సంఖ్యయే అధికము. ఆ భక్తి తత్త్వమున కది సహజము. మన భక్తివాఙ్మయమున మధురభక్తి శాఖ దొక ప్రత్యేకత. అందును కృష్ణభక్తికే విశేష ప్రతిపత్తి, ప్రాధాన్యము. ఆ వాఙ్మయ రస రాజములగు భక్తి శృంగారములకును, సరస్వతీదేవి తీర్థప్రసాదము లగు సంగీత సాహిత్యములకును సంగమస్థానము.

## భక్తి వాఙ్మయము - భారతదేశము

బహుశః భారతదేశమున ప్రవర్తిల్లినంత భక్తివాఙ్మయము ఈ భూప్రపంచ మున మరి యే దేశమునందును ప్రవర్తిల్లియుండదు. అది ఒకా విశాల భారత మున వివిధభాషల విలసిల్లిన మార్గములు బహు భంగులు. పూర్వకాలమున సర్వ భారతీయ వాఙ్మయమును – అంతో యింతో భగవత్పరమైనదే. ప్రతి

కవియు మహాభక్తుడే. ప్రాయికముగా ప్రతి కృతియు భగవ దంకితమే. అట నట నరాంకితము లున్నను—అవియు ప్రప్రథమమున భగవత్ప్రార్థనలేనిదే ప్రారంభ మైనవి కావు. అయితే, ఆ గ్రంథము లన్నియు భగవ త్ప్రసక్తిలేనివి కావనియే గాని, అన్నియు భక్తి ప్రధానములైన రచనలని చెప్పుటగాదు.

భారతదేశమున అతిప్రాచీనము, అఖిలప్రాంతీయ భాషలకును అక్షరమైన సంస్కార భిక్షపెట్టిన సంస్కృత వాఙ్మయమునందు భక్తిరచనలు సమృద్ధిగ నున్నవి. లీలాశుక జయదేవ తీర్థ నారాయణాదుల భక్తి రచన లెన్నియో అందు ప్రసిద్ధి వహించియున్నవి. లీలాశుకుని కృష్ణ కర్ణామృతము, జయదేవుని గీతగోవిందము. నారాయణ తీర్థుని శ్రీ కృష్ణలీలాతరంగిణి — మూడును మధుర సాహిత్యకోవకు మకుటాయమానములైన రచనలు. అందు గీతగోవిందము రాధాకృష్ణ ప్రణయ వాఙ్మయమున కెత్తిన పతాక. కృష్ణలీలా తరంగిణి భాగవత సాగరోన్ముఖముగా పరవళ్లు త్రొక్కిన భక్తిభావ కూలంకష. ఆ యా గ్రంథము లందలి ఒక్కొక శ్లోక మొక్కొక రసగుళిక. ఒక్కొక అష్టపది యొక్కొక మధురోపనిషత్తు. ఒక్కొక తరంగ మొక్కక మోహనమంత్రము. ప్రప్రథమముగా భక్తి నొక మోక్షదాయక మహాయోగముగా నుద్ఘాటించిన భగవద్గీత — గీర్వాణవాణీ వీణాక్వణన పాణింధమముగా వెలసినది. సర్వ భారత మును భక్తిబంధముతో నొక్క కొలికికి తెచ్చిన భాగవతమును ఆ దైవభాషలో అవతరిల్లినదే. అది కేవలము భక్తితత్త్వాశ్రయమైనదేకాదు — కావ్యోచితపథ బహువిధ కథా విలసిత మగుటవలన భవ్యకవితాశ్రయమును. అందుచే నది భారతీయభక్తి వాఙ్మయ సర్వస్వ మగుటయే కాదు — అటు సాధారణ వాఙ్మయ కోటిలో చేర్చి చూచినను, సాహిత్య మకుట కోటీర మాణిక్యమే. ఇది ప్రాంతీయ భాష లన్నిట ననూదితమై, తరతరాలుగా ఇంటింట వెలుగై అలరారుచున్నది.

సంస్కృతమువలెనే భారతీయభాషలలో మిగుల ప్రాచీనమైనది తమిళము. ద్రవిడదేశమున వైష్ణవమత ప్రవర్తకులగు ఆళ్వారులు పన్నిద్దరు భక్తిమార్గప్రచార మునకు బాసటయై నిలిచినారు. ఒక్కొక్కరి జీవితోదంత మొక్కక లోకోత్తర భక్తియోగ సూత్రమునకు మహాభాష్యముగా — ఒక్కొక మహాకావ్యేతివృత్త ముగా — భక్తి వాఙ్మయ భాండారమున కెత్తిన బావుటాగా పరిఢవిల్లిన మహా భాగులు వారు. తదుపరి విశిష్టాద్వైతముతో విశేషముగా కొనసాగిన భక్తి తత్త్వప్రచారము వీరశైవ విజృంభణతో పరాకాష్ఠ నందినది. అంతకుముందే

ఆ యాళ్వారులు, ఈ నాయనారులు మొదలగు వైష్ణవ శైవ మతానుయాయు లగు నా మహానుభావులచే స్వయంవ్యక్తములైన భక్తిరచనలు, తదుపరి వారి జీవితగాథలు, బోధలు నితివృత్తములుగా – పరంపరగా ప్రవృత్తములైన రచన లన్నియు గలిసి, దక్షిణ భారతమున నొక సువిశాలమైన భక్తి వాఙ్మయ కోశ మవతరిల్లినది. తమిళమున నీ యాళ్వారుల భక్తిగీతము లన్నియు నాలుగువేల గ్రంథముగా – 'నాలాయిర దివ్యప్రబంధ' మనుపేర నాథముని సంకలితమై వెలయుచున్నది. ఇందు దశావతారకథలకు, ముఖ్యముగా రామకృష్ణుల బాల్య క్రీడాదికమునకు ప్రాముఖ్యము. ఆ రచనలలో – తిరుమంగై, నమ్మ, పెరియ, కులశేఖరాళ్వారులవి సుప్రసిద్ధములు. పెరియాళ్వారు పుత్రి శ్రీ ఆండాళు (ఆముక్తమాల్యద, గోదాదేవి) శ్రీరంగనాథునే ప్రియునిగా వలచి, మధుర భక్తితో జీవితమంతా కన్యగా గడపిన మహానుభావ. ఆపె చెప్పిన 'తిరుప్పావై' ఇప్పటికిని దాక్షిణార్య వైష్ణవులయింట నిత్యపారాయణల నెగడుచున్నది. ఇట్లే – తమిళమునగల శివభక్తి వాఙ్మయమున ముఖ్యముగా పేర్కొన దగినవి నంబి ఆండార్ నంబి ప్రారంభించిన 'తిరుముఱై' శైవ సిద్ధాంత ప్రచారమున కవలంబముగా వెలసిన సంబంధర్, అప్పర్, సుందమూర్తి నాయనారుల తేవారము, మాణిక్క వాచకర్ తిరువాశగమ్ తిరుక్కోవై, తిరుమూలర్ తిరుమందిరము మొదలగు అరువది ముగ్గుర నాయనారుల చరిత్రముగా వెలసిన పెరియపురాణము తమిళశైవ వాఙ్మయమున శిఖరప్రాయమగు రచన.

కన్నడమున బసవేశ్వరునిచే, తదనుయాయులచే వీరశైవ వాఙ్మయము విశేషముగా ప్రవర్తితమైనది. జనసామాన్యమున మతప్రచార సౌలభ్యమునకై వచన గ్రంథము లెక్కువగా వెలసినవి ఏతాదృగ్గ్రంథసృష్టిలో అక్కమహాదేవి మొదలగు కవయిత్రులును పాల్గొనియుండుట విశేషము. కన్నడ శైవవాఙ్మయ మున కడముప్రక్రియలకును విశేష ప్రసక్తి గలదు. అయితే, ఆ వాఙ్మయ మంతటిని భక్తివాఙ్మయ మనజెల్లదు. భక్తి ప్రబోధాత్మకమైనను అధికముగా దానిని మత ప్రచారవాఙ్మయ మనియే యనవలెను. అందు ముఖ్యములైన కొన్ని భక్తి రచనలు :– హరీశ్వరుని పంపాశతకము, గిరిజాకల్యాణచంపువు, శివగణదరగళెగళు, రాఘవాంకుని సిద్ధారామపురాణము, శరభచరిత, భీమకవి బసవపురాణము, చామరసుని ప్రభులింగలీల, విరూపాక్ష పండితుని చెన్నబసవపురాణము మొదలగు ఆంధ్ర శివకవులలో నగ్రగణ్యుడగు పాల్కురికి సోమనారాధ్యుని ప్రభావము

కన్నడమునను బాగుగ గలదు. అతని బసవపురాణాదులు కన్నడింపబడుటయే కాదు – అతడు కన్నడమున స్వయముగా శీలసంపాదనె, సహస్రగణనామ, పంచరత్న మొదలగు గ్రంథములను రచించి యుండెను. కన్నడ వైష్ణవ వాఙ్మయమున భక్తిప్రచురములకు గీతరచనల కెక్కువ ప్రాముఖ్యము. అందు నరహరితీర్థుని విష్ణుకీర్తనలు ప్రాచీనములు (క్రీ. శ. 1280 ప్రాంతము). క్రీ. శ. 1510 ప్రాంతమున శ్రీ చైతన్య మహాప్రభువు విజయనగరమునకు విచ్చేసినకాల మున కన్నడ దేశములో మధ్వాచార్య ప్రవర్తితమైన వైష్ణవోద్యమమున కొక నూతనోత్తేజము గలిగినది. అది కన్నడమున 'దాస వాఙ్మయ' మను పేర విశేషప్రసిద్ధినందిన వైష్ణవభక్తి గీతసాహిత్యము ప్రాదుర్భవమునకు దారి తీసినది. ఆ దాసవాఙ్మయ ప్రవర్తకులలో నగ్రగణ్యులు పురందరదాసు, కనకదాసు. కన్నడదేశమున వారిపాటలు వినబడని తావులేదు.

మలయాళమున అంత ప్రాచీనకాలములో వాఙ్మయమే లేదు. అసలు కన్నడాంధ్రములందు వాఙ్మయావిర్భావము జరిగిననాటికి మలయాళభాష కే స్థితి వ్యవస్థలు లేవు. క్రీ. శ. 14-వ శతాబ్దినుండి కొంత వాఙ్మయ సృష్టి జరిగినది. అందుగల కొలది భక్తి రచనలలో ముఖ్యమైనవి భద్రకాళిప్పాట్టు, తిరువాదిరై ప్పాట్టు, చెరుస్సేరి నంబూద్రి రచన, కృష్ణగాథ, తుంచల్ రామానుజ ఎళుత్తచ్చన్ రచనలు కిళిప్పాట్టు (చిలుకపాటలు), హరినామకీర్తనము, కృష్ణన్ తంపి హరి కథలు మున్నగునవి.

తెలుగుదేశమునను శైవవైష్ణవముల ప్రచారము సాగినది. భక్తి వాఙ్మ యము ప్రక్రియా వైవిధ్యముతో బహుళముగా ప్రవర్తిల్లినది. అయితే – మన శివకవుల రచనలలో మతప్రచారధోరణియే అధికము. అందందు భక్తికిని ప్రసక్తి లేకపోలేదు. అట్టివానిలో ముఖ్యములైనవి కొన్ని :— మల్లికార్జున పండితా రాధ్యుని శివతత్త్వసారము, పాల్కురికి సోమనాథుని వృషాధిప శతకము, బసవ పురాణము, యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వర శతకము మొదలగునవి. వైష్ణవ వాఙ్మయములో భక్తికి విశేషప్రాముఖ్యము. తెలుగుదేశమున బహుధా భక్తివాఙ్మయ ప్రవర్తకులైన వైష్ణవ కుటుంబములవారిలో తాళ్ళపాకవారు సుప్రసిద్ధులు. వారు హరికీర్తనాచార్యులు. వేలకొలది పదములను, కీర్తనలును రచించి, కీర్తన వాఙ్మయమునకు పట్టుకొమ్మలైనవారు. తదితర రచనా

ప్రక్రియలను యథోచితముగ సాధించినవారు. వారిలో – అన్నమాచార్యులు, పెదతిరుమలయ్య, చిన్నన్న యనువారు ముఖ్యులు. వారి దెక్కువగా మధుర భక్తి సంప్రదాయము. కందాళ వైష్ణవకుటుంబమువారును కవిత చెప్పనేర్చిన తమ శిష్యులను ప్రోత్సహించి, అనేక భక్తిరచనలు వెలయింపజేసినారు. ఇంకను – భక్తితత్త్వము నెడ ప్రత్యేకమైన ఆస్థ ప్రకటించి, తమ రచనలలో ఆ తత్త్వమును ప్రతిఫలింపజేసిన ప్రసిద్ధులైన మన మహాకవుల విషయము :– తిక్కనామాత్యుడు హరిహరాద్వైతమును స్థాపించి, ఆనాటి అస్తవ్యస్త మతవ్యవస్థను చక్కదిద్దగల ఒక మహత్తర సందేశము నాంధ్రజాతి కందజేసినాడు. అర్వాచీన కవులును కొంద రా మార్గము ననుసరించిరి. ఎఱ్ఱాప్రెగ్గడయు శంభుదాసుడయ్యు హరివంశ నృసింహపురాణము లను విష్ణుమాహాత్మ్య ప్రతిపాదక గ్రంథములను రచించినాడు. శ్రీనాథుడు హరవిలాస భీమఖండ కాశీఖండాది రచనలుచేసి, శివపారమ్యమును – శివక్షేత్ర మాహాత్మ్యమును ప్రబోధించినాడు. పోతనామాత్యుడు తన భాగవతానువాదముచే అఖిలాంధ్రమునను అఖండవర్తిగా భక్తిదీపమును నిలిపిన మహానుభావుడు. శ్రీకృష్ణదేవరాయలు వైష్ణవ వాఙ్మయ సంతానఫలమగు గురుపరంపరా ప్రభావ ప్రసాదముగా ఆముక్తమాల్యద ననుగ్రహించినా డాంధ్రజాతికి. ధూర్జటి కాళహస్తీశ్వర శతకము పరశ్శతముగా తెనుగున గల భక్తి శతకముల కెల్ల తలమానికమైనది. అట్లే – అతని కాళహస్తీశ్వర మాహాత్మ్యము క్షేత్ర మాహాత్మ్యములలో నగ్రగణ్యమైనది. మధుర భక్తి సంప్రదాయమున కధిష్ఠాన దైవత మగు మాధవుని హృదయేశ్వరియైన రాధిక కావ్య నాయికగా ప్రప్రథమమున ఆంధ్రములో రసోత్తరముగా శ్రీ రాధా మాధవ ప్రణయ ప్రబంధమును రచించినాడు చింతలపూడి ఎల్లనార్యుడు. ప్రతి పద మధుర భక్తి బంధురములు – సూక్తి సుందరములు నగు మువ్వగోపాల పదముల గాన ప్రతి ధ్వానములతో దివ్యగంధర్వలోకము నాంధ్రసీమకు దింపినాడు క్షేత్రయ. నిధి తన సన్నిధికి వచ్చినను నిరాకరించి, భగవత్సన్నిధినే తన జీవిత పరమావధిగా నెంచి, బ్రతుకంతా రామకీర్తనగా గడపిన మహానుభావుడు త్యాగయ్య. అతని కృతులు యావద్దక్షిణభారతమును భక్తి సంగీత భంగీ తరంగితముగా నొనర్చినవి. అతడు వందలకొలది సంగీత కృతులనేకాక, నౌకాచరిత్ర మను నొక గేయప్రబంధమును, ప్రహ్లాద భక్తి విజయమను నొక నాటకమును అపూర్వ రస భావ భాగవతములుగా రచించినాడు. ఇట్లింకను గల

రాంధ్రమున భక్తి రచన లనేక ప్రక్రియల సంతరించినవారు — ఎందరో మహాను భావులు. ఆ యా భక్తి రచనలకు జనసామాన్యమున బహుముఖప్రచారము గలిగించినవారు — ఆచార్యులు, పూజారులు, పౌరాణికులు, కూచిపూడి భాగవతులు, జంగాలు, జక్కులు, గొల్లభాగవతులు, బవినీంద్రు, గొరగలు, దాసరులు, సాతానిజియ్యరులు, గుడిచేటులు (దేవదాసీజనము), హరిదాసులు (హరికథకులు) మొదలగువారు.

అటు ఉత్తరభారతమునను భక్తి వాఙ్మయము బాగుగా వెల్లి విరిసినది. తులసీదాసు, సూరదాసు, కబీరు ప్రభృతులవలన హిందీవాఙ్మయము — నామదేవ్, తుకారామ్, సమర్థ రామదాసాదుల వలన మరాటీ వాఙ్మయమును, విద్యాపతి ప్రభృతులవలన మైథిలీవాఙ్మయమును భక్తితత్త్వ శబలితములైనవి. బంగాళమున ఉమాపతి జయదేవ ధోయీకవులు, చండీదాసు, చైతన్యుడు మొదలగువారి వలన కృష్ణభక్తి రచనలు కోకొల్లలుగా వెలసి — 'కానూబినా గీత్ నై' (కృష్ణుడు వినా గీతములేదు) అనున దొక నానుడి యైపోయినది. గుజరాతు సరేసరి — అది కృష్ణావతార క్రీడారంగము. అక్కడ కృష్ణభక్తి వాఙ్మయమునకు కొదవేముండును? ఏనాడో ఆ మధుర — బృందావన సీమలలో మ్రోగిన మీరా బాయి భక్తి గీతములు, ఆ గీతములలో ప్రతిధ్వనించిన ఆ మహాభక్తురాలి మధుర హృదయ సంస్పందనములు తరతరముల నుర్రూత లూగించుచున్నవి. గుజ రాతులో వల్లభాచార్యుడు (ఇతడు తెలుగువాడట) ప్రారంభించిన 'పుష్టి మార్గము' అనే నూతనోద్యమము భక్తుని సర్వస్వము కృష్ణార్పణము కావలెనను సిద్ధాంతము గలది. దీనికి విఠ్ఠలదాస ప్రభృతులవలన విశేషప్రచారము గలిగినది. అనుయాయు లనేకు లేర్పడిరి. వారిలో గోపాలదా సను నాయన వల్లభాఖ్యాన మను కావ్యమును రచించినాడు. నరసింహ మెహతా అను నాయన వల్లభ మతమును మధురభక్తి సంప్రదాయమును మేళవించి, అనేక భక్తి శృంగార పదములను రచించినాడు. గాంధీమహాత్ముని ప్రార్థన గీతమైన 'వైష్ణవజనతో తేనే కహీఏ' అనునది మెహతా రచనయే. ఈయన పదములేకాక, రసవ దాఖ్యానములును కొన్ని రచించియుండెను. అన్నియు భక్తి గర్భితములే. కొన్ని భాగవతేతి వృత్తములు. 'సురత సంగ్రామ' మనునది అతని రచనలలో అతి స్వతంత్రమైన పోకడగల ఉత్తమ భక్తి కావ్యము. ఇతని గురించి, అద్భుత గాథ లనేకము గుజరాతునిండ అల్లుకొన్నవి. అయితే — అవి అర్వాచీన కవులకు

కావ్యవస్తువు లగుట విశేషము. నరసింహ మెహతా అనుయాయులలో ప్రేమానంద దయారాము లను భక్తకవులు ముఖ్యులు; ప్రసిద్ధులును. సిద్ధాంత రీత్యా వల్లభమతము గొప్పదేకాని, రాను రాను — ఆచరణలో ఆచార్యుడే వ్రజవల్లభు నంశావతార మను విశ్వాస మతని అనుయాయులలో ప్రబలి, అది యంతట బోక, వారును వీరును — కృష్ణుడు, గోపికలవలె రాసక్రీడ లాడ దొడగిరి. (చండీదాసు 'సహజయాన' సంప్రదాయముగూడ నించుమిం చిట్టిదే.) అంతట నా మతమును వెట్టి తలలు వేయదొడగినది. అయితే — అది గుజ రాతులో విశాలమైన మధురభక్తి వాఙ్మయము వెలయుటకు దోహదము చేసిన విషయము విస్మరింపరానిది.

ఉత్కళదేశమునను వంగదేశమునందువలె రాధాకృష్ణ ప్రణయ సంబంధి యైన భక్తివాఙ్మయమునకు ప్రచారము హెచ్చు. అందు ముఖ్యముగా పేర్కొన దగిన కావ్యములు కొన్ని :— కవి సూర్య బలదేవ్ రథ్ మహాశయుని 'కిశోర చంద్రానన చంపువు', అభిమన్యు సామంతసిన్హార్ 'బిదగ్ధచింతామణి', దీనకృష్ణ దాసుని 'రాసకల్లోల' మొదలగునవి.

ఇట్లే — ఉత్తరభారతమున ఇతర ప్రాంతములందును ఇతర భాషలలోను భక్తివాఙ్మయము కొంత కొంత ప్రవర్తిల్లినది. అయితే — పైని పేర్కొనబడిన భాషలలోగల భక్తివాఙ్మయమున కున్నంతప్రసిద్ధి త దితరమున గానరాదు. ఉత్తరభారతమున 'సూఫీ' తత్త్వమొకటి ఉర్దూ హిందీ పంజాబీ మొదలగు భక్తి వాఙ్మయ ప్రభవమునకు కొంత దోహదము చేసినది.

ఆధునికయుగమున పాశ్చాత్య సంస్కార ప్రభావ మధికమై, మన రచయితల దృక్పథము బహుధా విపరిణతమైనది. వారి అభిరుచులలో, ఆశయములలో-వస్తు స్వీకరణలో-రచనా ఫక్కికలలో వినూత్నతయు, వైవిధ్యము నధికముగా గోచరించుచున్నవి. భగవచ్చింతన తగ్గి, మానవ సమాజమువైపు రచయితల చూపు పరువెత్తుచున్నది. నాస్తికతయు బాగుగా ప్రబలినది. ఆస్తిక్యము కొందరిపట్ల నున్నను, అది హృదయములకు మాత్రము పరిమితమై, రచనలలో ప్రసరించుట మందగించినది. భక్తి రచనల ప్రాబల్యము నానాటికి పలుచబారిపోవుచున్నది. అయితే ఒకమాట :——పూర్వకాలమున సర్వభారత మందును వివిధభాషలలో రకరకములైన ప్రక్రియలద్వారా రసవంతమైన వాఙ్మ

యము విశేషముగా ప్రవర్తిల్లియుండుటకు మూలకారణములైన వానిలో ముఖ్యమైనది భక్తియను విషయము సహృదయు లందరును అంగీకరింపదగినది. అది—సాహిత్యమును ప్రజాసన్నిహితము చేయుట కెంతగనో తోడ్పడినది,

## భక్తి వాఙ్మయ ప్రక్రియలు - తత్త్వానుశీలనము

భారతీయ భక్తివాఙ్మయమును పరిశీలించినచో ఆ రచనా ప్రక్రియలలో విశేష వైవిధ్యము గోచరించును. సాధారణముగా వాఙ్మయములో ప్రక్రియా వైవిధ్యమున కెంత యవకాశ ముండగలదో — అంతయు భక్తివాఙ్మయమున గన్పట్టును. రచనాప్రక్రియనుబట్టి వాఙ్మయ మంతయు ముత్తెరగులు — పద్యము, గద్యము, గేయము. ఈ మూడింటి వ్యస్తప్రయోగమునగాని. సమవాయ ప్రయోగమునగాని అనేక రచనాభక్కిక లుద్భావ్యము లగును. పద్యకేవలములు శతకాదులు. గద్యకేవలములు చూర్ణికలు, కైవారములు, విన్నపములు మొదలగునవి. గద్య పద్యోభయాత్మకములు చంపువులు. చంపూ రూపమున అనేక కావ్యప్రబంధములు, పురాణ స్థల పురాణములును వెలసినవి. గేయ ప్రయోజనాత్మకములు దండకములు, తేవారములు, పాశురములు, అంక నూలికలు, త్రిపదము, చతుష్పదులు, షట్పదులు, సప్త పదులు, అష్ట పదులు, రగడలు, ఏలలు, త్రిభంగులు, ధవళశోభనములు, మేలుకొలుపులు, పదములు, గరబీలు, కృతులు, కీర్తనలు ఇత్యాదు లెన్నో గలవు. పద పద్యములకు నడిమి వాటముగా నడచునట్టివి ద్విపదాదులు. పద్యగేయాత్మకములు ఉదాహరణ ములు. పద్య గద్య గేయాత్మకములు యక్షగానములు, ఏకాంతసేవాది ప్రబంధములు, హరికథలు మొదలగునవి. ఈ ప్రక్రియ లన్నిటను ఇతోధికముగ వివిధ భారతీయ భాషలలో భక్తి రచనలు వెలసినవి. (ఒక్క తెనుగునందును ఇంచుమిం చివి యన్నియు గలవు) ఇందు దండకములు, అంకమాలికలు, తేవారములు, చూర్ణికాదులు — కేవలము స్తోత్రప్రాయ రచనలు. మేలు కొలుపులు, ధవళశోభనాదు లౌపచారికగీతాలు. చంపువులు, యక్షగాన హరికథాదులు కథాత్మకములు. శతక విన్నప కీర్త నోదాహరణాదు లసలైన భక్తి రచనలు. అవి కేవల స్తుతిపరములుగాక, కథాలంబనమును లేక నిసర్గ మనోహరముగా భక్తుడైన కవియొక్క అనుభవము, అభినివేశముల ప్రేరణతో అతని హృదయమునుండి ప్రసవించిన భక్తిరస సంపుటములు. అందును, కీర్తనల రూపమున నున్న భక్తి రచనలకు ప్రచార మింతయు నంతయును గాదు.

ప్రాచీనకాలమున భరతవర్షమంతయు మహర్షుల ఉపనిషత్సూక్తములందువలెనే భక్తి, గీతమాధురుల లోలలాడినది. శతకములు సంస్కృత వంగ తమిళ కర్ణాటాంధ్రాది భాషలందు గలవు. అందు నీతి శృంగారాది భావాత్మకము లనేకము గలవు. అందులో భక్తి శతకముల దొక ప్రత్యేకత. అవి ప్రాయికముగా కవీష్టదేవతా మకుటములతో భగవత్సంబుద్ధులతో కర్తృభావసాపేక్షములైన భక్త్యనుభవావేశయావేశములతో వెలయుచుండును. భక్తివచనములలో చూర్ణికలు, కైవారములు అనునవి కేవల స్తుతిపరములు. విన్నపము లట్లుగాక, వచన రచనలయ్యు ఒక చక్కని తూగు, సంగీతపు హొయలు గలిగి, భక్తి సూనృతముగా – భావప్రధానముగా నడచు భావగద్యలు (Lyrical Prose). తెలుగునగల కృష్ణమాచార్యుని సింహగిరి నరహరిగీతములు మొదలగునవి ఈ కోవకు చెందునట్టివి.

ఇక ఉదాహరణాది కతిపయ ప్రక్రియలగూర్చి ప్రత్యేకముగా చెప్పవలసినది కొంత గలదు.

## ఉ దా హ ర ణ ము

మన తెలుగునగల భక్తి వాఙ్మయములో ఉదాహరణ మొక విశిష్ట రచనా ప్రక్రియ. మన వాఙ్మయ మంతయు మొదటినుండియు మార్గదేశి భేదముచే ద్వివిధముగా ప్రవర్తిత మగుచున్నది. అందు మార్గసాహిత్యము పద్య ప్రధానమైనది. గేయ ప్రాముఖ్యముగలది దేశి. పద్య ప్రభేదములగు వివిధ వృత్తములకును, గేయ ప్రభేదమగు రగడయొక్క వికృతి వైవిధ్యముగల రచనా విశేషములగు కళికోత్కళికలకును సమాన ప్రతిపత్తి గలిగి, మార్గ దేశి శాఖల కేక వాక్యత ఘటించిన ట్లవతరించిన సాహిత్య ప్రక్రియ ఉదాహరణము. ఆ కళికోత్కళికలు మధురకవితా శాఖకు చెందిన గీత రీతు లగుటచే, ఉదాహరణము సంగీత సాహిత్యములకును నొక మధుర బాంధవ్యమును సంఘటించిన దనవచ్చును. అట్లే-మానవ జీవితములో మహత్తర విషయములగు కవిత, భక్తి, సంగీత ప్రియముల కైక్య సిద్ధి ననుసంధించిన దీ యుదాహరణమే.

భగవన్మాహాత్మ్యము నుదాహరించు స్తోత్ర ప్రాయమైన రచన కావున నీ కావ్యప్రభేదమునకు ఉదాహరణ మను పేరు ఉచితము, సార్థకమును. అనలాదికాలమున సర్వవాక్కు స్తోత్రప్రాయముగనే, గేయరూపముగనే ఆవిష్కృత

మైనది. ఉదా: మన వేదబుక్కులు, సామలు; గ్రీకుల డితేరాంబ్ మొదలగునవి. అందుదాహరణము దొక ప్రత్యేకత. కాలక్రమమున వాఙ్మయము స్తోత్ర రూప మాత్రము గాక, నైక వస్తు వర్ణనాఖ్యానపరిణతమై, వైవిధ్య రమణీయమై, అనేక కావ్య ప్రక్రియల రూపమున వ్యాప్తిగాంచినది. కాని, ఉదాహరణము కూడ కాలక్రమమున కేవల భగవన్మాహాత్మ్య ప్రతిపాదకముగా మాత్రమే కాక, మహనీయుడగు నొక మానవ మాత్రుని ప్రశంసకును తావలమైనదిగా పరిణమించి యున్నను, నాటికి నేటికిని దాని ఆద్య ప్రకృతియగు స్తోత్ర ప్రాయత్వధర్మమునకు క్షతి కలుగలేదు.

ఉదాహరణము స్తోత్ర ప్రాయ రచన మనగా – ఉత్త సాధారణ స్తోత్రము గాదు. అది యొక విశిష్టమైన రచనా పద్ధతి, నిబద్ధతయు గలది. సప్త విభక్తులు, తదుపరి సంబోధనా ప్రథమను గ్రహించి, వరుసగా నొక్కొక్కదానియం దొక్కొక పద్యము. వెనువెంట నవవిధ రగడలలో నొక రగడను గ్రహించి, అం దొక కళిక, కళిక ఏ రగడ ప్రభేదమునకు చెందునో అందే ఆ కళికలో సగమగు నొక యుత్కళిక, ఆదే విభక్తిలో అనగా – నొక్కొక విభక్తిలో నొక పద్యము, ఒక కళికయు, ఒక ఉత్కళికయు గలిసి యొక ప్రమాణాంశ (unit) గా జెప్పినచో నిట్టి వెనిమిది ప్రమాణాంశలు మీద నొక సార్వ విభక్తిక పద్యమును గలిసి యొక ఉదాహరణ మగును.

ఈ యుదాహరణ కావ్య మహత్త్వరహస్యము ని ట్లూహించినా రాధుని కోదాహరణకర్తలలో నగ్రగణ్యులగు కవి సమ్రాట్ (శ్రీ) విశ్వనాథ సత్యానారాయణగారు :– 'జగత్తంతయుఁ గ్రియారూపము ... ధాతువు సర్వదా విభక్త్యాశ్రయము ... అందుచేత నన్ని విభక్తులతోఁ బరమేశ్వరునిఁ జెప్పినపుడు భగవంతుఁడు సర్వ క్రియాస్థానభూతుఁడని వ్యంగ్యము.' మరి నే నిట్లనుకొందును:– ఉదాహరణము విభక్తి విశిష్టమైన రచనయే కాదు; భక్తిప్రధానమును. భగవత్సాయుజ్యమే భక్తుని కపేక్షితము. కాని, అది సిద్ధించునందాక భగవంతుడు వేఱు; భక్తుడు వేఱు. భగవత్సాయుజ్యసిద్ధికై భక్తుడు చేయు సాధనయే భక్తిప్రకటనము. అది స్తోత్రరూపమున ఆవిష్కృత మగును. అనగా – స్తోత్రము నుదాహరించినవాడు వేఱు; అందుదాహృతుడైనవాడు వేఱు. ఈ యర్థమునే విభక్తితత్త్వము, తత్ప్రాభావమగు నుదాహరణము విశదీకరించుచున్నవి.

అనగా – అదియే ద్వైత విశ్వాస ప్రతిపత్తి. అదిలేక భక్తి కర్థములేదు. ఈ విభక్తి తత్త్వ పురస్సరముగ భక్తిని ప్రకటించుటయే ఉదాహరణ కావ్య పరమార్థము.

ఈ యుదాహరణ రచనలు క్రీ. శ. 13-వ శతాబ్దినుండియే ఎక్కువగా తెలుగు భాషయందు మాత్రమే కన్పట్టుచున్నవి. పాల్కురికి సోమనాథుడు రచించిన బసవోదాహరణమే అటు సంస్కృతమునను, ఇటు తెనుగునను మొట్టమొదటిది. క్రీ. శ. 1700 ప్రాంతమున సంస్కృతములో మరి రెండుదాహరణములు మాత్రము వెలసినవి. అందొకటి – తెలుగువాడైన ఓరుగంటి రామయామాత్యుడు రచించిన శివోదాహరణము. రెండవది – మైసూరులో తిరుమలార్యుడను నతడు రచించిన చికదేవరాయోదాహరణము. (ఇది భగవత్పరము గాదు, రాజపరము.) తెనుగున మాత్రము పాల్కురికి సోమనాథుని నాటినుండి ఇప్పటిదాక ప్రతి శతాబ్దియందును ఎడతప్పక యొకటో - రెండో ఉదాహరములు వెలయుచు వచ్చినవి. ఒక్క 20-వ శతాబ్దియందే ఇప్పటి కైదుదాహరణములు వెలసినవి. తెనుగున ఇప్పటికి వెలసినవానిలో మొట్టమొదటిది వీరశైవమత ప్రవర్తకు డగు బసవేశ్వరుని గూర్చినది. కాగా, చిట్టచివరిది విశిష్టాద్వైత ప్రవర్తకు డగు రామానుజాచార్యుని గూర్చినది (శ్రీమాన్ చెలమచెర్ల రంగాచార్య కృతము)*

## పల్లకి సేవా ప్రబంధము

క్రీ. శ. 16–17 శతాబ్దుల సంధికాలమున తంజావూరిలో మహారాష్ట్ర ప్రభువుల యాస్థానమున పల్లకిసేవా ప్రబంధము లను భక్తి ప్రబంధములు రచనలో యక్షగానపు బాణీని పోలినట్టివి కొన్ని వెలసినవి. అందు శహాజీకృతములుగా విష్ణు పల్లకి, శంకర పల్లకి సేవా ప్రబంధములు రెండు తెనుగున ఉపలభ్యము లగుచున్నవి. వానిలో నాయికలు (లక్ష్మియో, గౌరియో) నాయకులపాలికి చెలికత్తెలను పుత్తెంచుట, వారు పల్లకీలపై స్వామివారి నమ్మవారి సన్నిధికి తోడ్కొని వచ్చుట, అచ్చట అయ్యవారి యారగింపుసేవ, ఉభయుల పవళింపుసేవ ఇత్యాదులు ప్రవర్తితము లగుటయు విషయము. ఈ ప్రబంధములు నిన్నమొన్నటిదనుక తంజాపుర పరిసర దేవాయతనములలో ఉత్సవ సందర్భమునందు

* ఇది – 'శ్రీమద్రామానుజోదాహరణ' మను శీర్షికతో శ్రీ రామానుజ కీర్తి కౌముదియందే రానున్న భాగములలో నొక భాగమున సందర్భోచితముగా ప్రచురింపఁబడనున్నది. — సంపాదకుడు.

అటు నిటు రెండు కోవలుగా పల్లకి బోయీల పాత్రలు ధరించిన నట్టువరాండ్రచే సాభినయముగ, సంవాదరూపమున ప్రదర్శింపబడుచుండెడివట. ఇవి ఉత్సవ దిదృక్షువు లగు భక్తజనుల హృదయములం దొక మధుర భావోత్సుకతా ప్రరోచన చేయజాలి, చూడ ముచ్చటగా నుండునట.

## ఏకాంత సేవ

ఏకాంతసేవ యనగా -- నిత్యార్చన సాగు దేవాయతనములలో ముఖ్యముగా భోగనిలయము లగు వైష్ణవాలయములలో రాత్రి గుడి తలుపులు మూయుటకు ముందు అర్చకులు యథావిధి నుపచరించి, అమ్మవారి స్వామివారి యుత్సవ విగ్రహములను పానుపుపై పవళింపుచేసి, గుడిచేటులు లాలిపాటలు పాడి, ద్వారపాలన నిమిత్త మష్ట దిక్పాలకులకు బహు పరాకులు చెప్పి వెడలి పోగా, ఇక నమ్మవారు స్వామివారికి చేయునదిగా ఊహింపదగిన పర్యంక సపర్య. అది యొక మధురాతి మధురమైన సేవ. అది యొక మహారాజునకు భృత్య మాత్రుడు చేయుదాని కంటెను. ఎన్నియో మడుంగులు దొడ్డది. అట నాజ్ఞ లేదు. చిత్తము బత్తెము లసలే లేవు. అవి ఎదిరి ఆనందమునకు గాదు. ఆత్మసంతృప్తికై మాత్రమే పచరించుకొనబడునది. తత్ఫలితము తత్రాపి సేవ్యుని చెందవచ్చుగాక. హృదయ నివేదనమే ఆ సేవ యందలి పరమాశయము. మధురభక్తి ముదితాత్ములగు కవివతంసులు కొందరా సన్నివేశమును గ్రహించి, దానికి ప్రస్తావనగా ఇంత కథాంగము గల్పించి, నాయకుని వివిధోపచారములకు వివిధ గీత ప్రభేదములను ప్రయోగించి, ఏకాంతసేవా మకుటముతో ననేక మధురగేయ ప్రబంధములు వెలయించిరి. అవి భక్తి శృంగారములకు, సంగీత సాహిత్యములకు నాలయములు.

ఈ యేకాంతసేవా ప్రబంధములు తత్త్వతః పల్లకిసేవా ప్రబంధముల వంటివే. యక్షగానములవలె నెట్టి రచనా విశేషమునైన నిమిడ్చుకొగలట్టివి. ఈ కోవకు చెందిన రచనలు కొన్ని యక్షగానములనియే వ్యవహృతములైనవి. కొన్ని నాటక నామకరణమునే చేయించుకొన్నవి. ఈ జాతి కృతి రచన ఏమంత ప్రాచీనమైనదిగా తోపదు. ఏ పందొమ్మిదవ శతాబ్దియందో యక్షగాన మొరవడిగా బయలుదేరిన దనుకొందును. అదియుగాక, తెలుగునందుమాత్రమే ఈ పేరింట ప్రబంధములు పది పండ్రెండు గన్పట్టుచున్నవి. ఉదా :— యడవల్లి సర్వేశ్వరశాస్త్రి ఉమామహేశ్వరైకాంతసేవ, మద్దిరాల వెంకటరాయకవి ఏకాంత సేవావిలాసము మొదలగునవి.

## హ రి క థ లు

హరికథా కాలక్షేప సంప్రదాయము మనకు మహారాష్ట్రమునుండి సంక్రమించిన దనియు, ఇందులకు తుకారాముని అభంగములు మూలము లనియు, అభిజ్ఞుల భావన కావచ్చును. మరాటీ అభంగములు, తమిళదేశము నందలి భాగవత కాలక్షేపములు. కన్నడ తాళమర్దళ, తెనుగు హరికథలు అన్నియు నొక్కకోవకు చెందునట్టివి. ప్రాయికముగా నన్నియు వివిధ భాగవతోపాఖ్యానము లితివృత్తము గలవి. రచనలో యక్షగాన ప్రాయములు. దక్షిణదేశమున నివి గత శతాబ్దిలోనే ప్రవర్తిల్లి, జనసామాన్యమున విశేషప్రచారమును బొందినవి. గాన రూప కథా ఖ్యానము వీని ప్రధాన స్వరూపము. భక్తి భావ ప్రబోధ లక్షణము వీని జీవలక్షణము. భక్తి తత్త్వ వ్యాప్తి కివి గొప్ప దోహదకారులైనవి. కథాశ్రవణ ప్రవణమైన ప్రజాభిరుచికి చాల సంతృప్తినిగూడ ఒడగూర్చినవి.

అరవదేశమున గోపాలకృష్ణ భారతి, మళయాలమున కృష్ణన్ తంపి మొదలగు వారివలె ఆంధ్రమున హరికథా ప్రవర్తకులలో నగ్రగణ్యుడు శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసు. ఆంధ్ర హరికథా పితామహు డతడు. హరికథా రచనమునందేకాక, ఆఖ్యానమునందును, ఆరితేరిన జాణ డతడు. ఆతని హరికథ లాంధ్రదేశము నందలి యాబాల గోపాలమును ఆనందాబ్ధి నోలలాడించినవి. ఆయనవి, బాగేపల్లి అనంతరామాచార్య బాలాజీదాస ప్రభృతులవి హరికథ లాంధ్రమున వందకు పైచిలుకు గలవు. అం దెక్కువ మహాభక్తులును ప్రౌఢులు నైన పండితకవుల రచనలు. ఆ రచనా ప్రక్రియయు వివిధ గద్య పద్య గీతి రీతుల కాలవాల మగుట వలనను, విశిష్టప్రయోజనాత్మక మగుటయు హరికథలను గూడ ఉదాహరణాదులవలె మన మొక ప్రత్యేక వాఙ్మయ శాఖగా పరిగణింపవచ్చును.

ఇట్లు బహు ముఖముల ప్రవృత్తమైన భక్తి తత్త్వము—భారతజాతిని, ఆ భక్తి రచనా పరంపర భారతీయ భాషావాఙ్మయములను పునీతము—పరిపుష్టము నొనర్చినవని నిరూపించుటయే ఈ రచనయొక్క ముఖ్యోద్దేశము, ఈ భక్తి వాఙ్మయశాఖల గూర్చి యింకను విపుల విమర్శయు, పరిశోధనమును బాగుగా జరుగవలసియున్నది.

* * *

# శ్రీమద్భాగవతము - భక్తితత్త్వము

శ్రీ రావూరి ప్రసన్న సత్యనారాయణ, ఎమ్. ఏ.

* * *

## భాగవతవైశిష్ట్యము

భక్తితత్త్వమును ప్రతిపాదించు ఆధికారిక గ్రంథములలో శ్రీమద్భాగవతము అగ్రగణ్యమైనది. ఇందు – వ్యాసుఁడు నిరూపించిన వైష్ణవభక్తిసంప్రదాయమునకు మూలము – వేదములు, ఉపనిషత్తులు. తత్త్వవిషయమున వేదములకు, ఉపనిషత్తులకు నున్న భేదమే, ఉపనిషత్తులకును – భాగవతమునకును ఉన్నది. అంతమాత్రమేకాదు – వేదముల యొక్కయు, ఉపనిషత్తుల యొక్కయు స్వరూపముల రెండింటిని ఈ భాగవత మిముడ్చుకొనియున్నది. ఇట్లిముడ్చుకొనుటకు పూర్వము – అనౌచిత్యములఁ దొలఁగించి, ఆ రెంటికిని ఒక చక్కని సమన్వయమును సమకూర్చినది. ఆ మార్గమున వానికంటెను మఱికొంతదూరము పురోగమించినది. అదియే భాగవత భక్తిసంప్రదాయము.

## భాగవతము - పరబ్రహ్మము

భాగవత మతానుసారము, వాసుదేవుఁడే పరబ్రహ్మము. అతఁడే పరమ పురుషుఁడు. అతఁడే భగవానుఁడు. సర్వమును ఆతని పరమైనవే. ఆతనికంటె భిన్నమైన యణువు దృశ్యాదృశ్యప్రపంచమునం దేదియు లేదు.

"వాసుదేవపరావేదా వాసుదేవపరామఖాః
వాసుదేవపరాయోగా వాసుదేవపరాః క్రియాః
వాసుదేవపరంజ్ఞానం వాసుదేవపరం తపః
వాసుదేవపరోధర్మో వాసుదేవపరాగతిః." — (1 - 2 - 28, 29)

పై శ్లోకమునకు - భక్తావతంసమగు విష్ణుపురి వ్యాఖ్యానము మనకు సత్వరగ్రహణీయము. అతఁ డీ క్రింది విధముగా ననుచున్నాఁడు :—

"ఆసన ప్రాణాయామాది క్రియాణాం, తద్జ్ఞానోపాయత్వేన, తత్పరత్వే, యోగశాస్త్రమపి, తత్పరమేవ. జ్ఞానస్య, తద్విషయత్వేన, తత్పరత్వే, జ్ఞానశాస్త్ర

మపి తత్పరం; తపఃపదం జ్ఞానపరం, ప్రకరణాత్, తపోవత్, జ్ఞానస్యాపి శుద్ధి హేతుత్వాత్, స్వర్గాదీనాం త దానందాంశరూపత్వాత్, త త్పరత్వే, త దర్థకధర్మ శాస్త్రమపి, త త్పరమేవ." — (భక్తిరత్నావళి: కాంతిమాలావ్యాఖ్యానము: 1-16.)

వేదములు, యజ్ఞములు, యోగములు, క్రియలు, జ్ఞానము, ధర్మము గతి మున్నగు సర్వమును వాసుదేవపరములే. ఈ వాసుదేవుఁడు — ఏకైకుఁడు; అద్వితీయుఁడు.

అతఁ డొక్కఁడే. ఇతరమును గూర్చినది — నిజమగు భయము గాదు. ద్వితీయాభినివేశము వలన భయము గలుగుచున్నది. అది — అజ్ఞాన జన్యము.

వాసుదేవుఁడే శ్రీకృష్ణుఁడు. అతఁ డవతారపురుషుఁడైనను, స్వయముగ భగవానుఁడే.

"ఏతే చాంశ కలాః పుంసః కృష్ణస్తు భగవాన్ స్వయమ్."

అను సూక్తియే ఇందులకు పరమప్రమాణము.

## భాగవత భక్తి - వేదాంత భక్తి

జీవున కతి సహజమును, ఏకైకమును, పరమధ్యేయము నైనది భక్తి యోగము. నారదుని పరభక్తి, వ్యాసునిచే అహైతుకభక్తి యని చెప్పఁబడినది. ఉత్తమభక్తి, నిర్హేతుకభక్తి, అకించనభక్తి, అనిమిత్తభక్తి, అనన్యభక్తి, ఊర్జితభక్తి, ఏకాంతభక్తి, ప్రగల్భభక్తి, అమలభక్తి, దృఢభక్తి, తీవ్రభక్తి, అనపాయభక్తి, యోగప్రవృత్తభక్తి, యోగపూర్వకభక్తి, శ్రద్ధాభక్తి, ఆత్యంతికభక్తి, ఉచితభక్తి, ఆత్మప్రసాదభక్తి, నైష్ఠికభక్తి, పరాభక్తి, అనపాయరతి, పరమభక్తి మున్నగునవి పై యర్థమునందే యుపయుక్తములు.

భాగవతభక్తి — కొంద ఱాధునికులచే 'వేదాంతభక్తి' యని చెప్పఁబడినది. కాని, అట్లు ప్రత్యేకముగఁ జెప్పవలసిన యవసరములేదు. కారణము — భక్తి యనిననే వేదాంతముతోఁ గూడినది. ఆ దృష్టితో — నారద శాండిల్యాదులు చెప్పునది వేదాంతభక్తియే యగును.

## భక్తి - ముక్తి

ముక్తి యనునది కేవలము భక్తుని యిచ్ఛపై నాధారపడియుండును. భక్తియోగప్రాశస్త్యము, ప్రాముఖ్యము ఈ క్రిందివిధముగా విశదీకరింపఁబడినవి :—

"స వై పుంసాం పరో ధర్మో యతో భక్తిరధోక్షజే
అహైతుక్యప్రతిహతా యయాత్మా సంప్రసీదతి." — (1 - 2 - 6.)

" అహైతుకీ ఫలాభిసంధివివర్జితా అప్రతిహతా నిరంతరా, అవ్యభిచారిణీ చ."
— (కాంతిమాలా టీక: 1 - 10.)

అహైతుకమును – అప్రతిహతమునైన భక్తియే పరమధర్మము. దానివలన, ఆత్మ సుప్రసన్నమగునని దీని తాత్పర్యము.

ఫలాభిసంధి – వివర్జితము, నిరంతరము ననుటయందు – భక్తియొక్క 'అసలు' స్వరూపము చాలవఱకును చెప్పఁబడినట్లే. జ్ఞానమున కది సాధన భూతము, సాధ్యము ననుటయు ప్రత్యక్షముగఁ గాకపోయినను స్పష్టమే.

ఆత్మలబ్ధికి భక్తితోమాత్రమే భగవంతుని భజింపవలయును. భగవన్నామ గ్రహణాదులచేఁ జేయు భక్తియోగమే పరమధర్మము. భక్తివలన భూతములు (ఆత్మలు) అమృతత్వమును బొందును. భయ రహితము – క్షేమ కరము నగు భక్తియోగమే యుత్తమమైనది.

భక్తియోగమునకు తపముగాని, జ్ఞానముగాని, కర్మముగాని, వైరాగ్యముగాని, దాన ధర్మాది శ్రేయఃకార్యములుగాని అక్కఱలేదు. వాని యన్నింటివలన లభించు ఫలము – భక్తిచే సత్వరముగ సాధింప నగును. దాన వ్రత తపో హోమ జప స్వాధ్యాయ సంయమాది వివిధ ధర్మములును భక్తియోగమునకు సాధనభూతములు మాత్రమే. ధర్మము, సత్యము, దయ, విద్య, తపము మున్నగున వెన్నియున్నను భక్తి లేక చిత్తము పవిత్రము కాదు. యోగముగాని, సాంఖ్యముగాని, స్వాధ్యాయముగాని, తపముగాని, త్యాగము గాని, యేదియైనను భక్తివలె భగవంతుని సాధింపఁజాలవు. జ్ఞానము, యోగము, కర్మము మున్నగున వన్నియు – భక్తిముందు శక్తిహీనములే. ముకుందుని సంసేవించుటచే లభించిన చిత్తప్రశాంతత – అనుక్షణము కామ లోభ హతమగు యమాది యోగపథముల వలన లభింపదు. బహి రర్థములయందు (కర్మకాండ యందు) శ్రద్ధవహించువారు – విష్ణువును తెలియఁజాలరు. కర్మకాండ యనెడి బంధముచే బద్ధులైనవారు – అంధులచే నడపింపఁబడు అంధులవంటివారు. క్రతువులచే సాధింపఁబడు ఐహికభోగము లన్నియు నశ్వరములు. అవి – మాత్సర్య జనకము లగుటవలన, అపవిత్రములు.

భగవానుఁడు భక్తులకు వలె యోగులకును అంత సులభగమ్యుఁడు కాఁడు. శ్రేయఃప్రవాహమైన భక్తియోగమును వదలి, కేవలము జ్ఞానార్జనకై ప్రయత్నించువారికి – చివరకు మిగులునది క్లేశము మాత్రమే. వారి పరిశ్రమ మంతయు – కేవలము వరిపొట్టునందు బియ్యపు గింజలకొఱకై వెదకుట వంటిదే.

మానవ జన్మమును బొంది, కేవల తత్త్వవిషయకజ్ఞాన సముపార్జనమునందే కాలము గడపువారు – భగవ దారాధనమునకుఁ గడంగనిచో నే మందుము ? వారు – భగవ న్మాయాశక్తిచే సమ్మోహితులైనవారని యనవలసియున్నది.

నైష్కర్మ్యముతోఁ గూడియున్నను, అచ్యుత భావ వర్జితమైన జ్ఞానము శోభింపదు. అమలభక్తివలన హరి ప్రీతుఁ డగును. దానముగాని, తపముగాని, యజ్ఞముగాని, శౌచముగాని, వ్రతములుగాని కేవల విడంబనములే. హరితోషకమైనదే కర్మము. అతనిని దెలుపునదియే విద్య. అతనిని దెలిసికొనినదే మతి.

'అసలు' యోగాదులవలన సంప్రాప్తించు సిద్ధు లన్నియు – భక్తునకు అయాచితముగా వానియంతట నవియే లభించును.

"అథో విభూతిం మమ మాయా వినస్తా
మైశ్వర్య మష్టాంగ మనుప్రవృత్తమ్
శ్రియం భగవతీం వా స్పృహయంతి భద్రాం
పరస్య మే తేఽశ్నువతే తు లోకే."

నా భక్తులు – నా మాయచే కల్పితములైన యైశ్వర్యమును, సిద్ధులను కోరకపోయినను, వారి కవి సహజముగా సంప్రాప్తించు నని భగవద్వాక్యము.

యోగులుగూడ, భగవ దర్పితబుద్ధులై, భక్తిమార్గమువలననే పరగతిని బొందిరి. పూర్వము బహుసంఖ్యాకు లగు యోగులుగూడ, భగవ దర్పితేహులయి, నిజకర్మలబ్ధమయిన భక్తిచే నుద్బుద్ధు లయి, శీఘ్రమే అచ్యుతుని పరగతిని పొందిరి.

కర్మమార్గము – భక్తికి నుపాయమనుట యిట స్పష్టము. సుసమృద్ధార్చులు గలిగిన యగ్ని, కాష్ఠముల నెట్లు భస్మము జేయునో – అట్లే, భగవ ద్భక్తి-భక్తుని పాపములను సంపూర్ణముగ భస్మము జేయును.

"భక్త్యాఽహమేకయా గ్రాహ్య శ్రద్ధయాఽఽత్మా ప్రియ స్సతామ్
భక్తిః పునాతి మ న్నిష్ఠా శ్వపాకా నపి సంభవాత్." — (11-14-21.)

'శ్రద్ధగలిగిన భక్తివలననే నేను గ్రహింపఁబడదగిన వాఁడను. మన్నిష్ఠమైన భక్తి, శ్వపాకులనైనను పవిత్రులఁజేయు'నని భగవ ద్వచనము.

"అవిస్మితం తం పరిపూర్ణకామం స్వేనైవ లాభేన సమం ప్రశాంతమ్
వినోపసర్పత్యపరం హి బాలిశః శ్వలాంగులేనాతి తితర్తి సింధుమ్."
— (6 - 9 - 22)

పరిపూర్ణకాముఁడైన భగవానుని గాక, త దన్యుని దరిజేరుట — కుక్క తోఁక పుచ్చుకొని సముద్రమును తరించుట వంటిది.

అకామత్వముతోనైనను, సర్వకామత్వముతోనైనను, మోక్షకామత్వ ముతోనైనను, ఎట్లైనను భగవానుని భజింపవచ్చును.

మోక్షము సుఖరూప మగుటవలనను, భక్తుఁడు దాని ననుభవించువాఁ డగుటవలనను, మోక్షముకంటె భక్తియే యధికతరమైనది. శర్కరగా మాఱుటకంటె, శర్కరను భుజించుట యధికతరము — అధికతరానంద దాయకము. శర్కర — శర్కరను భుజింపలేదు. భక్తుఁడు మోక్షమును గోర కుండుట కిదియే హేతువు.

భక్తిమార్గమున కన్నులు మూసికొనియైనను పయనింపవచ్చును. ఆత్మ లబ్ధికొఱకు భగవానునిచే నుపదిష్టములైన యుపాయముల ననుసరించుచుఁబోవు మానవుఁడు — ఎన్నఁడును సత్పథమును వీడఁడు. కన్నులు మూసికొని పోయినను, ఆతఁ డిసుమంతయు మార్గమును దప్పఁడు — పతనము జెందఁడు.

యోగులకు బ్రహ్మసిద్ధియందును, అఖిలాత్ముఁడగు భగవానునియం దర్పింపఁబడిన భక్తికంటె శుభకరమగు పథములేదు. భగవానునియందు ప్రయుక్తమైన భక్తి, శీఘ్రముగ అహైతుకమైన జ్ఞానమును జనింపఁజేయును. ఇట అహైతుక మనఁగా — శుష్కతర్కా ద్యగోచరమని యర్థము.

ఇట్టి భక్తియోగము - యేమంత కఠినమైనది గాదు. చాల సులభమైనది. దీని కధికా రనియమ మేమియు లేదు. సురలైనను, అసురలైనను, వానరులై నను, నరులైనను భగవానుని భజింపవచ్చును. అచ్యుతుని ప్రీతునిఁజేయుటయం

దేమియు నాయాసములేదు. హరి నుపాసించుటయందు ప్రయాస మేమియు లేదు. ముకుందుని ప్రీతికి – ద్విజత్వముగాని, దేవత్వముగాని, ఋషిత్వముగాని, విత్తముగాని, బహుజ్ఞతగాని యేమియును అక్కఱలేదు. దానముగాని, తపముగాని, యజ్ఞముగాని, శౌచముగాని, వ్రతములుగాని, భగవానుని ప్రీతికి అక్కఱలేదు. భగవదారాధనకు - ధనాభి జనరూప తపః శ్రుతౌజస్తేజ ప్రభావ బల పౌరుష బుద్ధియోగము లేవియును అక్కఱలేదు.

భక్తికి జ్ఞానకర్మములు అంగభూతములు, జ్ఞానకర్మల కంటెను భక్తి శ్రేష్ఠతరమైనది. భక్తిమార్గమున, ఇంద్రియముల సహజవృత్తిని నిరోధింప నక్కఱలేదు. ఇదియే భక్తియోగముయొక్క సౌలభ్యము

## భాగవత సాంగత్య ప్రభావము

భక్తికి ఉద్బోధక కారణములలో ప్రప్రథమము. ముఖ్యతమము, భగవద్భక్తుల సాంగత్యము అనఁగా – సాధుసేవ, మహత్సేవ, సత్సేవ, భాగవతసేవ యని తాత్పర్యము. ఇట, సాంగత్య మనఁగా - దర్శనము. స్పర్శనము, సంభాషణము, సేవ మున్నగునవి.

"సతాం ప్రసంగా న్మమవీర్య సంవిదో
భవంతి హృత్కర్ణ రసాయనాః కథాః
త జ్జోషణా దాశ్వప వర్గవర్త్మని
శ్రద్ధారతి ర్భక్తి రనుక్రమిష్యతి." — (3-25-25.)

నా భక్తి నెఱిఁగిన సాధువుల ప్రసంగమందు, నన్నుఁగూర్చిన హృత్కర్ణ రసాయనములగు కథలు వచ్చును. వానివలన మోక్షప్రాప్తి హేతువులగు శ్రద్ధయు, రతియు, భక్తియు ననుక్రమించునని సత్సాంగత్య మాహాత్మ్యమును భగవానుఁడే స్వయముగా ప్రవచించెను.

స్వర్గముకంటెను, మోక్షముకంటెను సత్సాంగత్య మధికము. భక్తుల సన్నిధియే యెట్టివారినయినను పునీతులఁ జేయును. భాగవతసేవవలన అమంగళము లన్నియు హత మగును. నైష్ఠికభక్తి యుద్భవించును.

సాధు సంభాషణము - ఎట్టి మనస్తాపమునైన శీఘ్రముగఁ బోఁగొట్టును. భాగవతులఁగూర్చిన స్మరణమే పవిత్రము చేయుచుండ, ఇఁక వారి దర్శన స్పర్శ

పాదశౌచాసనాదుల విషయ మేమని చెప్పవలెను ? సాధువులతోడి ప్రసంగము - మోక్ష ద్వారమును అపావృతముచేయును. ముక్తికి మహాత్సేవ, ద్వార మని చెప్పఁబడినది. భాగవతుల పాద సరోజ రేణువును శిరస్సుపై ధరించుట - పాపమును నశింపఁజేయుటయేగాక. సర్వ సద్గుణములను సంప్రాప్తింపఁజేయును. సాధు సంగమముయొక్క వైశిష్ట్యము - వక్తకు, శ్రోతకు సమ్మతమగుటయేగాక, సర్వులకును సుఖకర మగును.

మహాత్ములతోడి ప్రచుర సమాగమములేని నరుని జన్మము నిరర్థకము. భగవానునిగూర్చిన జ్ఞానము మహాత్ముల పాద రజోభిషేకమువలన మాత్రమే సంపాదింపనగును. తీర్థములు, మృచ్ఛిలామయములైన దేవతలు, దీర్ఘకాలమునఁగాని భక్తులను పవిత్రులఁజేయరు. కాని, సాధువులు దర్శన మాత్రముననే పునీతుల గావింతురు.

సత్సంగమువలె వ్రతములు - యజ్ఞములు మున్నగునవి యేవియు భగవానుని కరుణను సంపాదింపఁజాలవు. సాధువులుమాత్రమే భక్తికి విరుద్ధములైన భావములను భేదింపఁగలరు. సాధువుల కిట్టి మాహాత్మ్య మబ్బుటకు హేతువు - వారియందు హరి యుండుటయే.

సాధువులే భగవానునికి హృదయము. సాధువుల హృదయమే భగవానుఁడు. వా రిరువురికిని మఱియొకటి తెలియదు. సాధువులే దేవతలు. 'అసలు' దేవత లనఁబడువారు - స్వార్థపరులు. సాధువు లట్లుకాదు. దేవతల చరిత్రము సుఖమును, దుఃఖమును రెంటిని గల్గించును. కాని, సాధువుల చరిత్రము - ఒక్క సుఖమును మాత్రమే కల్గించును. భక్తుల విషయమున, దేవతల వర్తనము - పిండికొలఁది రొట్టెవంటిది. కాని, సాధువుల విషయ మట్లుకాదు. దేవతలకంటెను సాధువు లుత్తములు. ఇట్టి సాధు సాంగత్యము సులభముగ లభించునది కాదు. అది - దురాపము, దుర్లభము.

"దుర్లభో మానుషోదేహో దేహినాం క్షణభంగురః
తత్రాఽపి దుర్లభం మన్యే వైకుంఠ ప్రియదర్శనమ్." — (11-2-29.)

క్షణభంగురమైన మానవజన్మమే దేహులకు దుర్లభము. అందునను - వైకుంఠ ప్రియులదర్శనము, అతిదుర్లభము. వైకుంఠమునకు మార్గభూతులైన సాధువులసేవ, అల్పతపమునకు దురాపము.

" య ద్దుష్కరం య ద్దురాపం య ద్దుర్గం య చ్చతుష్కరమ్
త త్సర్వం తపసా ప్రాప్తం తపోహి దురతిక్రమః. " —(మనుస్మృతి.)

దుష్కరము - దురాపము - దుస్తరమునైన సర్వము తపముచే సాధ్యము. తపస్సు దురతిక్రమము. ఇట్లుచెప్పఁబడినను, అట్టి తపమునకుఁగూడ, స్వల్పమైనచో - సాధుసేవ దురాప మనుటయందు - దానివైశిష్ట్యము స్పష్టము.

ప్రారబ్ధ, సంచిత కర్మలవలన సంభవించిన పాపము నాశ మగుటకు - భక్తి యుపకరించును. మహాత్సేవవలన, పాపము నాశ మగును. పాపము నాశము కాఁగా - చిత్తసంశుద్ధి కలుగును. దానివలన వివేకము కలుగును. వివేకము (జ్ఞానము) కలుగుటయే భక్తియుద్భవించుటకు హేతువు.

## భక్తి సాధనములు

" నిషేవితే నానిమిత్తేన స్వధర్మేణ మహీయసా
క్రియాయోగేన శస్త్రేణ నాతిహింస్రేణ నిత్యశః
మద్ధిష్ణ్య దర్శన స్పర్శ పూజా స్తు త్యభివందనైః
భూతేషు మద్భావనయా సత్త్వేనా సంగమేవ చ
మహతాం బహుమానేన దీనా నామనుకంపయా
మైత్ర్యా చైవాత్మతుల్యేషు యమేన నియమేన చ
అధ్యాత్మికాను శ్రవణా న్నామసంకీర్తనాచ్చ మే
ఆర్జవే నార్యసంగేన నిరహం క్రియయా తథా
మద్ధర్మిణో గుణై రేతైః పరిసంశుద్ధ ఆశయః
పురుషస్యాంజసాభ్యేతి శ్రుతమాత్రగుణం హి మామ్."

— (3-29-15 నుండి 19.)

"ఏవం భూతాయాః భక్తే స్సాధనా న్యాహ పంచభిః నిషేవితేతి. నిషేవితేన సమ్యగనుష్ఠితేన, అనిమిత్తేన ఫలాభి రహితేన, స్వధర్మేణ నిత్యనైమిత్తికేన, మహీయసా శ్రద్ధాయుక్తేన, క్రియాయోగేన, పాంచరాత్రాద్యుక్త పూజా ప్రకారేణ, శస్త్రేణ నిష్కామేన.........మద్ధిష్ణ్యం మత్ప్రతిమాదితస్య దర్శనాదిభిః, సత్వేన ధైర్యేణ, అసంగమేన వైరాగ్యేణ........ఆర్జవేన అకౌటిల్యేన........ మద్ధర్మిణః భగవద్ధర్మానుష్ఠాతుః పురుషస్య, ఆశయః చిత్తమ్ "

— (శ్రీధరీయ వ్యాఖ్య)

సమ్యగనుష్ఠితము-ఫలాభిసంధిరహితము-శ్రద్ధాయుక్తము-నిత్య నైమిత్తికములైన స్వధర్మ నిర్వహణము - నిష్కామము - అనతిహింస్రమమునైన పాంచరాత్రామాద్యుక్త పూజ - ప్రతిమాదుల దర్శనము - స్పర్శ - పూజ - స్తుతి - అభివందనము - భూతములయందు భగవద్భావన - ధైర్యము (సత్త్వము) వైరాగ్యము (అసంగము) - మహాత్ములను సన్మానించుట - దీనులను దయతోఁ జూచుట - సములయెడ మైత్రితో మెలఁగుట-శమము-నియమము-ఆధ్యాత్మికాను శ్రవణము-భగవన్నామ సంకీర్తనము - ఆర్జవము - ఆర్యసంగము - నిరహంక్రియతమున్నగు వానిచే చిత్తము పరిశుద్ధ మగును-ఇట్టి భగవద్ధర్మముల ననుష్ఠించిన పురుషుఁడు-శ్రుతమాత్రగుణుఁడైన భగవానుని శీఘ్రమే పొందును.

అనఁగా - చిత్త పరిశుద్ధికి సాధనములగునవి యన్నియు భక్తికిసాధనములే యని భావము. కారణము - చిత్తము పరిశుద్ధ మగు క్షణము, భక్తి యుద్భవించు క్షణము ఒకటియే యగుట. ఈ సాధనముల విషయమున, తరువాతి శాండిల్య సూత్రములందు బహిరంతర విభజన మేర్పడినది.

జ్ఞాన వైరాగ్యములు - శౌచము - జపము - తపము - హోమము - శ్రద్ధ - ఆతిథ్యము-భగవదర్చనము-తీర్థాటనము-ఆచార్యసేవనము-స్వధర్మ నిర్వహణము-విధర్మనివర్తనము-తీవ్రమైన యాత్మసమాధి-గ్రామ్యధర్మ నివృత్తి-మోక్షధర్మరతి-స్వాధ్యాయము - గురూపాసన - మితభోజనము - వివిక్తసేవనము - విమన్యుత - అనుద్వేగత మున్నగు భక్తి నియమములు చెప్పఁబడినవి.

## భక్తికి అధికారులు

భక్తికి అధికార నియమము లేకున్నను, దానికిఁ గావలసిన కనీసమైన యర్హతయు యోగ్యతయు ఆవశ్యకములే. వాని విషయమై, భాగవత మీ క్రింది విధముగా నను చున్నది.

> " యదృచ్ఛయా మత్కథాదౌ జాతశ్రద్ధస్తు యః పుమాన్
> న నిర్విణ్ణో నాఽతిసక్తో భక్తియోగోఽస్య సిద్ధిదః." — (11-20-8.)

భగవానునిగూర్చిన కథలయందు, యాదృచ్ఛికముగా నెవనికి శ్రద్ధయుదయించునో - అనిర్విణ్ణుఁడును, అనతి సక్తుఁడునగు నాతనికి భక్తియోగము సిద్ధినిచ్చును. నిర్విణ్ణులకు జ్ఞానయోగము, అతిసక్తులకు కర్మయోగము ఉండనే ఉన్నవి. అనఁగా — నిర్విణ్ణుఁడును, అతి సక్తుఁడును కాని వానికి భక్తియోగము

సిద్ధించునని యర్థము. భక్తుఁడు - నిర్విణ్ణత పొందనక్కఱలేదు; అతిసక్తుఁడును కానక్కఱలేదు. ఉన్నవానిని త్యజింప నక్కఱలేదు, లేనివానికై ఆరాటపడ నక్కఱలేదు. ఉన్నవానివలననే లేనివానిని సాధింపవచ్చును. భక్తియోగము యొక్క యాంతర్య మంతయును ఇదియే. ఆనుషంగికముగ నిట భక్తి, జ్ఞాన, కర్మ యోగముల సంబంధమును, జ్ఞానకర్మలకంటె భక్తికిఁగల యాధిక్యమును చెప్పఁబడిన ట్లయినది. జ్ఞానకర్మలు రెంటికిని కూర్పఁబడిన యొక చక్కని సమన్వయమే భక్తియోగము.

భక్తి కలుగువఱకును కర్మ మావశ్యకమే. భక్తి కలుగగనే జ్ఞానము, వైరాగ్యము వానియంతట నవియే కలుగును. జ్ఞాని యెల్లపుడును భక్తుఁడేగదా!

శ్రద్ధధానత - భక్తి (ఇట భక్తియనఁగా - గౌరవభావము) - వినీతత - అనసూయత - భూతకృతమైత్రి - శుశ్రూషాభిరతి - వైరాగ్యము - శాంతచిత్తత - ధీమత్త - నిర్మత్సరత - శుచి - భగవానుఁడనిన అతులమగు ప్రీతి - దోషవిహీనత - బ్రహ్మణ్యత - ప్రియత్వము (గురువునకు ప్రియుఁడై యుండుట) - సాధుత్వము మున్నగు గుణములు గల్గిన శూద్రులైనను, స్త్రీలైనను భక్తియోగమున కర్హులే.

భక్తియోగమునకు పై గుణము లవసరములని చెప్పుట - కేవలము ఔపచారికము మాత్రమే. కారణము - ఇట్టి గుణములుగల వ్యక్తికి భక్తి, దాని యంతట నదియే యుద్భవించును. ఉద్భవించుటకాదు - ఉండితీరును.

## భక్తికి అనర్హులు

పరుల నుద్వేగపఱచు ఖలత్వము - అవినీతి - స్తబ్ధత (అనఁగా - చెప్పునది గ్రహింప లేకుండుట) - దురాచారత్వము - ధాంభికత్వము - లౌల్యము - గృహము నందు రూఢమైన చేతము (గృహమనఁగా - దేహ మనియుఁ జెప్పవచ్చును. అనఁగా - వైరాగ్యము లేకుండుట యని యర్థము.) — భక్తి లేకుండుట — భక్తి యెడ ద్వేషము - నాస్తికత - వంచన - అశుశ్రూషత మున్నగు గుణములు భక్తియోగమున కనర్హత నాపాదించుచున్నవి.

ఇట్టి గుణము లున్నచోట - ఒక్క భక్తియే కాదు - ఆధ్యాత్మికవాసనయే లేశమైనను నుండుటకు ఏ యవకాశము లేదు. భక్తి కలుగుటకు అంతరాయములుగ, ప్రధానముగా - స్త్రీ, విత్త, విషయ ప్రియత్వములు చెప్పఁబడినవి.

స్త్రీ సంగమువలన సత్యము, శౌచము, దయ, మౌనము, బుద్ధి, సంపద, లజ్జ, యశము, క్షమ, శమము, దమము, భాగ్యము మున్నగునవి నశించును. స్త్రీ వలనఁగలుగు అనర్థములు చాల విపులముగ నిరూపింపఁ బడినవి.

స్తేయము - హింస - అనృతము - దంభము - కామము - క్రోధము స్మయము (గర్వము) - మదము - భేదము - వైరము - అవిశ్వాసము - సంస్పర్ధ స్త్రీ - ద్యూతము - మద్యము అను పదునైదును అనర్థములు.

విషయములయందలి గుణములను ధ్యానించుటవలన సంగము, సంగము వలన కామము, కామము వలన వివాదము, వివాదమువలన తీవ్ర క్రోధము, క్రోధమువలన తమము, తమముచే చేతనత నశించుట, దానివలన - శూన్యత్వము, మృతకల్పమైన అట్టి మూర్ఖువలన పురుషార్థభ్రష్టత సంభవించును. స్త్రీ, విత్త, విషయేచ్ఛల వలనఁ గలుగు ఫలితము లన్నియు భక్తి కలుగుటకు వలయు ప్రకృతిని తెలుచునవియే. అందువలననే - అవి భక్తికి ఆటంకము లైనవి.

స్త్రీ విత్త విషయేచ్ఛాదులవలనఁ గలుగు అనర్థములను గూర్చిన పయి నిరూపణము - 'నేతిని నెత్తురువలెను, అభ్యంగమును స్త్రీ సంగమువలెను, స్త్రీలను పాములవలెను, బంగారమును విషమువలెను భావించి, సన్యాసి వానిని పరిత్యజింపవలె'నను సన్యాసోపనిషద్వచనముల వివరణమును —

"స్త్రీ ధన నాస్తిక వైరిచరిత్రం న శ్రవణీయమ్."

ఇత్యాది నారదభక్తి సూత్రాది వచనములకును - ఉపనిషత్తుల వలెనే మూలకందము నగుచున్నది. భక్తి శాస్త్ర పరిణామ క్రమముయొక్క విధానమును గ్రహించుటకు - పయి నిరూపణము తోడుపడు ననుట స్పష్టము.

## భక్తుని లక్షణములు

భాగవతమున భిన్నములగు తావులయందు, బహుధా ప్రోక్తములైన యంశము లన్నిటినిబట్టి, నిజమగు భక్తునకు ఈ క్రిందిలక్షణము లుండితీరునని నిర్ణయింపవచ్చును.

అహింస : మనోవాక్కాయములు మూఁడిటివలనను హింసలేకుండుట. హింసను గూర్చిన సంకల్పముగూడ హింసయే. అహింస-యనగా, హింస లేకుండుటయే కాదు, పరమ ప్రేమను గలిగియుండుటగూడ. అహింసయే సత్యము, ఋతమును.

సత్యము :— ఏది యనాదియై, యింతవఱకు పూర్వమున్నదో - అది. సత్యమనఁగా - అహింసయే. పరమ ప్రేమయే.

అస్తేయము :— తనకేవి లేకున్నను, తన జీవితమున కొటంకముండదో - అట్టివానిని గలిగియుండుటగూడ స్తేయమే. స్తేయ విషయిక భావనయు స్తేయమే. ఈయవలసిన వాని నీయకుండుటయు స్తేయమే.

అసంగము :— త్రికరణములందును సంగము లేకుండుట.

హ్రీ :— భవమును బొందినందువలన లజ్జ.

అసంచయము :— ప్రాణముల కాధారభూతములగు వానికంటెను ఇతరములగువానిని సంపాదించుట సంచయము. అట్టిది లేకుండుటయే అసంచయము. అస్తేయమునకును, అసంచయమునకును ప్రయత్నము మాత్రమే భేదము.

ఆస్తిక్యము :— ఉన్నదానిని ఉన్నదని భావింపఁగలుగుట. అట్టి భావనకవసరమగు అర్హతను సంపాదించుటకై యత్నించుట.

బ్రహ్మచర్యము :— త్రికరణములయందు బ్రహ్మచర్యము నాచరించుటయే కాదు - ఇంద్రియము లన్నిటియందును సంయమనము గలిగియుండుటగూడ. అంతమాత్రమేకాదు - బ్రహ్మభావనయందు సంతతము సంచరించుటగూడ.

మౌనము :— మనోవాక్కాయములను, వానివాని ధర్మము లన్నింటి నుండి దూరముచేయుట.

స్థైర్యము :— త్రికరణములయందును స్థిరత్వ ముండుటయేకాదు - వానిని భగవానుని కర్పించుటగూడ.

క్షమ :— అసహ్యములగువానిని త్రికరణములచే సహించుటయేకాదు - వానియందును తత్కర్తలయందును యెట్టి ద్వేషము లేకుండుటగూడ.

అభయము :— అసత్తునుగూర్చిన భీతి లేకుండుటమాత్రమేకాదు - సత్యమునుగూర్చిన స్థైర్యమును గలిగియుండుటగూడ.

పరార్థేహా :— ప్రాణు లన్నిటికిని ఆనందమును గోరుటమాత్రమేకాదు - ఇంద్రియము లన్నిటిని ఆ ప్రయత్నమున మగ్నముచేయుటగూడ. అంతమాత్రమే కాదు - ఆనంద వ్యతిరిక్తమైన యది త్రికరణములయందును లేకయుండుట.

తుష్టి :- జ్ఞానేంద్రియము లైదింటియందును, తన్మూలమున మనము నందును, ఉన్నదానితో తృప్తినొందుట మాత్రమేకాదు - లేనిదాని నేమాత్రమును కోరకుండుట; కర్మేంద్రియము లయిదింటిని మనసున కవ్యతిరిక్తముగనే కాక, అనుకూలముగను ప్రవర్తింపఁ జేయుటగూడ.

శమము :— భగవన్నిష్ఠమైన బుద్ధి.

దమము :— ఇంద్రియ సంయమనము.

తితిక్ష :— దుఃఖము నణఁచుట.

ధృతి :— జిహ్వోపస్థలను జయించుట.

దానము :— త్రికరణములయందును దండమును త్యజించుట.

తపము :— కామత్యాగము.

శౌర్యము :— స్వభావ విజయము.

సమదర్శనము :— సత్యము.

ఋతము :— ఋషులచే పొగడఁబడిన సూనృతవాణి, ఏది యొఁకముం దనంతమై యుండునో - అదియే ఋతము.

శౌచము :— కర్మములయం దసంగత్వము.

సన్న్యాసము :— దృశ్యమగు సర్వమును త్యజించుట.

ధర్మము :— నరులలో నధిక సంఖ్యాకులకు ఇష్టమైనది.

యజ్ఞము :— భగవానుఁడే యజ్ఞము. ఆ యజ్ఞరూపమును పొందుట యని యర్థము.

దక్షిణ :— జీవితము మూలమున జ్ఞాన సందేశము నిచ్చుట.

బలము :— మనస్సును భగవానునియందు లీనముచేయుట.

భగము :— భగవానునిగూర్చిన యైశ్వర్య భావము.

లాభము :— భగవానునియందు ఉత్తమ భక్తిని గల్గియుండుట.

విద్య :— ఆత్మలయందు భేదత్వమును జూచినచోఁ గల్గుబాధ.

జుగుప్స :— అకర్మములయెడఁ గలుగు లజ్జమాత్రమేకాక, అసహనము గూడ.

శ్రీ :— గుణములను గలిగియుండుట.

సుఖము :— లౌకికవ్యవహారమునందు సుఖ దుఃఖములని చెప్పఁబడు రెంటిని అతిక్రమించిన స్థితి.

దుఃఖరాహిత్యము :— త్రైవర్గిక సుఖాపేక్ష లేకుండుట.

పాండిత్యము :— బంధమోక్షమును గూర్చిన విధము నెఱింగి యుండుట.

మూర్ఖత లేకుండుట :— దేహాద్యహం బుద్ధియే మూర్ఖత. అది లేకుండుట యన్న మాట.

పథమునందు వర్తించుట :— నిగమస్మృతమైన మార్గమున వర్తించుట. బాగుగా నడపించునది నిగమ మనబడును.

ఉత్పథము లేకుండుట :— ఉత్పథమార్గమనఁగా - ఆకాశ మార్గము. అనఁగా - అమార్గమని యర్థము. చిత్తవిక్షేపము అమార్గము. అట్టి యమార్గమునఁ బోకుండుట.

స్వర్గమును గలిగియుండుట :— సత్త్వగుణోదయమే స్వర్గము.

నరకము లేకుండుట :— తమః ప్రజ్వలనమే నరకము. అది లేకుండుట.

ఆఢ్యత్వము :— గుణములను గలిగియుండుట.

దరిద్రత లేకుండుట :— అసంతుష్టియే దరిద్రత. అది లేకుండుట యన్న మాట.

కృపణత లేకుండుట :— అజితేంద్రియతయే కృపణత. అట్టిది లేకుండుట. అనఁగా - జితేంద్రియత్వ మన్న మాట.

ఈశత్వము :— గుణాతీతత్వము.

అనీశత లేకుండుట :— గుణములకు లోఁబడుట యనీశత. అట్టిది లేకుండుట. అనఁగా - ఈశత్వముగలిగి యుండుట యని యర్థము.

దోషము లేకుండుట :— గుణదోషదర్శనము దోషము. అట్టిది లేకుండుట యని యర్థము.

సుశీలత :—భగవానుని బొందుట కనువైన శీలము.

అకించనత :—లౌకిక విషయము లేమాత్రము లేకుండుట.

నిరపేక్షత :—ఫలమును గూర్చిన భావన యణుమాత్రమును లేకుండుట.

నిర్వైరము :—భేదభావము లేక, సమదర్శనము గల్గియుండుట.

భగవదనురక్తి :—భగవానునియందు పరమప్రేమను గల్గియుండుట.

అఖిల జీవ వత్సలత :—అఖిలజీవములను తన పరమప్రియుఁడైన భగవానుఁడు, ఆత్మరూపములుగ సృజించెనని యెఱింగి, ఆ జీవులయందు వాత్సల్యమును గల్గియుండుట,

ఆత్మవద్దర్శనము :—సర్వభూతములను తనయందు, తన్ను సర్వభూతముల యందును జూచుచు, నిరంతరము వానికి మనసున మ్రొక్కుట.

నష్టాహంకారత :—తా ననెడి భావము సర్వము త్యజించి, తన్నీ భువి యందలి ప్రతిప్రాణికంటెను తక్కువగఁ జూచుకొనుట.

విత్తము నష్టమైనవానివలె నాతురత :—భగవంతునకు సన్నిహితుఁడై యుండవలసిన తాను, దూరమై, అతనిని పోగొట్టుకొంటినే యను భావముచేఁ గలుగు నాతురత.

సన్నిపాతము లేకుండుట :—నేను, నాది అను అహంభావము సన్నిపాతము. అది లేకుండుట.

నిందాస్తుతులు విడచి, అనిమిత్తుఁడై, సూర్యునివలె చరించుట :— ఇష్టానిష్టములు రెంటికిని అతీతుఁడై ఏకత్వమును బొందుట.

సంశయరహిత :—భగవానునిగూర్చియు, అతని స్వరూపమును గూర్చియు సంచయ మేమాత్రము లేకుండుట.

మోక్షముగూడఁ గోరకుండుట - భగవత్సేవనుమాత్రమే కోరుట :— మోక్షమున పరమఫల రూపమైన భక్తికి అవకాశము లేకపోవుటయే కారణము.

సుహృదత్వము :—అజాత శత్రుత్వము, సాధుత్వము.

తాపము :— భగవానునినుండి వేఱైతి నను దుర్భర వేదనయొక్కఫలము.

మాహాత్మ్యము:—భగవద్బుద్ధ హృదయత - భగవ దాశ్రయము - భగవ త్కథామృష్టత - భగవ త్కథాశ్రవణము - భగవ త్కథాకథనము - స్మృతి (ఎట్టి స్థితియందైనను విచక్షణను, జ్ఞానమును గోల్పోకయుండుట) - బుధుఁడైనను బాలకునివలె క్రీడించుట - కుశలుఁడైనను జడునివలె చరించుట-విద్వాంసుఁడైనను ఉన్మత్తునివలె మాటాడుట - నియతమగు చర్య లేకుండుట - కర్మములు, పాషండ త్వమును, తర్కమును అధిగమించుట - శుష్కవాదమునకు దిగకుండుట - అనివార్య మగు స్థితియందు మాటాడవలసి వచ్చినను, అతివాదమునకు బోకుండుట - అట్లు మాట్లాడుట యందును ఎవరికిని ఏమాత్రమును న్యూనత గలిగింపకుండుట - దృఢ నిశ్చయముగలిగి, బకమువలె లక్ష్యమును జేరుట మొదలగునవి భక్తున కుండవలసిన లక్షణములు.

వివేకానందుఁడు చెప్పిన (Bhakti yoga-The triogle of love) పరమ ప్రేమ యొక్క లక్షణములు మూఁడును అనఁగా - అభీతి, నిరపేక్షత, ఏ ప్రాణికంటెను తాను తక్కువయని భావించుట, పై లక్షణములలోనివే.

## భక్తుని ధర్మములు

భగవత్కథలందు శ్రద్ధ, భగవత్కథావ్యాఖ్యానము, పూజయందు నిష్ఠ, స్తుతి, పరిచర్యయం దాదరము, సర్వాంగములతో నభివందనముసేయుట, భక్తులను పూజించుట, సర్వభూతములయందును భగవ ద్భావనజేయుట, అంగచేష్టలన్నియు భగవదర్థముసేయుట (అనఁగా-భగవత్కార్యార్థమే యంగము లన్నిటి నుపయో గించుట) భగవత్కథా కథనము, మనసును భగవానునియం దర్పించుట, సర్వ కామములను వర్జించుట, అర్థపరిత్యాగము, భోగపరిత్యాగము, సుఖపరిత్యాగము ఇష్ట దత్త హుత జప్త వ్రత తపములను భగవానుని కర్పించుట, ఈ ధర్మముల నాచరించుచు, భక్తుఁడు ఆత్మనివేదనమొనర్చినచో-అతనిభక్తి, మహోన్నతస్థితి నందుకొని, లక్ష్యసిద్ధికి దోహదమొసంగును. అట్టివాని కిక గావలసిన దేమియు నుండదు.

## నవవిధ భక్తులు

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మ నివేదనమ్
ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తిశ్చే న్నవలక్షణా." — (7-5-23,24.)

శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మ నివేదనము అని, భక్తి-నవ లక్షణ లక్షితముగా చెప్పఁబడినది.

పై వానియందు-శ్రవణము, కీర్తనము, పాదసేవనము, అర్చనము, వందనము అను నైదును భక్తిని వ్యక్తీకరించునవి మాత్రమే. స్మరణము, దాస్యము, సఖ్యము, సఖ్యము, ఆత్మ నివేదనము అనునవి-భక్తి భావపరిణామ మందలి యవస్థలు.

ఈ నవ విధ భక్తుల ప్రాశస్త్యము-ఈ క్రిందివిధముగా విపులీకరింపఁబడినది.

౧. శ్రవణము :

"శృణ్వతాం స్వకథాం కృష్ణః పుణ్యశ్రవణకీర్తనః
హృద్యన్తస్థో హ్యభద్రాణి విధునోతి సుహృత్సతామ్." (1–2–17)

ఉత్తముల స్నేహితుఁడగు కృష్ణుఁడు-తన కథలను వినువారి హృదయమం దుండి, వారి యమంగళములను బోఁగొట్టును. కృష్ణకథాశ్రవణ కీర్తనములు పుణ్యావహములు.

౨. కీర్తనము :

"ఇదం హి పుంస స్తపస శ్రుతస్య వా
స్విష్టస్య సూక్తస్య చ బుద్ధిదత్తయోః
అవిచ్యుతోఽర్థః కవిభి ర్నిరూపితో
య దుత్తమశ్లోకగుణానువర్ణనమ్." (1–5–22)

ఉత్తమశ్లోకుని గుణానువర్ణనమే ఋషులచే నిరూపింపఁబడిన తపమునకు, శ్రుతమునకు, అగ్నిష్టోమాది రూపేష్టమునకు, తటాకాది ప్రతిష్ఠారూపమైన పూర్తమునకు, శంసనపూర్వక దానములకును అవిచ్యుతమైన ఫలము.

౩. స్మరణము :

"ఏతావాన్ సాంఖ్యయోగాభ్యాం స్వధర్మ పరినిష్ఠయా
జన్మలాభః పరః పుంసాం అంతే నారాయణస్మృతిః." (2–1–6)

సాంఖ్యము, యోగము, స్వధర్మ పరినిష్ఠ వీని యన్నిటివలనను పురుషుని జన్మమునకుఁ గలుగు పరమలాభము అంత్యదశయందు నారాయణుని స్మరించుటయే.

౪. పాదసేవనము:

"దేవో ఽసురో మనుష్యో వా యక్షో గన్ధర్వ ఏవ చ
భజ న్ముకున్ద చరణం స్వస్తిమాన్ స్యాద్యథావయమ్." (7–7–52)

దేవాసుర మనుష్య యక్ష గంధర్వాదులయం దెవరైనను, ముకుందుని చరణములను భజించి, శుభమును బొందఁగలరు. ముకుందుఁ డనఁగా—"ముకుం-ముక్తిం దదాతీతి ముకున్దః" ముక్తి నిచ్చువాఁడని యర్థము.

౫. అర్చనము:

"యథా తరోర్మూల నిషేచనేన
తృప్యన్తి తత్స్కంధభుజోపశాఖాః
ప్రాణోపహారాచ్చ యథేంద్రియాణామ్
తథైవ సర్వార్హణ మచ్యుతేజ్యా." (4–31–14)

చెట్టుయొక్క మొదటిని దడుపుటవలన-స్కంధ, భుజోపశాఖ లెట్లు తృప్తి జెందునో, ప్రాణమున కిడిన యాహార మెట్లింద్రియములఁ దృప్తిపఱచునో, అట్లే-అచ్యుతుని యర్చనము సర్వదేవతలకు వర్తించును.

౬. వందనము:

"హృద్వాగ్వపుర్భిర్వ దధన్నమస్తే
జీవేత యో ముక్తిపదే సదాయ భాక్." (10–14–8)

హృదయముచేతను, వాక్కుచేతను, కాయముచేతను భగవానునికి నమస్కరించుచు జీవించువాఁడు ముక్తిపదమున కర్హుఁడు.

౭. దాస్యము:

"య న్నామశ్రుతిమాత్రేణ పుమా న్భవతి నిర్మలః
తస్య తీర్థపదః కిం వా దాసానా మవశిష్యతే?" (9–5–16)

ఎవని నామమును వినిన మాత్రమున నే పురుషుఁడు నిర్మలుఁ డగునో-అట్టి భగవానుని యొక్క దాసులకు కావలసిన దేమున్నది? (ఏమియు లే దనుట.)

౮. సఖ్యము :

"అహో భాగ్య మహోభాగ్యం నన్దగోపవ్రజౌకసామ్
యన్మిత్రం పరమానన్దం పూర్ణం బ్రహ్మసనాతనమ్." (10–14–32)

సనాతనుఁడు, పరిపూర్ణుఁడు, పరమానంద స్వరూపుఁడునైన బ్రహ్మను (భగవానుని) మిత్రునిగ బడసిన నందగోప వ్రజవాసులది యేమిభాగ్య మేమి భాగ్యము!

౯. ఆత్మ నివేదనము :

"మర్త్యో యదా త్యక్తసమస్తకర్మా
నివేదితాత్మా విచికీర్షితో మే
తదాఽమృతత్వం ప్రతిపద్యమానో
మయాఽఽత్మభూయాయ చ కల్పతే వై."

మర్త్యుఁ డెప్పుడు త్యక్తసమస్త కర్ముఁడయి, భగవన్నివేదితాత్ముఁ డగునో-అప్పుడు భగవానుని విశిష్ట కర్తవ్యమునకు పాత్రుఁడై, అమృతత్వమునకు యోగ్యుఁడై, భగవానునిచే భగవద్భావము పొందింపఁ బడును.

ఇందు-ఆత్మనివేదన మనఁబడు శరణాగతి ప్రభావమును భాగవతము బహువిధములఁ జాటుచున్నది. వ్యసనాత్యయమైన భగవత్పదములయందు శరణము పొందిన ధీరులకు, పొందరాని దనుచు నేదియు లేదు.

"కిం దురాపాదనం తేషాం పుంసా ముద్దామచేతసామ్
యై రాశ్రితస్తీర్థపద శ్చరణో వ్యసనాత్యయః." (3–23–42)

## పరభక్తిస్వరూపము

పరభక్తుని స్థితిని భాగవత మీ క్రిందిరీతిగా విశదీకరించుచున్నది :—

ఆతని చిత్తము ప్రణయార్ద్రమగుటచే, పులకితగాత్రుఁ డగును. హృదయము ద్రవించుటచే, బాష్పపూరితనేత్రుఁ డగును. గద్గదకంఠుఁ డగును. కనిపించునది భగవానుఁడొక్కఁడే యగుట - నోటమాట యుండదు. ఊరక

చూచును. ఊరక నవ్వును. ఊరక యేడ్చును. ఉచ్చైస్స్వరముతో పాటలు పాడును. ఒడలు తెలియక నృత్యము చేయును. ఆనందాబ్ధిలో నుక్కిరిబిక్కిరియై ఆతఁడు-ఆమృతుఁ డగును. భగవ ద్విరహముననే ఆతఁడు ప్రాణములు విడచును.

## భాగవత లక్షణములు

ఆత్మయొక్క భగవద్భావమును సర్వభూతముల యందును, భగవ త్స్వరూపమైన ఆత్మయందును తనయందు సర్వభూతములఁను జూచువాఁడు భాగవతోత్తముఁడు.

భగవానునియందును, త దధీనులయందును, మూర్ఖులయెడను, క్రమముగా ప్రేమ, స్నేహము, దయ, ఉదాసీనలతో వర్తించువాఁడు భాగవతమధ్యములు.

భగవ త్ప్రతిమలనుమాత్రమే శ్రద్ధతోఁ బూజించుచు, భక్తులయెడను - ఇతరుల యెడను అట్టి భగవ ద్భావము లేనివాఁడు ప్రాకృతభక్తుఁడు.

ఇంకను భాగవతోత్తముని లక్షణములు, భాగవత ప్రధానుని లక్షణములు, అగ్రవైష్ణవుని లక్షణములు, హరిప్రియుని లక్షణములు విపులముగాఁ జెప్పఁబడినవి. కాని, ఆ లక్షణము లెల్లను, పూర్వోక్త భక్త లక్షణములయం దంతర్లీనమగు నవియే. ఉత్తముఁడు - నిష్ణాతుఁడు నైన గురునియొద్ద జిజ్ఞాసువైన శిష్యుఁడు, నియమముతో భాగవత ధర్మములయొక్క శిక్షణమును పొందవలెనని చెప్పఁబడి, ఆ శిక్షణాక్రమము, భాగవత ధర్మములు విపులీకరింపఁ బడినవి. ఆ ధర్మము లన్నియు పూర్వోక్త భక్తలక్షణములం దంతర్గతమగునవియే.

## భక్తుని వైశిష్ట్యము

భక్తుని వైశిష్ట్యమంతయు నొక్కమాటలో, క్రిందివిధముగాఁ జెప్పఁబడినది.

"మ ద్భక్తియుక్తో భువనం పునాతి." (11-14-24)

నా భక్తుఁడు విశ్వమును పవిత్రమును 'చేయు' నని భగవానుఁడే స్వయముగా పలికినాఁడు. ఈ భావమునే నారదుఁడుకూడ - 'స లోకాం స్తారయతి' ఆ భక్తుడు లోకమును తరింపఁజేయునని చెప్పియున్నాఁడు.

భగవానుఁడు భక్తపరాధీనుఁడు. సర్వమును త్యజించి, తనను శరణు బొందిన భక్తుల నెన్నటికిని ఆతఁడు వదలఁడు. ఆతఁడు కరుణా సముద్రుఁడు. వైరముచేత నాతని గతి విలాసవిలోక నాకారాదులను, శయ నాసనాదులయందు ధ్యానించు శిశుపాల పౌండ్ర సాల్వాదులకే సారూప్యముక్తిని ప్రసాదించినవాఁడు. ఇఁక నాతని ననురక్తితో భజించువారి విషయము చెప్పవలెనా?

"వైరేణ యం నృపతయ శ్శిశుపాలపౌండ్ర
సాల్వాదయో గతివిలాసవిలోక నాద్యైః
ధ్యాయన్త ఆకృతధియ శ్శయనాసనాదౌ
తత్సామ్య మాపు రనురక్తధియాం పునఃకిమ్?" (11-5-48)

భక్తిప్రవాహయోగము (3–33–24), భావయోగము (6–3–26), భక్తివితానయోగము (3-25-31) మున్నగు పదములు భక్తియోగ మను నర్థమున ప్రయోగింపఁబడినవి.

శ్రీమద్భాగవతము పై విధముగ భక్తితత్త్వ విషయమున, ప్రధానముగా నుపనిషత్తులకు వ్యాఖ్యానమును, తరువాతికాలమున వచ్చిన భక్తిసూత్రములకు లక్ష్యకోశమును నగుచున్నది.



# నారదుఁడు-భక్తిప్రచారము

"సరస కవి – కవి శేఖర"

★ ★ ★

శ్రీ కేశవభొట్ల సుదర్శన వేణుగోపాలమూర్తి, బి. ఏ.

## భూమిక

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" — (భగవద్గీత: 4-8.)

సాధువులను సంరక్షించుటకును, దుర్మార్గులను దునుమాడుటకును, ధర్మము నుద్ధరించుటకును యుగ యుగమునను నే నవతరింతు' నని శ్రీకృష్ణభగవానుఁడు వక్కాణించియున్నాఁడు. ఇట్టి భగవంతుని లీలా వినోదములకు యథోచితమైన పూర్వరంగములను సిద్ధమొనర్చి, వాని కవసరమగు సాధన సంపదను సమకూర్చి, ప్రపంచమునకు శ్రేయమును గల్గించు నిమిత్తమై, భగవత్ప్రతినిధులును ఆ యా సమయములలో అవతరించుట పరిపాటియై యున్నది. ఇట్టి భగవత్ప్రతినిధులు-కారణ జన్ములుగా వ్యవహరింపఁబడుచుందురు.

ఈ కారణ జన్ములు-పరార్థ ప్రాపకులై, ప్రజలకు ఆధ్యాత్మిక చైతన్యమును గల్గించుచు, వారిని తరింపఁ జేయుటయే పరమాశయముగాఁగల్గి ప్రవర్తించుచుందురు. మఱియు – ప్రభువు, సేవకుఁడు – పురుషుఁడు, స్త్రీ – బాలుఁడు, వృద్ధుఁడు ధనవంతుఁడు, దరిద్రుఁడు అను భేదము నెంచక, ఎల్లఅను ఏకరీతిగా సమదృష్టితో గాంచుచు, అందఱియందును భగవత్కటాక్షము ప్రసరింపవలెనని వాంఛించు చుందురు. ఇట్టి భగవత్ప్రతినిధులలో కొందఱు – కొన్ని ప్రత్యేక సందర్భము లందును, కతిపయ సన్నివేశములందును కార్యనిర్వాహకులై, ప్రముఖ స్థాన మలంకరించుచు గన్పట్టుచుందురు. దేవర్షి నారదుఁ డట్టివాఁడు.

"అహో! దేవర్షి ర్ధన్యోఽయం యత్కీర్తిం శార్ఙ్గధన్వనః
గాయన్ కార్యన్నిదం తన్త్ర్యా రమయ త్యాతురం జగత్."

ఓహో! దేవర్షీ! అనవరతమును వీణావాదనము గావించుచు, శ్రీహరి లీలలను గాన మొనర్చుచు, ప్రపంచమును రమింపఁజేయుచున్న నీవు – పరమ ధన్యుఁడవుగదా! అని నారదుని, శ్రీమద్భాగవతము అనేక విధములుగా అభినందించుచున్నది. అవును – భగవన్నామ సంకీర్తనముకంటెను ప్రపంచమునకు మేలు చేకూర్చునది వేఱొకటి యేమున్నది? అన్యథా శరణం నాస్తి. ఈ కారణమువలననే, నిరంతర హరినామ సంకీర్తనా తత్పరుఁడైన నారదుఁడు – ఇట్లు బహుధా ప్రశంసింపఁబడుచున్నాఁడు.

## భగవన్నామప్రభావము

"సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చదృఢవ్రతాః
నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే."— (భగవద్గీత : 9-14)

దృఢసంకల్పముగలవారు – భక్తితో నన్నే సంకీర్తించుచు, నాకే నమస్కరించుచు, నన్నే నిత్యము ఉపాసించుచుందు'రని శ్రీకృష్ణభగవానుఁడు నుడివియున్నట్లు–భగవన్నామ సంకీర్తనమే మానవులకు శరణ్యమనియు, ఇతర సాధనోపాయములు ఫలవంతములు కాఁజాలవనియు బాగుగా గ్రహించిన మహర్షులు– విశ్వకల్యాణ కాంక్షగలవారగుటచే 'నామస్మరణా దన్యోపాయం నహి పశ్యామో భవతరణే' భవసాగర తరణమునకు భగవన్నామ స్మరణకంటెను ఇతరోపాయ మేదియు లేదని లోకమునకు చాటియున్నారు. శ్రీశుకమహర్షి, వ్యాస భగవానునిచే రచింపఁబడిన భాగవత పురాణమును పరీక్షిన్మహారాజుకు విన్పించు సందర్భమున, ఈ విషయమును ఇట్లు విశదీకరించియున్నాఁడు : 'ఓరాజా! ఈ కలియుగ మెన్ని దోషములతో నిండియున్నను, ఒక ఉత్తమ లక్షణమును గూడు కొనియే యున్నది సుమా! ఏమన, శ్రీకృష్ణపరమాత్ముని లీలావిశేషములను గాన మొనర్చినంతమాత్రముననే కర్మపాశబంధములనుండి విడివడి, మానవులు మోక్షము నందఁగలరు. ఇదియే కలియుగమునకుఁగల ప్రత్యేకత. అదియునుఁ గాక, కృతయుగమున తపస్సువలనను – త్రేతాయుగమున యజ్ఞమువలనను – ద్వాపరయుగమున భగవత్సేవవలననుఁ గల్గు ఫలము – కలియుగమున కేవలము హరినామ స్మరణమువలననే గల్గునుగదా!' ఈ మాటలను పాటించియే పరీక్షిత్తు హరినామస్మరణాయత్తచిత్తుఁడై, భగవద్వైభవమును శుకుని మూలమున శ్రద్ధాసక్తులతో శ్రవణముగావించి, ఏడుదినములలో దివ్యధామము నలంకరించెను. ఇట్టి హరినామస్మరణమే తన సర్వస్వముగ సంభావించి, అందలి సుధా మాధుర్యమును లోకమునకు చవిఁజూపు నారదుఁడు – అందఱకును ఆరాధ్యుఁడేకదా!

## భగవత్తత్త్వము

యావద్విశ్వమునకును వేదమే పురాతన సారస్వతము. అపౌరుషేయమైన ఈసారస్వతమునందే సృష్టిరహస్యము లన్నియు ఇమిడియున్నవి. ఋగ్వేదములో-

"తత స్స్వయంభూ ర్భగవాన్ అవ్యక్తో వ్యంజయన్నదన్
మహాభూతాది వృత్తౌజాః ప్రాదురాసీత్తమోనుదః."

"యోఽసావతీన్ద్రియ గ్రాహ్యః సూక్ష్మోఽవ్యక్తస్సనాతనః
సర్వభూతమయోఽచిన్త్యః స ఏవ స్వయ ముద్బభౌ."

భగవంతుఁడు తనంతట తానే వెలసినవాఁడు. ఇతఁడు సర్వభూతమయుఁడు; సర్వాంతర్యామి యని చెప్పఁబడియున్నది. మఱియొకచో —

"ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్ ఏకమే వాద్వితీయమ్"

భగవానుఁ డొకఁడే. అతఁ డద్వితీయుఁడు'—అని చెప్పఁబడినది. ఇట్లే భగవద్గీతయందును —

"అహం సర్వస్యప్రభవో మత్త స్సర్వం ప్రవర్తతే
ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః." (10-8.)

ఈసర్వమునకును నేనే ఉత్పత్తిహేతువును. నావలననే సకలము నడచుచుండును. తెలివిగలవారు ఇట్లు తలంచి, నన్ను భజించుచుందురు.' అని శ్రీకృష్ణభగవానుఁడు స్పష్టీకరించినాఁడు. దీని ననుసరించియే మహాభారతములో-

"జగత్ప్రభుం దేవ దేవం అనన్తం పురుషోత్తమమ్
స్తువన్నామ సహస్రేణ పురుష స్సతతోత్థితః
అనాదినిధనం విష్ణుం సర్వలోక మహేశ్వరమ్
లోకాధ్యక్షం స్తువన్నిత్యం సర్వదుఃఖాతిగోభవేత్."

జగత్ప్రభువును—దేవ దేవుఁడును—పురుషోత్తముఁడును అగు శ్రీమహావిష్ణువు అనాదిపురుషుఁడు. అతఁడు లోకాధ్యక్షుఁడు — సర్వవ్యాపకుఁడు — అజాతజన్ముఁడు. ఇట్టి సర్వేశ్వరుని సంస్తుతించినచో, సర్వదుఃఖములు సుదూరములై, సుఖింపఁగలరని భీష్ముఁడు యుధిష్ఠిరున కుపదేశించెను. నారదీయపురాణములో—

"నారాయణోఽ క్షరోనంతః సర్వవ్యాపీ నిరంజనః
తేనేద మఖిలం వ్యాప్తం జగత్స్థావర జంగమమ్."

నారాయణుఁడు వినాశము లేనివాఁడు. అంతములేనివాఁడు. అంతటను నిండియున్నవాఁడు. స్థావర జంగమాత్మకమైన ప్రపంచమునం దంతటను వ్యాపించియున్నవాఁడు.' అని వక్కాణింపఁబడియున్నది. ఇందువలన, శ్రీమన్నారాయణుఁడే జగత్కారణకర్తయనియు, ఇతఁ డంతటను వ్యాపించియున్నాఁ డనియు స్పష్టమగుచున్నదిగదా!

## భగవ ద్విలాసము

ఈ ప్రపంచమంతయును కంటికి గన్పట్టుచున్నది. కాని, ఈ సృష్టికి కారణభూతుఁడు మాత్రము కంటికి గన్పట్టుటలేదు. కనుక. ఇతని యునికి, సంశయమున కాస్పదమగుట సహజము కాని, సర్వులకును స్వానుభవమున నున్నది — 'నేను' అను స్ఫురించు జీవాత్మ కాన, ఇఁక సంశయమున కాస్పదములేదు. ఏలన, తనను లేనివానినిగా నెవ్వఁడును తలంపఁడుగదా! ఇట్లే, ప్రత్యక్షముగ గన్పట్టు ప్రపంచమునుగూడ ఎవరును లేదనఁజాలరుగదా! అయినను-పరిణామ స్వభావముగల ప్రపంచముయొక్క యథార్థ తత్త్వమును, సృష్టికర్తకు సంబంధించిన తత్త్వ రహస్యమును, జీవాత్మయొక్క నిజ స్థితిని విశదముగా దెలిసికొనవలెనని ఇచ్ఛకల్గుట సర్వ సహజము. మఱియు నారదుఁడును ఈ సృష్టిలోనివాఁడే యగుట—ముందుగా సృష్టిని, సృష్టికర్తను గుర్తించిన యనంతరము నారదుని గుఱించి తెలిసికొనుట అత్యంతము యుక్తము.

సూక్ష్మరూపులైన జీవేశ్వర తత్త్వములను తెలిసికొనుట సులభముకాదు. అతికష్టమని అందఱును అంగీకరించిన విషయమే. ఇందువలననే మన మహర్షులు—ప్రత్యక్ష, అనుమాన, శబ్దప్రమాణముల మూలమున ఈ సృష్టి తత్త్వమును తెలిసికొన నగునని తమ గ్రంథములలో పొందుపఱచిరి. ఈ గ్రంథములే షడ్దర్శనములని వ్యవహరింపఁబడుచున్నవి. ఈ దర్శనకర్తలు — కపిల, పతంజలి, జైమిన్యాది మహర్షులు.

ఈ మహర్షుల యనంతరము ఇట్టి తాత్త్విక విషయములను బాగుగా తరచి, లోకమునకు చాటినవారు—శ్రీశంకర, రామానుజ, మధ్వాచార్యులు. ఇందు శంకరాచార్యులు అద్వైతవాది. అనఁగా-జీవులు మాయాకల్పితములయిన భగవత్ప్రతిబింబములనియు, జీవబ్రహ్మలకు ఏకత్వముగలదనియు చెప్పినవాఁడు.

శ్రీరామానుజాచార్యులు విశిష్టాద్వైతవాది. భగవంతుఁడొకఁడు కలఁడు. ఇతఁడే సూక్ష్మరూపముతో ప్రపంచ మంతటను వ్యాపించియున్నాఁడు. ప్రపంచమునకు మూలమైన జీవప్రకృతులు భగవంతుని శరీరములుగా నలరారుచున్నవి. ఇట్లు జీవప్రపంచ శరీరుఁడైన భగవానుఁడు-నారాయణుఁడుగా వ్యవహరింపఁబడుచున్నాఁడు. అతఁడొకఁడేయైనను సృష్టిచేయవలెనని సంకల్పించి, బహురూపుఁడాయెను.[1] ఇట్లు వ్యాపించి, తిరిగి అతఁడు సమస్తమును స్వశరీర ప్రకృతియందు లీనముగావించుకొనుచు, సూక్ష్మప్రకృతిశరీరుఁడై విలసిల్లుచుండును. ఇందులకు సాలెపురుగు విలక్షణమే దృష్టాంతము.[2] సాలెపురుగు తన శరీరమునందలి తంతువులచే విస్తృతిపొంది, మరల స్వీయమగు సంకల్పమువలననే ఆతంతువుల నన్నింటిని స్వీయశరీరమునఁ జేర్చి, ఏకరూపమును పొందుచుండును. జీవ ప్రకృతులు రెండును నారాయణునకు శరీరమగుటవలన అభేదముగానున్నను, ఈ మూఁడు తత్త్వములును స్వరూప స్వభావాదులచే వేర్వేరుగా నున్నవి.

అంతమాత్రమేగాక, ఈ మూఁడును దేహ దేహులుగా నున్నవి. వీనిలో జీవుఁడు అణురూపుఁడు. నారాయణుఁడు వ్యాపకుఁడు. ప్రకృతి జడరూపము. నారాయణుఁడు సత్యజ్ఞానానంద స్వరూపుఁడు. ఇతఁడు ప్రపంచమునకు నిమిత్త కారణుఁడు. నారాయణుని సంకల్పముచే ప్రకృతి జగదాకార పరిణామమును బొందుచున్నది. ఇదియే విశిష్టాద్వైత మత సిద్ధాంతము.

ఇఁక మూఁడవది-ద్వైత మతము. ఇది జీవప్రకృతులకు, నారాయణునకు పరస్పర భేదమును ప్రతిపాదించును. ద్వైత మనఁగా భేదము.

ఈ ద్వైతాద్వైత విశిష్టాద్వైత మతకర్తలు ముగ్గురును ఈశ్వరవాదులు. మఱియు-ఈశ్వరలీలయే సృష్టికార్య మనువారు కావున, భగవంతుని ముఖ్యలీల సృష్టికార్యము. తార్కికుఁడు సైతము-

"క్షిత్యంకురాదికం సకర్తృకం కార్యత్వాత్ ఘటవత్."

కుండకు కుమ్మరివానివలె విచిత్రాకార రచనాకరమైన యీ సృష్టికిని కర్త కలఁడనియు-సూక్ష్మాణువుల దగ్గఱ జేర్చుట-స్థూల ప్రపంచ నిర్మాణము జరుగుచున్నదనియు-దేవుని యిచ్ఛవలననే యీ సూక్ష్మములు కలిసికొనుననియు

1. సోఽకామయత బహుస్యాం ప్రజాయేయ.
2. యథోర్ణనాభిస్సృజతే గృహ్ణతే చ. — (శ్రుతి)

సాధించినాఁడు. ఇందువలన, సృష్టికార్య మంతయు దేవుని లీల యగుట నిస్సంశయము. ఈ లీల నిరాఘాటముగ జరుగుటకు ఆంతరలీల లెన్నియో యవసరములై యుండును. కావ్యమునందు నాయకుని కార్యక్రమమును గుర్తెఱింగి, అందులకు దోహద మొనరించు పతాకానాయక విదూషకాదు లవసరముగదా! వారలు నాయకుని లీలావినోద నిర్వహణమునకు కారకు లగుచున్నారు. నారదుఁడు-ఆ కోవకుఁ జెందినవాఁడు. ఒక్క నారదుఁడే కాదు-భీష్మాది పరమ భాగవతోత్తము లందఱును ఆ తెగకుఁ జెందినవారే.

ఒక్కొక్కయెడ, కారణజన్ములకు సైతము అలవిగాని సందర్భము లేర్పడును. అనఁగా-సృష్టికార్య విఘాతము గల్గుటకు కొందఱు తమోగుణౌ ద్ధత్యముతో బూనుకొనుచుందురు. వారును సృష్టిలోనివారే. అయిననేమి? సృష్టికి ఆధారభూతుఁడగువానినే యెదిరింప బ్రయత్నింతురు. ఇది వారి యజ్ఞానము. సృష్టి స్థితులకే భంగము వాటిల్లనున్నపుడు చేయవలసినదేమి? అట్టివారిని దొలగించుటయే కర్తవ్యము. ఆ రీతి తొలఁగించినఁగాని గ్లాని పొందిన ధర్మము పునరుద్ధరింపఁబడదుగదా! అందులకు ఒక్కొక్కప్పుడు నారాయణుఁడే భూలోకమం దవతరించవలసివచ్చుచుండును.

"యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య త దాత్మానం సృజామ్యహమ్." (భగవద్గీత: 4-7)

అనిగదా భగవద్వాణి! అట్టి యవసరములందు సైతము కారణజన్ములు కార్యానుసంధాన మొనర్చుచునే యుందురు. ఇందు నారదుఁడు ముఖ్యుఁడు. ఇతఁడు లేని సందర్భమే లేదు. సృష్టి విలక్షణ మంతయు నారదుఁడు బాగుగా నెఱింగినవాఁడు. బ్రహ్మదేవునివలన ఈ విజ్ఞాన మితఁడు బడసినటుల శ్రీమద్భాగవతము పలుకుచున్నది. కావున, అంతయు గుర్తెఱింగిన ఈతని చరితము-లోకారాధ్యము

## నారద ప్రశస్తి

నారదుఁడు-లోక కల్యాణదాయకుఁడు. కనుకనే, నారాయణుఁ డవతరించినపుడెల్లను నారదుఁ డవతరించి, నారాయణుని కార్యక్రమములలో పాల్గొనియున్నాఁడు. భగవంతుని పలు యవతారములు భాగవతములో ఈ క్రిందివిధముగా విశదీకరింపఁబడినవి:-

"అన్నియవతారములకు మూలకారణమైనది-శ్రీమన్నారాయణ దేవుని విరాజమానంబైన దివ్యరూపము. దానినిఁ బరమ యోగీంద్రులు దర్శింతురు. ఆ పరమేశ్వరుని నాభికమలంబువలన, సృష్టికర్తలలో శ్రేష్ఠుండైన బ్రహ్మ యుదయించెను."

శ్రీమన్నారాయణుని అవతారములు ఏకవింశతిగా భాగవతముననే చెప్పఁబడినవి. అందు-శ్రీమహావిష్ణువే నారదుఁడుగా నుదయించినట్లు పేర్కొనఁ బడినది. ఇట్లు విష్ణ్వంశసంభూతుఁడు గావుననే ఘటనాఘటన చాతురీ ధురీణుఁడైనాఁడు నారదుఁడు.

ఈ నారదుని చరిత్రము పురాణగాథల ననుసరించి బహుముఖములుగ నుండుటచే, నారదులు పలువురున్నారని కొందఱందురు. కాని, నారదుఁడు ప్రతికల్పమునందును ప్రతి యుగమునందును గలఁడు. కనుక, ఆ యా కాలభేదముల ననుసరించి యేర్పడిన కథలు-పరస్పర విరుద్ధములుగానుండిన నుండవచ్చును. అయినను–అవి యన్నియు ఆతని జన్మమును గుఱించికాని, ఆతని ఆశయమును గుఱించికాని, ఆతని సందేశ విధానములను గుఱించికాని ఇంచుకేనియు వ్యత్యస్తముగ బలుకవు. కనుక, నారదుఁ డొకఁడే యనుటలో విప్రతిపత్తి లేదు. నారదులు సప్తసంఖ్యాధికులుగా నుండియున్నట్లు కొందఱు నిర్ణయించి యున్నారు. కాని, ఆ జన్మములన్నియు వరములకో, శాపములకో సంబంధించినవిగా సూక్ష్మపరిశీలనము వలనఁ దెలియనగును.

విష్ణ్వంశవలన సంభవించినవాఁడు నారదుఁడని భాగవతము పేర్కొనుచున్నట్లు ముందే చెప్పఁబడినది. ఈ నారదుఁడే కర్మ నిర్మోచకమగు వైష్ణవమంత్రరాజమును లోకమునకు జాటెను. ఇతఁడు బ్రహ్మమానస పుత్రుఁడుగా నేఁ డందఱకును తెలియఁబడుచునే యున్నాఁడు. పర్వతుఁడను సంగీత విద్వాంసునకు మేనమామగా పరిగణింపఁ బడుటయును ఎల్లఱెఱింగిన విషయమే. వసిష్ఠుని భార్యయగు అరుంధతి సోదరుఁడని యొకట విశద మగుచున్నది. సత్యవతి యను నామెకు భర్తయనియును ఒకచో పేర్కొనఁబడినది. అంతేగాక, కుబేరుని ఆస్థానమందుండువాఁడనియును, శ్రీరామచంద్రుని ఆస్థాన పండితులలో నొకఁడనియు, జనమేజయుని సర్పయాగ సందర్భమున పాల్గొనినవాఁడనియు బహువిధములుగా ఈ నారదుఁడు పేర్కొనఁబడుచున్నాఁడు. మఱియును-అద్భుత రామాయణము

బ్రహ్మవైవర్త పురాణము, వరాహ పురాణము, భారతేతిహాసము మున్నగున వెన్నియో యెన్నో విధముల ఈ నారదుని పేర్కొను చున్నవి. ఆ యా కార్య క్రమములను, ఆయా విధములను అతఁడు సంచరించుటమాత్రముగ ఆయా కథల యందు గ్రహింపఁదగును. ఈ గాథల పరస్పర సమన్వయమే ఇం దవసరమైన విషయము. అట్టి సమన్వయము సిద్ధించినచో ఎట్టి వైరుధ్యమును గలుగదు.

పురాణ సారస్వత మిట్లుండ-నారదుఁడు ఋగ్వేదమునందలి VIII-13; IX-104, 105 ఋక్కులకు ఈ నారదుఁడు కర్తయనియు, సామవేద సంబంధియై, యజ్ఞముల 'ఉద్గాత'గఁ గూడ నుండినవాఁడనియు పండితులు వక్కాణించు చున్నారు.

సంస్కృత సాహిత్యమును పరిశీలించినచో-౧. నారదభక్తి సూత్రములు ౨. నారదస్మృతి, ౩. నారదీయశిక్ష, ౪. సంగీత మకరందము ౫. నారద పరివ్రాజ కోపనిషత్తు, ౬. నారదీయ పురాణము, ౭. నారద పాంచరాత్రము, ౮. నారద సంహిత అనునవి నారద కృతములుగా గన్పట్టుచున్నవి. ఈ రచనలలో నారదుని జీవిత ప్రతిభా విశేషములు. ప్రతిబింబించుచుండుట గమనార్హము. భక్తిజ్ఞాన విల సితములైన ఇట్టి ప్రతిభా విశేషములు. ఇతనికి సనత్కుమార సంబంధము వలనను, ఆయనవద్ద అభ్యసించి, ఆచరించిన జప తపంబుల వలనను లభించినట్లు తెలియ వచ్చును.

నారదుని తపశ్శక్తిని-సదసద్వివేక సంపదను మహాభారతము విశదముగా అభివర్ణించుచున్నది. (XII 194-195) అంతేకాదు-నారదుఁడు హిమాలయంబున కేఁగి, తపంబొనరించి, శ్రీమహావిష్ణువును మెప్పించి, ఆ విష్ణుసందర్శనభాగ్య మును బొందగల్గినట్లును మహాభారతమే వివరించుచున్నది. (XII-190.)

పురాణము లన్నియు నారదు నొక భగవత్సందేశహారునిగను, విశ్వ శ్రేయోభిలాషిగను, వేదాంతిగను మార్గదర్శకునిగను, శాంతి ప్రదాతగను, సృష్టికి-సృష్టికర్తకు సంబంధ సూత్రగూపునిగను అభివర్ణించుచున్నవి. మఱియు నారదనామమును గుఱించి—

"నారం పరమాత్మవిషయకం జ్ఞానం దదాతి ఇతి నారదః."

నారము అనఁగా-పరమాత్మ విషయకమైన జ్ఞానము. ఇట్టి జ్ఞానము నిచ్చువాఁడు గనుక, ఇతఁడు నారదుఁ డనఁబడుచున్నాఁడనియు నిర్వచింపఁబడినది. కనుకనే, సచ్చిదానంద స్వరూపుఁడైన భగవంతునిగూర్చి ముందుగా నెఱుంగుట మానవుని ముఖ్యకర్తవ్యమని నారదుఁడు లోకమునకు ప్రబోధించి, సార్థక నామముగలవాఁ డయ్యెను.

నారదుఁడు నిష్కళంక పరమాదర్శ పురుషుఁడని భీష్ముఁడంతటివాఁడు యుధిష్ఠిరునకు స్పష్టీకరించెనన్న-ఈ నారదుని గొప్పతనమును మనము సులభముగా గ్రహింపవచ్చును. అయితే, ఇట్టి తన గొప్పతనమును గుఱించిన గర్వము ఈ మహర్షి కెన్నఁడును లేదు. అనన్యమైన ఆధ్యాత్మిక విజ్ఞాన సంపద, మేధాశక్తి, తపో మహిమ మొదలగు విశిష్ట లక్షణము లెన్నియో ఇతనియందు మూర్తీభవించి యున్నవి, ఇట్టి లక్షణములే కారణ జన్ములకు గావలసినవి. ఇవి లేనిచో—కార్యానుసంధానము గావింపఁజాలరుగదా! ఇతని యీ నైపుణ్య మంతయు--లోక కల్యాణ దాయకమై ప్రకాశించినది. కనుకనే, ఇతనికి పదునాల్గు భువనములందును అత్యుత్తమస్థానము లభించెను. ఇతని 'సలహాలు' కొన్ని యెడల తాత్కాలికముగా కలహ కారణములుగ గన్పట్టినను, అవి యెల్లను శుభపరిణామ కారణములై, విశ్వకల్యాణ సంధాయకములై విలసిల్లినవి. కావుననే, ఈ మహనీయుఁడు లోకమం దంతటను కీర్తింపఁబడుచున్నాఁడు.

క్షమ, ఆత్మ విజ్ఞానము, ప్రశాంతి, ఇంద్రియ నిగ్రహము, నిర్మల మనస్కత, సత్యవాక్కు, అచంచల భగవ ద్భక్తి, దక్షత, అనుకంపాగుణము నారదునియందు అమూల్యాభరణములై విరాజిల్లినవి. ఏది పవిత్రమైనదో-దానినే ఆతఁ డొనర్చును. కావుననే ఇతఁడు పాపదూరుఁ డగుచున్నాఁడు. విజ్ఞాన కౌశలమువలన పురాకృత కర్మముల నెఱింగి, తన లక్ష్యశుద్ధి తప్పక, కార్యసాధనయం దెందుఁ జూచినను నారదుఁడు విజయుఁడైనట్లు స్పష్టమగుచున్నది.

ఒకనిని ప్రేమించుట, మఱియొకనిని ద్వేషించుట అనునది ఈ మహాముని కెన్నఁడును లేదు. నిరంతరము కార్య నిమగ్నుఁడై, లోకోపకారముగావించుటయే ఇతని జీవిత రహస్యము. భగవ దాశయము నెఱింగి, తదనుసారముగ సహజ సిద్ధమైన తన చతురతతో కార్యసంధాన మొనర్చుటయే ఇతని నిత్య కృత్యము. నిరర్థకముగగాని, స్వార్థము నపేక్షించిగాని, ఈ మహర్షి యెన్నఁడును తనశక్తి సామర్థ్యములను వినియోగించి యుండలేదు. ఈతని జీవితచర్యలను పరిశీలించినపుడు ఈ విషయములు తేట తెల్ల మగును.

సంశయగ్రస్తవిషయమును త్వరితగతిని పరిష్కరింపఁ జేయుటకు నారదుఁడెంతయో ప్రయత్నించి, కృతకృత్యుఁ డయ్యెను. క్షణమేనియు వ్యర్థసేయక, నిరంతర జిజ్ఞాసువుగ వర్తించుచు, తన మార్గమున తా నుండియు, ఇతరుల యభిప్రాయములను, నమ్మకములను త్రోసిపుచ్చక సంచరించెను. భగవత్సందేశము నెఱింగించి, లోకుల నుత్తీర్ణుల నొనర్చుటకు మహా ప్రబోధములు గావించెను. ఇతఁడు-భగవ దధికారము నందిన ఆధికారిక పురుషుఁడేకాని, సామాన్యుఁడు కాఁడు. నారదునివంటి విజ్ఞాన పురుషులు భగవంతుని కార్య సాధకులుగా వర్తించుచుందురు. భాగవత సంబంధము, భగవల్లీలా విజ్ఞానము ఇట్టి కారణ జన్ములకు మిక్కిలి ప్రియములు.

## నారదుని భక్తి స్వరూపము

నారదుఁడు ఆదర్శజ్ఞాని; భక్తుఁడు; పరమభాగవతోత్తముఁడు. భక్తిజ్ఞాన కర్మ మార్గములం దితఁడు దక్షుఁడైనను, సార్వజనీనమగు భక్తినే ఇతఁడు ప్రబోధించెను. ఇది-జాతిభేదములేక, వయోభేదములేక, అందఱును అవలంబింపఁ దగినదై, భగవ దనుగ్రహ ప్రాప్తికి సులభమార్గమై యొప్పుచున్నది.

కర్మము—సంకల్పమును, జ్ఞానము—ప్రజ్ఞా బుద్ధులను, భక్తి—రాగ ద్వేషాది భావోద్రేకములను పరిశుద్ధమొనర్చును. భక్తివలనఁగల్గు అట్టి భావ పరిశుద్ధి—భగవత్సేవకు, భాగవతసేవకు సదవకాశమును గల్పించి, మానవుని ఉత్తీర్ణుని గావించును. కనుకనే నారదుఁ డితర మార్గములకంటెను, భక్తిమార్గమే సులభమైన తరణోపాయమని నిర్ణయించి, దీనిని లోకమునకు ప్రబోధించెను.

లోక కల్యాణార్థము గావించు నారదుని కార్య కలాపములను కేవల తాత్కాలిక బాహ్యదృష్టితో మాత్రమే గ్రహించి, అతని నొక కలహాభోక్తగా కొందఱు చిత్రించుట అత్యంతము విచారకరము. కార్యఫలమును గ్రహించిన వివేకు లెవఱును—నారదుని కలహాభోక్తగా వాకొనఁజాలరు. నారదునిగూర్చి వివరముగా దెలిసికొన గోరువారికి—సదసద్వివేకము, సహృదయము, సమీచీనములై యుండుట చాల అవసరము.

నారదుఁడు కృత త్రేత ద్వాపరములందే గాక, కలియుగమందును. ఉన్నాఁడు. త దారాధకులకు తరచుగా గన్పట్టి, దివ్యసందేశముల నిచ్చుచునే యున్నాఁడు. అంతేగాదు—సంగీతగురువుగాగూడ కొందఱకు దర్శన మిచ్చుచునే

యున్నాఁడు. యుగ యుగమునందును, ఒకచోటమాత్రమేగాక, బ్రహ్మలోక-గోలోక-వైకుంఠ లోకాదులందును, పాతాళాదులందును తన యిచ్ఛామాత్రమున నే తత్‌క్షణములో సంచరించుచు, శ్రుతి స్మృతి పురాణాగమాదులయందును, జ్యోతిష సంగీతశాస్త్రములయందును నిష్ణాతగా కొనియాడబడుచు, చిరంజీవియై ప్రకాశించుచునే యున్నాఁడు.

## నారద ప్రభావము

ఎన్నోగాథలను, నారద జీవిత రహస్యములను పురాణేతిహాసములు వెల్లడించుచున్నవి. ఈపురాణేతిహాసములకు కర్త వ్యాసమహర్షి.

"వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే."

అనునట్లు, ఈవ్యాసుఁడు కేవలము విష్ణుస్వరూపుఁడు. కనుకనే ఇట్టి విష్ణుస్వరూపుఁడైన వ్యాసుఁడు-వ్యాస భగవానుఁడుగా వ్యవహరింపఁబడుచున్నాఁడు. ఈవిషయ మిచ్చట ముఖ్యముగా గమనీయము.

ఇట్టి వ్యాసభగవానుఁడు పదునేడు పురాణములను రచించి, అనంతరము పదునెనిమిది పర్వములలో మహాభారతేతిహాసమును రచించెను. కాని, తాను రచించిన ఈపురాణేతిహాసములలో భగవంతుని దివ్య లీలా విలాసములు పరిపూర్ణముగా అభివర్ణింపఁబడనందున, వ్యాస మహర్షికి సంతృప్తిగల్గలేదు. ఇట్టి యసంతృప్తితో విచారగ్రస్తుఁడైన వ్యాసునకు నారదుఁడు సమయమెఱింగి, తగిన సలహాల నొసంగి, ఆతని చింతను తొలగించినట్లు భాగవతమే స్పష్టము జేయుచున్నది.

"మేలగు భారతాఖ్యానంబు సేసియు నమ్మౌని భూతహితంబునందుఁ దన హృదయంబు సంతసింపకున్న సరస్వతీ తటంబున నొంటియుండి హేతువు వితర్కించుచున్న-

తనచేతివల్లకీ తంత్రీచయంబున
సతత నారాయణ శబ్దమొప్ప
ఆననసంభూత హరిగీత రవసుధా
ధారల యోగీంద్ర తతులుసొక్క

కపిలజటాభార కాంతిపుంజంబుల
   దిశలు ప్రభాత దీధితి వహింప
తనులగ్న తులసికా దామగంధంబులు
   గగనాంతరాళంబు గప్పికొనఁగ
వచ్చె మింటనుండి వాసవీనందను
   కడకు మాటలాడఁ గడఁకతోడ
భద్రవిమలకీర్తి పారగుఁ డారూఢ
   నయ విశారదుండు నారదుండు.

కనియె న్నారదుఁడంతన్
వినయైక విలాసు నిగమ విభజనవిద్యా
జనితోల్లాసున్ భవదుః
ఖ నిరాసున్ గురుమనోవికాసున్ వ్యాసున్.

ఇట్లు నిజాశ్రమంబునకు వచ్చిన నారదు నెఱింగి లేచి వ్యాసుండు వివిధ క్రమంబులం బూజించిన నతండు లేనగవు నెగడెడి మొగంబుతోడ విపంచికా తంత్రి వ్రేల మీటుచు నిట్లనియె.

ధాతవు-భారతశ్రుతి విధాతవు-వేదపదాబ్జజాల వి
జ్ఞాతవు-కామముఖ్య రిపుషట్క విజేతవు-బ్రహ్మతత్త్వ ని
ర్ణేతవు-యోగినేతవు-వినీతుఁడ వీవు చలించి చెల్లరే!
కాతరు కైవడిన్ వగవఁ గారణమేమి పరాశరాత్మజా!

అనినఁ బారాశర్యుండిట్లనియె.

పుట్టితి వజు తనువునఁ జే
పట్టితివి పురాణపురుషు భజనము పదముల్
మెట్టితివి దిక్కులం దుది
ముట్టితివి మహాప్రబోధమున మునినాథా!

అదియునుంగాక నీవు సూర్యునిభంగి మూడులోకంబులం జరింతువు. వాయువు పగిది నఖిల జనులలోనన్ మెలంగుదువు. సర్వజ్ఞుండ వగుటం జేసి—

నీ కెఱుఁగరాని ధర్మము
లోకములను లేదు బహు విలోకివి నీ వీ
నా కొఱఁత యెట్టి దంతయు
నాకున్ వివరింపుమయ్య నారద! కరుణన్.

అనిన నారదుం డిట్లనియె.

అంచితమైన ధర్మచయ మంతయుఁ జెప్పితి వందులోన నిం
చించుకగాని విష్ణుకథ లేర్పడఁ జెప్పవు-ధర్మముల్ ప్రపం
చించిన మెచ్చునే గుణ విశేషము లెన్నినఁగాక నీకు నీ
కొంచెము వచ్చు నెల్ల హరిఁ గోరి నుతింపమి నార్యపూజితా!
అపశబ్దంబులఁ గూడియున్ హరిచరిత్రాలాపముల్ సర్వపా

ప పరిత్యాగము సేయుఁగావున హరిం భావించుచున్ బాడుచున్
జపముల్ సేయుచు వీనులన్ వినుచు నశ్రాంతంబుఁ గీర్తించుచున్.
దపసుల్ సాధులు ధన్యు లౌదురుగదా! తత్త్వజ్ఞ! చింతింపుమా!
విష్ణుండు విశ్వంబు విష్ణునికం టెను

వే ఱేమియునులేదు విశ్వమునకు
భవ వృద్ధి లయము లా పరమేశుచే నగు
నీవెఱుంగుదుగాదె నీ ముఖమున
నెఱిఁగింపఁబడ్డది యేకదేశమున నీ
భువన భద్రమునకై పుట్టినట్టి
హరి కళాజాతుం డవని విచారింపుము
రమణతో హరిపరాక్రమములెల్ల

వినికి సేయు మీవు వినికియుఁ జదువును
దానమతుల నయము దపము ధృతియుఁ
గలిమి కెల్ల ఫలముగాదె పుణ్యశ్లోకుఁ
గమలనాభుఁ బొగడఁ గలిగెనేని.

అని యిట్లు భగవంతుండగు నారదుండు వ్యాస మునీంద్రుని వీడ్కొని వీణ వాయించుచు యదృచ్ఛామార్గంబునం జనియె.

అవనీచక్రములోన నే పురుషుఁడే యామ్నాయము న్విన్న, మా
ధవుపై లోకశరణ్యుపై భవములం దప్పింపఁగాఁజాలు భ
క్తి విశేషంబు జనించునట్టి భువనక్షేమంకరంబైన భా
గవతామ్నాయము బాదరాయణుఁడు గల్పించె నేర్పొప్పఁగన్.

నిగమములు వేయి చదివిన
సుగమంబులుగావు ముక్తి సుభగత్వంబుల్
సుగమంబు భాగవత మను
నిగమంబుఁ బఠింప ముక్తినివసనము బుధా!

అతిరహస్యమైన హరిజన్మ కథనంబు
మనుజుఁ డెవ్వఁ డేని మాపు రేపు
చాలభక్తితోడఁ జదువుఁ దా సంసార
దుఃఖరాశిఁబాసి తొలఁగిపోవు ''

అని, యీ చివర రెండుపద్యములలో బలికిన ఫలశ్రుతిగల భాగవత రచనకు కారకుఁడైన నారద మహాముని సందేశ మిందు బాగుగా విశద మగుచున్నదిగదా! ఇట్లు వ్యాసుఁడును భాగవత రచనఁ గావించి, ఎంతయు సంతుష్టినంది, ఇట్టి సంతుష్టికి కారణభూతుఁడైన నారదుని పరి పరి విధముల ప్రశంసించెను. ఈ రీతిగా భాగవత రచన పూర్తియైన యనంతరము పురాణములు అష్టాదశములుగా విఖ్యాతి నందెను.

" భువి బ్రహ్మాండము వామనంబు గరుడంబున్ స్కాందమున్ గూర్మ భా
గవ తాగ్నేయక మాత్స్యలైంగములు మార్కండేయమున్ బాద్మ వై
ష్ణవ శైవంబులు నారదీయము భవిష్య ద్బ్రహ్మ వైవర్త ది
వ్య వరాహంబులు నాఁ బురాణములు ముయ్యారయ్యె విప్రోత్తమా! "

— (విష్ణు పురాణము : 4–99.)

ఈ అష్టాదశ పురాణములలో భాగవతము భగవ ద్గుణానుభవమున సుప్రసిద్ధ మగుటచే, పురాణ శిరోమణియై ప్రకాశించుచుండుట-ఎల్ల ఱెఱింగిన విషయమే.

శ్రీమద్భాగవతమునకు మాత్రమేగాక, శ్రీమద్రామాయణ రచనకును నారదప్రేరణయే మూలకారణమైనట్లు మనకు గన్పట్టుచున్నది. భారతీయులకు పరమ పవిత్రగ్రంథములుగా-భగవ దవతార చరిత్రముల నభివర్ణించుటలో అగ్రగణ్యా

ములుగా ప్రసిద్ధివహించిన ఈ భాగవత, రామాయణములు రెండును నారద ప్రేరణముననే విశేషముగా ప్రకాశించుట–ఆతని లోకక్షేమదాయక ప్రవృత్తిని వేనోళ్ళ చాటుచున్నవి.

"తప స్స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాం వరమ్
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్."

ఈ శ్లోకము-నారదుని తపస్స్వాధ్యాయ నిరతాది సాధన సంపదను బహు విధములుగా అభివర్ణించు చున్నది వాల్మీకి–శాపవశమున భూమియందుఁ బుట్టి, తుదకు నారద ప్రేరణమున శ్రీమద్రామాయణమును రచించి, ధన్యుఁడయ్యెను. ఇట్లనేకులను ధన్యులఁ గావించిన నారదుని ప్రభావము–అవాఙ్మానసగోచరము.

## నారదుని భక్తితత్త్వము

భక్తిప్రబోధమే నారదుని ఆశయము. భగవద్గుణానుభవమే ఈతని దివ్య సందేశము. ఇదియే ఇతని సర్వస్వము. ఈ యంశము-ఈతని భక్తిసూత్రముల వలననే వ్యక్తమగుచున్నది.

వేదవ్యాసుఁడు బ్రహ్మసూత్రములను వ్రాసియున్నాఁడు. అట్లే-నారదుఁడు భక్తిసూత్రములు వ్రాసియున్నాఁడు. వ్యాకరణ సూత్రములు, ధర్మసూత్రములు గూడ ఇట్లే మహర్షులచే రచింపఁబడియున్నవి. అవి యన్నియు భారతీయ సంస్కృతికి-ఆధ్యాత్మిక సంపదకు ఆటపట్టులు.

సూత్ర కర్తకును-వ్యాఖ్యాన కర్తకును మిక్కిలి భేద మున్నది. సూత్ర కారుఁడు-తాను ప్రతిపాదింపఁదలచిన యంశములను సూత్రములలో సవిమర్శముగా ప్రతిబింబింపఁ జేయఁజాలఁడు. ప్రతిపాదింపఁ దలచిన యంశములు సూక్ష్మీకరించి చెప్పఁబడుటవలననే ఇవి సూత్రములుగా వ్యవహరింపఁబడుచున్నవి. ఇట్టి సూత్రములకు ఎందఱో వ్యాఖ్యానములు వ్రాసి, ప్రసిద్ధి వహించిరి. ఇట్టి వ్యాఖ్యానములు ఆ యా సూత్రములలోఁగల నిగూఢ విషయములను, గంభీర భావములను బయల్పఱచును. ఇవి తారుమారైనచో రాణింపఁజాలవు. ఇది-సారస్వతమునకు ముఖ్య లక్షణము. నారదుఁడీ లక్షణమును బాగుగా దెలిసినవాఁ డగుటచే, తన సూత్రములను సులలితమైన శైలిలో రూపొందించి, వ్యాఖ్యాతలకు విశేష పరిశ్రమనుఁ గల్గింపక, గొప్ప సారస్వత వేత్తయై విలసిల్లినాఁడు.

నారద సారస్వతమున భగవద్భక్తియే ప్రధానముగ గోచరించుచుండును ఆ భక్తి-పరమ ప్రేమరూపమైనది. ఆప్రేమ—ముక్తిసాధనమైనది. కనుక, అట్టి ప్రేమయే భగవంతునియందుఁ గల్గినచో-ఇఁక మరియొక కోరిక యుండదు. ఆ భక్తులు—ఆత్మానందము నందుచుండుటయే ఇందులకు కారణము. ఆ భక్తి—త్యాగమునకు దారి తీయును. అట్టి త్యాగశీలునకు పరమపదము కరతలామలకము.

"న కర్మణా న ప్రజయా ధనేన
త్యాగేనైకే అమృతత్వమానశుః."

అనిగదా ఉపనిషత్సూక్తి! ఇట్టి త్యాగశీలునకు శాత్రవమే లేదు. కనుక, కర్మజ్ఞానములకంటెను—భక్తియే ముఖ్యము. భక్తుఁడు—తన సర్వభారమును భగవంతునిపై నుంచవలెను. సుఖ దుఃఖములందు సైతము అట్టిభక్తునకు మనస్సు చలింపదు. ప్రాపంచిక విషయదూరుఁడైనపుడే భక్తునకా స్థితి సిద్ధించును. భగవత్కటాక్షము వలన నిది సిద్ధించును. ఇది—సాధనవలన సంభవించును.

భక్తుఁడు—ధన దారాపుత్రాదులనుఁగూర్చిన వ్యామోహమును త్యజింపవలయును. గర్వము, అహంభావము, మొదలగు దుర్గుణములను దూర దూరముగ పారద్రోలవలెను. భక్తిరాజ్యమున కులము, జన్మము, యౌవనము, భాగ్యము, వృత్తి మున్నగు భేదములు లేవు. అందఱును భగవంతుని ప్రేమించుటకు అర్హులే. భాగవతుల తారతమ్యము నెంచక, అందఱును భక్తుఁడు భక్తితోడనే చూడవలయును. శాంతిని, పవిత్రతను, పరిశుద్ధతను, కరుణను, భగవానునియందు సంపూర్ణ విశ్వాసమును భక్తుఁ డలవరచుకొనవలెను. అప్పుడే భగవంతు డాతనినాశీర్వదించును.

భక్తియనునది ఒక్కటియేయైనను, అది పదకొండు విధములుగా నిర్వచింపఁబడుచున్నది. ౧. భగవంతుని గుణాభివర్ణన మొనర్చుట, ౨. కల్యాణ మూర్తినిఁ బొగడుట, ౩. ప్రార్థించుట, ౪. నిరంతరము స్మరించుచుండుట, ౫. దాస్యమొనర్చుట, ౬. మైత్రితో మెలంగుట, ౭. బిడ్డవలె నెంచుట, ౮. భర్తవలె దలంచుట, ౯. ఆత్మార్పణ మొనర్చుట, ౧౦. సంపూర్ణముగ భగవద్రూపమునందు ధ్యానమును లగింపఁజేయుట, ౧౧. ఎడబాటును క్షణమేని సహింపకుండుట అను పదునొకండును భక్తిశాఖలుగ వెలయుచున్నవి. ఇట్టి యీ భక్తి సందేశమును మహర్షు లందఱును శిరోధార్యముగ భావించియే యున్నారు.

నారదుని భక్తితత్త్వ మిట్లు ఆతని సూత్రములలో గన్పట్టుచుండును. ఇప్పు డీ వివరణము—ఆతని సూత్రములకు కేవలము సూత్రప్రాయము.

ముక్తిదాయకమైన నారదభక్తి తత్త్వమును గ్రహించి, తదనుసారమున వర్తించుట-సర్వులకును శ్రేయస్కరము.

"సంసార సాగరే మగ్నాన్ తర్తు మిచ్ఛన్ కృపామతిః
దదర్శ యో భక్తినావం తం వన్దే నారదం మునిమ్."



# భగవన్నామ సంకీర్తన ప్రభావము

'ఆర్షవిద్యాలంకార'

మాన్యశ్రీ - కల్లూరి చంద్రమౌళి, బి. యస్. సి. (స్కాట్లండు)

* * *

## భగవద్వైభవము

"యం బ్రహ్మ వరుణేంద్ర రుద్రమరుతః స్తున్వన్తి దివ్యైః స్తవైః
వేదైః సాంగపదక్రమోపనిషదైః గాయన్తి యం సామగాః
ధ్యానావస్థిత తద్గతేన మనసా పశ్యన్తి యం యోగినః
యస్యాన్తం న విదుః సురాసురగణాః దేవాయ తస్మై నమః."

భగవంతుఁడు సర్వవ్యాపకుఁడు; సర్వజ్ఞుఁడు; సర్వశక్తిమంతుఁడు; సర్వాంతర్యామి; సృష్టివ్యాపార కారణుఁడు. ఇట్టి భగవానుఁడు అనంత నామములతో నలరారుచు, ఆశ్రితపారిజాతముగ విఖ్యాతి గాంచినాఁడు. ఇట్టి భగవానుని నామము - మహత్తర శక్తి సంభరితము; మహా ఫలప్రదము. కనుకనే —

"హరినామ కథన దావానలజ్వాలలఁ
గాలవే ఘోరాఘ కాననములు
వైకుంఠ దర్శన వాయు సంఘములచే
దొలఁగవే భవదుఃఖ తోయదములు
కమలనాభధ్యాన కంఠీరవంబుచేఁ
గూలవే సంతాపకుంజరములు
నారాయణస్మరణ ప్రభాకరదీప్తి
దీఱవే షడ్వర్గ తిమిర తతులు

నలిన నయన భక్తినావచేఁగాక సం
సారజలధిదాఁటి చనఁగరాదు
వేయునేల? మాకు విష్ణుప్రభావంబు
దెలుపవయ్య సూత! ధీసమేత!!

— (ఆంధ్రమహాభాగవతము)

అని శౌనకాది మహామునులు సూతమహర్షికి విన్నవించి, ఆతనివలన భగవద్వైభవమును అవగత మొనరించుకొని, భగవన్నామమును సంకీర్తించుచు, ఆ నామమునఁగల మాధుర్యమును తనివిదీర నాస్వాదించి, ఆ మాధుర్యమును ప్రజ లందఱకును చవిఁజూపిన మహనీయులు.

" ధీరులు నిరపేక్షులు నా
త్మారాములునైన మునులు హరిభజనము ని
ష్కారణమ చేయుచుందురు
నారాయణుఁ డట్టివాఁడనన్యచరిత్రా ! " — (ఆంధ్రమహాభాగవతము)

ఈ రీతిగా భగవన్నామ సంకీర్తనానంద లహరిలో నోలలాడిన ఆ మహర్షు లెంత ధన్యాత్ములో గదా!

## నామ వైభవము

చిన్న వటబీజమున మహా వృక్షము దాఁగియున్నట్లు, సూక్ష్మమైన భగవన్నామమునందు మహత్తరమైన శక్తి ఇమిడి యున్నది. కనుకనే, భగవన్నామ సంకీర్తనాదులు స్వయం ప్రభావములై, సర్వ సంపూర్ణములై, సర్వ పాపహారకములై, సర్వ శుభశ్రేయోదాయకములై, నిత్య శాంతిప్రదములై, నిత్యానంద సంధాయకములై యొప్పుచుండును.

భగవన్నామ సంకీర్తనము – మానవుల చిత్తమనెడి దర్పణమునఁ గల మలినమును తొలఁగించి, దానిని స్వచ్ఛముగా ప్రకాశింపఁజేయును. ఇందు వలననే – నామ స్మరణము వినా కర్మజ్ఞానములు నిష్ప్రయోజనములని శాస్త్రములు వేనోళ్ళ చాటుచున్నవి. కనుక, దుఃఖ నివృత్తికిని, సుఖప్రాప్తికిని నామ స్మరణమే పరమ శరణ్యమని నిర్ణయింపఁబడినది.

" హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ కేవలమ్
కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతి రన్యథా. "
— (నారద పురాణము : 1-41-15.)

హరినామ సంకీర్తనమే ముముక్షువులకు తరణోపాయమనియు, ఈ కలియుగమున అంతకంటెను మార్గాంతరము మఱియొకటి ముముక్షువులకు లేదనియు, త్రికాలజ్ఞుఁడును – త్రిలోక సంచారియు – పరమ భాగవత శిఖామణియు – బ్రహ్మర్షియు నగు నారదుఁడు స్పష్టీకరించెను.

" సర్వదా సర్వకాలేషు యేఽపి కుర్వన్తి పాతకమ్
నామ సంకీర్తనం కృత్వా యాంతి విష్ణోః పరంపదమ్. "

" న దేశ నియమో రాజన్ న కాల నియమస్తథా
విద్యతే నాత్ర సందేహో విష్ణో ర్నామానుకీర్తనే. "

సర్వదా-సర్వకాలముల యందును దుష్కార్యము లాచరించు పాపాత్ములు సైతము-భగవన్నామ సంకీర్తనము వలన పరిశుద్ధులై, దేహాంతమున పరమ పదమును పొందఁగలరనియు, ఇట్టి భగవన్నామ సంకీర్తనము గావించు వారలకు దేశ, కాల నియమములు లేవనియు పురాణము లుద్ఘోషించుచున్నవి.

భగవన్నామ ప్రభావము అఖండము; అప్రతిహతము. అ నిర్వచనీయ మైన ఆ ప్రభావమును ఆ మూలాగ్రముగ నెఱింగినవా రెందఱో గలరు. అట్టి వారిలో — వ్యాస, పరాశర, శుక, శౌనక, సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాత, నారద, వశిష్ఠ, వాల్మీకి, వామన, జాబాలి, విశ్వామిత్ర, అగస్త్య, యాజ్ఞవల్క్యాది మహామునులును, హనుమ దక్రూరాది భక్తాగ్రేసరులును — పన్నిద్దరాళ్వారులును, నాథ, యామున, రామానుజాది పూర్వాచార్యులును -- చైతన్య వల్లభ, బలదేవ, జ్ఞానదేవ, నామదేవ, తుకారాం, సమర్థరామదాసు, కబీరు, దాదూ, రైదాసు, రామానంద, తులసీదాసు, సూరదాసు, మీరాబాయి, సక్కుబాయి, పోతన, రామదాసు, త్యాగరాజు అన్నమాచార్యులు మున్నగు మహాభక్తులును ముఖ్యులు.

" ముదమున కాటపట్టు - భవమోహ మదద్విరదాంకుశంబు - సం
పదల కొటారు - కోరికల పంట - పరంబున కాది - వైరుల
న్నదన జయించుత్రోవ - విపదబ్ధికి నావగదా ! సదా భవ
త్పదమల నామసంస్మరణ దాశరథీ ! కరుణాపయోనిధీ ! "

అని, నామవైభవమును గోపన్న బహు భంగులస్తుతించుచు-పరమ దయా నిధే! పతితపావననామ! హరే! యటంచు సుస్థిర మతులై, సదా భజనసేయు మహాత్ముల దరికేఁగ వలదని యముండు తన కింకరుల కానబెట్టినట్లు యెలుగెత్తి చాటినాఁడు.

" నిధిచాల సుఖమా ? రాముని సన్నిధి చాలసుఖమా ? "
" సంగీతజ్ఞానము భక్తివినా సన్మార్గము గలదే మనసా ? "

అను భక్తిభావ సమన్వితమైన త్యాగయ్య గాన మాధుర్యమును మనము నేటికిని ఆస్వాదించుచునే యున్నాముగదా !

" అపశబ్దంబుల గూడియున్, హరిచరిత్రాలాపముల్ సర్వపా
ప పరిత్యాగము సేయుఁ గావున, హరిన్ భావించుచున్, బాడుచున్
జపముల్ సేయుచు, వీనులన్ వినుచు నశ్రాంతంబుఁ గీర్తించుచుం
దపసుల్ సాధులు ధన్యులౌదురుగదా తత్త్వజ్ఞ చింతింపుమా ! "

అను పోతన్న మహోపదేశమును మన మెన్నటికిని మఱువజాలముగదా !

" ఇందిరా నామ మిందఱికి - కుందనపు ముద్దవో గోవిందా !
అచ్యుతనామము అనంతనామము - ఇచ్చిన సంపద లిందఱికి
నచ్చిన సిరులు నాలుక తుదలు - కొచ్చికొచ్చినో గోవిందా !
వైకుంఠనామము వరదనామము - ఈకడ నాకడ నిందఱికి
వాకుఁదెరపులు వన్నెలు లోకాలఁ గూకులువత్తులునో గోవిందా !
పండరి నామము పరమనామము - ఎండలు వాపెడి దిందఱికి
నిండు నిధానమై నిలిచినపేరు - కొండలకోనేటివో గోవిందా ! "

అను అన్నమాచార్యుల మధురాలాపనము నేటికిని మన కర్ణపుటములలో ప్రతిధ్వనించుచునే యున్నదిగదా !

ఇట్టి భగవన్నామ సంకీర్తన ప్రభావభాసితమైనదే భాగవత మతము. ఇది కేవలము భక్తిప్రధానమైనది. భవ సాగర తరణమునకు మార్గదర్శకమైనదే ఈ భాగవత మతము. దీనికి భగవన్నామ సంకీర్తనమే ముఖ్యమైన యంగము. నియమ నిష్ఠలు, ఆచార వ్యవహారములు మున్నగునవి దీనికి ప్రత్యంగములు. భవ సాగర తరణ సాధనమైన ఇట్టి భగవన్నామ సంకీర్తనము - భాగవత మతాను యాయులగు ముముక్షువులకు నిత్యకృత్యము.

అనంత నామములుగల భగవానుని, భక్తుఁడు ఏ ఒక్క నామమునైనను చిరకాలము మననమొనరించుట - అత్యంత ఫలప్రదము. ఇదియే భాగవత మత రహస్యము. చైతన్య మహాప్రభువు - తన దివ్యానుభవ ప్రబోధములచే లోకమున కందించిన మధుర ఫల మిదియే.

" చేతో దర్పణ మార్జనం భవమహాదావాగ్ని నిర్వాపణం
శ్రేయః కైరవచంద్రికా వితరణం విద్యావధూజీవనమ్

ఆనందాంబుధి వర్ధనం ప్రతిపదం పూర్ణామృతాస్వాదనం
సర్వాత్మస్నపనం పరం విజయతే శ్రీ కృష్ణ సంకీర్తనమ్. ''

— (శిక్షాష్టకము : 1.)

చిత్తమనెడి దర్పణమును పరిశుభ్రముగ, నిర్మలముగఁ జేయునదియు, సంసార రూపమగు కారుచిచ్చును శమింపఁజేయునదియు - పరమ మంగళము లనెడి పద్మములు వికసించుటకు వెన్నెలను ప్రసాదించునదియు - 'పరావిద్య' అను సుందరికి ప్రాణమైనదియు - ఆనందమనెడి సముద్రము నుప్పొంగించునదియు- అడుగడుగున అమృతమును బాగుగా జూపించునదియు - సకల జీవులకు నిర్మలత (Purity), స్నిగ్ధత (Mellowness) కలిగించునదియు, అద్వితీయము నగు శ్రీకృష్ణ సంకీర్తనము సర్వోత్కృష్టత నొందుచున్న' దని చైతన్యుఁడు సంకీర్తనమును బహుధా ప్రశంసించెను. ఇది - ఇంతటి ప్రభావముగల దగుటవలననే —

" ఇదం శరీరం పరిణామపేశలం
పత త్యవశ్యం శ్లథ సంధి జర్ఝరమ్
కి మౌషధైః క్లిష్యసి మూఢ ! దుర్మతే !
నిరామయం కృష్ణరసాయనం పిబ ! "

— (ముకుందమాల – 31.)

ఓ మూఢుఁడా ! ఈ శరీరము పరిణామముతో గూడినట్టిది. దారుణవ్యాధు లచే ఒక్కక్షణకాలములో నీ శరీరము పతనము కాఁగలదు. కనుక, ఓ మందుఁడా! ఇందుకు సామాన్యమైన మందుల సేవించి, ఫలితము గానక, వ్యథపడనేల? సంపూర్ణారోగ్యమును ప్రసాదించు శ్రీకృష్ణభగవానుని నామామృతమునుగ్రోలు' మని కులశేఖరాళ్వారు లుద్బోధించిరి.

పరమ భాగవతాగ్రగణ్యులును - పరమైకాంతులు నగు పన్నిద్దరాళ్వారుల దివ్యప్రబంధము లందంతటను పరమార్థ మిట్లతి గంభీరముగ ప్రకాశించుచునే యున్నది. ఈ రీతిగా భగవన్నామమును మధుర మధురముగ గాన మొనరించిన వారు - ఎందఱో మహానుభావులు. అట్టి మహానుభావుల మహాభావనము - బద్ధ చేతనుల నుద్ధరింపఁగలదై, లోక కల్యాణదాయకమై విరాజిల్లుచుండుట - ఎల్లఱ కును గమనార్హము.

భగవన్నామ సంకీర్తన ప్రభావము భక్తునిపై ఎట్లు ప్రసరించునో తెలియ వలెను. కనుక, మున్ముందు - మానవుని బహిరంతర నిర్మాణ విశేషములను కూలంకషముగ గ్రహించినఁగాని, నామ ప్రభావము ఆమూలాగ్రముగ అవగతము కాఁజాలదు. ఇందువలన, ప్రకృతము ఆ విశేషముల నొకింత పరిశీలింతము.

## మానవుఁడు - జనన మరణములు

" జాతస్య హి ధృవో మృత్యుః ధృవం జన్మ మృతస్య చ
తస్మా దపరిహార్యార్థే న త్వం శోచితు మర్హసి." — (భగవద్గీత : 2-27.)

పుట్టినవానికి చావును, చచ్చినవానికి పుట్టుకయు నిశ్చయము. కనుక, నివారింపఁగూడని విషయమునందు నీవు దుఃఖమును గల్గియుండుట అనుచిత' మని నరునకు నారాయణుఁ డుపదేశ మొనరించి యున్నాఁడుగదా! అట్టి జనన మరణములు మనకు ప్రత్యక్షముగఁ గన్పట్టు నిత్య సత్యములు. ఏవం విధములైన జనన మరణములు నిత్యము-నిరంతరాయముగ జరుగుచుండుట సర్వ విదితము. జననమునకు పూర్వముగాని, మరణమునకు అనంతరముగాని శరీరమున కెట్టి మార్పును ఉండదు. ఒకవేళ ఏమాత్రమైన మార్పు ఉన్నదన్నను - అది పరిగణింపఁదగినంత మార్పుకాదని తత్త్వశాస్త్రవేత్తలు నిరూపించి యున్నారు. ఇది యిట్లుండ - శ్వాస, హృదయస్పందము ఎప్పుడు ఆగిపోవునో, అప్పుడే మరణము సంప్రాప్తించినట్లు గుర్తింపవలెననియు-ఉచ్ఛ్వాస నిశ్వాసములు, హృదయస్పందము మాత్రమే ప్రాణమున్నదనుటకు ప్రధానాధారములనియు భౌతికశాస్త్రవేత్తలు నిర్ణయించిరి. ఈ నిర్ణయము అశాస్త్రీయము. ఇది - తపసంపన్నులైన తాత్త్వికవేత్తలగు మహర్షుల నిర్ణయమునకు కేవలము విరుద్ధము. ప్రాణము ప్రస్తుత శరీరమును డిపి పోవుటయే మరణమనియు, ఆ ప్రాణము మఱియొక శరీరమున ప్రవేశించుట జనన మనియు మహర్షులు-తమ తపః ప్రభావము వలనను, యోగాభ్యాస విశేషము వలనను బాగుగా నెఱింగి, తమ యీ నిర్ణయములను లోకమున ప్రకటింపఁగల్గిరి.

శ్వాస, హృదయస్పందము ఇవి రెండును ఒకే తావునుండి వెలువడుననియు, పరస్పర సంబంధము గల్గియున్నవనియు మహర్షుల మనోభావన. ఈ భావమును భౌతికశాస్త్రజ్ఞులు అంగీకరించుచునే యున్నారు. నవీనవైద్యశాస్త్రనిపుణులు నైతము శస్త్రములను సాధనములుగ గైకొని, ప్రయోగముల గావించి, ఈ సత్యమును మనకు ప్రత్యక్షముగ జూపెట్టుచునే యున్నారు.

## అజప జపము - భగవత్సాక్షాత్కారము

భక్తులు ఉచ్ఛ్వాస నిశ్వాసములను గావించుచునే భగవన్నామ సంకీర్తనమును అఖండముగఁ జేయుచుందురు, ఇట్టి స్థితిలో - వారిచే ఉచ్చరింపఁబడు నామము ఎట్టి ప్రయత్నము లేకనే శ్వాసతో సమ్మిళిత మగుచుండును. ఇట్లు

నామము, ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములు అన్యోన్యముగ పెనవైచుకొని, వేఱు పఱచుటకు వీలుగాని విధమున నుండును. ఇట్లు రెండు పనులు ఏక కాలమున నిరంతరాయముగ జరుగుచునే యుండును. ఈ రీతిగా ఎడతెగక జేయు నామ సంకీర్తనము - 'అజప జపము' అని చెప్పఁబడును. ఇట్లు నిరంతరాయముగ సంకీర్తనము గావించు భక్తులు - అనంత శక్తులను పొందఁగలరనియు, అట్టి దివ్యశక్తులవలన వారికి భగవత్సాక్షాత్కారము లభింపఁగలదనియు అనుభవజ్ఞు లుద్ఘాటించుచుందురు. భగవత్సాక్షాత్కారమును బడసిన ఇట్టి పరమ భాగవత శిఖామణులకును, భక్తత్రాణపరాయణుఁడగు భగవంతునకును ఎంతయో సన్నిహిత సంబంధ మేర్పడి యుండును. ఈ మహనీయులు - సర్వము విష్ణు మయ ముగా సంభావించి, అంతటను ఆ పరమాత్మనే ఆలోకించి ఆనందించుచుందురు. ఇట్టి స్థితి గతు లేర్పడవలెనన్న, భక్తుని యింద్రియము లన్నియు భగవన్నామ సంకీర్తన యనఁబడు అగ్నిచే తప్తములై, పవిత్రీకరింపఁబడవలెను. అప్పుడు భౌతికచక్షువు-దివ్యచక్షువుగ పరిణతిని పొందును. మనస్సు నిర్మలమై, స్వచ్ఛముగ ప్రకాశించును. హృదయము వికసించును. విశ్వ మంతయు దివ్య స్వరూపముగా- ప్రేమమయముగా - భగవన్మయముగా గన్పట్టును. అనంతరము అట్టి భక్తుఁడు భగవ దనుభూతిని బడసి, ఆత్మానందము నందును. తా నేమి జేయుచున్నను - భగవదాజ్ఞానుసారమే గావించుచున్నట్లు భావించును. తన శరీరములోని ప్రత్యణువు నందును భగవంతుని స్పర్శయే ఆతనికి గోచరించును. ఇట్లాతని జీవితము పరిశుద్ధమై, పరమ పవిత్రమై, పరమాత్మ తత్త్వమునకు అతి సన్నిహిత మగును. కనుకనే - సంకీర్త నానందాబ్ధిలో నోలలాడు ముముక్షువు నకు సకల లోకము సంతోష మయముగా - సత్య స్వరూపముగా సాక్షాత్కరించుచుండునని మహర్షులు నొక్కి వక్కాణించిరి. ప్రతి శ్వాసతో భగవన్నామమును మిళిత మొనర్చి, నిరంతరాయముగ సంకీర్తించుచుండుటచేతనే ఇట్టి అమృతఫలములు ఎవరికేని లభించు చుండఁగలవు. భక్తుల కివి అనుభవ సిద్ధములు. ఇట్టి భక్తుల యను భూతులు ఇతరులైన ప్రాకృతులకును మార్గదర్శకములై, వారిలో నిద్రాణమై యున్న ఆధ్యాత్మిక చైతన్యమును జాగరిత మొనరించుచునే యుండును.

## నామ రూపములు

సృష్టిలో నామరూపములు లోపించినచో - మానవుని మనుగడయే కుంటు వడును. అందువలన, అవి అందఱకును అవశ్యాపేక్షితములు. ఏలన-రాముఁడు, కృష్ణుఁడు ప్రాణమిత్రు లనుకొనుఁడు వా రిరువురిలో రాముఁడు-'కృష్ణా!' అని

పిలిచినంతనే 'ఆఁ!'అని కృష్ణుఁడు ప్రత్యుత్తర మిచ్చునుగదా! ఈ కృష్ణుఁడెవరు? ఇతరుని నుండి భిన్నునిగ సూచించు పేరుతో బిలువఁబడు యీ కృష్ణుఁడు శరీరమా? అట్లగుచో - 'ఆఁ!' అను సమాధానము ప్రాణములేని శరీరమునుండి వచ్చునా? ఎన్నఁడును రానేరదుగదా! అట్లుగాక, ప్రాణమే యిట్లు ప్రశ్నించునా? అట్లగుచో - ప్రాణమునకు నామము గలదా? శరీరముతో గాక, ప్రాణముతో మాత్రమే నామసంబంధము గల్గియున్నచో - శరీరము వీడిన ప్రాణము, రాముని పిలుపున కేల సమాధానము నీయదు? నామమును ప్రకటించు సాధనమగు శరీరము, ప్రాణమునుండి వేరగుటవలననే, ప్రాణము రాముని పిలుపునకు సమాధాన మొసంగఁ జాలదుగదా! అదియును అసంభవ మనియే స్పష్టమగుచున్నది. ప్రాణమునకు కృష్ణుఁడను నామ ముండియున్న దన్నను, అది ప్రాణమునకు శరీరముతో సంబంధ మున్నంతవఱకు మాత్రమే అన్వయించును. ప్రాణము శరీరము వీడినంతనే, నామముతో తన సంబంధమును త్రెంచుకొనును ప్రాణము, శరీరము ఏకమైయున్నంతవఱకును నామము అన్వయించునని ఇందువలన స్పష్టమగుచున్నది గదా! కనుక, నామి-నామముల సంబంధముకూడ ఇట్టిదనియే గ్రహింపవలెను. రాముఁడు కృష్ణుని యెడతెగక పిలుచుచున్నచో కృష్ణుఁడును - 'ఆఁ! ఇచ్చటనే యున్నాను' అని సమాధాన మిచ్చుచునే యుండును, ఇది సహజసిద్ధము; నిత్య సత్యము. ఇట్లే ప్రతిశ్వాసతో భగవన్నామ సంకీర్తనము గావించు భక్తుఁడును భగవంతుని ప్రత్యుత్తరములను తా నొనరించు సంకీర్తనమునకు సముచిత ఫలములుగ పొందుచుండును.

"అహం భక్తపరాధీనః అస్వతంత్ర ఇవ ద్విజ."

అని, అంబరీషోపాఖ్యానమున భగవానుఁడు దూర్వాసునితో బలికినట్లు - భక్తపరాధీనుఁడగు భగవానుఁడు, ఇట్టి భక్తుల మనోరథముల నీడేర్చుచు, మధుర ఫలముల నందించుచు, పరమానందమును ప్రసాదించుచుండును. భక్తునకు-భగవానునకు గల అవినాభావ సంబంధము అనుభవైకవేద్యము.

శ్వాసకు, హృదయస్పందమునకు ప్రాణమే మూలాధారము. అయినను- యోగాభ్యాసపరులై, సమాధిస్థితి లోఁగల యోగులకు ఉచ్ఛ్వాస నిశ్శ్వాసము లుండవు. హృదయము స్పందింపదు. మరణ చిహ్నములు జూపెట్టు స్థితి ప్రకటించుచుండును. కాని, అట్టి యోగుల శరీరము చెడిపోదు; శరీర్వాసన వేయదు. అది శవము కాదు గనుకనే ఇట్టి దుర్లక్షణము లుండవు. దురము

యథాతథముగ నుండును. కాని, అవయవములు మాత్రము అట్టి యోగాభ్యాస పరునకు వశములై యుండును. ఆతడు ఆ అవయముల చర్యల నరికట్టును. ప్రాణమును బిగ బట్టును. ఇట్టి విచిత్రమైన పరిస్థితి అతనిలో నేర్పడినను, అతఁడు సజీవుఁడై, సంశోభించుచునే యుండును. యోగాభ్యాసమూలమున సంప్రాప్తించిన దివ్యశక్తియే ఈ విచిత్ర పరిస్థితికి మూలకారణము. ఇట్టి దివ్యశక్తిని ప్రసాదించు అష్టాంగయోగ ప్రభావము అందఱకును అవశ్యగ్రహణీయము.

## అష్టాంగ యోగములు - వాని ప్రభావములు

యమము - నియమము - ఆసనము - ప్రాణాయామము - ప్రత్యాహారము- ధారణము - ధ్యానము - సమాధి అనునవి అష్టాంగ యోగములు. అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము అనునవి యమ మని చెప్పఁబడును. ఈ యమము వలన చిత్తశుద్ధి గల్గును. శౌచము, సంతోషము, తపము, స్వాధ్యాయము, భగవ దారాధనము అనునవి నియమ మని చెప్పఁబడును. ఈ నియమము వలన బాహ్యశుద్ధియు, అంత శ్శుద్ధియు ఏర్పడును. వక్షమును, భుజములను శిరస్సును నిశ్చలముగా సీటూరుగా నిలిపి, శరీరమును సక్రమ విధానమున నుంచుట ఆసన మనఁబడును. ఇందువలన, ఇంద్రియము లన్నియు స్వాధీనము లగును. ప్రాణాయామ మనఁగా - ఉచ్ఛ్వాస నిశ్వాసముల మూలమున ప్రాణగతిని వశ మొనర్చుకొనుట. తత్ఫలితముగ నాడీశుద్ధి, చిత్తశుద్ధి కలుగును. ఇది - రేచక, పూరక, కుంభకము లని మూఁడు విధములు. రేచక మనఁగా - ఊపిరి విడచుట. పూరక మనఁగా - ఊపిరి పీల్చుకొనుట. కుంభక మనఁగా-ఊపిరి నిలుపుట. ఈ ప్రాణాయామమువలన భూమిపై ఆసీనుఁడై యున్న యోగి, తేలికగ పైకి లేచుటకు తగిన శక్తియు, దివ్యానందమును లభించును. ప్రత్యాహార మనఁగా - ఇంద్రియములు తమ తమ విషయములను విసర్జించి, చిత్తముయొక్క స్వరూపమును పొందుట. హృదయ కమలమునందు గాని, శిరస్సునందలి సహస్రార కమలమునందుగాని మనస్సును నిలుపుట ధారణమనఁబడును. దీనివలన, ఇంద్రియము లన్నియు సంపూర్ణముగ వశము కాఁగలవు. ఇట్లు ఇంద్రియము లన్నియు వశమైనపిమ్మట, ఏకభావ ప్రవాహరూపముగాఁగల్గు జ్ఞానమే ధ్యానము. సమాధి యనఁగా-సర్వమును సర్వేశ్వరునకు సమర్పించుట. భగవంతుని శరణుపొందుటవలన ఇట్టి సమాధిస్థితి లభించును. బ్రహ్మానందానుభవమే దీనికి ఫలము. ఈ యోగవిధానము ననుసరించి - 'శ్వాస, హృదయ స్పందము ఆగిపోయినచో అది మరణమే యగు' నను భౌతిక శాస్త్రజ్ఞుల నిర్ణయము నిరస్త మగుచున్నది.

యోగి సమాధిస్థితిలో నున్నప్పుడు ప్రాణము స్థూల సూక్ష్మ శరీరముల నుండి కారణ శరీరమునకేగి, అట నిశ్చలముగా ప్రకాశించుచుండును. అట్టి స్థితిలో జీవుఁడు కారణ శరీరముతో మాత్రమే సంబంధము గలిగియున్నను, స్థూల సూక్ష్మ శరీరములను కలిపియుంచు కొలికి మాత్ర వీడియుండదు. ఇది మన భౌతిక చక్షువునకుఁ గన్పించునదికాదు. అయినను, అందఱును విధిగా నంగీకరింపవలసిన సూక్ష్మ విషయ మిది. కనుక, స్థూలదృష్టికి యోగి మరణ చిహ్నములు గల్గి, చూచువారికి మరణించెనను అభిప్రాయమును గల్గించువిధమున గన్పట్టుచున్నను, అది ఆతని మరణము గానేరదు. అతని శరీరము అణుమాత్రము చెక్కుచెదరక, చెడక, యథాతథముగనే యుండును. ఇది మనకు ప్రత్యక్షముగ గన్పట్టు సత్యము. అట్టి స్థితిలో—స్థూల శరీరము కారణ శరీరమునకు వశమై యుండును. కారణశరీరము మాత్రము స్థూలశరీరమునకు లొంగియుండదు. యోగమునందు కడపటిదగు సమాధి దశ కియ్యవి సహజ లక్షణములు. ఈ సమాధ్యవస్థలో - ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములు లేకున్నను, జీవుఁడు కారణ శరీరమున ఆనంద మనుభవించుచునే యుండును. ఇట్టి అద్భుత విషయములు - భౌతిక శాస్త్రజ్ఞుల ఊహాలకు మిక్కిలి అతీతములైనవి.

జీవుఁడు శరీరాంతర్వర్తియై యుండును గావున, అట్టిస్థితిలో స్థూలశరీరము చెడదు. శ్వాసకు కారణము శరీరసంబంధమగుటవలన, అట్టి సంబంధ మున్నంత వఱకును స్థూలశరీరముపై తన శక్తిసామర్థ్యములను ప్రదర్శించుచునే యుండు ననుట ఇట స్పష్టము.

నిరంతర భగవన్నామస్మరణము, అజప జపము కారణ సూక్ష్మశరీరములపై తన ప్రభావమును ప్రదర్శించునట్లే - స్థూల శరీరముపైనను తనశక్తిని ప్రసరింపఁజేసి, దానిని స్వాధీన మొనరించుకొని, తన సంకల్పానుసారము ప్రవర్తింపఁజేయుచుండును. యోగశాస్త్రము లోకమున కుపదేశించిన పరమ రహస్య మిదియే. దీనిని మహర్షులు అనుభవపూర్వకముగను, శాస్త్రీయముగను నిరూపించి, విశ్వవ్యాప్త మొనరించిరి.

## శారీర విజ్ఞానము

మన శరీరములో ఊపిరితిత్తులు (శ్వాస నాళపు శాఖలు), హృదయము (రక్త ప్రసరణ కేంద్రము), ఈ రెంటిని మించిన నరములు, నాడులు (వార్తా వాహినులు) కలవని ఆయుర్వేదశాస్త్రము అతి ప్రాచీనకాలముననే అభివ్యక్త

గావించియున్నది. ఈ నిర్ణయమును నవీన వైద్య శాస్త్రజ్ఞులును ఆమోదించుచునే యున్నారు. నరములు శరీరమునందు తమ చర్యలను ప్రస్ఫుటింపఁజేయుచు, స్వీయ ప్రభావమును ప్రకటించుచుండుట అందఱకును అనుభవసిద్ధమైన యంశము. ఇంద్రియముల కందింపఁబడిన సందేశములను యథాతథముగ నరములు మనస్సున కందించును. అనంతరము బుద్ధి—నిర్ణయములఁ గావించును. ఈ నిర్ణయములను నరములు మరల ఇంద్రియముల కందించి, కార్యరూపమున రూపొందించి, బాహ్యమునకు వ్యక్తమగు శ్వాసకంటెను, రక్తప్రసరణముకంటెను త్వరిత గతిని కార్య నిర్వహణమునకు గడంగుచుండును. రక్తప్రవాహము హృదయస్పందముపై ఆధారపడియుండును. హృదయస్పందము శ్వాసకంటెను వేగముగ తన చర్యలను కొనసాగించుచుండును. ఇట్టి హృదయస్పందమునకు ప్రోత్సాహము, ప్రేరణము, ఊపిరితిత్తులనుండియే లభించుచున్నను, శ్వాసగతికంటె హృదయస్పందమే త్వరిత గతిని జరుగుచుండును. ఇందువలన, శ్వాసకోశములందును - హృదయము నందును ఉత్పన్నములగు సున్నితములైన వ్యాధులు సైతము తప్పక నివారణ కాఁగలవని ఆయుర్వేద వైద్య శాస్త్రవేత్తల నిశ్చితాభిప్రాయము.

హృదయము, శ్వాసకోశములు అనునవి నిరంతరాయముగ గావించు క్రియల కంటెను, నరములు తమ తమ క్రియలలో ప్రగాఢముగ అనువర్తించుచుండు ననియు, శరీరపోషణమునందును-పారిశుద్ధ్యమునందును శ్వాసనాళముల కంటెను, రక్త ప్రసరణము కంటెను నరములు అధిక ప్రాధాన్యము వహించి యున్నట్లు విశదమగుచున్నది. ఈ యంశమును నవీన వైద్యశాస్త్రజ్ఞులు సైతము అంగీకరించుచునే యున్నారు.

నరములు భావనా ప్రపంచమున తమ ప్రభావమును బాగుగా ప్రకటించు చుండుట పరిపాటి. సూక్ష్మములును - మృదులములును అగు తంత్రులవలె నవి మనస్సులో నుదయించు భావములను అటు నిటు అందించుచుండును. ఇందువలన, ఇవి వార్తావాహకములని వక్కాణింపఁబడు చుండును. శ్వాస, రక్త ప్రసరణము అనునవి రెండును కేవలము శరీర సంబంధములు. ఇవి క్రియా ప్రధానములేగాని, భావ ప్రధానములు కావు. కావున, కర్మకంటెను భావము అతి ముఖ్యమైనదనియు - సూక్ష్మమైనదనియు - కోమలమైనదనియు తెలియ నగును. ఇట భావమును వ్యక్తీకరించుట యన, మనస్సులో నుదయించిన

భావమును బాహ్యప్రపంచమునకు వెలువరించుట యని తాత్పర్యము. అట్టి భావ ప్రకటనమునకు వాహనము (సాధనము) నామము. కావున, నామములేని భావమే యుండదనుట నిర్వివాదాంశము. ఆలోచనము జరుగుచున్నదన్న, భావము వెలువడుచున్నదన్న, వెనువెంటనే దానికి నామ మేర్పడితీరును. ఇది అనివార్యము. మనము చేయు ప్రతి కర్మకును, దాని ఫలితమునకును నామముకూడ తప్పక జోడింపఁబడియే యుండును. నామములేని కర్మయు, చర్యయు ఉండనే ఉండదు. కనుక, నరముల నిర్మాణ విధానము భావ ప్రకటనమునకు ఉద్దేశింపఁబడినదే యని నిస్సంశయముగా నిర్ణయింపవచ్చును.

బాహ్యప్రపంచమును, క్రియాప్రపంచమును మనస్సుమూలముననే తెలియ నగును. ఈ బాహ్యప్రపంచమును మనస్సున కెదుట బెట్టునవి నరములే. అప్పుడు మనస్సు - ఆ నరముల తత్త్వము నెఱింగి, తన భావములను బహిర్గతము గావించు చుండును. కనుక, నరముల నిర్మాణము శరీరాంతర్భాగమున మిక్కిలి ప్రాధా న్యము వహించియున్నట్లు మనము నిర్ణయించుకొనవచ్చును. ఇట్లు ప్రాముఖ్యము వహించిన నరముల చర్యలు - నామముయొక్క సహకారమువలననే జరుగు చుండును. నరములకును, నామమునకును ఇంతటి యవినాభావసంబంధ మున్నందుననే, నామము లోపించినయెడల ప్రపంచపు టునికియు నశించునని చెప్పఁబడినది. ఇంద్రియములు తమ తమ చర్యలను ప్రదర్శించుచుండుట మనకు అనుభవసిద్ధమైన విషయమే గదా ! కన్ను చూచును. కర్ణము ఆకర్ణించును. మనస్సు బుద్ధికి సందేశముల నందించును. బుద్ధి గావించిన నిర్ణయములను మనస్సు నుండి ఇంద్రియములకు గొనివచ్చి, వాని క్రమచర్యలను నిర్ణీత విధానాను గుణముగ నరములు నిర్వహించుట - నరములకు నామముతోఁగల యెడతెగని సంబంధమువలననేగదా !

శరీరమునందలి యే భాగమునఁగల చైతన్యమునైనను స్తంభింపఁజేసి, స్పర్శజ్ఞానమును తాత్కాలికముగ నిలిపి వేయుటకు వైద్యశాస్త్రనిపుణులు మత్తుమందులను ప్రయోగించుచుండుట ఎల్లఱకు తెలిసిన విషయమే. ఔషధ ప్రభావమువలన నరములు స్తంభించి, శరీరము చైతన్యరహిత మగును. అనఁగా- ఆ భాగము తాత్కాలికముగా మరణించినదని తాత్పర్యము. అయినను, ఆ శరీరములో మాత్రము ప్రాణము నిలిచియే యుండును. నరముల చలనము

స్తంభించినంతనే ఆ భాగము చైతన్యరహితమై, స్పర్శజ్ఞానమును నశింపఁజేసి, తాత్కాలిక మరణమునకు గురి గావించును. ఇట్లే, యోగము సైతము ఇట్టి చర్యల నరికట్టునని యెఱుంగవలెను.

కొన్ని సమయములలో వైద్యులు (Doctors) రోగులకు సూదిమందుల నుపయోగింతురు. ఇవి రెండు విధములుగా నుండును. కండరములద్వారా మందునెక్కించుట ఒక విధము, దీనిని- 'ఇంట్రామస్క్యులర్' (Intramusculor) అని యందురు. నరములద్వారా మందునెక్కించుట మఱియొకవిధము, దీనిని- 'ఇంట్రావీనస్' (Intravenus) అని యందురు. చిన్న నరములనుండి సిరల ద్వారా ప్రవేశింపఁజేయఁబడినమందు - హృదయమునకుఁ జని, అటనుండి వ్యాధి గల ప్రాంతమునకు వ్యాపించును. ఇది మనకు అనుభవసిద్ధమైన విషయము. ఇట్లు శరీరములోనికి సూదిమందుల నెక్కించి, ఆ మందును రక్తముతో సమ్మిళిత మొనర్చి ప్రసరింపఁజేయునట్లు - శ్వాసతో సైతము మందులను సమ్మిళిత మొనర్ప వచ్చునుగదా! ఇదియును సాధ్యమే కాఁగలదు. ఈ విధానమునుగూడ వైద్య శాస్త్రవేత్తలు తమ ప్రయోగములచే నిరూపించుచునే యున్నారు. చూడుఁడు:

లెక్సిన్ (Lexin) అను మందును శ్వాసతో పీల్చినయెడల, తేలుకుట్టిన విషము హరించుచున్నది. ఈ యౌషధమే కొన్ని సందర్భములలో పాము కాటుకుగూడ పనిఁజేయుచున్నది. 'క్లోరోఫారమ్' (Chloroform) అను మత్తు మందును శ్వాసతో పీల్చినచో - అది తాత్కాలికముగ శరీరము నంతయు చైతన్య రహితము గావించును. వైద్యుఁడు రోగిశరీరమును కత్తితో కోయుచున్నను, ఆ రోగికి - అంతకుముందు వైద్యుఁడు ప్రయోగించిన మత్తుమందు ప్రభావమువలన స్పర్శజ్ఞానము నశించియుండును గనుక, మత్తు యేర్పడియుండును. అప్పుడు ఏమాత్రము బాధయు గన్పింపదు. కాని, ఆ మత్తుమందునందలి శక్తి యంతరించి నంతనే - మత్తుపీడి, స్పర్శజ్ఞానము గల్గినంతనే - ఆ శస్త్రచికిత్స (Operation) మిక్కిలి బాధను గల్గించును. మందును శ్వాసతో మిళితము గావింపఁబడు నిట్టి రోగ నివారణ సాధనములు - చిరకాలానుభవములు. ఇట్లే - శ్వాసతో భగవన్నామ మును సమ్మిళిత మొనర్చుటయు, పైన బేర్కొనఁబడిన సూదిమందుల (Injections) ప్రయోగమువంటిదేగదా! కనుక, నామము శ్వాసతో మిళితమై, దివ్యఫలముల నొసంగగలదనుటలో అణుమాత్రమైనను అసత్యము లేదుగదా!

## నామప్రభావము

''సంకీర్త్యమానో భగవా ననంతః శ్రుతానుభావో వ్యసనం హి పుంసామ్
ప్రవిశ్య చిత్తం విధునో త్యశేషం యథా తమోఽర్కోఽభ్రమివాతి వాతః.''

సూర్యుఁడు అంధకారమును, వాయువు మేఘములను ఎట్లు ఛిన్నాభిన్న మొనరించునో - అట్లే, నామసంకీర్తనము గావించినచో అనంతుఁడైన భగవానుఁడు అట్టి భక్తుల హృదయసీమలలో ప్రవేశించి, వారి సర్వపాపములను పటాపంచలు చేయునని భాగవత పురాణము నొక్కి వక్కాణించుచున్నది.

ఈ భాగవత సూక్తిచే, అత్యద్భుతమైన నామ ప్రభావము మనకు సుస్పష్టముగుచున్నది గదా! అయినచో – ఇట్టి నామమునకు అనుభవము, ప్రకటనాశక్తి అత్యావశ్యకములు. ఇం దేయొకటి లోపించినను, నామము మరుగునఁబడి యుండును. అప్పుడు అనుభవము వంటి స్పందమునకు, స్పర్శకు తుల్యమైన మఱియొక స్పర్శకొఱకు అన్వేషణము గావించును. తెలియని విషయము నెఱుకపఱచు జ్ఞానము వికసించు వఱకును - దానికి తుల్యమగు స్పర్శను గల్గించును. ఇట్టి నామము నుచ్చరించినంతనే, ఆ శబ్దము చెవియందలి మద్దెల పొరవంటి చర్మపు పొరకు తగులును. వెన్వెంటనే ఆ శబ్దము నరముల మూలమున మనస్సున ప్రవేశించును. అట్టి నామమునందలి రూపమును మనస్సు చిత్రించుకొనును.

నామముతో లీనమైయుండు స్పర్శను గల్గించు శక్తి, నరములకు గలదు. కనుక, మన బాహ్యస్థితికి – దృశ్య ప్రపంచమునకు నరములే సంబంధమును గల్గించుచున్నట్లు తెలియనగును. నరములపై నామము మాత్రమే క్రియను, ప్రతిక్రియను చేయఁగలదు. ఈ నామ ప్రభావము కర్మ ప్రభావము కంటెను మిన్నగా నుండును. బాహ్యకర్మ కంటెను నామమునకు సంబంధించిన చర్యలు – సూక్ష్మాతిసూక్ష్మములు. ఇందువలన, భగవన్నామ ముచ్చరించుచున్నంతనే ఆ నామము శ్వాసతో మిళితమై, తన ప్రభావమును నరములపై ప్రసరింపఁజేయును. భగవన్నామము – శరీరమునందును మనస్సునందును, సర్వేంద్రియములందును గల కల్మషమును తొలఁగించి, వానికి పవిత్రతనుఁ జేకూర్చును. అంతేకాదు – ఈ భగవన్నామమే సజ్జన సాంగత్యమును, సదాచార సంపదను ప్రసాదించును. ఇట్లీ నామము అంతటను – అన్నింటియందును తన ప్రభావమును ప్రదర్శించుచునే యుండును. నామ ముచ్చరించువారి ప్రతి పనియందును అది తన శక్తిసామర్థ్య

ములను ప్రకటించుచునే యుండును. ఇట్టి భగవన్నామోచ్చారణమువలన భక్తుఁడు అభ్యుదయ పథమున పురోగమించుచు, ఆధ్యాత్మికమైన దివ్యతేజమును, ఆత్మానుభూతిని పొందుచుండును. ఇట్టి దివ్యానుభూతులు — అట్టి భక్తుని నుండి బాహ్య ప్రపంచమునకును వ్యక్తమగుచునే యుండును. కావున, భగవన్నామో చ్చారణముతో మిళిత మగు శ్వాసయే పవిత్రభావములను, పరమశాంతిని, పరమా నందమును ప్రసాదించుటకు కారణమై యుండునని తెలియవలయును. అదియునుఁ గాక, భగవత్సాక్షాత్కారమునకు సైతము ఉచ్ఛ్వాస నిశ్వాసములతో మేళవింపఁబడిన నామమే ప్రధాన కారణ మనియు గ్రహింపవలెను.

మానవుఁడు ఇతరోపాయముల కంటెను భగవన్నామ సంకీర్తనమువలననే భగవ దనుగ్రహమును సులభముగ పొందగలఁడు. ఇట్టి నామసంకీర్తన ప్రభావము- భాగవత మతానుయాయులకు బాగుగా తెలియును. ఇది-భవ సాగర తరణమునకు మిక్కిలి సులభోపాయము. ఇట్టి సులభోపాయమే సర్వమానవ సంఘ సంక్షేమము నకు పరమ ప్రయోజనకరము. ఇట్టి సాధనయే సర్వేశ్వరానుగ్రహమును నరులకు ప్రసాదించును. అట్టి భగవ దనుగ్రహము — భక్తుల మనః పద్మముల వికసింపఁ జేయును. భౌతిక ప్రపంచముపై అఖండ విజయమును ప్రసాదించును. ముక్తి నొసంగును. భాగవత మతముగా ప్రసిద్ధిగాంచిన వైష్ణవ మతము-ఇట్టి భగవన్నామ సంకీర్తనమునే ప్రబోధించుచుండుట గమనార్హము. భక్తియుక్తమైన భగవ న్నామ సంకీర్తనమును ప్రబోధించునది కావుననే — వైష్ణవ మతము దివ్యశక్తులను, దివ్యానుభూతిని, దివ్యధామమును ప్రసాదింపఁగల్గి ప్రకాశించుచున్నది.

"ఆర్తా విషణ్ణా శ్శిథిలాశ్చ భీతాః
ఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః
సంకీర్త్య నారాయణ శబ్దమాత్రం
విముక్తదుఃఖా స్సుఖినో భవన్తి."

దారుణములైన శారీరక వ్యాధులచే బాధపడువారును, దుర్భరములైన మానసికబాధలచే క్రుంగి క్రుశించువారును నారాయణనామ సంకీర్తన గావించిన మాత్రమున, వివిధ వ్యథలనుండి విముక్తులై, సుఖ శాంతులను బడయఁగలరని మహాభారతము ఎలుగెత్తి చాటుచున్నది. కనుక, భగవన్నామ సంకీర్తనమే సకలరోగములకు దివ్యౌషధమని యెఱుంగవలయును.

"కొనరో కొనరో కూరిమిమందు
వునికి మనికికెల్ల నొక్కటేమందు
ధ్రువుఁడు గొనినమందు - తొల్లియు
ప్రహ్లాదుఁడు చవిగాఁగొనినమందు - పల్లనిమందు
నిలిచి నారదుఁడు గొనినమందు
జనకుఁడు గెలుపుతోఁగొని బ్రదికినమందు
మొలచి నాలుగుయుగముల రాజులు
ఘనుఁలు కలకాలముగొని కడగన్నమందు
అజునకుఁ బరమాయువై యొసఁగినమందు
నిజమై లోకములెల్ల నిండినమందు
త్రిజగములు నెఱుఁగ తిరువేంకటాద్రిపై
ధ్వజమెత్తెఁ గోనేటిదరినున్నమందు."

ఈ సంకీర్తనములో అన్నమాచార్యులు భగవన్నామ ప్రభావమును స్పష్టముగా బల్కినాఁడు. ఇట్టి భగవన్నామామృతమును గ్రోలినవారు - ఎంతటి సుకృతాత్ములు!

## పరబ్రహ్మము - శబ్దబ్రహ్మము

నామము నాదోద్భూతము. నాదము శబ్దమయము. ఈశబ్దమే సకల జగద్వ్యాపారమునకును మూలాధారము. సర్వాంతర్యామియగు పరబ్రహ్మమే అట్టి శబ్దమునకు మూలాధారము. సృష్టికర్తయగు పరబ్రహ్మ మెట్లు అనాదియో అట్లే, సృష్టివ్యాపారమునకు మూలాధారమైన శబ్దముకూడ అనాదిసిద్ధమే. పరబ్రహ్మమెట్లు సర్వపదార్థములందును వ్యాపించియుండెనో - అట్లే, శబ్దముకూడ సర్వపదార్థములందును అనుస్యూతముగ వ్యాపించియున్నది. పరబ్రహ్మ మెట్లు సర్వప్రకాశకుఁడో - అట్లే, శబ్దముకూడ సర్వప్రకాశకము. బ్రహ్మములేక సృష్టిలో నేదియు ప్రకాశింపనట్లే - శబ్దము లేక సృష్టిలో ఏవ్యవహారము జరుగనేరదు. ఏవ్యవహారములేక, సృష్టివ్యాపారము జరుగనేరదు. ప్రపంచపు టునికికి, అంతర్యామిస్వరూపముగాఁగల పరబ్రహ్మమే ఎట్లు కారణ మగుచున్నదో - అట్లే, శబ్దముకూడ ప్రపంచపు టునికికి ఆధారభూతమై యలరారుచున్నది. ఇం దొకటి పరబ్రహ్మము, మఱియొకటి శబ్దబ్రహ్మము. అవిభాజ్యములైన యీ రెంటికినిఁ

గల అవినాభావ సంబంధము నిత్యమై, శాశ్వతమై యొప్పుచున్నది. కావున, శబ్ద బ్రహ్మమగు భగవన్నామమును అనన్యమైన భక్తిభావముతో సంకీర్తించినఁ గాని, పరబ్రహ్మాభిధేయుఁడగు భగవన్నారాయణుని కృపాకటాక్షము భక్తులపై ప్రసరింపఁజాలదు. ఇందువలన, జననమరణరూపమైన ఈసంసార సాగరమును తరించి, విముక్తి నందఁదలచిన సహృదయులు - సర్వకాల సర్వావస్థల యందును భగవన్నామ సంకీర్తన మొనరించి, సర్వాంతర్యామియు, ఆనంద మయుఁడు నగు ఆ భగవానుని యనుగ్రహమును సంపూర్ణముగ బడసి, శాశ్వతా నందము నందుదురుగావుత!



# ప్రపత్తి ప్రాశస్త్యము

డాక్టరు: కందాడ రంగాచార్యులు, యం. బి. బి. యస్.

* * *

'శరణాగతి' యను పదమునకు ప్రపత్తి, న్యాసము మున్నగు నామాంతరములు గలవు. 'పద్ గతౌ' అను ధాతువునుండి 'ప్రపత్తి' యను శబ్దము సముత్పన్నమైనది. 'యే గత్యర్థా స్తే బుద్ధ్యర్థాః' అను వ్యాకరణ నియమము ననుసరించి, ప్రపత్తియనఁగా - అధ్యవసాయరూపమైనబుద్ధి అని యర్థము.

మానవజీవితముయొక్క ముఖ్యమైన పురుషార్థము సంసారరూపమైన కర్మబంధమునుండి విముక్తి. తత్ఫలము బ్రహ్మసాన్నిధ్యము. లేక, పరమపద వాసము. ఇట్టి ముక్తికి ముఖ్యమైన మార్గములు భక్తిప్రపత్తులు. భక్తి - లేక, ఉపాసనవలన ముక్తి సంపాదించుటకు కష్టసాధ్యమైన సాధన సంపత్తిని సేకరించుట అత్యంతావశ్యకమై యున్నది. అంగభూతములైన కర్మజ్ఞానములు, అష్టాంగ యోగ నియమములు, వివేక విమోకాది సాధన సప్తకము, ఇతరాదిత్యభూమాది బ్రహ్మవిద్యలు ఉపాసనకు పరికరములు. ఇట్టి సాధన సంపత్తిని సేకరించుటకు అనేక జన్మల వ్యవధి అవసరము. సాధనయందు ఇంచుక దోషముకల్గినచో - పరిణామముకూడ విపరీత మగును. కాని, స్థిరమైన ఆవృత్తి, లేక - సాధనవలన క్రమముగ కర్మ - కైంకర్యమై, జ్ఞానము - బ్రహ్మజ్ఞానమై, భక్తి - అనన్యమై, ప్రపత్తి - పరమైకాంతికమునై పరమపదమును చేకూర్చును.

"జన్మాంతర సహస్రేషు తపోజ్ఞాన సమాధిభిః
నరాణాం క్షీణ కర్మాణాం కృష్ణే భక్తిః ప్రజాయతే." — (భాగవతము)

అనేక సహస్ర జన్మలలో - తపో ధ్యాన జ్ఞాన యోగములచే కర్మలు క్షయించిన వారికిఁగాని హరిభక్తి జనింపదు. కర్మముల క్షీణింపఁజేయుట - భగవత్ప్రాప్తికి ప్రథమ సోపానము.

"సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే." (గీత: 4-33)
"జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసా త్కురుతేఽర్జున!" (గీత: 4-37)

ఓ పార్థా! కర్మ లన్నిటికిని జ్ఞానమే పర్యవసానము. జ్ఞాన మనెడి అగ్ని, బంధ హేతువులైన సర్వ కర్మలను భస్మము సేయును. ఇట్లు భగవద్గీత ప్రబోధించు చున్నది. కాని, జ్ఞానయోగము సైతము ప్రారబ్ధ కర్మానుభవమును వారింపఁ జాలదు. అనుభవమునకుఁ గావలసిన పునర్జన్మయు గల్గుట తథ్యము.

"భోగేన త్వితరే క్షపయిత్వా అథ సంపద్యతే." — (బ్ర. సూ. 4-1-19)

అను వ్యాస సూత్రము ననుసరించి, సంచితములును-ఆగాములు నైన కర్మలు నిష్కామ కర్మ వలనను, జ్ఞానము వలనను నశించినను, ప్రారబ్ధ కర్మము లనుభవించుట వలననే పరిసమాప్త మగును. ఇట్టి ప్రారబ్ధ కర్మానుభవమునకనేక సహస్ర జన్మము లెత్తు టావశ్యకమని యెల్లరకు విదితమే. నిష్కామ కర్మానుష్ఠాన పరులైన జనకాదులు సైతము కొన్ని జన్మములవఱకు ప్రారబ్ధ మనుభవించి, అంతిమ జన్మయందు మోక్షము బడయఁగల్గి రనుట సు స్పష్టము.

"తదధిగమ ఉత్తర పూర్వాఘయో రశ్లేష వినాశౌ తద్వ్యపదేశాత్."
— (బ్ర. సూ. 4-1-13)

అను సూత్రమునందు చరమ శరీరావసానమున మాత్రమే సంచితాగామి కర్మలతోఁబాటు పూర్వకృతమైన ప్రారబ్ధము నశించి, సిద్ధి గల్గునని వ్యాసభగవానుఁ డుపదేశించెను.

కర్మ జ్ఞానములు రెండును భక్త్యంగములు. కాని, భక్తిమాత్రము స్వతంత్ర మైన మోక్షోపాయ మనుటలో సందియములేదు. భక్తి సిద్ధించిన తర్వాత, సంచి తాగామి కర్మలకు తావు లేదు. కాని, ప్రారబ్ధకర్మమాత్ర మనుభవించియే తీర వలెను. దుస్సాధ్యమైన సాధన సంపత్తిచే ధృవమైన ఉపాసన లభ్యమైనను, భక్తి యోగముకూడ పునర్జన్మానుభవమును దాటఁజాలకున్నది.

శరణాగతియందు భక్తి కవసరమైన సాధనములు, అనుష్ఠానములు అనా వశ్యములు. భగవంతుఁడు తనను రక్షించునను మహా విశ్వాసముతోఁగూడిన పరిణా మము గల హృదయముతో రక్షకునకు తనను తా నర్పణము చేసికొనిన చాలును. ఇచ్చట ముముక్షువుయొక్క ఆత్మార్పణమునకును, భగవంతుని దయాప్రసారము నకును సంబంధముగాని ప్రపన్నుని గుణదోషములు, పుణ్యాపాపములు, కుల గోత్ర ములు వర్ణాశ్రమములు లెక్కకు రావు. ఇతర మార్గములయందు భగవత్కటాక్షము

న్యాయస్థానమునందు న్యాయమూర్తి నిర్ణయమువలె గుణదోషముల కనుగుణముగ లభించును. కాని, మహా విశ్వాసము గల ముముక్షువుపై భగవంతుని దయ అవ్యాజమై, అనంతమై ప్రభవించును. ఇట్టి ప్రపత్తి ప్రారబ్ధ కర్మములనుగూడ ఈ జన్మమునందే నశింపఁజేయును.

"ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే." (శ్వేతాశ్వతరోపనిషత్)

"తస్మాత్ న్యాస మేషాం తపసా మతిరిక్త మాహుః."

అనగా, పూర్వోక్తహేతువులచే తపస్సు లన్నిటికంటె ప్రపత్తి ఉత్తమ తపస్సు - అని ప్రశంసించుచున్నారు. మఱియును - అది, అనన్యార్హ శేషత్వ జ్ఞానమువలనఁ గలిగినదై, ఉపాయాంతర విలక్షణమై, భగవ ద్రక్షకత్వానుమతి రూపమై, సకృ త్కర్తవ్యతానుగుణమై, సర్వాధికారమై, సుకరమై, అవిలంబ ఫలప్రదమై యుండుటవలన ఇతర మోక్షోపాయములకంటెను విశిష్టమైన దనుటలో సంశయము లేదు.

"సత్కర్మ నిరతా శ్శుద్ధాః సాంఖ్యయోగ విదస్తథా
నార్హంతి శరణస్థస్య కలాం కోటి శతా మపి."

కర్మయోగ - జ్ఞానయోగుల యోగ్యత, ప్రపత్తి నిష్ఠునకుఁగల యోగ్యత లలో నొక కోటి వంతునకైనను సమానము కాదని పాంచరాత్రశాస్త్రము వక్కాణించుచున్నది.

"వృథైవ భవతో యాతా భూయసీ జన్మ సంతతిః
తస్యా దన్యతమం జన్మ సంచిత్య శరణం వ్రజ."

వ్యర్థముగ అనేక జన్మలను గడపితివి. వానిలో నొక్క జన్మమునవైనను భగవంతుని శరణుబొందు'మని శాండిల్యముని దేవలున కుపదేశించెను.

ప్రపత్తియొక్క అంతరార్థములను పిళ్ళలోకాచార్యులు, వేదాంతదేశికులు రహస్యత్రయ వ్యాఖ్యానములందు విశదీకరించిరి. ఆ రహస్యములు మూలమంత్ర ద్వయ చరమశ్లోకములు. మూలమంత్రములోని ప్రణవమునందలి అకారము సకల శబ్దములకు మూల మగుటవలనను, నారాయణపదార్థ ప్రబోధక మగుట వలనను, భగవంతుని సకల జగత్కారణత్వమును, సర్వ రక్షకత్వమును, స్వామిత్వ మును తెలుపుచున్నది. రక్షకత్వమునందు ముముక్షువులకు విరోధియైన సంసార సంబంధ నివర్తకత్వమును, అపేక్షితమైన కైంకర్య వృద్ధియును గోచరించు చున్నవి.

"ఓమి త్యాత్మానం యుంజీత."

అన్నట్లు - ప్రణవముచే ప్రత్యగాత్మస్వరూపమును, నమస్సుచే విరోధ్యుపాయ స్వరూపములను, నారాయణ శబ్దమువలన పరస్వరూపమును చతుర్థ్యా ఫల స్వరూపమును తెలుపుచున్నది. ఇట్టి అర్థపంచకజ్ఞానము ప్రపన్నునకత్యావశ్యకము. మకారము ఆత్మవాచకము. "అవ - రక్షణే" అను ధాత్వర్థము ననుసరించి. అకారము రక్షకుని సూచించుచున్నది. మకారము రక్షింపఁబడువానిని బోధించుచున్నది. ఉకారము లక్ష్మీశేషత్వమును తెలుపుచున్నది. రక్ష్య రక్షకుల సంబంధమును పిళ్ళలోకాచార్యులు—

"శేషత్వ మే ఆత్మ ఉక్కు స్వరూపమ్." — (ముముక్షుప్పడి)

భగవచ్ఛేషత్వము గలిగి యున్నను, అన్య శేషత్వ నివృత్తియే ప్రధాన'మని విపులీకరించిరి.

"స్వామీ స్వశేషం స్వవశం స్వభరత్వేన నిర్భరమ్
స్వదత్త స్వధియా స్వార్థం స్వస్మిన్ న్యస్యతి మాం స్వయమ్."
— (న్యాస దశకమ్)

శేషికిని, శేషభూతునకును గల సంబంధమును ఈ రీతిగ వేదాంతదేశికులు వివరించిరి.

సర్వ రక్షకవ్యాపారములు భగవ దధీనము లనియు-వానిలో చేతనున కెట్టి యధికారము లేదనియు ప్రపన్నుఁడు విశ్వసించి, లక్ష్మణునివలె శేషభూతుఁడై కాని, భరతుని వలె పరతంత్రుఁడై కాని ప్రవర్తింపవలెను.

" న దేవలోకాక్రమణం నామరత్వ మహం వృణే
ఐశ్వర్యంవాఽపి లోకానాం కామయేన త్వయా వినా. "
— (వాల్మీకి రామాయణము)

ఓ రామా ! నిన్ను విడనాడి, నేను స్వర్గాధిపత్యమైనను అమరత్వమైనను, ఈ లోకమునందు భోగ భాగ్యములైనను వాంఛింపను.

" కురుష్వ మా మనుచరం వైధర్మ్యం నేహవిద్యతే
కృతార్థోఽహం భవిష్యామి తవ చార్థః ప్రకల్పతే. ''

" భవాంస్తు సహ వైదేహ్యా గిరి సాను ఘరంస్యతే
అహం సర్వం కరిష్యామి జాగ్రత స్స్వపతశ్చ తే."
— (వాల్మీకి రామాయణము)

ఓ రామచంద్రా ! నన్ను నీ యనుచరునిగఁ జేసికొనుము. అందువలన నీ ధర్మమునకు లోటు కలుగదు. నేను నీవలన కృతార్థుఁడనై తరింపఁగలను. అట్టి కృతార్థతకు మూలము నీ కైంకర్యము. విదేహ రాజపుత్రి నీతో గిరి సానువుల యందు క్రీడించునపుడు నీకు కావలసిన సర్వ కైంకర్యములను నేను నెఱవేర్చగలను. నీవు నిద్రించునపుడు జాగరూకుఁడనై, మృగాదుల వలనను, రక్కసుల వలనను నిద్రాభంగము గాకుండ చూచుకొందును. కావున, రామా ! నన్ను విడనాడకు' మని లక్ష్మణుఁడు నివేదించెను. ప్రపన్నుల యోగ్యతను దెల్పుటకు ఈ లక్ష్మణ వాక్యములు చాలును.

" శరణ మాకుం తగతాళడైం దార్కు ఎల్లాం
మరణ మానాల్ వైకుంఠం కొడుక్కుం పిరాన్
అరణమైంద మదిల్ నూల్ తిరుక్కణ్ణపురత్తు
తరణి యాళన్ తగదు అంబర్కు అంబాకుమే. " — (నమ్మాళ్వారులు)

తిరుక్కణ్ణపురమున సమాధ్యవస్థలో నున్న నమ్మాళ్వారులు తమ శిష్యులగు మధురకవియాళ్వారులతో — 'భగవంతుని శరణుఁ జొచ్చిన వారల కాతఁడే రక్షకుఁడు; మరణాంతమున వైకుంఠము నిచ్చువాఁడు. నా కొఱకు స్వయముగ తిరుక్కణ్ణ పురమున వేంచేసియుండె' నని సెలవిచ్చిరి, కనుక, ప్రపన్నుని కొఱకు రక్షకుని దయ వైకుంఠము నుండి పొంగి, పొరలి ప్రవహించును. ఇతర మోక్షార్థులకువలె భూమినుండి వైకుంఠమునకు వివిధ సాధనములలో సోపానములను నిర్మింప నక్కరలేదు.

'నమ' శబ్దమునందుఁ గల విరోధి స్వరూపము మూఁడు విధములు. శరీరమే ఆత్మయని తలంచుట స్వరూప విరోధము. తన్ను తానే రక్షించుకొందు నను భ్రాంతి ఉపాయ విరోధి. స్వార్థప్రవృత్తి ప్రాప్య విరోధి. 'ఈ దేహము నీది ; నా సర్వస్వము నీయదియే' యని ఆత్మార్పణము చేసినచో-స్వరూప విరోధము తొలఁగిపోవును. 'నీవు తప్ప నాకు రక్షకు లెవరును లే' రను విశ్వాసము గల్గిన, ఉపాయ విరోధి నివృత్తి యగును. నీ సంతోషమునకు వ్యతిరిక్తములైన కోర్కెలను నాయందు మొలకెత్తకుండ జేయుమని ప్రార్థించినచో ప్రాప్య విరోధము తొలంగును. దీనినే —

" మత్తినం కామంగళ్ మాత్తు. " — (తిరుప్పావు)

నా మనస్సు నందు విపరీతములైన కోర్కెలు కలుగకుండుగాక !' అని గోదాదేవి తలంచెను.

" పితరం మాతరం దారాన్ పుత్రాన్ బంధూన్ సఖీన్ గురూన్
రత్నాని ధన ధాన్యాని క్షేత్రాణి చ గృహాణి చ
సర్వ ధర్మాంశ్చ సంత్యజ్య సర్వకామాంశ్చ సాక్షరాన్
లోకవిక్రాంత చరణౌ శరణం తేఽవ్రజం విభో ! " — (శరణాగతి గద్య)

ప్రభూ ! సంసారబంధమూలకములైన సర్వ బాహ్యాంతర్గతేతరోపాయము లను విరోధిస్వరూపములుగ భావించి, త్యజించి, నీవే ఉపాయమని తలంచి, నీ యందు ప్రపత్తిచేయు చున్నాడ' నని భగవద్రామానుజులు నివేదించిరి.

సకల జగత్కారణుఁడు-సర్వరక్షకుఁడు-స్వామియు శ్రీమన్నారాయణుఁ డనియే విశ్వసించి - 'స్వ ప్రవృత్తి నివృత్తిః ప్రపత్తిః' అని పిళ్ళలోకాచార్యు లన్నట్లు- స్వ రక్షకత్వ ప్రవృత్తిని పరిత్యజించి, భగవద్రక్షకత్వమును స్వీకరించి, శరణాగతి సేయుట పరమ హితము.

మంత్ర రత్న మని ప్రశస్తికెక్కిన ద్వయమునందు లక్ష్మీ పురుషకారము వలన భగవత్ప్రాప్తి గలుగు విధానము వివరింపఁబడినది. సూర్యునకు, ఆతని ప్రకాశము నకుఁ గల సంబంధ మెట్టిదో — నారాయణునకు, లక్ష్మికిఁ గల సంబంధ మట్టిదే. స్వరూప స్వభావములచే నారాయణునకు జగద్వ్యాప్తి కలిగినట్లు-లక్ష్మికిఁ గూడ అట్టి వ్యాప్తి గలదు. కనుక, ఆమె సర్వేశ్వరి. మాతృస్థాన మలంకరించుటచే - 'దేవ్యా కారుణ్య రూపయా' అన్న ట్లామె కరుణామయ స్వరూపిణి.

" ఇవళ్ తాయా యివర్కళ్ క్లేశం పొరుక్కమాట్టాతే, అవనుక్కు పత్నియాయి నియ విషయమాయిరుక్కైయాలే కణ్ణళివత్త పురుషకారమ్. "
— (ముముక్షుప్పడి)

ఈమె చేతనుని తల్లి. అతని కష్టములను జూచి, ఊరక యుండఁ జాలదు. నారాయణునకు పత్నియగుటచే ప్రపన్నుఁడైన జీవుని రక్షింపు మని భర్తకు దయ గల్గునట్లు చెప్పుట పురుషకారము. శరణాగతిఁ జేయు ప్రపన్నుఁడు శ్రీ లక్ష్మీ నారాయణుల నిద్దర నుద్దేశించియే చేయవలెను.

"ఇవళ్ సన్నిధియాలె కాకంతలై పెత్తదు, అదిల్లామైయాలె రావణన్ ముడిందాన్."

— (ముముక్షుప్పడి)

ఈమె సన్నిధివలననే కాకాసురుఁడు రక్షింపఁబడెను. ఈమెకు దూరస్థుఁడగుటచే, రావణుఁడు సంహరింపఁబడెను.

"స పిత్రా చ పరిత్యక్త స్సురైశ్చ స మహర్షిభిః
త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య త మేవ శరణం గతః
పురతః పతితం దేవీ ధరణ్యాం వాయసం తథా
తచ్ఛిరః పాదయో స్తస్య యోజయామాస జానకీ
ప్రాణ సంశయ మాపన్నం దృష్ట్వా సీత్వాऽథ వాయసం
త్రాహి త్రాహీతి భర్తార మువా చ దయయా విభుమ్."

— (వాల్మీకి రామాయణము)

సీత కపకారము తలపెట్టిన జయంతుఁడు రాముని యిషీకాస్త్రము వెన్నంటగా - తండ్రియైన దేవేంద్రుని, ఇతర దేవతలను, మహర్షులను తన ప్రాణ రక్షణ కొఱకు ప్రార్థించి వారిచే పరిత్యక్తుఁడై, మూఁడు లోకములందును పరిభ్రమించి, తన్ను రక్షించువారిని గానక, తుదకు రాఘవునే శరణుఁజొచ్చెను. అప్పుడు దయామయయైన సీత - యెదుట భూమిమీద పడియున్న వాయసమును రాముని పాదములపై వైచి, ప్రాణ సంశయముచే ఆపన్నుండైన వీనిని రక్షింపుమని ప్రార్థించెను.

"వధార్హ మపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్."

వధార్హమైనను, రాముఁడు దేవియొక్క పురుషకారము వలన వాయసమును కృపతో రక్షించెను. కాఁబట్టి, దేవీ పురుషకారమును పురస్కరించుకొని, శరణాగతి చేయుట ప్రపన్నుల కావశ్యకము.

శ్రీకృష్ణుఁడు అర్జునునకు కర్మ జ్ఞాన భక్తి యోగములను, త దితర పురుషోత్తమ ప్రాప్తి విద్యలను ఉపదేశించి, అంతిమోపాయముగ శరణాగతి గర్భితమైన చరమశ్లోకము నుపదేశించెను.

"సర్వ ధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః."

— (భ: గీ: 18-66)

అర్జునా ! కేవల మదృష్ట ఫలములనే గాక, మోక్షసాధనములైన ఇతర మార్గములను పరిత్యజించి, నన్ను శరణుఁ జొచ్చినయెడల, అజ్ఞుఁడవును, అశక్తి వంతుఁడ వగు నీకు, సర్వజ్ఞుఁడును - సర్వశక్తిమంతుఁడును - ప్రాప్తభూతుఁడ నగు నేను అవిద్యా - కర్మ - వాసనా - రుచి రూపములగు పుణ్య పాపములనుండి తొలఁగించెదను. కావున, దుఃఖింపకుము.'

ఇందు భగవంతుని వాత్సల్య, సౌశీల్య, సౌలభ్య-జ్ఞాన-శక్త్యాది గుణములు ప్రస్ఫుటించుచున్నవి గదా ! తనయందు శరణాగతి చేసిన పిమ్మట, రక్షణ భారము తనదే యగును. స్వ ప్రవృత్తికి ప్రసంగమే లేదు. స్వ రక్షణమందు స్వ ప్రవృత్తి కలిగిన యెడల అది రక్షణోపాయముగాక, అంతరాయము గూడ నగును.

"యో వజ్రపాతాశని సన్నిపాతా న్న చక్షుభేనాపి చచాల రాజా
స రామబాణాభిహతో భృశార్త శ్చచాల చాపం చ ముమోచ వీరః."

— (వాల్మీకి రామాయణము)

కేవలము స్వ శక్తినే ఆధారముగ నమ్మిన రావణుఁడు ఇంద్రుని వజ్రపాత ముచేనైనను సంక్షోభము చెందనివాఁడు; చలించనివాఁడు రామబాణాభిహతి వలన ఆర్తుఁడై, చంచల మనస్కుఁడై ధనుస్సును భూమిపై జారవిడచెను.

"చచాల చాపం చ ముమోచ వీరః ఎన్గిరపడియే, ఇవై అనుపాయంగళ్ ఆనమాత్ర అన్రిక్కే కాల్కట్టు ఎన్గిరతు." — (ముముక్షుప్పడి)

రావణుని చేతిలో విల్లున్నంతవఱకు రాముని శరములు తాకుచునే యుండెను. మఱియు, తన ప్రాణమునకే యపాయము గలుగునంత ప్రతిబంధక మయ్యెను. విల్లు క్రింద జారవిడచిన పిమ్మట రాముని శరవర్షము ఉపసంహరింపఁబడెను.

"గచ్ఛాను జానామి రణార్దిత స్త్వం ప్రవిశ్య రాత్రించరరాజ లంకాం
ఆశ్వాస్య నిర్యాహి రథీ చ ధన్వీ తదా బలం ద్రక్ష్యసి మే రథస్థః."

— (వాల్మీకి రామాయణము)

'ఓ రావణుఁడా! నీవు రణ రంగమున నలసినవాఁడవని నే నెఱుఁగుదును. కనుక, నీవు లంకకు బోయి, శ్రమ తీర్చుకొని, ధనుస్సు స్వీకరించి, రథస్థుఁడవై యుద్ధమునకు వచ్చి, నీ బలమును ప్రదర్శింపుము. నేఁటికి చాలును పొ'మ్మని రాముఁడు పలికెను. కాఁబట్టి, ధనుస్సునే ఉపాయమని విశ్వసించిన రావణున కదియే ప్రతిబంధక మయ్యెను. భరన్యాసయుతుఁడై, శరణాగతిచేసి, నిర్భరుఁడై యున్నచో నెట్టి యిక్కట్లును వాటిల్లియుండవు.

పుణ్య పాపము లన్నిఁటినుండి నిన్ను విముక్తునిఁగావింపఁగల' ననుటలో - 'పుణ్యముకంటెను పాపమే నీయం దధికముగనుండి, హృదయ పరిణామము గలిగినపుడు రక్షించుటయే నా యభిమత'మని భగవంతుని యాశయమై యుండును.

" దోషో యద్యపి తస్య స్యాత్సతామేత దగర్హితమ్. "

— (వాల్మీకి రామాయణము)

ఇచ్చట - 'య ద్యపి' అనుదానిని వాక్యాలంకారముగ స్వీకరించినచో, వానియందు దోష మున్నప్పుడు బుద్ధిమంతులు గర్హింపక రక్షించుటచే శ్రేష్ఠమని వర్తించును.

"చక్రవర్తి తిరుమకన్ పాపత్తోడై వరిలుం అమైయుం ఎన్గాన్ ఇవన్ పుణ్యత్తై ప్పొకట్టు వరవేణుం ఎన్గాన్."

— (ముముక్షుప్పడి)

" విభీషణో వా యదివా రావణ స్స్వయమ్. "

— (వాల్మీకి రామాయణము)

దోషముల కాట పట్టయిన రావణుఁడైనను శరణుజొచ్చినయెడల రక్షింతు' నని శ్రీరాముఁడు ప్రతిజ్ఞచేసెను. 'నీ పుణ్యములనుగూడ విడచి నన్ను శరణు వేడు'మని శ్రీకృష్ణుఁడు అర్జునునకు బోధించెను. కాఁబట్టి, శరణాగతికి పుణ్య పాప కర్మలతో ప్రతిబంధకము లేదు. ఇట్టి శరణాగతికి ఆనుకూల్య సంకల్పము, ప్రాతికూల్య వర్జనము, మహా విశ్వాసము, గోప్తృత్వ వరణము, ఆత్మ నిక్షేపము, కార్పణ్యము అను షడంగములు గలవు. ఆత్మ నిక్షేపమే అంగి యనియు, త దితరము లంగము లనియు కొందఱు వ్యవహరింతురు.

" ఆనుకూల్య మిదం ప్రోక్తం సర్వభూతానుకూలతా. "

సర్వ భూతములకు ననుకూలముగా నుండుటయే ఆనుకూల్య మని ప్రపన్న పారిజాత ప్రవచనము.

" ఆత్మానం సర్వథా రక్ష పురీం చేమాం స రాక్షసాం
స్వస్తి తేఽస్తు గమిష్యామి సుఖీ భవ మయా వినా. "

— (వాల్మీకి రామాయణము)

రావణా! నిన్ను నీవు రక్షించుకొనుచు, రాక్షసులతోఁ గూడిన ఈ లంకా పురిని కూడ రక్షించు కొనుము. నీకు శుభమగుగాక! నేను పోయెదను. నే నిచ్చట లేకున్నను నీకు సుఖము గల్గిన సంతసించెద' నని విభీషణుఁడు తన అను కూల ప్రవృత్తిని ప్రకటించెను.

" హింసా ద్యపాయ విరతిః. " — (ప్రపన్న పారిజాతము)

పరహింస మున్నగు అపాయ కృత్యములను మానుట ప్రాతికూల్య వర్జనమని తెలియవలెను. తనకు శక్తియున్నను స్వప్రయత్నము మిక్కిలి ప్రతికూలమని తలచుట జ్ఞాన విశేషము. నిమేషమాత్రమున రావణుని భస్మముసేయఁగల శక్తి గల్గియు, సీతాదేవి తన మహాత్తర శక్తిని ప్రదర్శింపక, భగవచ్ఛక్తికొఱకై నిరీక్షించి సఫల మయ్యెను.

రక్షకుఁడు తనను రక్షించునను విషయమున ఎట్టి సందేహములు లేక, నిశ్చలమైన, పరిపూర్ణమైన నమ్మకము గలిగియుండుటయే మహా విశ్వాసము.

" సర్వలోక శరణ్యాయ రాఘవాయ మహాత్మనే
నివేదయత మాం క్షిప్రం విభీషణ ముపస్థితమ్
త్యక్త్వా పుత్రాం శ్చ దారాం శ్చ రాఘవం శరణం గతః. "
— (వాల్మీకి రామాయణము)

ఓ వానరశ్రేష్ఠులారా ! సర్వలోక శరణ్యుఁడైన శ్రీరామచంద్రునకు వెంటనే నా రాక నెఱింగింపుఁడు. దార పుత్రాదులను వదలి రాఘవుని శరణుఁ జొచ్చితి'నని వేడుకొన్న విభీషణుఁడు బద్ధ శత్రువుని సహోదరుఁడైనను, తన్ను సర్వలోక శరణ్యుఁడగు రాముఁడు రక్షించునను మహా విశ్వాసము కలిగి యుండెను.

దయామయా ! నీ నిర్హేతుక కరుణా కటాక్షము తప్ప వేఱొండు నాకు శరణంబు లేదు. కాన, నాకు రక్షకుఁడవు క'మ్మని భగవంతుని ప్రార్థించుట గోప్తృత్వ వరణము.

ఆత్మాత్మీయములైన సమస్తభరములును సర్వేశ్వరుని పాదపద్మములందు సమర్పించుట ఆత్మ నిక్షేపము.

కర్మ జ్ఞాన భక్తియోగముల నవలంబించుటకు శక్తి లేనందున అత్యంత దీనత్వముతో భగవంతుని శరణు జొచ్చుటయే కార్పణ్యము.

భగవత్కైంకర్యాభివృద్ధి వినా, ఇతర ఫలములను త్యాగము సేయుట, స్వరక్షణమునందు స్వాన్వయమును త్యజించుట, అహంకార మమకారములను వదలి ఆత్మార్పణము చేయుట శరణాగతునకు ముఖ్యమైన నియమములు.

ప్రపన్నుఁడు సర్వేశ్వరునకు శేషభూతుఁ డగుటవలన, కర్తృత్వ మమత్వ స్వార్థములను పరిత్యజించవలెను. ఇట్టి ప్రపన్నులను సర్వలోక శరణ్యుఁడైన భగవంతుఁడు రక్షించుననుటలో సందియము లేదు.

" బద్ధాంజలిపుటం దీనం యాచం తం శరణాగతం
అపి ప్రాణాన్ పరిత్యజ్య రక్షితవ్యః కృతాత్మనా. "

— (వాల్మీకి రామాయణము)

చేతులు జోడించినవానిని, దీనుని, యాచించువానిని, శరణాగతుని తన ప్రాణములనైనను పరిత్యజించి రక్షించవలెను. ఆఁకలిఁగొన్న బోయవాని ప్రాణమును రక్షించుటకు కపోత యుగము వాని కాహారముగ నగ్నియం దాహుతియైన విషయము లోకవిదితము.

" సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ. "

— (వాల్మీకి రామాయణము)

ఒక్కసారి 'నేను నీ వాఁడ' నని దీనుఁడై శరణాగతి చేసినచో సర్వభూతములకు అభయ మీయఁగలను. అది నా వ్రత' మని శ్రీరామచంద్రుఁడు ప్రతిజ్ఞ చేసెను. కావున, ప్రపన్నులకు భగవ ద్రక్షణ విషయమున నణుమాత్రము సంశయము లేదు.

" ప్రపత్తిర్కు దేశ నియమముం, కాల నియమముం, ప్రకార నియమముం, అధికార నియమముం. ఫల నియమముం యిల్లై. " — (శ్రీవచన భూషణము)

ప్రపత్తిచేయుటకు దేశ నియమముగాని, కాల నియమముగాని, ప్రకార నియమముగాని, అధికార నియమముగాని, ఫల నియమముగాని లేవు.

" స ఏష దేశః కాలశ్చ భవతీతి యథా తథా
పురుషా త్పురుషం ప్రాప్య తథా దోషగుణా నపి. "

— (వాల్మీకి రామాయణము)

ఎచ్చట - ఎప్పుడు ఇరువురు పురుషులకు కలయిక గల్గునో, అదియే వారి మైత్రికి యోగ్యమైన దేశము; కాలము. సత్య మాలోచించిన - సత్పురుషులందే గాక, దుష్టులందుగూడ ఇట్టి దేశ కాల సంఘటనలు సంప్రాప్తించుచుండును.

అయోధ్య యందో - కిష్కింధయందో - లేక యుద్ధానంతరముననో ప్రపత్తి చేయవలసిన విభీషణుఁడు, దక్షిణ సముద్ర తీరమున విడిసియున్న రాముని శరణు జొచ్చెను. అర్జునుఁడు రథస్థుఁడై, రణరంగమున "శిష్యస్తే హం శాధి మాం త్వాం ప్రపన్నమ్" (గీత : 2-7) అని ప్రపత్తి చేసెను.

"ద్రౌపది స్నాతైయాయన్తే ప్రపత్తి పణ్ణిత్తు." — (ముముక్షుప్పడి)

రజస్వలగా నుండు సమయముననే ద్రౌపది స్నానము గావింపక, నిండు సభలో ప్రపత్తి చేసెను.

కర్మ జ్ఞాన భక్తి యోగములందువలె అష్టాంగయోగ నిబంధన కృత్యములుగాని, ఉపాసనానుగుణమైన ప్రకార నియమములుగాని, ఈ శరణాగతికి ఆవశ్యకములు కావు.

"మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపిస్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేఽపి యాంతి పరాంగతిమ్."
— (భ: గీ: 9-32)

అర్జునా! నన్ను శరణుజొచ్చినవారు పాపాత్ములైనను స్త్రీలైనను, వైశ్యులైనను, శూద్రులైనను పరమపదమును పొందుచున్నా'రని కృష్ణభగవానుఁడు వక్కాణించి యున్నాఁడు.

"కుయోనిష్వపి సంజాతో య స్సకృ చ్ఛరణం గతః
తం మాతా పితృహంతార మపి పాతి భవార్తిహా."
— (సనత్కుమార సంహిత)

తాను హీనయోనియందు జన్మించినవాఁడైనను-భక్తుఁడు భగవంతు నొక్కసారి శరణాగతి చేసినయడల, అతఁడు మాతా పితృద్రోహియైనను దైవమునకు క్షమార్హుఁడే. కావున, శరణాగతి కధికార నియమములేదు. సమస్త ప్రాణికోటి యందును జాతి కుల జీవన వ్యత్యాసము లెట్లున్నను, శరణాగతి విషయమున సమానాధికారములు కలవు.

"శంఖ చక్ర గదాపాణే! ద్వారకానిల యాచ్యుత!
గోవింద! పుండరీకాక్ష! రక్ష మాం శరణాగతామ్."
— (మహా భారతము)

ఇట్లు శరణాగతిచేసిన ద్రౌపదికి ఫలము, వస్త్రము, లక్ష్మణునకు ఫలము-కైంకర్యము, విభీషణునకు రాజ్యము, కాకాసురునకు ప్రాణము. ఈ రీతిగ, శరణాగతి చేసిన వా రందఱకు వివిధములైన ఫలములు సంప్రాప్తించి యున్నవి. కనుక, ప్రపత్తికి ఫల నియమము లేదు.

కర్మ జ్ఞాన భక్త్యాది ఇతరోపాయము లాశ్రయించినవారికి అంతిమ స్మరణ మవసరము.

"అంతకాలే చ మామేవ స్మర న్ముక్త్వా కలేబరమ్
యః ప్రయాతి సమ ద్భావం యాతి నా స్త్యత్ర సంశయః."

— (భ: గీ: 8-5)

అర్జునా! అంతిమ కాలమునం దెవఁడు నన్ను స్మరించుచు, కలేబరమును త్యజించునో - అతఁడు నన్ను బొందుననుటలో సంశయములే'దని కృష్ణభగవానుని హెచ్చరిక.

మహా తపస్వి యయ్యును, అంతిమ కాలమున తాను పెంచిన హరిణము కొఱకు పరితపించి, హరిణ జన్మ మెత్తిన జడభరతుని దుర్గతి లోకవిదితమే గదా!

"స్థితే మనసి సుస్వస్థే శరీరే సతి యో నరః
ధాతుసామ్యే స్థితే స్మర్తా విశ్వరూపం చ మా మజమ్."
తత స్తం మ్రియ మాణం తు కాష్ఠ పాషాణసన్నిభమ్
అహం స్మరామి మద్భక్తం నయామి పరమాం గతిమ్."

— (వరాహ పురాణము)

మనస్సు స్థిరమై, శరీరము సుస్వస్థముగ నుండి, ధాతువులు సామ్యస్థితిలో నున్నప్పుడు జన్మరహితుఁడైన న న్నెవఁడు స్మరించునో, అతఁడవసాన సమయమున కాష్ఠ పాషాణ సన్నిభుఁడై మరణించుచున్నను అతని స్మరణము నేను చేసి, నా భక్తునకు పరలోకగతిని ప్రాప్తింపఁజేయుచున్నాఁడ'నని శ్రీవరాహస్వామి సెలవిచ్చెను. కనుక, ప్రపన్నుల కంతిమ స్మరణముతోఁ గూడ పని లేదు.

ఇట్టి శరణాగతియందు పురుష ప్రయత్నముచే భగవంతుని దయ సహేతుకమై, ప్రపన్నునిపై ప్రసరించునా? లేక, నిర్హేతుకమై కలుగునా? అను విషయమున వివిధ సంప్రదాయములు వివిధ రీతులుగ విశదీకరించియున్నవి. భగవంతుని

దయ సహేతుక మేదైన యెడల, ప్రపత్తియు ఇతర యోగములవలె శమ దమాది సాధన సంపత్తి కనుగుణముగ ఫలము నొసంగున దగును. అట్టిచో - భగవంతుని కృపకు కొన్ని సందర్భములలో వైషమ్యాది దోషము లాపాదింపఁబడవచ్చును. సర్వేశ్వరుని కృపలో నట్టి వైషమ్యమునకు తావు లేదని - 'న వైషమ్య నైర్ఘృణ్యే సాపేక్షిత్వాత్' అను వ్యాస సూత్రమువలన విశద మగుచున్నది.

భగవంతుఁడు తానే ఉపాయను, ప్రాప్యుఁడుగూడ నగుటవలన కేవలము భగవంతుని రక్షణసామర్థ్యమునందు మహా విశ్వాసము తప్ప, వేఱొండు పురుష ప్రయత్నమునకు తావు లేదని ఇతర సంప్రదాయు లందురు. అట్టిచో - భగవానుని దయాప్రసారణమున అర్హానర్హ విచార ప్రసక్తియే కలుగదు

సర్వేశ్వరుని కృప యోగ్యునిపై అపారముగ ప్రసరింపవచ్చును. కాని, అనర్హులపై ప్రసరింపఁ జాలదు. వేదాంత దేశికులు భగవద్దయా పాత్రతకు హృదయ పరిణామరూపమైన వ్యాజ మవసరమని చెప్పిరి. అట్టి వ్యాజ మను ఇంధన మత్యంత స్వల్పమైనను, దేదీప్యమానమై, ప్రారబ్ధరూపమైన కర్మను అనతి కాలముననే భస్మము సేయఁగలదు. అకించిన్యతగలిగినగాని, ఇట్టి వ్యాజ మేర్పడదు. వ్యాజ మతి సూక్ష్మమైనను భగవంతుని దయా సముద్రము పొంగి, పొరలి ప్రపన్నునిపై ప్రవహించును. ఇందువలన, శరణాగతి ఇతర మోక్షోపాయముల కంటెను మిక్కిలి ప్రాశస్త్యమును పొందియున్నది.

" యమే వైష వృణుతే తే న లభ్యః. " — (కఠోపనిషత్)

ఎవఁడు దేని వివరణము చేయునో, వాని కది లభించును. ఐశ్వర్యార్థుల కైశ్వర్యము, కైవల్యాపేక్షకులకు కైవల్యము, మోక్షాసక్తులకు మోక్షము లభించును. ప్రపన్నుఁడు మోక్షము నైత మాశింపక, భగవంతుని నిత్య విభూతి స్వరూపమైన పరమపదమునందు నిరంతరాయముగ నతనికి కైంకర్యము సేయఁ గోరును.

" సకృదేవ ప్రపన్నాయ " అను ప్రమాణము ననుసరించి, ముముక్షువు ఒక్కసారి ప్రపత్తిచేసి, క్రియాశూన్యుఁడై యుండవలెనా? లేక, ఆజన్మాంతము ఆశ్రమ కర్మల ననుష్ఠింపవలెనా? అని సంశయ ముదయింపవచ్చును. భగవద్రామానుజు లిప్పట్టున ప్రబోధించిన ప్రమాణము శిరసావహ్యము.

"ఆశ్రమ కర్మాణ్యాహరహ మనుష్ఠేయమేవ। అన్యథా ఆశ్రమ కర్మలోపే। దూషితాంతః కరణస్య విద్యోత్పత్తి రేవ న స్యాత్." — (శ్రీభాష్యము)

ఆశ్రమ కర్మల నెల్లప్పుడు అనుష్ఠింపవలసినదే. లేనిచో, కలుషితమైన అంతః కరణముచే ప్రాప్తి హేతుకమైన విద్య యుత్పన్నము కాఁజాలదు.

"కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతం సమాః
ఏవం త్వయి నాన్యథాఽస్తి న కర్మ లిప్యతే నరే."

— (ఈశావాస్యోపనిషత్)

అన్నట్లు - ఆజన్మాంతము కర్మలు చేయుట తప్ప, వేఱొక మార్గము లేదు. కాని, ప్రపన్నుని విషయమున మాత్రము కర్మస్వరూపము మారును.

"కర్మ - కైంకర్యత్తిలే పుగుం, జ్ఞానం - స్వరూపప్రకాశత్తిలే పుగుం, భక్తి - ప్రాప్య రుచియిలే పుగుం, ప్రపత్తి - స్వరూప యాథాత్మ్య జ్ఞానత్తిలే పుగుం."

— (ముముక్షుప్పడి)

కర్మ - కైంకర్య రూపమై విలసిల్లును. జ్ఞానము - స్వస్వరూప పరస్వరూప వివక్షయందు గలుగును. భక్తి - ప్రాప్యుఁడగు భగవంతునియం దాసక్తిగ పరిణమించును. ప్రపత్తి - శేషియగు సర్వేశ్వరునకు తాను శేషభూతుండను యథార్థ తత్త్వమును గోచరింపఁజేయును. కావున, కర్మ జ్ఞాన భక్తులు స్వభావము చేతను, స్వస్వరూపముచేతను భగవత్కైంకర్యాను గుణమైన పరిణామముచెంది, ప్రపత్తిలో లీన మగును.

ఇట్టి శరణాగతి ఇతర మోక్షోపాయములకంటెను ప్రశస్తమై నందున, ముముక్షువు లీ ప్రపత్తి యోగావలంబనమున ప్రపన్నులై, తరింతురుగాక !



# తమిళ సంఘ సాహిత్యము - వైష్ణవ ధర్మ దర్శనము

'ఉపన్యాస రత్న – కవితా విశారద'

శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ సంపాదకులు.

* * *

## అంజలి

"అఖిల భువన జన్మ స్థేమ భంగాది లీలే
వినత వివిధ భూత వ్రాత రక్షైక దీక్షే
శ్రుతి శిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే
భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా."

## అవతరణిక

శ్రీ వైష్ణవ సంప్రదాయము అనాది సిద్ధము. శ్రీ లక్ష్మీదేవి మొట్ట మొదట సంప్రదాయ ప్రవర్తిక. అనంతరము ఆర్ష ప్రతిభ గలిగిన మహనీయులు – పరంపరాగతమైన ఈ సంప్రదాయమును ప్రచారము చేసిరి. తత్ప్రచారము కాలక్రమమున విరళము కాఁగా– శ్రీమద్రామానుజులు పునరుద్ధార మొనరించి, యోగ్య విధానములను వెలయించిరి. ఇందును కొన్ని విశిష్ట భావములను వేఱుగా నిరూపించుకొని, శ్రీ వేదాంతదేశికులు – ఈ సంప్రదాయమునకు ఉత్తేజనము సంపాదించిరి.

అవైదికములైన జైన బౌద్ధములను అణచి వేయుటలో – శ్రీ వైష్ణవ ధర్మము ఎంతగనో ఉపకరించినది. శ్రీ పాంచరాత్రాగమమునందును, పవిత్ర పురాణములందును నిరూపితమైన మహార్థము-ఉపనిషత్సూత్ర గీతలలో అనుగతమై యుండుటను సంభావించిన శ్రీమద్రామానుజులు సనాతన ధర్మవ్యాప్తికి గట్టి పూనిక వహించుటచే, శ్రీ విశిష్టాద్వైత సంప్రదాయ మర్యాద – భారతదేశమందే గాక, విదేశములందును రాణించినది. కర్మజ్ఞానములు, భక్తిప్రపత్తులు ఈ సంప్రదాయమునందు సునిబద్ధములై యున్నవి. వేదానుమోదములేని ధర్మము నిలువదు. వేదానుమోదముపొందిన శ్రీ రామానుజ మతము లోకమునకు తారకమైనది.

దక్షిణదేశమున నుదయించిన భక్తిస్రవంతి – ఉత్తరదేశమందు వ్యాపించి వ్యాపించి, అంతటను విస్తృతమైనది. శ్రీమన్మధ్వాచార్య సంప్రదాయమునకు విశిష్టాద్వైతము నందలి విధానములే బలమును సంపాదించినవి. సంప్రదాయ పరంపరాగతమైన భక్తిధార-ఒక జీవనదియై, దేశమునఁగల నిమ్నోన్నతములను చదునుచేసి, సమున్నతిని పొందించినది. నింబార్కాచార్య వైష్ణవ ధర్మము అట్లు అంతగా వ్యాపించుటకు – శ్రీ రామానుజ సూక్తులే నిదానము. వల్లభాచార్యుల వాల్లభ్యవ్యాప్తికి ఈ సంప్రదాయమే హేతువు. బలదేవుని భావనా బలమునకు ఈ సిద్ధాంతమే ప్రాతిపదిక. శ్రీ చైతన్యప్రభు మహోతత్త్వమునకును ఇదియే పునాది. సూరదాసు సూక్తులలో ఈ సంప్రదాయమే అనుగతము. తులసీదాసుని మధుర భాషితములకు ఇదియే మూలార్థము. తుదకు గాంధీ సిద్ధాంతమునకును ఈ వైష్ణవ ధర్మమే ప్రాణము. అత్యంత పామరులనుండి, మహా వైష్ణవులవఱకును అభివ్యాప్తమైన ఈ ధర్మము లోకపావనమైనది.

నాలుగు వర్ణములవారు – నాలుగు ఆశ్రమములవారు నలుదిక్కుల వ్యాపించిన ఈ ధర్మమును శరణు పొంది, ధన్యులైరి. స్వాభావిక హృదయ మృదులత్వమునకు హేతువైన ఈ శ్రీ వైష్ణవధర్మము అందఱకును అవిస్మార్యము. ఆంధ్రావని అంతరంగమున వైష్ణవ ధర్మమును అర్థించుటను చక్కగా అవగతము చేసికొన్నది. తెనుఁగు కవులు వైష్ణవ ధర్మగానము చేయఁగల్గినారు. శతకకారులు వైష్ణవ అనుభూతి కలిగి, కవితలను వెలయించినారు. పదకర్తలు శ్రీ పాదముల పరాగమును ప్రోగుచేసి, కొండలు నిర్మించినారు. బ్రాహ్మణులలో – క్షత్రియులలో – వైశ్యులలో వైష్ణవ మర్యాదలు అతుకుకొని, వైదిక సంపదగలిగి శోభించినవి. ద్విజేతరులలో – ఆగమ బృంహితమైన వైష్ణవ ధర్మపథము తీర్చి దిద్దిన బాటయై, గమ్యస్థానమును పొందింపఁజేయఁగల్గుచున్నది. ఇట్టి వైష్ణవ ధర్మారాధకులలో ననేకులు భగవద్వైభవమును బాగుగా గుర్తించి, ఆత్మానందము నందియున్నారు.

భగవద్వైభవము అనిర్వచనీయమైనదని భక్తాగ్రేసరుల వక్కణ. అట్టి భగవద్వైభవము కంటెను భాగవత వైభవము మిక్కిలి మిన్నయైనదని, ఈ సంప్రదాయము సంభావించినది. ఈ యంశమును ఆళ్వారులు ఆచరణ పూర్వకముగా నిరూపించియున్నారు. వారు సహజముగా మహాభక్తులు. ఆ మహనీయులు నవ విధ భక్తిమార్గములలో పయనించి, అందందు గల ఆనందము ననుభవించి, ధన్యత గాంచిరి. ఆ పన్నిద్దరాళ్వారులు దక్షిణభారతమునుండి ప్రవహింపఁజేసిన భక్తిస్రవంతి – ఉత్తరభారతము వఱకు పయనించి, నేఁటివఱకును అఖండముగా ప్రవహించుచునే ఉన్నది.

ఆ మహనీయుల సిద్ధాంతములు విశిష్టాద్వైతమునకు జీవగఱ్ఱలై వెలసినవి. వారి ద్రావిడ దివ్య ప్రబంధములు భక్తి ప్రచారోద్యమమునకు ఉపకరణములై యొప్పారినవి. అనంతర కాలీనులైన నాథ, యామున రామానుజాది పూర్వాచార్యులందఱును వారి యడగుజాడలలోనే పయనించిరి. వారి సిద్ధాంతములను ఆధారముగ నిడుకొనియే, విశిష్టాద్వైతమును సుప్రతిష్ఠిత మొనర్చిరి.

ఆళ్వారుల ప్రభావము అత్యద్భుతమైనదని, వారి చరిత్రాంశములే లోకమునకు వేనోళ్ళ చాటుచున్నవి. వారు తమిళప్రదేశవాసులకుఁ గల్గించిన ఆధ్యాత్మిక చైతన్యము అసామాన్యమైనది. వారు తమిళ భాషకు ప్రాణ ప్రతిష్ఠ చేయుటలో జూపిన ఆస్థ నిరూపమానమైనది. వేదబాహ్యములైన ఇతర మతముల నెదుర్కొనుట యందును, శ్రీ వైష్ణవ సంప్రదాయమును సముల్లసింపఁజేయుటయందును ఆ మహనీయులు ప్రదర్శించిన ప్రజ్ఞా పాటవములు అపూర్వములైనవి. కావున, అట్టి ఆళ్వారుల బహుముఖ ప్రజ్ఞా విశేషములు సర్వులకును అవశ్య గ్రహణీయములై యున్నవి.

ఆళ్వారులకు సంబంధించిన విశేషాంశములు విపులముగాఁ దెలియవలెనన్న, ఆ మహనీయు లవతరించుటకు పూర్వము తమిళ ప్రదేశమున సంస్కృతి సభ్యత లెట్లున్నవి? ఆధ్యాత్మిక చైతన్య మే రీతిగా నున్నది? ఆ దేశమునకు 'అసలు' తమిళ భాష యెట్లు వచ్చినది? ఆ భాషయొక్క పుట్టు పూర్వోత్తరము లెవ్వి? ఇత్యాది విషయము లన్నింటిని మొట్ట మొదట మనము స్పష్టముగా గ్రహింప వలసియున్నది.

## తమిళ భాషోత్పత్తి

అతి ప్రాచీన కాలమునుండియు మన భరతఖండము ఏఁబదియాఱు దేశములతో విరాజిల్లుచున్నట్లు భగవచ్ఛాస్త్రము వలన తెలియవచ్చుచున్నది.[1] ఒక్కొక్క ప్రాంతములో ఒక్కొక్క భాష - ప్రధాన భాషగా వ్యవహరింపఁబడుట పరిపాటి.

---

1. "...కురు పాంచాల మధ్యదేశ అంగ వంగ కళింగ మగధ మాగధ మాళవ నేపాళ చోళ సింహళ ద్రవిడ ద్రావిడ కర్ణాట నాట కరహాట విరాట మరాట పాండ్య పుళింద శూరసేన భోజ బాహ్లీక బర్బరు కేకయ కుంతల కొంకణ టెంకణ కాశ్మీర చేర కేరళ ఛేది విదేహ విదర్భ సింధు ఘూర్జర సౌరాష్ట్ర మహారాష్ట్రాది షట్పంచాశద్దేశ విరాజితే...........భరత ఖండే........ ..." —(కల్యాణ ప్రకరణము – మహా సంకల్ప భాగము)

ద్రవిడదేశములో ముఖ్యముగా వ్యవహరింపఁబడు భాష - ద్రావిడ భాష. దీనిని 'తమిళ భాష' యనియు వ్యవహరించుచుందురు. ఇందలి 'ద్రావిడ' శబ్దము సంస్కృత భాషా జన్య మనియు - 'తమిళ' శబ్దము ద్రావిడ శబ్దమునకు వికృతిరూప మనియు సంస్కృతభాషాభిజ్ఞుల యభిప్రాయము.[2]

ఈ ద్రావిడ భాషను ఒకా నొకపుడు శివుఁడు అగస్త్య మహర్షికి వింధ్య పర్వత ప్రాంతమున నుపదేశింప, అగస్త్యుఁ డా భాషను అత్యంత శ్రద్ధాసక్తులతో అధ్యయన మొనరించి, ద్రావిడ భాషా వేత్తగా విఖ్యాతి నార్జించెను. అంతే కాదు - అటనుండి శిష్య సమేతముగా నతఁడు పయనమై, దుర్గమ మగు వింధ్యపర్వత ప్రాంతమును నిర్గమించి, కీకారణ్యముల దాఁటి, సుదూరముగాఁ గల దక్షిణా పథమున కేతెంచి, అట ఆర్య సంస్కృతిని ద్రావిడ భాషామూలమున ప్రచారము గావింప సంకల్పించి, 'పొదియ మలై' అను నొక పర్వతమున నివాస మేర్పఱచు కొని, అటనుండి ప్రచార ప్రబోధములఁ జేయ నుద్యమించెను.[3] ఇందువలన, ద్రావిడభాషకు 'అగస్త్య భాష' యనియు పేరు వచ్చెను. అదియునుఁగాక, ఈ తమిళ భాష - 'అరవ భాష' యనియు లోకమున వ్యవహరింపఁబడసాగెను. ఈ అరవ భాషకు - 'అగాత్తియమ్' అను పేర నొక వ్యాకరణ శాస్త్రమునుఁగూడ అగస్త్యుడు రచించియుండెనని ప్రతీతి యున్నది. కాని, ఇపు డా శాస్త్రము లభించుటలేదు. ఈ భాషా వ్యాప్తిని గుఱించి ముఖ్యముగా గమనింపవలసిన గాథ మఱి యొకటి కలదు.

"అది పార్వతీ పరమేశ్వరుల పరిణయ శుభ సమయము. ఆ వివాహ మహో త్సవమును వీక్షించుటకై దేవతలు, మహర్షులు మున్నగువా రెందఱో కైలాస గిరికి విచ్చేసిరి. అట్లు విచ్చేసిన వారిలో - విశ్వకర్మయు, అగస్త్య మహర్షియుఁ గూడ కలరు. వా రిరువురికిని విధివశమున అట గొప్ప తగ వేర్పడెను. తీవ్ర రూపము దాల్చిన ఆ తగవులో - అగస్త్యుని రోషావేశము హద్దుల నతిక్రమించెను. అట్టి స్థితిలో అగస్త్యుఁడు విశ్వకర్మ నుద్దేశించి - 'ఓ విశ్వకర్మా! లోకములో నీకు

---

2. "On the Other hand '*Tamil*' is the Original word, or name on the analogy of which the word '*Dravida*' has been Coined by Sanskritits."

— *K. Ramakrishnaiah*,
J.S.V.O.I; Vol 14, Pt, I.P.9.

3. శిలప్పధికారమ్: 3—1, 14.

సంబంధించిన విశ్వకర్మలనఁబడువా రందఱును నా శాపమువలన చండాలు రగుదురుగాక'! అని, అనేక పరుషోక్తులతో విశ్వకర్మను శపించెను. అపుడు విశ్వకర్మయు పట్టఁజాలని ఆగ్రహము గలవాఁడై, దేవతల సమక్షమునందే, మహర్షియైన అగస్త్యు నుద్దేశించి - 'ఓ అగస్త్యా! నీచే ప్రచారము గావింపఁబడు ద్రావిడ భాష యంతయు పిశాచ భాషగా మారిపోవుగాక! నీవు రచించిన తమిళవ్యాకరణ శాస్త్రము సైతము మ్లేచ్ఛ భాషవలె భ్రష్టమైపోవునుగాక!' అని ప్రతిశాప మిచ్చెను. అగస్త్యుఁ డందులకు విచారగ్రస్తుఁడై, తనకు ద్రావిడ భాష నుపదేశించిన శివుని పరామర్శయైన లభింపమికి మిగుల వ్యాకులమునుఁ జెంది, అట నుండి పయనమై, ఒకా నొక అరణ్యమున కరిగి, అచట నిద్రాహారములు విరమించి, శ్రీమహావిష్ణువును గుఱించి పదివేల సంవత్సరములు ఘోరమైన తపస్సు చేసెను. అగస్త్య మహర్షి కపుడు శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమై, 'మునీంద్రా! నేను వరదుఁడను. నీ తపస్సుకు మెచ్చి, నీ కిపుడు వరమిచ్చుటకై వచ్చియున్నాఁడను. కనుక, నీకు కావలసిన వరమును కోరుకొనుము' అని పలికెను. అగస్త్యుఁ డంతట విష్ణుభగవానునకు నమస్కరించి, ఆ దేవ దేవుని అనేక విధముల సంస్తుతించి, తన ద్రావిడ భాషకు విశ్వకర్మవలన వాటిల్లిన విపత్తును విన్నవించి, ఆ విపత్తును పూర్తిగా రహిత మొనర్ప వలసిన దని ప్రార్థించెను. అపుడు విష్ణుభగవానుఁడు అగస్త్యుని మనస్తాపమును ఉపశమింపఁ జేయనెంచి, 'ఓ అగస్త్యా! ఇఁక నీ విచారమును వీడుము. నా యంశతో ద్రవిడ దేశమున కొందఱిని అవతరింపఁ జేయఁ గలను. అట్టివారిచే ద్రావిడ భాష పునీతమై, పున రుజ్జీవింపఁబడగలదు. మఱి యొక విశేష మేమన, తామ్రపర్ణీతీరమునఁ గల 'కురుకాపురి'లో - మహా యోగియు, మహా తేజశ్శాలియునై, 'శఠకోపులు' అనువా రొకఱు అవతరింపఁ గలరు. నా యంశతో నవతరించు అట్టి శఠ రిపులు మొదలగు వారిచే, నాలుగు వేల సంఖ్యలో పాశురములు ద్రావిడ భాషయందే రచింపఁబడగలవు. ఆ పాశుర సముదాయము - 'నాలాయిర దివ్య ప్రబంధము' అను పేర విఖ్యాతి నార్జింపఁ గలదు. ఆ దివ్య ప్రబంధమును అధ్యయన మొనరించినవారు ముక్తు లగుట నిశ్చయము. అందునను - శఠ కోపులచే రచింపఁబడు 'తిరు వాయిమొళి' యను ద్రావిడ దివ్య ప్రబంధమును ఆకర్ణించినంత మాత్రముననే, అట్టివారు నా లోకమున పూజింపఁబడుదురు. నేను ప్రసన్నుఁడనై, ద్రవిడ దేశములో - వివిధ ప్రదేశము లందు అర్చారూపమున భక్తులకు దర్శన మిచ్చుచుండఁగలను. వేదార్థములు,

ఆ యర్థములలోని రహస్యములు ద్రావిడ భాషలోనే లోకమున ప్రకాశింపఁ బడగలవు. నాలుగు వేదములను ఆమూలాగ్రముగా వల్లించిన విప్రుండైనను, ద్వయమంత్రానుసంధాన తత్పరుండైనను, తిరుమంత్రార్థ గ్రహణ పారీణుండైనను ద్రావిడ దివ్య ప్రబంధములను అధ్యయనము చేయనియెడల, వైష్ణవత్వము సిద్ధింపఁ జాలదు. కనుక, ఇఁక నీవు విచారింపవలదు" అని వరము ననుగ్రహించి, అంతర్ధానుఁ డయ్యెను. అగస్త్యుఁ డంతట పయనమై, మహర్షి మండలమును ప్రవేశించి, అందు తన తపః ఫలమును వెల్లడించి, సంతృప్తిఁ జెందెను. తమిళ భాషోత్పత్తి క్రమ మిట్లు చరిత్రాంశములవలన తెలియవచ్చుచున్నది.[4]

## తమిళ భాషా వికాసము

శ్రుతి స్మృతీతిహాస పురాణాదులచేతను, భగవచ్ఛాస్త్రముచేతను ప్రభావితమైన భక్తిసిద్ధాంతము - భరత ఖండమున చిరకాలమునుండియు ప్రచలితమగుచునే ఉన్నది. తమిళ ప్రదేశవాసు లందును ధార్మిక ప్రవృత్తి కలదని, ప్రాచీన తమిళ వాఙ్మయమువలన తెలియుచున్నది. ఏది యెట్లున్నను - ఆళ్వారుల యుగమునందే, తమిళ వాఙ్మయ వియన్నదినుండి భక్తిస్రవంతి బయల్వెడలి, దక్షిణభారతము మొదలుకొని, ఉత్తర భారతము వఱకును ఒక మహా ప్రవాహ రూపమున ప్రవహించి, భారతీయుల జీవితములను రస సిక్తము గావించె ననుట నిశ్చయము. అందువలన - ఆళ్వారుల యుగము మొదలుకొని, వైష్ణవాచార్యుల యుగమువఱకును నడుమగాఁ గల కాలము - భారతీయ వాఙ్మయ ప్రపంచమున ఒక స్వర్ణయుగముగా సంభావింపఁబడినది. కావున, అట్టి స్వర్ణయుగమే తమిళ భాషకు, తమిళ ప్రదేశమునకు ఒక మహా యోగ కాలమని మనము తలంపవచ్చును.

తమిళ ప్రదేశములో - పండితులకు, కవులకు తగిన ప్రోత్సాహ మిచ్చుటకై, వారి వారి రచనలను పరీక్షించి, ఆ యా రచనల విలువలను నిర్ణయించు నిమిత్తమై, ఆ దేశ ప్రభువులు ఒక పండిత పరిషత్తు నేర్పఱచిరి. ఆ పరిషత్తును - 'సంఘమ్' అని వ్యవహరించుచుండెడివారు. తమిళ వాఙ్మయ చరిత్రను బట్టి, ఈ పరిషత్తు - క్రీ: పూ: 500 సంవత్సరములనుండి, క్రీ: శ: 2- వ శతాబ్దము వఱకును అమలులో నున్నట్లు తెలియవచ్చుచున్నది. ఇందువలన, ఆ నడుమగాఁ గల కాల మంతయు -

4. ప్రపన్నామృతము : 73- వ అధ్యాయము.

' సంఘ కాలము ' అని వ్యవహరింపఁబడుచుండెడిది. అటుపిమ్మట 3- వ శతాబ్దము నుండి 5- వ శతాబ్దము వఱకు గల కాలము ' జైన బౌద్ధ కాల ' మనియు, 6- వ శతాబ్దము నుండి 9- వ శతాబ్దము వఱకు గల కాలము ' భక్తికాల ' మనియు చెప్పఁబడుచున్నది.

సంఘ కాలీనులైన విద్వత్కవుల కావ్యరత్నములచే సముల్లసించిన తమిళ భాషా కుసుమము - ఆళ్వారుల దివ్య ప్రబంధములలోఁగల వైష్ణవ ధర్మ పరిమళమును సంతరించుకొని, తత్పరిమళమును భరతఖండమం దంతటను వ్యాపింపఁజేసి, సహృదయు లందఱకును పరమాహ్లాదమును గల్గించి, ప్రశంసాపాత్ర మయ్యెను.

## సంఘకాలము — ప్రకృతిపూజ

సంఘ పూర్వకాలపు రచనలలో — ' తొలకాప్పియమ్ ' అను పేరుగల గ్రంథ మొకటిమాత్రమే మన కిపుడు లభ్యమగుచున్నది. ఇది యొక లక్షణ గ్రంథము. ఈ గ్రంథమును ' తొలకాప్పియనార్ ' అను నొక సుప్రసిద్ధ పండితుఁడు రచించినాఁడు. ఇందు సిద్ధాంతీకరింపఁబడిన యంశము లన్నియు — పూర్వకాలమునఁ గల గ్రంథకర్తలచే స్పృశింపఁబడినవే. వారి సిద్ధాంతములకు అనుగుణ మైనట్టివే. ఈ విషయమును తన ' తొలకాప్పియమ్ ' గ్రంథములో — తొలకాప్పియనార్, తానే స్వయముగాఁ దెలిపియున్నాఁడు.[5] ఇందువలన, ఈ ' తొలకాప్పియమ్ ' వెలువడునాటి కంటెను పూర్వమే, తమిళభాషలో కొన్ని గ్రంథము లున్నట్లు స్పష్టమగుచున్నది. కాని, అట్టి ప్రాచీన గ్రంథములలో నే యొకటియు మన కిపుడు లభింపకున్నందున ' తొలకాప్పియమ్ ' వెలువడునాటికంటెను ముందు తమిళప్రదేశమున ఆధ్యాత్మిక చైతన్య మెట్లుండెడిదో తెలియఁజాలము. ఇందుచే, ' తొలకాప్పియమ్ ' గ్రంథమూలమున మాత్రమే తమిళప్రజల ధార్మిక దృష్టిని మన మిపుడు గ్రహింపవలసియున్నది.

ప్రాచీన కాలములో తమిళ ప్రజలు ప్రకృతి సౌందర్యముపై మిక్కిలి మక్కువ గల్గియుండెడివారనియు, పరిశుద్ధములైన అంతః కరణములతో మెలగుచు, నిర్విచారముగ తమ తమ జీవితములను గడుపుచుండెడివారనియు

5. Tolkappiam – Porul Puraturai, Sutras 77 and 78.

సంఘ కాలపు సాహిత్యము వలన తెలియుచున్నది. ఈ సంఘ కాలపు రచనలలో— ప్రేమ, శౌర్యము అనునవి రెండును విశేషముగ వర్ణింపఁబడియున్నవి. 'ఎట్టుతొకై'[6] (ఎనిమిది ఖండ కావ్యముల సంపుటము), 'పత్తు పాట్టు[7]' (పది ఖండ కావ్యముల సంపుటము) అను రెండు గ్రంథములే ఇందులకు పరమ ప్రమాణములు.

ప్రకృతి సంబంధమైన ఆనందమునందు నిమగ్నమైన ఒకానొక నిశ్చిత జీవిత ప్రవృత్తిని ప్రస్ఫుటింపఁజేయు సంఘ కాలీనములైన కావ్యములు — కేవలము ప్రకృతిలోఁ గల మహత్తర శక్తులనేగాక, తదితరములైన అజ్ఞాత విషయముల నెన్నింటినో మనకు వ్యక్తము గావింపఁగలవు. అదియునుఁగాక — వృక్షములు, అరణ్యములు, పర్వతములు మొదలగువానిలోఁగల శుభంకరములు — అశుభంకరములు నగు దేవతలను గుఱించిన వర్ణనలుగూడ, సంఘ సాహిత్యములో[8] అట నట గన్పట్టుచుండును. అట్టి దేవతలను సంతుష్టి బఱచుటకై, ఆనాఁటి తమిళ ప్రజలు ప్రార్థన చేయుచుండెడివారు. అప్పుడపుడు సూర్యచంద్రులనుఁగూడ పూజించుచుండెడివారు. అట్టి పూజ — 'పిరై తొళుదల్[8]' అని వ్యవహరింపఁబడుచుండెడిది. భక్తుఁడు భగవంతుని ఏ రూపమున ధ్యానించిన, ఆ రూపముననే భగవానుఁడు ఆ భక్తునకు సాక్షాత్కరింపఁగలఁడని — 'పరి పాడల్' అను గ్రంథములో నుల్లేఖింపఁబడియున్నది[9]. ఈ వాక్యము —

"యే యథా మాం ప్రపద్యన్తే
తాం స్తథైవ భజా మ్యహమ్."

అను భగవద్గీతా ప్రబోధమును జ్ఞప్తికి దెచ్చును. కనుక, ఇట్టి సంఘ కాలపు సాహిత్యమునఁ గల విశేషములను దెలిసికొనుటకు ముందు — తత్కాలమున

6. నట్రిణై, కురుందొకై, పదిట్రుప్పత్తు, పరి పాడల్, కలితొకై, నేడుతొకై, అహనానూరు, పురనానూరు.

7. తిరుమురు కట్రుపడై, పొరునర్-ఆట్రుపడై, చిరుపాణాట్రుపడై, పెరుంబాణాట్రుపడై, ముల్లై పాట్టు, మదురై-కాంచీ, నేడునల్‌వాడై, కురంజి పాట్టు, పట్టిణప్పాలై, మలైపడు కడామ్.

8. Tolkappiam – Porul, Ahatinai 5, Nachinarkanyanar's Commentary and kalitogai, Palaikali, 16.

9. పరి పాడల్ : 4. 11–56.

కంటెను పూర్వము తమిళ ప్రదేశములో ప్రచలితమైయున్న ప్రకృతి పూజా సంబంధమగు ప్రణాళికా స్వరూపమును ముఖ్యముగా మనము గమనింపవలసి యున్నది.

## తమిళ భూ భాగములు - తదధిదేవతలు

'తొలకాప్పియమ్' అను గ్రంథములో — తత్కాలమున తమిళులచే ఆరాధింపఁబడు ముఖ్య దేవతలను గుఱించిన వివరణ ముండుటచే, తన్కాలమున, ఆ యా విశేషములను చాలవఱకు గ్రహింపఁగలము. తమిళప్రదేశమునఁ గల జల వాయువులకు సంబంధించిన స్థితి గతుల ననుసరించి, ఆ ప్రదేశము నాల్గు భూ భాగములుగా విభజింపఁబడినట్లు — ఈ 'తొలకాప్పియమ్' మూలముననే తెలియవచ్చుచున్నది. అందలి ప్రతి భూ భాగమును, తమిళప్రజలు సర్వసామాన్య ముగ — 'తిణై' అని వ్యవహరించుచుండెడివారఁట! ఈ నాల్గు 'తిణై'లకు — వేఱ్వేరుగా నాల్గు పేర్లున్నవి. ఇవి — 'ముల్లై' (అరణ్యప్రాంతము), 'కురంజి' (పర్వతక్షేత్రము) 'మరుదమ్' (సారవంతమైన పంటభూమి), 'నేయదల్' (సముద్రప్రాంతము) అను పేరులు గలవి.[10] ఇవిగాక — 'పాలై' (మరుభూమి) అను నొక భూ భాగముకూడ ప్రత్యేకముగ నొకటి యుండెడిదఁట![11] ఈ భూ భాగము లన్నింటి పరి రక్షణకై, వేఱ్వేరుగా అధిదేవతలుకూడ ఏర్పాటుపఁబడి యున్నారు.[12]

పైఁ బేర్కొనఁబడినవానిలో - 'ముల్లై' ప్రదేశమునకు అధిదేవత - 'మాయోన్'. అనఁగా - శ్యామవర్ణము గల తిరుమాల (విష్ణువు). 'కురంజి'కి అధి దేవత - 'శెయోన్.' అనఁగా - గౌరవర్ణము గల 'మురుగన్' (సుబ్రహ్మణ్యస్వామి). గోవులు సంచరించు 'మరుదమ్' అను భూ భాగమునకు అధిదేవత - వర్షములను గురిపించు దేవేంద్రుఁడు. సముద్ర ప్రాంతమునకు అధిదేవత వరుణుఁడు. అయిదవ ప్రత్యేక భూ భాగమునకు 'కొట్రవై' అనునది అధిదేవత.

---

10. Tolkappiam – Poruladhikaram – Ahatinai, Sutra 5.

11. ఈ విధమైన భూ విభజనము, భూ విభాగములకు అధి దేవతల నిర్ణయము - వైదిక వాఙ్మయము నందునుఁ గలదు. కృష్ణయజుర్వేద సంహితలో 3.4 సర్గలు పరిశీలింప నగును.

12. Tolkappiam – Poruladhikaram – Ahatinai, Sutra 30.

తమిళప్రదేశమునఁ గల ఈ అయిదు భూ భాగములలో - ద్రావిడ ప్రజల కల్పనానుసారముగనే, ఈ అయిదుగురు దేవతలు ఆ యా స్థానములలో అధిష్ఠింపఁ బడినట్లును, ఈ దేవతలు - ఆర్యుల దేవతలతో పూర్వమునుండియే సంబంధముగల్గి యున్నట్లును తెలియుచున్నది.[13] ఆ కాలమున, ఈ అధిదేవతలకు విడి విడిగా ఆలయములుకూడ ఉండెడివఁట! ఈ అయిదుగురు దేవతలలో - 'మాయోన్' (తిరుమాల), 'మురుగన్' (సుబ్రహ్మణ్యస్వామి), 'కొట్రవై' అను ముగ్గురు దేవతలను మాత్రము - మిగిలిన ఇరువురు దేవతలకంటెను ప్రధానులుగా తమిళ ప్రజలు భావించుచుండెడివారు. ఇందువలన ఇంద్రునకు - వరుణునకు గౌణ స్థానములు మాత్రమే లభించెను. ఈ యంశములు - సంఘ సాహిత్యమువలనను, శిలా శాసనముల వలనను మనకు సవిస్తరముగాఁ దెలియవచ్చుచున్నవి.[14]

'తొలకాప్పియమ్' అను గ్రంథములో వర్ణింపఁబడిన తమిళ ప్రదేశము నందలి భూ భాగముల అధిష్ఠాన దేవతలకును, అనంతరకాలపు రచనలలో వర్ణింపఁ బడిన దేవతలకును పోలిక చాలవఱకు కన్పట్టుచుండును. ఈ రెండుకాలముల నడుమ - దాదాపు రెండు మూఁడు శతాబ్దముల వ్యవధి యున్నట్లు స్పష్టముగాఁ దెలియుచున్నది. కనుక, ఆ తరుణమునందే, ఆర్య ద్రావిడ సంస్కృతులు రెండును ఏకమైయుండవచ్చుననుటలో నేమాత్రముకూడ విప్రతిపత్తి లేదు. కారణ మేమన, 'తొలకాప్పియమ్' వెలువడిన పిమ్మట వచ్చిన రచనలందును, ముఖ్యముగా - సంఘ కాలములో వెలువడిన రచనలందును వైదిక దేవతలను గుఱించి విస్తారముగ ప్రస్తావింపఁబడియే యున్నది.

ప్రకృతి సంబంధమగు ఆనందముతోఁగూడిన తమిళ ప్రజల భక్తిభావము - క్రమ క్రమముగా వైదిక ప్రక్రియలతో సమ్మిళితమై, ఒకానొక విశిష్ట భక్తితత్త్వముగా పరిణమించినది. తత్ఫలముగా - తమిళప్రజల దేవతలలోఁగూడ మార్పులు, చేర్పులు కల్గుట తటస్థించెను.

పై జెప్పఁబడిన రీతిగా ఆర్య ద్రావిడ సంస్కృతులు రెండును ఏకమైనంతనే, రెండు విధములుగాఁ గల భక్తిసిద్ధాంతములుకూడ ఏకమైపోయినవి. ఈ ఏకీకరణము

13. తమిళ్ నూల్ కళిల్ బౌద్ధమ్ : 11, 12 పుటలు.

14. ఆళ్వార్‌గళ్ కాలనిలై — ము. రాఘవ అయ్యంగార్, 2, 3 పుటలు.

క్రీ॥ శ॥ 2, 3 శతాబ్దములవఱకు జరుగుచునే ఉండెను. ఇందులకు ప్రమాణములు మనకు సంఘోత్తరకాలపు రచనలలో లభింపఁగలవు. ఆ మధ్యకాలపు రచనలలో - వైదిక దేవతలను గుఱించిన విశేషములునైతము కన్పట్టుచునే ఉన్నవి.

'ముల్లై' అనఁబడు అరణ్యప్రాంతములో నివసించు ప్రజలచే ఆరాధింపఁబడు 'మాయోన్' అను పేరుగల దేవతకు - మిగిలినదేవత లందఱికంటెను అగ్రస్థానము లభించినది. ఈ దేవత - కాలక్రమమున తన ప్రభావమును ఇతర భూభాగములందును ప్రదర్శించెను. 'మాయోన్' అను శబ్దమునకు - 'నీలమేఘశ్యాముఁడైన భగవానుఁడు, అని యర్థము. ఈ భగవానునకు మఱియొక పేరు - తిరుమాల.

'కురంజి' అనఁబడు పర్వతప్రాంతమునకు ఏర్పాటుపఁబడిన అధిదేవతను - 'శెయోన్' అనియు, 'మురుగన్' అనియు వ్యవహరించుచుందురు. తమిళ ప్రదేశములో అవివాహితలైన కన్యలు - యోగ్యులైన భర్తలే తమకు లభింపవలె ననెడు ఆకాంక్షతో, ఈ దేవతను పూజించెడివారట. ఈ దేవతకు ఆయుధము బల్లెము. దండాయుధన్, దండపాణివేలన్, వేలాయుధన్, వేలవన్ అను పేరులు - ఈ దేవతయొక్క వీరస్వరూపమును సూచించునవియై యున్నవి. ఈ దేవతకు సంస్కృతములో - కార్తికేయుఁడు, స్కందుఁడు మొదలగు పేర్లున్నవి. సుబ్రహ్మణ్య స్వామిగా ప్రసిద్ధిఁజెందిన ఈ దేవతకు ఆలయములుకూడ నిర్మింపఁబడియున్నవి. 'మరుదమ్' అనఁబడు సారవంతమైన పంటభూమికి అధిదేవత - మేఘాధిపతియైన దేవేంద్రుఁడు. ఇతని ఆయుధము వజ్రము. నేల యంతయు బీటలువారినపుడు - ఇతఁడు మేఘములను బంపి, వర్షములను కురిపించుచుండును. ఇతనికి ప్రియమైన భోజ్యపదార్థము - 'పొంగల్' అనఁబడు ముద్గాన్నము. మకర సంక్రాంతి సమయములో - తమిళ ప్రదేశమున ఈ దేవతను పూజించి, 'పొంగల్' (ముద్గాన్న) నివేదనముతో తృప్తి బఱచుచుండుట - నేఁటికిని పరిపాటిగా నున్నది. ఈ దేవతకు వాహనము - ఐరావత మనఁబడు గౌరవర్ణముగల గజేంద్రము. ఈ దేవేంద్రునకు ఆ కాలమున ఆలయములుకూడ నిర్మింపఁబడుచుండెడివని తెలియుచున్నది. ఇంద్రుని వజ్రాయుధమునకు ప్రత్యేకముగా నొక ఆలయ మున్నట్లును 'శిలప్పధికారము' లో నుల్లేఖింపఁ బడియున్నది.[15] మేఘాధిపతియగు దేవేంద్రుని యనుగ్రహముచే సర్వ విధ సస్యములును సమృద్ధిగా ఫలింప, పాడిపంటలతో -

15. శిలప్పధికారమ్: కాదై - 9, 12.

సిరి సంపదలతో తుల దూఁగుచు, నిర్విచారముగ జీవిత యాత్రను కొనసాగించు తమిళప్రజలు - ఇంద్రునియందు భక్తి విశ్వాసములు గలవారై, కృతజ్ఞతా సూచకముగ ఆ దేవేంద్రునకు ప్రతి సంవత్సరమును-' ఇంద్రవిలా ' (ఇంద్రోత్సవము) అను పేర, ఒక ఉత్సవమును జరుపుచుండెడివారఁట! ఇట్టి మహోత్సవ వైభవ మంతయు - 'శిలప్పధికారము ' నందే వర్ణింపఁబడియున్నది.

'నేయదల్ ' అనఁబడు సముద్రప్రాంతమునకు అధిదేవత - వరుణుఁడు. ఈ దేవతను బెస్తవారు (జాలరులు) మిక్కిలి భక్తి శ్రద్ధలతో పూజించుచుండెడివారు. ఈ దేవతకు తిమింగిల దంతము ఆయుధము. ఆ కాలమునఁగల పాండ్య రాజు - సముద్ర ప్రాంతమునకు అధిదేవతయైన ఈ వరుణునకు ప్రతిసంవత్సరమును మహావైభవముగా ఉత్సవమును జరిపించుచుండెడివాఁడఁట![16] ఈ వరుణునకును, ఆ దేవేంద్రునకును తంజావూరులో ఆలయము లుండెడివని అచ్చటి శిలాశాసనముల వలననే తెలియవచ్చుచున్నది.[17]

'పాలై ' అనఁబడు మరుభూమికి - 'కొట్రవై ' అనునది అధిష్ఠానదేవత. ఈమె - యుద్ధరంగములో విజయమును చేకూర్చగలదని తమిళప్రజలకు గాఢమైన విశ్వాసముండెడిది. ఇందువలన, యుద్ధరంగమునందు విజయమును పొందగోరువా రందఱును, ఈ దేవతను పూజించుచుండెడివారఁట![18] ఈ దేవతను సర్వ సాధారణ ముగా - 'మరవర్ ' అనఁబడు 'కళ్లార్ ' ప్రజలు - అనఁగా, నీచజాతివారు విశేష ముగ పూజించుచుండెడివారు. తమ దేవతను ప్రసన్నము గావించుకొనుటకై వీరు- కేవలము పశువులనేగాక, మనుష్యులను సైతము బలి యిచ్చుచుండెడివారఁట! ఈ దేవతకు మూఁడు నేత్రము లున్నట్లు 'శిలప్పధికారము ' లో వర్ణింపఁబడి యున్నది.

## తమిళ ప్రదేశములో వైష్ణవ ధర్మము

తమిళభాషలో - 'తిరుమాలై ' అనఁగా - విష్ణువు అనియు, 'తిరుమాలినై ' అనఁగా - లక్ష్మీదేవి యనియు అర్థములు. వీ రిరువురిలో, లక్ష్మీదేవిని 'పెరియ పిరాట్టి ' యనియు శ్రీవైష్ణవ సంప్రదాయులు వ్యవహరించుచుందురు. మొట్ట

16. శిలప్పధికారమ్ : పురమ్ — 9, 10.
17. South Indian Inscriptions, Vol. 1. P. 414.
18. Tolkappiam – Porul – Sutra 59.

మొదట ఈ పెరియ పిరాట్టియే శ్రీ వైష్ణవ సంప్రదాయమును లోకమున ప్రవర్తింపఁజేసి యున్నందున, ఈ సంప్రదాయమునకు 'శ్రీసంప్రదాయము' అను పేరు వచ్చెను. ఈ సంప్రదాయమును ఆ నాఁటి తమిళ ప్రజలు - 'తిరుమాలై ధర్మమ్' అని వ్యవహరించు చుండెడివారు. ఇది కాల క్రమమున - 'తిరుమాల ధర్మము' అని యనఁబడుట పరిపాటి యయ్యెను.

ఈ వైష్ణవధర్మము సంఘ సాహిత్యములో విస్తారముగనే గన్పట్టుచున్నది. అయినను, ఇతర మతముల ప్రాబల్యమువలన, ఈ ధర్మమునకు ఆ కాలమున తగినంత ప్రాచుర్యము లభించియుండలేదనియే చెప్పవచ్చును. కాని, అనంతర కాలమున ఈ వైష్ణవ ధర్మము ఆళ్వారుల దివ్య ప్రబంధముల మూలమున పరిపుష్టిని సంపాదింపఁగల్గెను. ఇట్టి ధర్మపరి పుష్టికి పరిపూర్ణముగా నుపకరించిన ద్రావిడ దివ్య ప్రబంధములలోఁ గల విశిష్ట విషయములను - కాలాంతరమున, నాథ యామున రామానుజాది ఆచార్య వర్యులు బాగుగా గుర్తించి, ఆయా విశిష్ట విషయములను తమ తమ దార్శనిక గ్రంథములలో విపులముగా విశదీకరించి, తన్మూలమున శ్రీ వైష్ణవ ధర్మతేజమును భారతదేశమం దంతటను వెల్లివిరియఁజేసిరి.

## శ్రీ వైష్ణవ ధర్మ ప్రాచీనత

సంఘ కాలమునకు పూర్వము వెలువడిన 'తొలకాప్పియమ్' అను గ్రంథములో - తమిళ ప్రదేశమునఁగల అయిదు భూభాగములు వర్ణింపఁబడియుండుటే గాక, ఆ భూభాగములకు సంబంధించిన అధిష్ఠానదేవతలుకూడ అందు అభివర్ణింపఁబడినట్లు పైన పేర్కొనఁబడినదికదా! అయినచో - ఇఁక, ఆ యధిదేవతలలో - 'మాయోన్' అనఁబడు విష్ణుభగవానున కెంతటి ప్రాముఖ్యము గలదో మన మిపుడు గమనింపవలసి యున్నది.

'తొలకాప్పియమ్' రచయిత — తన గ్రంథమున అధిదేవతలను వర్ణించు సందర్భములో మొట్ట మొదట — 'ముల్లై' అనఁబడు అరణ్య ప్రదేశమునకు అధిదేవత యగు తిరుమాల (విష్ణువు) పేరునే ఉట్టంకించెను.[19] ఇట్లే - 'సేవికలార్' అను నొక సుప్రసిద్ధుఁడైన కవియు — తాను రచించిన 'పెరియ పురాణము' నందు, ఇతర దేవతలకంటెను తిరుమాల(విష్ణువు)కుఁ గల మహిమలనే విస్తారముగ ప్రస్తుతించుచు, ఆ దేవ దేవుని — అరణ్యప్రాంతమునకు అధి దేవతగా అభివర్ణించెను.[20]

19. Tolkappiam – Aham – Sutra 5 and 30.
20. Periya Puranam – Thirukurri Purandara Puranam, Stanza. 18.

దేవతలలో – విష్ణువుకుఁ గల ప్రాముఖ్యమును సూచించుటకై వ్యవహరింపఁబడు 'మాయోన్' శబ్దమే గాక, ఆ యర్థము నిచ్చెడు 'తిరుమాల' శబ్దము కూడ ఆ కాలమున తఱచుగా ప్రయోగింపఁ బడుచుండెడిది. తిరుమాల – కేవలము మానవులను మాత్రమేగాక, సర్వ జీవరాసులను సంరక్షింపఁగలవాఁడని 'తొలకాప్పియమ్' అను గ్రంథమునందే విశదీకరింపఁబడియున్నది.[21] ఈ లక్షణ శాస్త్రకారుఁడు తన గ్రంథమున – 'పువై. నిలై' అను కవితా లక్షణములను వివరించుచు – 'ఉత్తముఁడైన రాజు, తిరుమాలతో పోల్చఁ దగినవాఁడు' అని యుల్లేఖించి,[22] అనంత కల్యాణ గుణ గణ విశిష్టుండైన అట్టి తిరుమాలను బహు భంగులుగా కీర్తించి యున్నాఁడు. ఈ విద్వత్కవి – తన లక్షణ గ్రంథమున, ఇంతగా మఱి యే దేవతనుగూడ వర్ణించియుండలేదు. ఇందువలన, ఆ నాఁటి తమిళ ప్రజలు తిరుమాల మహిమలను ఎంతగా గుర్తించి యుండిరో మనము సులభముగాఁ దెలిసికొనవచ్చును.

'ముల్లై' అనఁబడు అరణ్యప్రదేశములో నివసించు 'ఆయర్' కులజులు (గొల్లలు) – తమ యిష్టదైవమగు తిరుమాలకు సంబంధించిన మహిమలను వర్ణించు గీతములను మధురముగా గానము చేయుచు, ఆ దేవ దేవుని వివిధ లీలలను విశేషముగా కొనియాడుచుండెడివారు. ఆ గొల్ల పడుచులకు తమ భర్తలపై నెంతటి యనురాగ ముండెడిదో – అంతటి భక్తిభావమే తమ యిష్టదైవ మగు 'మాయోన్' (తిరుమాల) యందును గలదు.[23] 'తొలకాప్పియమ్' వెలువడిన నాఁటి (క్రీ॥పూ: 5-వ శతాబ్దము) నుండియే తిరుమాలకు సంబంధించిన గాథలు-తమిళ ప్రజల మనస్సులను విశేషముగ ఆకర్షింపసాగినవనియు, అందువలన, తిరుమాలకు సంబంధించిన చరిత్రాంశములు సంఘ కాలము నుండియే బాగుగా ప్రచారములోనికి వచ్చినవనియు ఇందుమూలమున విశద మగుచున్నది.

## సంఘ సాహిత్యములో వైష్ణవము

సంఘ సాహిత్యమునకు సంబంధించిన రచనలలో – 'ఎట్టుతొకై' (ఎనిమిది ఖండ కావ్యముల సంపుటము)–'పత్తుపాట్టు' (పది ఖండ కావ్యముల సంపుటము) –

21. Tolkappiam – Porul – Sutra 60.

22. 'నా విష్ణుః పృథివీపతిః' అని కదా ఆర్యోక్తి !

23. Tolkappiam – Porul – Sutra 84 and 84.

'పదినేణ కీళ కణక్కు' (పదునెనిమిది లఘు కావ్యముల సంపుటము[24]) అను మూఁడు గ్రంథములు మాత్ర మిపుడు లభ్యమగుచున్నవి. వీనిలో మొట్టమొదటి దగు 'ఎట్టుతొకై' అను సంపుటమునఁ గల 'నట్రిణై' అను కావ్యము—మిగిలిన కావ్యము లన్నింటి కంటెను ప్రాచీనమైనదిగా మనము సంభావింపవచ్చును. ఇందు — తిరుమాల(విష్ణువు) కు సంబంధించిన వివిధ గాథలు విస్తారముగ వర్ణింపఁ బడియున్నవి. ఇందలి ఒక కావ్య రచయిత — సమస్త విశ్వమును తిరుమాల మయముగా దర్శించినాఁడు.[25] విశ్వమునం దంతటను తిరుమాల యొక్క ప్రభావము వ్యాపించి యున్నట్లు గుర్తించినాఁడు. విశ్వమును తిరుమాలగా-తిరుమాలను విశ్వముగా విశ్వసించినాఁడు.[26] ఈ కావ్య సంపుటములో మంగళా చరణము గాక, నూటడెబ్బదియైదు మంది కవులు రచించిన నాలుగు వందల కవిత లున్నవి. ఈ కవితలను రచించినవారిలో - ఎనమండుగురు స్త్రీలును కలరు. కపిలర్, ఉల్లోచనార్ అను పేర్లు గల ఇరువురు కవుల రచనలు - ఇందు, శేషించిన వారి రచనలకంటెను అధికసంఖ్యలో నున్నవి. ఈ యిరువురిలో మొదటికవి - ప్రకృతి సౌందర్యమునందే తాను తిరుమాలను దర్శించినట్లు, తన కవితలో విశదీకరించి నాఁడు. ఇఁక రెండవకవి - శ్యామ వర్ణముగల పర్వతమును, ఆ పర్వత పంక్తులనుండి జల జల ప్రవహించు నిర్మలమైన నిర్ఝరిణిని పరిశీలించినంతనే, తనకు తిరుమాల జ్ఞప్తికి వచ్చినట్లు తన కవితలో స్పష్టీకరించినాఁడు. మఱియొక కవికి - కాయా పుష్పమునందును,[27] నీల గగనమునందును, సముద్ర తరంగములందును విష్ణువు కాన వచ్చినట్లు ఒక కావ్యములో నుట్టంకింపఁబడియున్నది. ఇట్లే, సంఘకాలమునఁగల కవులలో ననేకులు - ప్రకృతియందే తిరుమాలను దర్శించినట్లును, ఆ నాఁటి తమిళ ప్రజలు తిరుమాల మహిమలను కథల రూపమున తఱచుగా కీర్తించుచుండెడి వారనియును - 'నట్రిణై' అను కావ్యమువలననే తెలియవచ్చుచున్నది.

---

24. ఎట్టుతొకై, పత్తుపాట్టు అను సంపుటములలోఁగల కావ్యములపేర్లు ముందే తెలుపఁబడినవి. కనుక, ఇచట పదినేణ కీళ కణక్కు అను సంపుటములోఁగల కావ్యములు కొన్ని మాత్రము సూచింపఁబడుచున్నవి. ఇందు తిరుక్కురళ్, తిరికటుకమ్, నాన్మణి కటికమ్, శిరుపంచమూలమ్, నాలడియార్, కార్ నార్పదు, కళవళ నార్పదు, ఇనివై నార్పదు, ఇన్నా నార్పదు, ఎంతిణై, పళమొళి, ముదుమొళి, కాంచి మున్నగు లఘు కావ్యములు మొత్తము పదునెనిమిది ఉన్నవి.

25. 'సర్వం విష్ణుమయం జగత్' అనుసూక్తి — అతి ప్రాచీనకాలము నుండియు లోకమున ప్రచలిత మగుచున్నదే గదా!

26. వ్యాస రచితమైన మహాభారతము నందును విష్ణుభగవానుని విశ్వరూపము వర్ణింపఁబడి యున్నది. శాంతిపర్వము నందు 338—వ అధ్యాయములో 21—వ శ్లోకము మొదలుకొని, 28—వ శ్లోకము వఱకును పరిశీలింపుఁడు.

27 ఒకానొక పుష్ప విశేషము.

'పదిట్టు పత్తు' అను కావ్యములో - 'కాప్పియటూరు కాప్పియనార్' అను కవి - తనకు ఆశ్రయ మిచ్చిన 'నారముడి చేరల్' అను పేరు గల ఒకా నొక చేర రాజును విష్ణుభక్తునిగా అభివర్ణించినాఁడు. వరాహావతారముతో సర్వ భూ మండలమును సంరక్షించిన తిరుమాల(విష్ణువు)ను - సర్వకాల సర్వావస్థలయందును, సద్భక్తితో ఆరాధించుచుండవలసినదని, ఆ రాజు తన రాష్ట్ర ప్రజల నుద్దేశించి ఉద్బోధించినట్లు ఈ కావ్యములో నుల్లేఖింపఁ బడియున్నది. ఈ కావ్యమునందే మఱియొక తావున - తిరుమాల భక్తులు స్నాన మాడి, ఉపవాసవ్రతమును బూని, తిరుమాల కోవెలకుఁ బోయి, అందు వేంచేసియున్న దివ్య మంగళ విగ్రహమును సంసేవించి, పలు విధములుగా ప్రస్తుతించి. తులసి మాలను ధరించియున్న ఆ తిరు మాలయొక్క చరణారవిందముల సన్నిధిలో పుష్పాంజలి సమర్పించి, తన్మయత్వ ముతో నృత్యము జేయుచుండెడివారని అభివర్ణింపఁబడియున్నది. ఇందు వర్ణింపఁ బడిన ఆలయము - తిరువనంతపురములోఁగల శేషశాయి యగు తిరుమాల వేంచేసి యున్నట్టిదని విద్వాంసుల అభిప్రాయము.[28]

'చేర్వ కటుంగీ' అను నొక రాజు - తిరుమాలయందు తనకుఁగల భక్తి ప్రపత్తులను పురస్కరించుకొని నిత్య నైవేద్య దీపారాధనాదుల నిమిత్తమై 'ఓమన్దూర్' అను పేరుగల గ్రామము నొకదానిని తిరుమాలకు శాశ్వత కైంకర్య ముగా సమర్పించినట్లు - 'కపిలర్' అను కవి, ఒక కావ్యములో నుట్టంకించి యున్నాఁడు. కావున, తమిళ ప్రదేశమునకుఁ జెందిన చేర రాజ్యములో - అతి ప్రాచీనకాలమునుండియు తిరుమాలార్చన జరుగుచున్నట్లు స్పష్ట మగుచున్నది.

'నక్కీరర్' అను పేరుగల ఒక కవి- 'పురనానూరు' అను తన కావ్యమున బలరాముని వర్ణించుచు, సముద్రములో సముత్పన్నములగు ధవళ వర్ణము గల శంఖముల కాంతివలె, బలదేవుని దేహకాంతి తేజరిల్లుచుండెననియు - అతని ధ్వజముపై తాళవృక్ష చిహ్నము సంకేతింపఁబడియుండెననియు ఉల్లేఖించి యున్నాఁడు.[29] మఱియు - ఆ బలరామునకు అనుజుఁడైన 'కణ్ణన్' (కృష్ణుని) శరీరము నీలమణికాంతివలె విలసిల్లుచున్నదనియు, ఆతఁడే తిరుమాలగా సంభావింపఁబడదగినవాఁ డనియు ఈ కవిశేఖరుఁడు అభివర్ణించి యున్నాఁడు.[30]

28. 'తమిళముమ్—వైష్ణవముమ్' — ఎమ్. రాధాకృష్ణపిళ్లై, 6—వ పుట.

29. పురమ్: 55—3—4.

30. ,, 174—1—5.

'మారోక్కత్తు నప్పసలైయార్' అను పేరుగల కవి - 'కణ్ణన్' (కృష్ణ) మహిమలను తన కావ్యమున వివరించుచు, దేవ దానవులకు యుద్ధము సంభవించి నపుడు, పగటి కాలమునఁ గూడ చీఁకటి వ్యాపించుటకై, అసురులు సూర్యుని కప్పివేసిరనియు - అపుడు భూ మండల మంతయు అంధకార బంధుర మయ్యె ననియు - అందువలన, ప్రజ లందఱును భయ భ్రాంతులు కాఁగా, అపుడు నీలవర్ణ దేహ ధారియగు 'కణ్ణన్' (కృష్ణుఁడు) జగత్కల్యాణ కాంక్షతో మఱి యొక సూర్యుని సృష్టించి, ఆకాశమునఁ గన్పఱచి, ప్రజలకు సంతుష్టి గల్గించెననియు అభివర్ణించినాఁడు.[31] అదియునుఁగాక, ప్రళయకాలమున విష్ణువు వటపత్ర శాయియైయుండు వృత్తాంతము సైతము ఈ కవిచే వర్ణింపఁబడినది.[32]

'పరి పాడల్' అను గ్రంథమునందును విష్ణువును గుఱించిన వర్ణనలు విస్తారముగ నున్నవి. 'పాడల్' అనఁగా-'గీతము' అని యర్థము. ఈ సంపుటమునఁగల డెబ్బది కావ్యములలో- ప్రత్యేకముగా ఎనిమిది కావ్యములు కేవలము తిరుమాలకు సంబంధించిన వివిధ మహిమలను వర్ణించునవియై యున్నవి. ఈ సంపుటమునఁ గల మొదటి కావ్యములో - శేషశాయి యగు విష్ణు భగవానుఁడు అభివర్ణింపఁబడి యున్నాఁడు. ఛత్రము, ఆసనము, దీపము మున్నగునవియును ఇందు వర్ణింపఁ బడి యున్నవి. నీల మేఘ శ్యాముఁడైన తిరుమాలయొక్క వక్షస్స్థలమును వరలఁ జేయు రమాదేవి - సత్య సుందరముల సమన్వయమువలె సంశోభించుచున్నదని, ఇందు కవి రమణీయముగా వర్ణించినాఁడు. తిరుమాలకు సంబంధించిన వివిధ భూషణములుగూడ ఇందు వర్ణింపఁబడి యున్నవి. ఆ భూషణము లెవ్వి యన, ప్రకృతిలోఁ గల వివిధ వస్తువులే. అగ్నిచే సమావృతమైన పర్వతమే ఆ తిరుమాలకు పీతాంబరమఁట! ఇట్లే, ప్రకృతిలోఁ గల వస్తుజాత మంతయు తిరుమాలకు అలంకారప్రాయమైన భూషణ సముదాయముగా ఈ కావ్యమున వర్ణింపఁబడినది. ఈ కావ్య రచయిత - తన అకించనత్వమును, శేషత్వ పారతంత్ర్యములను, భగవన్మాహాత్మ్యమును వ్యక్తము గావించుచు - 'వేదవేద్యులైన మహర్షులు, విజ్ఞాన వేత్తలైన మహనీయులు తిరుమాల మహిమలను పరిపూర్ణముగా గ్రహింపఁజాలని పరిస్థితిలో - అకించనుఁడనైన నేను, ఆ తిరుమాల మహిమల నన్నింటిని ఎట్లు వర్ణింపఁగలవాఁడను ? అవాఙ్మానసగోచరమైన ఆ దేవ దేవుని మహాప్రభావమును ఏ కొలఁదిగా వర్ణింపఁ దలచినను - అతని కృపా కటాక్షము అణుమాత్రమైనను నాపై ప్రసరించితీరవలెను' అని, తన కావ్యమునందే మఱి యొక తావున వ్రాసి యున్నాఁడు.

---

31. పురమ్ : 57-1-3.

32. ,, 191-1.

'బ్రహ్మరుద్రేంద్రాదు లందఱును తిరుమాల యొక్క సంకల్పమువలన నుద్భవించినవారే. స్వర్ణమయమై, ధగ ద్ధగాయమానముగ వెలుగొందు చక్రాయుధమును తన కర కమలమున ధరించిన ఆ తిరుమాలయే అఖిల ప్రపంచమునకును ఆదికారణము. అతఁడే, శ్రుతి స్మృతీతిహాసాదులలో నంతటను పరబ్రహ్మాభిధానుఁడుగా కీర్తింపఁబడుచున్నాఁడు. అట్టి పరమాత్మను శరణుపొందినవారలు ముక్తులగుట నిశ్చయము' అనియు సంఘ సాహిత్యమునందు పలు తావులలో విశదీకరింపఁబడియున్నది. ఈ కారణమును బట్టి, సంఘకాలీనులైన కవులలో ననేకులు కేవలము వైష్ణవ హృదయులనియే తెలియవచ్చుచున్నది.

పైన పేర్కొనఁబడిన 'పరిపాడల్' కావ్యమునందుగూడ, తిరుమాల ధరించిన యవతారములు కొన్ని వర్ణింపఁబడి యున్నవి. బలరాముఁడుకూడ దశావతారములలో నొకఁడు కనుక, సంఘ కాలములో - కృష్ణునకు వలెనే బల దేవునకును ఆలయములు నిర్మింపఁబడినట్లును, ఆ బలదేవునిఁగూడ తమిళ ప్రజలు పూజించుచుండెడివా రనియు 'పరి పాడల్' కావ్యమువలననే తెలియవచ్చుచున్నది.

ఈ 'పరి పాడల్' కావ్యకర్తయగు 'కడువన వేయనార్' అను కవి, ముఖ్యముగా - భగవచ్ఛాస్త్రమునందును, పురాణేతిహాసాదులయందును గాఢమైన అభినివేశము గలవాఁడని మనము భావింపవచ్చును. ఏల యన, భగవచ్ఛాస్త్రమునందును, పురాణేతిహాసాదులయందునుఁ గల తాత్త్విక విషయము లనేకములను ఈ కవి తన కావ్యములో తడవి యున్నాఁడు. ఇందులకు ఒక్క ఉదాహరణము మాత్రము ఇట చాలును. పైఁ బేర్కొనఁబడిన భగవచ్ఛాస్త్రాదులలో వర్ణింపఁబడియున్న వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ వ్యూహములను నాల్గింటిని ఈ కవి తన కావ్యమున వరుసగా - చెంకణకారీ, కరుంకణ వెళ్ళై, పొంకణపచ్చై, పైంకణ్మాల్ అను పేర్లతో సంకేతించుచు, ఈ వ్యూహములకు సంబంధించిన విశేషాంశములను సైతము అందే విశదీకరించియున్నాఁడు[33]. అదియునుఁగాక, ఈ కావ్య సంపుటమునందు - పృథివిని రక్షించిన వరాహావతారము[34], ప్రహ్లాదుని భక్తి విశ్వాసములను సార్థకములఁ గావించిన నరసింహావతారము[35], మూఁడు అడుగులతో ముల్లోకముల నాక్రమించిన వామనావతారము[36] సైతము బహు భంగులుగా ప్రస్తుతింపఁబడియున్నవి.

---

33. 'తిరు కోయిల్ పత్రిక (Vol. 11, Issue 3)లో 'వైష్ణవమ్' అను శీర్షిక గల వ్యాసము. వ్యాసకర్త — శ్రీ.పి.శ్రీ. ఆచార్య, 21—వ పుట.

34. పరిపాడల్ 4—10—21

35. ,, 3—33—34

36. ,, 3—19—20

'పరి పాడల్' కావ్యములో - రెండవ గీతమును రచించిన 'కీరన్తైయార్' అను పేరు గల కవి - బలరాముని, కృష్ణుని ఒకే రూపముగ భావించుచు, అందునను - కృష్ణుఁడు (కణ్ణన్) విశేషించి, పరిపూర్ణావతారముతో విరాజిల్లువాఁడని సంభావించుచు, ఆ కృష్ణ భగవానుని - అనన్యమైన భక్తిభావముతో స్తోత్రము గావించియున్నాఁడు[37]. తనకు తిరుమాల - నిరంతరము తరుణ వయస్కుఁడుగా, జ్ఞాన స్వరూపుడుగా గోచరించుచుండునని స్పష్టీకరించినాఁడు[38]. లోకరక్షణార్థమై, భూమండలములో వివిధ అవతారములు ధరించిన తిరుమాలయొక్క కల్యాణ గుణములను తన గీతమున విశేషముగా కీర్తించినాఁడు.

'నల్లెళుదియార్' అను నొక కవి - తిరుమాలను పరబ్రహ్మముగా భావించుచు, సర్వ వ్యాపకుఁడైన అట్టి తిరుమాల మహిమలను తన కావ్యమున మనోహరముగా వర్ణించినాఁడు.[39] మఱియొక కవి - 'ఇరుందైయూర్' అను క్షేత్రమునఁ గల తిరుమాలను ఒక గీతమున అభివర్ణించినాఁడు. ఆ క్షేత్రము - వేగావతీ తీరమునందు సుప్రసిద్ధముగాఁ గల 'అళగర్ కోయిల్' అని, విద్వాంసుల అభిప్రాయము.[40]

'కలిత్తొకై' అను కావ్యములో - బాల కృష్ణుని లీల లన్నియు వర్ణింపఁబడియున్నవి. ఇందు - కృష్ణుని ప్రాణములను హరించు నిమిత్తమై, కంసునిచే నియుక్తమైన 'కేశి' అను అశ్వరూపము ధరించిన రాక్షసునకు సంబంధించిన వృత్తాంత మంతయు సవిస్తరముగా నున్నది. ఈ 'కేశి'ని సంహరించిన కృష్ణుఁడు - ఏతత్కావ్య కర్త యగు 'నల్లినుత్తనార్' అను కవిచే, విశేషముగా కీర్తింపఁబడినాఁడు.[41] అదియునుగాక, తనను హృదయపూర్వకముగా శరణించిన ద్రౌపదిని కరుణించి, ఆమెయొక్క మానవీత్వమును రక్షించి, దుర్మార్గ గాములగు దుశ్శాసనాదుల గర్వము నణంచిన కృష్ణుని ప్రభావము సైతము - ఇందు పలు విధములుగా ప్రశంసింపఁబడినది.[42] మఱియు - సమస్త విశ్వమును మూఁడు అడుగులలో నాక్రమించిన త్రివిక్రమావతార వృత్తాంతముకూడ ఇందు అభివర్ణింపఁబడినది. ఈ 'కలిత్తొకై' కావ్యమునందే - పరిశుద్ధములైన కాషాయ వస్త్రములు ధరించి, పవిత్రములైన అంతఃకరణములు కలిగి, ఆదర్శప్రాయమైన ప్రవృత్తితో - నివృత్తి

37. పరి పాడల్ 2–20–23
38. ,, 2–43–49
39. ,, 3–18–28.
40. తమిళముమ్–వైష్ణవముమ్: ఎం. రాధాకృష్ణపిళ్లై, 20–వ పుట.
41. ముల్లైకలి–103, 50–53.
42. ,, 1–81–120.

మార్గమున, వైరాగ్య ప్రయుక్తములైన జీవితములను పయనింపఁజేయు వైష్ణవ సంన్యాసుల మహత్త్వ వర్ణింపఁబడి యున్నది. ఆ మహనీయులు సర్వసామాన్యముగా - 'భగవర్' అనియు, 'ముక్కోల్ భగవర్' అనియు వ్యవహరింపఁబడుచుండెడివారఁట! తమిళ భాషలో 'ముక్కోల్' అనఁగా - 'త్రిదండము' అని యర్థము. కావున, ఈ 'ముక్కోల్' శబ్దమే - కాలక్రమమున 'ముక్కోర్' అను రూపాంతరమును పొందియుండవచ్చును. దీనినిఁబట్టి, ఆ వైష్ణవ సంన్యాసులుకూడ, ఈనాఁటి వైష్ణవ సంన్యాసులకువలెనే, త్రిదండములను ధరించుచుండెడివారని స్పష్టమగుచున్నది.[43] ప్రభువులు మొదలుకొని, సామాన్య ప్రజలవఱకు ఎల్లరును ఆ మహనీయులయందు అత్యంతము పూజ్యభావముగలవారలై, ధార్మికరంగమున వారొసంగు సలహాలను శిరసా వహించి, పాటించుచుండెడివారఁట! ఆ కాలమున రాజాధిరాజులుకూడ తిరుమాల(వైష్ణవ)ధర్మమును సమాశ్రయించి, అట్టి సనాతన ధర్మవ్యాప్తికై, బహుముఖములుగా కృషిజేయుచుండెడివారని, 'కలిత్తొకై' అను కావ్యమువలననే వ్యక్తమగుచున్నది.

సంఘకాలమునందు వెలువడిన కావ్య సంపుటములలో 'పదు పాట్టు' అనునది రెండవది. ఇది - పది ఖండ కావ్యముల సంపుటము. ఇందలి మొదటి కావ్యము ఒకానొక ప్రాచీన కవిచే రచింపఁబడినట్లు తెలియవచ్చుచున్నది. ఈ కావ్యసంపుటమునఁగల 'పాణాట్రుపడై' అను మఱి యొక కావ్యమును రచించిన కవి - తనకు ఆశ్రయ మొసంగిన తిరుమాల వంశమునందే తాను జన్మించినట్లు విశదీకరించినాఁడు.[44] ఈ కావ్యములో కవి - కాంచీపురమును వర్ణించు సందర్భమున, కాంచీపట్టణము - బ్రహ్మను ధరించిన తిరుమాలయొక్క నాభినుండి వెలువడిన కమలమువలె అతి పురాతనమైనదనియు, మహిమాన్వితమైనదనియు అభివర్ణించెను. అదియునుఁగాక, ఆ కాంచీపురమునకు సమీపమున - 'తిరువేహా' అను తావులో, ఒక తిరుమాల కోవెల కలదనియు కవి ఉల్లేఖించియున్నాఁడు.

'ముల్లై పాట్టు' (వన గీతము) అను కావ్యమును రచించిన 'నంపూదనార్' అను కవి-వామనావతారమును వర్ణించుచు, తిరుమాల-భువన సుందరమూర్తి యని కీర్తించుచు, అతని సర్వ వ్యాపకత్వమును ప్రస్తుతించెను. ఈ కావ్యము - 'ముల్లై'

43. ఇట్టి త్రిదండ సంన్యాసులే 'జీయరులు' అని వ్యవహరింపఁబడుచున్నారు.

44. పెరున పాణాట్రుపడై : 29—31.

ప్రదేశమునకు అధిదేవత యగు 'మాయోన్' అనఁబడు తిరుమాలను స్తుతించుట తోడనే ఆరంభమైనది. బలిచక్రవర్తిని మూఁడు అడుగుల ప్రదేశమును అడిగి, ముల్లోకముల నాక్రమించిన వామనుని వృత్తాంతము - ఆకాలమున లోకప్రియముగా నుండెడిదని, ఈ కావ్యమువలన తెలియుచున్నది. బలిచక్రవర్తికిఁ గల గర్వము నంతయు భంగము గావించిన తిరుమాల మహిమను కీర్తించు నిమిత్తమై మధురలో - 'ఓణ్' అను పేర, ఒక ఉత్సవమును మహా వైభవముగా జరుపుచుండుట పరిపాటిగాఁ గలదని, ఈ కావ్యమున విశదీకరింపఁబడియున్నది.

సంఘ కాలములో వెలువడిన మూఁడవ కావ్య సంపుటము - 'పదినేణ కీళ కణవమ్' అనునది. ఇందు - పదునెనిమిది ఖండ కావ్యము లున్నవని మున్నే సూచింపఁబడినది. ఈ కావ్యము లన్నింటిలో - విశ్వ విఖ్యాతి గాంచిన 'తిరువళ్ళువర్' మహాకవి విరచిత మగు 'తిరుక్కుఱళ్' అనునది ప్రముఖస్థాన మాక్రమించియున్నది. ఈ కావ్య రచయిత 'అసలు' ఏ మతమునకుఁ జెందినవాఁడై యున్నను - కావ్యమును రచించు తరుణమున మాత్రము తిరుమాలను తన దృక్పథములో నుంచుకొని యుండె ననుట నిర్వివాదాంశము. ఏల యన, ఈ కావ్యములో 'తిరువళ్ళువర్' - తిరుమాలకు సంబంధించిన కల్యాణ గుణములను విశేషముగా కీర్తించుటే గాక, భగవద్గీతలోఁ గల తాత్త్విక విషయములనన్నింటిని, వివేచనాపూర్వముగ గ్రహించి, తత్సారాంశమును నైతము తన కావ్యమున పొందుపఱచియున్నాఁడు. అది యునుఁగాక - 'అడియళందాన్'[45] (లోకమును ప్రవర్తింపఁజేయు), 'తామరైకణ్ణన్'[46] (కమల దళ లోచనుఁ డగు కృష్ణుఁడు) అను రెండు ప్రయోగములను కవి తన కావ్యమున ప్రయోగించియుండుటనుబట్టియు,- ఆ కాలమున లోకములో ప్రచలిత మగుచున్న తిరుమాల తత్త్వము - 'తిరువళ్ళువర్' మహాకవిని విశేషముగ నాకర్షించెనని మనము సులభముగా గ్రహింపవచ్చును.

'పదినేణ కీళ కణవమ్' అను కావ్య సంపుటమునందే 'తిరు కడుక్కుమ్' అను శీర్షికతో నొక ఖండ కావ్య మున్నది. ఇందు-తిరుమాలకు సంబంధించిన వివిధ లీలలు మొదలుకొని, వామన వృత్తాంతమును గలుపుకొని, శకటాసురుని సంహరించిన కృష్ణావతారము వఱకును అనేక ఘట్టములు అభివర్ణింపఁబడియున్నవి. ఇందుఁగల మంగళాచరణమునుఁబట్టి, ఈ కావ్య రచయిత యగు 'నల్లాదనార్' అను నతఁడు- వైష్ణవుఁ డనియే నొక్కి వక్కాణింపవచ్చును.

---

45. తిరుక్కుఱళ్ – దోహా 610.

46. ,, ,, 1103.

'నాన్మణి కడిక్కై' అను ఖండ కావ్య మొకటి - పై కావ్య సంపుటమునందే సంకలితమై యున్నది. ఈ ఖండ కావ్యము-'విళంబీ నాగనార్' అను కవిచే రచింపఁబడినది. ఇతఁడుకూడ, వైష్ణవుఁ డనియే మనము భావింపవచ్చును. ఈతని కావ్యములో - ప్రారంభమున రెండు పద్యము లున్నవి. ఇందలి మొదటి పద్యములో - 'మాయోన్' (కణ్ణన్) ప్రస్తుతింపఁబడి యున్నాఁడు. చంద్రుఁడు- 'మాయోన్' ముఖ మండలమువలె నుండెననియు, కిరణసహితుఁడైన సూర్యుఁడు - తిరుమాల యొక్క నయనములవలె నుండెననియు, 'పూవై' (నల్ల అవిసి చెట్టునందు వికసించిన) పుష్పము - ఆతని శరీర వర్ణమును తలపింపఁజేయుచుండె ననియు, కవి - ఉపమాన వస్తువును ఉపమేయవస్తువుకంటెను శ్రేష్ఠమైనదానినిగా వర్ణించెను[47]. ఇట్టి వర్ణనమునే వ్యతిరేకాలంకారమని, ఆలంకారికులు సంకేతించియున్నారు. మంగళాచరణమునందలి రెండవ పద్యములో-'కణ్ణన్' లీలలు కొన్ని వర్ణింపఁబడియున్నవి.

'ఇనియదు నార్పదు' అను కావ్యమును రచించిన 'పూదం చెందనార్' అను పేరు గల కవియు వైష్ణవుఁ డనియే విద్వాంసుల అభిప్రాయము. ఈ కవి - తన కావ్యములో, కృష్ణ లీలలను మనోహరముగా వర్ణించియున్నాఁడు.

సంఘోత్తర కాలములో 3,4 శతాబ్దములందు - అయిదు ఉత్తమ కావ్యములు వెలువడినవి. అవి - శిలప్పధికారమ్, మణిమేఘలై, జీవకచింతామణి, వళయాపతి, కుండలకేశి అను పేర్లతో సుప్రసిద్ధములై యున్నవి. ఈ మహా కావ్యములే గాక, ఆ కాలమున ఉత్తమశ్రేణికిఁ జెందిన అయిదు లఘు కావ్యములుకూడ వెలువడినవి. ఇవి-నీలకేశీ, చూడామణి, యశోదర కావ్యమ్, నాగ కుమార కావ్యమ్, ఉదయణ కదై అను పేరులు గలవి.

'ఇళంగో' అను పేరుగల కవిచే - 'శిలప్పధికారమ్' (నూపుర కావ్యము) రచింపఁబడినది. ఈ కవి సహజముగా బౌద్ధ ముని యయ్యును - తన కాలమునఁ గల వివిధ ప్రసిద్ధ మతములను సైతము శిలప్పధికారమునందు ప్రస్తావించియున్నాఁడు. ఈ సందర్భమున నితఁడు తిరుమాల ధర్మమును విస్తారముగ ప్రశంసించి యుండుట-గమనావశ్యకమైన యంశము. ఆయరులు (గొల్లలు) కృష్ణుని ప్రార్థించుచు - 'కురవై' (రాచక్రీడ) అను నృత్యము చేసినట్లు ఈ కావ్యమున అభివర్ణింపఁబడి యున్నది. ఇట్టి సన్నివేశమును సర్వ సామాన్యముగ - 'ఆయచియర్ కురవై'

47. 'తిరుకోడల్' ( Vol. III, Issue 4 )లో – తిరుమాల్ వళిపాడు' అను శీర్షిక గల వ్యాసము. వ్యాసకర్త – శ్రీ.పి.శ్రీ. ఆచార్య.

అని యందురు. ఈ శీర్షికతో వివిధ నృత్యములు శిలప్పధికారములో విశేషముగా వర్ణింపఁబడియున్నవి. వీనిలో - 'కురవై కూత్తు' అను నృత్యమే తదితర నృత్యము లన్నింటి కంటెను ముఖ్యమైనది.[48] ఈ నృత్యము లన్నియు - ఆయర (గొల్ల) కులమునందే ఆచరణమునం దున్నట్లు, ఈ కావ్యమున వ్యక్తము గావింపఁబడినది. విఘ్నములు కలుగకుండుటకును, కష్టములు వాటిల్లకుండుటకును ఆయరులు (గొల్లలు) తమ ఇష్టదైవమగు కృష్ణుని ప్రార్థించి, 'కురవై కూత్తు' నృత్యము చేయుచుండెడివారఁట ! ఒక్కొక్క సమయమున కృష్ణుఁడుకూడ- 'నప్పిన్నై'[49] అను తన ప్రియురాలిని, అగ్రజుఁడైన బలరాముని తోడ్కొని, నృత్యము చేయు చుండెడివాఁడనియు ఈ కావ్యమునందే సూచింపఁబడియున్నది.

ఇచ్చట ఒక్క విశేషమును మనము ముఖ్యముగా గమనింపవలసియున్నది. ఏమన, కణ్ణన్ పత్నులలో- 'నప్పిన్నై' అను కాంతా లలామకు తమిళ ప్రపంచమున గొప్పప్రాముఖ్య మున్నది. ఈమె - కృష్ణునకు మిక్కిలి ముఖ్యమైన ప్రియురాలు. ఆయర కులోత్పన్నయైన ఈ నప్పిన్న - కొన్ని తావులలో 'పిన్నై' అనియు, మఱికొన్ని సందర్భములలో 'నీళ' యనియు పేర్కొనఁబడియున్నది. కృష్ణుఁడు విష్ణువుయొక్క అవతారముగా అభివర్ణింపఁబడినది. ఏది యెట్లున్నను, ఆ కాలపు తమిళ ప్రజలు - 'కణ్ణన్', 'నప్పిన్నై' అనువారల నిఱువురిని ఆదర్శప్రాయులుగ సంభావించి, వారిని అనుకరించుచుండెడివారని తెలియుచున్నది. ఇందులకు - ఈ క్రింది వృత్తాంతమే ఒక తార్కాణ మనవచ్చును.

పూర్వము ద్వాపర యుగమున 'నాగ్నజిత్తు' అను నొక రాజు - తన ప్రియపుత్రిక యగు 'నాగ్నజితి' అను కన్యను, ఏడు గో వృషభములను వశము గావించు కొనఁగల్గిన వీరపురుషున కొసంగవలెనని నిశ్చయించుకొని, తన నిశ్చితాభిప్రాయమును లోకమునకు విశదపఱచెనఁట ! ఈ వార్తను కృష్ణుఁడు విని, ఎట్లేని ఆ నాగ్నజితిని చేపట్టవలెనని కృతనిశ్చయుఁడై, వెంటనే పయనము సాగించి, నాగ్నజిత్తు కడ కేగి, అతని సంకల్పమును సఫలము గావించి, అతని సుతను తన సతిగా పరిగ్రహించి, సంతసము నందెను. ఈ గాథ- భాగవత పురాణములో విపులముగా నుల్లేఖింపఁబడియే యున్నది. అయినను, ఈ క్రింద పొందుపరుపఁబడు ఒక్క శ్లోకమువలననే పై వృత్తాంతమును చాలవఱకు గ్రహింపవచ్చును.

---

48. ఈ 'కురువై కూత్తు' నృత్యమే — భాగవతమున రాసలీలగా అభివర్ణింపఁబడి యున్నది.

49. రాధను తమిళభాషలో — 'నప్పిన్నై' అని వ్యవహరించుచుండుట పరిపాటి.
"We Venture to conjecture that Nappinnai is the Tamil name of Radha." **V. R. R. Dikshitar,**
"*Krishna in Early Tamil Literature*" *in Indian culture, Vol:* $I_A$ (1837–38), *P.* 269.

"తస్య సత్యాభవత్ కన్యా దేవీ నాగ్నజితీ నృప
న తాం శేకుర్ నృపా వోఢు మజిత్వా సప్త గోవృషాన్."

— (భాగవతము : 10-58-31,32.)

ఇట్లే, తమిళ ప్రదేశమునందుఁ గల కన్యలు-వీరవరులైన యువకులను తమ తమ భర్తలుగా వరించుచుండెడివారఁట ! ఈ విధానమును 'యెరుతబుల్' అనియు-'వృష వశీకరణ' మనియు వ్యవహరించుచుండెడివారు. ఇట్టి స్వయంవరమునకు తమిళ ప్రదేశములో నొక విచిత్ర ప్రక్రియ అమలులో నున్నట్లు, చరిత్ర పరిశోధన మూలమున తెలియవచ్చుచున్నది.

ఒక ఆవరణములో బలిష్ఠములైన కొన్ని ఆఁబోతులను ప్రవేశపెట్టి, వానిని డప్పులు మొదలుగాఁగల వాయిద్యముల చేతను, తదితరములైన వివిధోపాయములచేతను భయపెట్టుచుందురు. భయోత్పాతముఁ జెందిన ఆ యాఁబోతులను వెంటనే వెలుపలకు వెడలనిచ్చుచుండ, ఆ మార్గమున పొంచియున్న వీర యువకులు - తమ బాహు బలము నంతటిని వినియోగించి, ఆ యాఁబోతులను వశము గావించుకొనుటకై అనేక విధములుగా ప్రయత్నించుచుందురు. కాని, అట్టివారిలో కొలఁదిమంది మాత్రమే విజయమును సాధింప, వారి కంఠములలో కన్యలు జయ మాలలను వేసి, వారిని గౌరవ భావముతో తమ తమ భర్తలనుగా పరిగ్రహించుచుండెడివారఁట ! ఇట్టి స్వయంవర విధానము తమిళనాడులో నేఁటికిని అట నట గలదని తెలియవచ్చుచున్నది.[50]

పైఁ బేర్కొనఁబడిన పంచ మహాకావ్యములలో - 'మణి మేఖలై' అనునది రెండవది. ఇది - శీతలై చాత్తనార్ అను కవిచే రచింపఁబడినది. ఈ కావ్యమున బౌద్ధ ధర్మ స్వరూప నిరూపణమే కవికి ముఖ్యోద్దేశమైయున్నను ఇందు సందర్భోచితముగా వైష్ణవ ధర్మ మహాత్వముకూడ ప్రశంసింపఁబడి యున్నది. అదియునుఁ గాక, కృష్ణునకు సంబంధించిన వివిధ గాథలు, కురవై కూత్తు నృత్యము మున్నగునవియును ఇందు అభివర్ణింపఁబడియున్నవి.[51]

---

50. "It seemed in a way a test for a man to be fit husband for a lady. The rearing of bulls and letting them loose with some prize for the capture have become a regular social and popular amusement which persists even to this day in the Tamil Districts." — V. R. R. Dikshitar, '*Indian culture*' *Vol. IV pp.* 270, 271.

51. మణిమేఖలై : 19—65—66

'చూడామణి' అను కావ్యములోఁగల కథా నాయకుని గుణములు - 'కణ్ణన్' కల్యాణ గుణములతో పోల్చబడి యున్నవి. కావున, ఆకాలములో తిరుమాల ధర్మము అధిక ప్రచారమునందే కలదనియు, తమిళ ప్రజలు తిరుమాలకు సంబంధించిన కథలను చదువుచుండెడివారనియు, చదువుచుండగా వినుచుండెడివారనియు ఈ కావ్యమువలన మనము గ్రహింపవచ్చును.

రామాయణగాథను ఇతివృత్తముగా గైకొని, తమిళ భాషలో నొక మహాకావ్యమును రచించి - 'కవి చక్రవర్తి' అను బిరుదమును సముపార్జించిన కంబ మహాకవి (11-వ శతాబ్దము)కంటెను పూర్వమే, సంఘ కాలమున - 'వెణ్బా' అను వృత్తముతో మఱి యొక కవిచే రచింపఁబడిన రామాయణ మహాకావ్యము - తమిళ వాఙ్మయ ప్రపంచమున ప్రసిద్ధి వహించి యుండెనని పండితుల యభిప్రాయము.[52]

క్రీస్తు శకారంభములో వెలువడిన 'అహానానూరు' 'పురనానూరు' అను సంఘకాలీనములైన కావ్యములందును - రామాయణమునకు సంబంధించిన కొన్ని గాథలు అచ్చటచ్చట పొందుపఱుపఁబడి యున్నవి. ఆంజనేయుఁడు లంకాపట్టణమునకు వెళ్ళి వచ్చిన పిమ్మట - సీతాదేవి యొక్క స్థితి గతులను గ్రహించిన శ్రీరాముఁడు - పాండ్యదేశమున దక్షిణ ప్రాంతమునఁగల ఒకానొక విశాల వటవృక్షముకడ, వానర వీరులతో సమావేశ మేర్పఱచి, విషణ్ణ వదనుఁడై, జానకీదేవిని లంకాపురినుండి తోడ్కొనివచ్చు విషయమై చర్చించుచుండె ననియు, ఆ సమయమున - ఆ వటవృక్షముపై విహరించుచున్న విహంగములు కలకలారావములఁ జేయ నారంభింప, కొంత తడవు చర్చను విరమింపవలసివచ్చె ననియు, ఆ పక్షుల కలకలారావములు ఉపశమించిన యనంతరము మఱల ఆ చర్చను కొనసాగించె ననియు - 'అహానానూరు' అను కావ్యములో నొకతావున వర్ణింపఁబడియున్నది.[53]

ఇట్లే - 'పురనానూరు' అను కావ్యమునందును కొన్ని గాథలు కన్పట్టుచుండును. ఒకప్పుడు ఒక రాజు - ఒక కవిరాజును వివిధములైన కొన్ని స్వర్ణాభరణములతో సత్కరించెనఁట! కాని, ఆ కవిరాజుకు ఆ యాభరణముల నెచ్చటెచ్చట - ఏ యే విధముగా ధరింపవలెనో తెలియలేదు. ఈ వృత్తాంతమును కావ్య రచయిత తన కావ్యమున ప్రస్తావించుచు, అందుల కుదాహరణముగా - రామాయణగాథ

52. 'కంబన్ కణ్డ తమిళకమ్' — స్వామి చిదంబనార్, 20-వ పుట.

53. అహానానూరు — 70.

నొకదానిని బేర్కొనియున్నాఁడు. ఆ ఉదాహరణ మెద్ది యన, రావణునిచే గొనిపోఁబడుచున్న సీతాదేవి - తన నగల నన్నింటిని మూట గట్టి, దానిని వానరులు సంచరించు తావునఁ బడవైచెనఁట! అపు డా మూటను వానరులు విప్పి, అందలి యాభరణములను ధరింపవలెనని తలంచిరి. కాని, ఏ యాభరణములను ఎచట ఏ రీతిగా ధరింపవలెనో తెలియక, తిక మక పడసాగిరి. అట్లే, ఈ కవిరాజు కూడ ప్రభువుచే బహుమానముగా నొసంగఁబడిన ఆ యాభరణములను ధరింప వలసిన విధానము తెలియక తిక మక పడెనఁట![54]

ఇట్టి ప్రమాణములనుబట్టి, తమిళ ప్రదేశములో - సంఘ కాలమునాఁటికే, తిరుమాల (విష్ణువు)కు సంబంధించిన అవతార కథలు బహుళ ప్రచారములో నుండెడి వనియు, తమిళ ప్రజలలో వైష్ణవ ధర్మము వ్యాపించి యున్న దనియు తెలియవచ్చు చున్నది.

## ఆలయములలో తిరుమాలార్చన

తమిళ ప్రదేశమునకు సంబంధించిన దేవాలయ చరిత్ర - అతిప్రాచీనమైనది.[55] ఆ దేశమునఁ గల దేవాలయములలో - దేవతా విగ్రహములు సుందర సుశోభిత ములై, నయనానందకరములై, భక్త కల్పద్రుమములై విరాజిల్లుచున్నట్లును, ఆ దేవతామూర్తులకు నిర్ణీతమైన ఒకా నొక ప్రణాళిక ననుసరించి, ఆరాధనాదులు జరుగుచున్నట్లును, సంఘ సాహిత్యములో స్పష్టీకరింపఁబడియున్నది. అందునను - తిరువరంగమ్ (శ్రీరంగము), తిరువేంగడమ్ (తిరుమల), తిరుపతి, తిరుమాలిరుంశోలై, తిరు క్కురుగూరు, తిరు క్కురుంగుడి, తిరు క్కణ్ణపురమ్ మున్నగు దివ్యక్షేత్రము లలోఁ గల తిరుమాల కోవెలలకు సంబంధించిన వృత్తాంతములు విస్తారముగ పేర్కొనఁబడియుండుటేగాక, ఆ యా క్షేత్రములందు వివిధ రూపములతో విరా జిల్లు తిరుమాలకు - నిత్యపూజలు, ఉత్సవములు మహావైభవముగా జరుగుచున్న ట్లును విశదీకరింపఁబడియున్నది.

తిరువరంగ(శ్రీరంగ)క్షేత్రమునఁ గల కోవెలలో వేంచేసియున్న తిరుమాల (శ్రీరంగనాయకస్వామి) - ఆదిశేషునిపై పవళించి, నీలమేఘ వర్ణము వలె విరాజిల్లుచున్నట్లు - శిలప్పధికారమునందు వర్ణింపఁబడియున్నది.[56] ఈ గ్రంథము

54. పురనానూరు – 378.
55. 'Origin of South Indian Temple' — Dr. Venkatramaiah.
56. శిలప్పధికారమ్ : 2, 35—40.

నందే మఱి యొక తావున, తిరువేంగడము(తిరుమల)లో - అర్చా రూపమున దర్శన మిచ్చుచున్న తిరుమాల(శ్రీవేంకటేశ్వరస్వామి) - కర కమలములలో శంఖ చక్రములను ధరించినట్లును వర్ణింపఁబడియున్నది.[57]

'పరిపాడల్' అను కావ్యములో - 'తిరుమాలిరుం శోలై' అను క్షేత్రమునఁ గల ఆలయములో వేంచేసియున్న కమల దళ లోచనుఁడును, శ్యామ సుందర విగ్రహుఁడు నగు తిరుమాల - మానవుల దుఃఖములను దూర దూరము చేయఁ గలవాఁడని వర్ణింపఁబడినది.[58] 'పెరుం పాణా ట్టరుపడై' అను కావ్యములో - కాంచీపురమునకు సమీపమునఁ గల 'తిరు వేహా' అను క్షేత్రమున విలసిల్లు తిరుమాల కోవెల అభివర్ణింపఁబడి యున్నది.[59] ఇందువలన, సంఘ కాలములో - నప్పిన్న సహితుఁడైన కణ్ణన్, బలరాముఁడు తమిళప్రజలచే విశేషముగా పూజింపఁబడుచున్నట్లును, ఈ ముప్వురును గల ఆలయ మొకటి మధురలో నున్నట్లును, అది - 'వెళ్ళైనగర్ కొట్టమ్' అని వ్యవహరింపఁబడుచున్నట్లును తెలియవచ్చుచున్నది.[60]

సంఘ కాలపు ఉత్తరార్ధమునందును, సంఘోత్తరకాలమునందును తమిళ ప్రదేశమునఁ గల కొన్ని తిరుమాల కోవెలలలో (విష్ణ్వాలయములలో) - శ్రీ పాంచరాత్రాగమ శాస్త్రము ననుసరించియు, మఱి కొన్ని ఆలయములలో వైఖానసాగమశాస్త్రము ననుసరించియు అర్చనాదులు జరుగుచున్నట్లు - 'శిలప్పధికారమ్' 'పరిపాడల్' అను కావ్యముల మూలముననే తెలియుచున్నది. ఆ కాలమునందును తిరుమాల కోవెల ప్రాంగణమున, అభిముఖముగాఁ గల ధ్వజ స్తంభమునందు - 'పెరియ తిరుమొడి' (గరుడాళ్వారు) వేంచేసియున్నట్లు సంఘ సాహిత్యములో వర్ణింపఁబడియున్నది. కావున, సంఘ కాలములో - తమిళ ప్రదేశమునఁ గల విష్ణ్వాలయములందు, అర్చనాది కార్య కలాపములు యథా విధిగా జరుగుచుండెడివనియు విశేషోత్సవములలో తమిళప్రజలు మిక్కిలి ఉత్సాహముతో - భక్తి విశ్వాసములతో పాల్గొనుచుండెడివా రనియు మనము సంభావింపవచ్చును.

---

57. శిల్పధికారమ్ : 2, 41–45.

58. పరిపాడల్ — 15.

59. పెరుంబాణాట్టరుపడై : 371 — 374.

60. శిలప్పధికారమ్ : 5, 171 — 172.

## ఆళ్వారులు - భక్తి ప్రచారము

దక్షిణ భారతమున, వివిధ ప్రదేశములలో - వివిధ సమయములందు - ఆళ్వారులు పన్నిద్దఱు దైవాంశ సంభూతులై, సర్వ వేద సారమును తమ ద్రావిడ దివ్య ప్రబంధములలో ప్రసరింపఁజేసి, అందు - భక్తి వైశిష్ట్యమును విస్పష్టముగా వ్యక్తము గావించి, భక్తి పదవి నధిష్ఠించుటకు సర్వులును సమానాధికారులే యని అనేక విధములుగా నిరూపించి, భక్తి సిద్ధాంత స్థాపనమున అగ్రగణ్యులుగా విఖ్యాతి నార్జించిరి.[61] తాము రచించిన దివ్య ప్రబంధముల మూలమున తమిళ భాషకు పవిత్రత చేకూర్చి, తమిళ ప్రదేశమునకు నూతన శోభను సంతరింపఁజేసిరి. తమ యుగమున తమిళ ప్రజలలోఁ గల ప్రేమ భావమును భగవంతుని వైపుకు మఱల్చి, వారిని భక్తి తత్పరుల గావించి, భగవంతునకును - భక్తులకును నడుమ, తాము పురుషకారభూతులుగా విరాజిల్లిరి.

మఱియును - ఆ యాళ్వారులు తమ యుగమునఁ గల స్థితిగతులను బాగుగా గమనించి, త త్కాలమున లోకములో అలముకొనియున్న జైన బౌద్ధాది అవైదికమతముల బారినుండి ప్రజలను పరిరక్షించి, దేశమం దంతటను భక్తిమయ మైన వాతావరణమును సృజించి, సనాతన ధర్మమును పునరుజ్జీవింపఁజేసిరి.

మహనీయులైన ఆ పన్నిద్దఱాళ్వారులచే రచింపఁబడిన పాశురములు మిక్కిలి రసవత్తరములై రాణించుటచే - అవి పఠితలను, శ్రోతలను ఉఱ్ఱూత లూగించు టే గాక, తమిళ వాఙ్మయ మహోదధినుండి వెలువడిన ఆ మధుర గీతములు - భారతీయుల హృదయ క్షేత్రములను పరిప్లావితముల గావించి, బ్రహ్మానందమున నోలలాడించివైచినవి. కావున, ఆళ్వారుల ద్రావిడ దివ్యప్రబంధములలోఁ గల ప్రబోధములను, అట్టి ప్రబోధములవలనఁ గలుగు ప్రయోజనములను ముముక్షువులు గ్రహింతురు గావుత !

" ధర్మం భజస్వ సతతం త్యజ లోకధర్మాన్
సేవస్వ సాధుపురుషాన్ జహి కామతృష్ణామ్
అన్యస్య దోష గుణచింతన మాశు ముక్త్వా
సేవా కథారస మహో నితరాం పిబ త్వమ్. "

---

61. "Alwars are the first people who gave a new shape to Bhakti School, making simple, designed not for serving the purpose of worship by the eleit but, subserve the similar ends for the quite Ordinary folk."

— *History of Tirupati, Vol–I.* **pp. 73, 74.**

**Dr. S. Krishnaswami Ayyangar.**

★

# ఆళ్వారులు - భక్తివాఙ్మయము

'వైయాకరణ పంచానన - విద్వత్కవి సార్వభౌమ - ఆగమాచార్య - పండిత'

శ్రీమాన్ రొంపిచర్ల పార్థసారధి భట్టాచార్యులు

## భూమిక

"పరం బ్రహ్మ పరంధామ యోఽసౌ బ్రహ్మ తథాపరమ్
త మారాధ్య హరిం యాంతి ముక్తిమ ప్యతి దుర్లభామ్."

— (విష్ణు పురాణము: 1–11–46.)

శ్రీహరి నాశ్రయించి, అనన్య భక్తితో నారాధించి, ప్రపన్నులై విరాజిల్లువారు - బ్రహ్మాదులకుగూడ నలభ్యమగు పరమ పదమును పొందగలరని విష్ణు పురాణము విశదీకరించిన విధముగా - శ్రీమన్నారాయణ చరణారవిందముల నాశ్రయించి, తరించినవా రెందఱో కలరు. అట్టివారిలో - ఆళ్వారులు ముఖ్యముగా పేర్కొనఁదగినవారు. వారి యవతార వైభవము, భక్తి వాఙ్మయము పరంపరాగతమైన శ్రీవైష్ణవ సంప్రదాయమును మిక్కిలి సముల్లసింపఁజేసినవి. అట్లు సముల్లసితమైన శ్రీవైష్ణవ సంప్రదాయము, అనంతర శతాబ్దములలో నవతరించిన ఆచార్యులకు ఆలంబమై, వారి పవిత్రాశయముల కెంతయో ప్రాచుర్యమును గల్పించినవి. ఇట్టి ఆచార్య వైభవమును దెలిసికొనుటకు ముందు, ఆళ్వారుల యవతార వైభవమును, భక్తి వాఙ్మయమును అవగాహన మొనరించుకొనుట - అత్యంతము ఆవశ్యకము.

## పరిచయము

"భూతం సర శ్చ మహ దాహ్వయ భట్టనాథ
శ్రీ భక్తిసార కులశేఖర యోగివాహాన్
భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్ర మిశ్రాన్
శ్రీమ త్పరాంకుశ మునిం ప్రణతోఽస్మి నిత్యమ్."

ఇది - ఆళ్వారులను గుఱించిన స్తుతి. ఇందు - పూదత్తాళ్వారు, పొయిగై యాళ్వారు, పేయాళ్వారు, పెరియాళ్వారు. తిరుమళిశైయాళ్వారు, కులశేఖ రాళ్వారు, తిరుప్పాణాళ్వారు, తొండరడిప్పొడి యాళ్వారు, తిరుమంగై యాళ్వారు, నమ్మాళ్వారు అను పదిమంది ఆళ్వారులు కీర్తింపఁబడుచున్నారు. యతీంద్ర మిశ్రు లనఁగా - శ్రీమద్రామానుజులు. వీరిని ఆళ్వారుల ప్రస్తావనలోఁ జేర్చుట - గౌర వార్థమైయున్నది. వీరికి గోష్ఠియందన్వయము లేదు. పన్నిద్దరు (పండ్రెండు మంది) ఆళ్వారు లనునదికూడ, ఒకపక్షము కలదు. ఆ పక్షములో - పైఁ జెప్పిన పదిమంది కాక, 'శ్రీభక్తిసార' యనుచోట, శ్రీ శబ్దముచే - 'ఆండాళ్' అను అర్థము చెప్పి, 'శ్రీమత్పరాంకుశ' యను చోట, శ్రీమత్ శబ్దముచే మధుర కవులను జెప్పి కాని, 'యతీంద్ర మిశ్రాన్' అను చోట, మిశ్ర శబ్దముచే శ్రీరామమిశ్రులను గాని, పండ్రెండు సంఖ్యను సాధింతురు. దివ్య ప్రబంధములకు ప్రథమాశ్రయ మగు 'పెరియ కోవిల్' (శ్రీరంగము) నందు 'అరైయర్లు' శ్రీరంగ నాథునకు 'కట్టియం' చెప్పు నప్పుడు 'పదిన్మర్ పాడుం పెరుమాళ్' (పది మంది ఆళ్వారులు పాడిన దేవుఁడు) అని యనుసంధించుట - మొదటి పక్షమునకు గమకము. నాలాయిర దివ్య ప్రబంధ నిర్మాతలలో - 'ఆండాళ్', 'మధురకవి' ఈ యిరువురును చేర్చబడుట రెండవ పక్షమునకు సాధకము. ఇట్లే - లోక వ్యవహారము ప్రసిద్ధి జెందినది.

పై పండ్రెండు మందియు, వేఱ్వేరుగా నిర్మించిన వేఱ్వేరు ప్రబంధములను సంకలనముఁ జేసి, ఔచిత్యము ననుసరించి పౌర్వాపర్యమును కల్పించిన ప్రాచీనులు - ఆ గ్రంథ సముదాయమును నాలాయిర దివ్యప్రబంధము (నాల్గువేల ద్రావిడ గీతములు గల గ్రంథము) అని వ్యవహరించుచు వచ్చిరి. శ్రీమద్రామానుజులకు ప్రశిష్యులును - కూరత్తాళ్వారుల శిష్యులు నగు 'తిరువరంగత్తముదనార్' రచించిన 'రామానుజ నూత్తందాది' యను మఱియొక ప్రబంధముకూడ కలదు. దీనిని నైతము, నాలాయిర దివ్య ప్రబంధ భాగముగా పరిగణించు పక్ష మొకటి యున్నది.

## నాలాయిర దివ్య ప్రబంధము - తద్వివరణము

**ముదలాయిరము** (మొదటివేయి) : ఇది పది ప్రబంధములలో 947 పాశుర ములు కలిగి, యేడుగురు ఆళ్వారులచే రచింపఁ బడినది. దీని వివరణమిది —

| ప్రబంధసంఖ్య | ప్రబంధనామము | పాశురసంఖ్య | రచయితలు |
|---|---|---|---|
| ౧. | తిరుప్పల్లాండు | 12 | పెరియాళ్వారు |
| ౨. | పెరియాళ్వార్ తిరుమొళి | 461 | ,, |
| ౩. | తిరుప్పావై | 30 | ఆండాళ్ |
| ౪. | నాచ్చియార్ తిరుమొళి | 143 | ,, |
| ౫. | పెరుమాళ్ తిరుమొళి | 105 | కులశేఖరాళ్వార్ |
| ౬. | తిరుచ్చంద విరుత్తమ్ | 120 | తిరుమళిశై యాళ్వార్ |
| ౭. | తిరుమాలై | 45 | తొండరడిప్పొడియాళ్వార్ |
| ౮. | తిరుప్పళ్ళి యెళుచ్చి | 10 | ,, |
| ౯. | అమలనాదిపిరాన్ | 10 | తిరుప్పాణాళ్వార్ |
| ౧౦. | కణ్ణినుణ్ శిరుత్తాంబు | 11 | మధురకవి యాళ్వార్ |

**రెండవ ఆయిరము:** ఇది మూఁడు ప్రబంధములలో 1134 పాశురములు కలిగి, ఒక్క తిరుమంగై యాళ్వారుచే రచింపఁబడినది. దీని వివర మిది —

| | | | |
|---|---|---|---|
| ౧. | తిరుమొళి | 1084 | తిరుమంగై యాళ్వార్ |
| ౨. | తిరుక్కురుందాండగమ్ | 20 | ,, |
| ౩. | తిరునెడుందాండగమ్ | 30 | ,, |

**ఇయర్పా (మూఁడవ వేయి):** పది ప్రబంధములలో - మతభేదముచే 593, 711, 817 పాశురములు కలిగి, ఆరుగురు ఆళ్వారులచే రచింపఁబడినది. దీని **వివరణ** మిది —

| | | | |
|---|---|---|---|
| ౧. | ముదల్ తిరువందాది | 100 | పొయిగై యాళ్వార్ |
| ౨. | రెండాఁ తిరువందాది | 100 | పూదత్తాళ్వార్ |
| ౩. | మూన్ఱాం తిరువందాది | 100 | పే యాళ్వార్ |
| ౪. | నాన్ముగం తిరువందాది | 96 | తిరుమళిశై యాళ్వార్ |
| ౫. | తిరువెళుక్కూత్తిరుక్కై | 1 | తిరుమంగై యాళ్వార్ |
| ౬. | శిరియ తిరుమడల్ | 1. 40, 77½ | ,, |
| ౭. | పెరియ తిరుమడల్ | 1, 80, 148½ | ,, |
| ౮. | తిరువిరుత్తమ్ | 180 | నమ్మాళ్వార్ |
| ౯. | పెరియ తిరువందాది | 87 | ,, |
| ౧౦. | తిరువాశిరియమ్ | 7 | ,, |

(రామానుజ నూత్తందాది 108 పాశురములు.)

నాల్గవ వేయి: 'తిరువాయిమొళి' యనుపేర 1102 పాశురములలో నమ్మాళ్వారులచే రచింపఁబడినది. ఇది-'భగవ ద్విషయ' మని విఖ్యాతి గాంచినది.

౧. తిరువాయిమొళి 1102 నమ్మాళ్వార్

పై లెక్క ప్రకారము, నాలాయిరమునందలి అవాంతర ప్రబంధముల సంఖ్య ఇరువది నాలుగు అనునది సంప్రతిపన్న విషయము. కాని, ముందు చెప్పిన రామానుజ నూత్తందాది ప్రబంధమును ఇరువది నాల్గింటిలో నొక్కటిగ వడగలవారు లెక్కించుచు, ముదలాయిరము నందలి తిరుప్పల్లాండు ప్రబంధమును పెరియాళ్వార్ తిరుమొళితో చేర్చి, ఆ రెంటిని ఒకే ప్రబంధముగ భావింతురు. తెన్గలవారు రామానుజ నూత్తందాదిని ఈ యిరువదినాల్గింటిలో చేర్చుటలేదు. 'నాదనుక్కు నాలాయిర మరుళినాన్' అను నమ్మాళ్వారుల బిరుదము ననుసరించి, నాథ మునులనాఁటికే, దివ్య ప్రబంధము నాలాయిర వ్యవహారము కలిగిన దగుటచే, నాథమునుల తరువాతికాలపు దగు 'రామానుజ నూత్తందాది'ని నాలాయిర ప్రబంధ గణనములో చేర్చుట యుక్తము కాదని వీరి మతము. ఇందుకు సాధక ముగ — "కృత్వా విశ్వహితం ప్రబంధ యుగళం శ్రీ భట్టనాథ స్సుధీః" అను దివ్య సూరి చరిత్ర ప్రమాణమును వీరు చెప్పుదురు.

ఇట్లే — నాలాయిర మందలి పాశుర సంఖ్యయందును అభిప్రాయ భేదము కానవచ్చుచున్నది.

'ఇయర్పా' యందలి 'శిరియ తిరుమడల్' 'పెరియ తిరుమడల్' అను రెండు ప్రబంధములను, ద్రావిడ లక్షణ వేత్తలు ఒక్కొక్క గ్రంథముగ లెక్క చేయుటచే, వారి మత ప్రకారము నాలాయిర గ్రంథసంఖ్య 3776 మాత్రమే అగు చున్నది. నాలాయిర మనునది ప్రాయోవాదమని వా రందురు. వడగలవారు పై రెండు ప్రబంధములలో - 'శిరియ తిరుమడల్'ను నలువది గ్రంథములుగాను, 'పెరియ తిరుమడల్'ను యెనుబది గ్రంథములుగాను విడదీసి, 'రామానుజ నూత్తందాది'ని కలిపి, మొత్తము గ్రంథ సంఖ్యను 4002 గ చెప్పుదురు. తెన్గల వారు - 'శిరియ తిరుమడల్' ను 77½ గ్రంథములుగను - 'పెరియ తిరుమడల్'ను 148½ గ్రంథములుగను విభజించి, మొత్తము సంఖ్యను 4000 లుగ చెప్పుదురు.

"కృతినః కమలావాస కారుణ్యైకాన్తినో భజే
ధత్తే య స్సూక్తి రూపేణ త్రివేదీ సర్వయోగ్యతామ్."
— (దయా శతకము: 3 శ్లో.)

అని ప్రశంసింపఁబడు ఆళ్వారులు, విష్ణు భగవానునియందు ప్రపత్తిని లోకమున వ్యాపింపఁ జేయుటకై -

"యద్య ద్విభూతిమ త్సత్త్వం శ్రీమ దూర్జితమేవ వా
తత్తదేవావ గచ్ఛత్వం మమ తేజోఽంశసంభవమ్."
— (భగవద్గీత: 10-41.)

అనునట్లు - భగవ దంశచే అప్పు డప్పు డవతరించుచు వచ్చిరి.

"తామ్రపర్ణీ నదీ యత్ర కృతమాలా యశస్వినీ
కావేరీ చ మహాభాగా ప్రతీచీ చ సరస్వతీ."

"కలౌ ఖలు భవిష్యన్తి నారాయణ పరాయణాః
క్వచి త్క్వచి న్మహాభాగా ద్రామిడేషు చ భూరిశః."
— (భాగవతము: 11-5-38,-39.)

ఈ మొదలగు పురాణ వచనములకు లక్ష్యము, ఈయాళ్వారులేయని ప్రతీతి.

శ్రీ వైఖానస, పాంచరాత్ర భగవ చ్ఛాస్త్రముల ననుసరించి ప్రతిష్ఠింపఁబడి ఆరాధింపబడెడి భగవదాలయములలో - పుణ్య క్షేత్రములయందలి అర్చామూర్తులను ఈ ఆళ్వారులు ప్రపత్తి జేసి, తాము తరించి, ఇతరులను తరింపఁ జేయుటకై, రసవత్తరములును - గంభీరార్థకములు నగు గీతములను ద్రావిడ భాషలో గానము జేసిరి. ఇట్లు గానము చేయఁబడిన పన్నిద్దరాళ్వారుల నాలాయిర దివ్య ప్రబంధము ఈక్రింది రీతిగా రూపొందినది.

| | గ్రంథకర్త | ప్రబంధసంఖ్య | గ్రంథసంఖ్య | గ్రంథనామము. |
|---|---|---|---|---|
| ౧. | పూదత్తాళ్వార్ | 1 | 100 | ఇయర్పా భాగము. |
| ౨. | పొయిగైయాళ్వార్ | 1 | 100 | ,, |
| ౩. | పేయాళ్వార్ | 1 | 100 | ,, |
| ౪. | పెరియాళ్వార్ | 1 లేక 2 (12+461) | 471 | ,, |
| ౫. | తిరుమళిశైయాళ్వార్ | 2 | 216 | ఇయర్పాముదలాయిర భాగము. |

| | | | |
|---|---|---|---|
| ౬. కులశేఖరాళ్వార్ | 1 | 105 | ముదలాయిర భాగము. |
| ౭. తిరుప్పాణాళ్వార్ | 1 | 10 | ,, |
| ౮. తొండరడిప్పొడియాళ్వార్ | 2 | 55 | ,, |
| ౯. తిరుమంగై ఆళ్వార్ | 6 | 1135, 1255, 1361 తిరు మొళి ఇయర్పా భాగము. | |
| ౧౦. నమ్మాళ్వార్ | 4 | 1296 ఇయర్పా భాగము తిరువాయి మొళి. | |
| ౧౧. ఆండాళ్ | 2 | 173 | ముదలాయిర భాగము. |
| ౧౨. మధుర కవి | 1 | 11 | ,, |
| (తిరువరంగత్త ముదనార్) | 1 | 108 (రామానుజ నూత్తందాది) | |

## నాలాయిర వ్యాఖ్యానములు

ఈ నాలాయిర దివ్య ప్రబంధమునకు పరిపూర్ణములైన వ్యాఖ్యానములు కొలదిగ మాత్రమే కలవు. అట్టి వానిలో 'పెరియవాచ్చాం బిళ్లై' వ్రాసిన వ్యాఖ్యానము విశేష ప్రచారములోనున్నది. పెరియాళ్వార్ల తిరుమొళికి మాత్రము 'పెరియవాచ్చాంబిళ్ళ' వ్యాఖ్యానము లభింపలేదు. లుప్తమైన దీనికి మణవాళ మహా మునులు వ్యాఖ్యానము వ్రాసిరి. పెరియవాచ్చాంబిళ్ళ వ్యాఖ్యానమును, వడగల తెంగల సంప్రదాయ లిరువురును ఆదరించిరి. ఇది గాక, 'పెరియ పరకాల జీయర్' అను వడగల జీయ రొకరు రచించిన సంపూర్ణ వ్యాఖ్యాన మింకొకటి కలదు. ఈ రెండు వ్యాఖ్యానములును – 'మణి ప్రవాళము' అనఁగా – సంస్కృత ప్రచురమైన ద్రావిడ భాషలో రచింపఁబడి యున్నవి.

ఆధునికులలో – తెంగల సంప్రదాయులగు శ్రీ ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యులవారును, వడగల సంప్రదాయులగు శ్రీఉత్తమూరు వీరరాఘవాచార్యులవారును వ్రాసిన వ్యాఖ్యానములు కలవు. ఇవియును మణిప్రవాళ రచనలే.

ఆళ్వారులలో – 'ప్రపన్న జన కూటస్థులు' అను గౌరవముచే నమ్మాళ్వారులను, వారి ప్రబంధములలో – 'భగవ ద్విషయము' అను గౌరవముచే తిరువాయిమొళిని, సంప్రదాయజ్ఞులు విశేషముగా కొనియాడెదరు. ఈ కారణమువలన, 'తిరువాయిమొళి'కి సంగ్రహముగను, విస్తారముగను అనేక వ్యాఖ్యానములు వెలువడినవి. అందు – 'తిరుక్కురుగైప్పిరాన్ పిళ్ళాన్' (కురుకేశచంద్ర జలధి)

అనువారు శ్రీ మద్రామానుజుల యాజ్ఞానుసారము 'తిరువాయిమొళి' కి తొలుతగా 'ఆరాయిరప్పడి' వ్యాఖ్యానమును వ్రాసిరి. వీరు-శ్రీ మద్రామానుజులకు సాక్షాత్తుగా శిష్యులు. ఈ వ్యాఖ్యానము శ్రీ విష్ణుపురాణ ప్రక్రియ ననుసరించి, సంఖ్యాతమైనదని ప్రతీతి యున్నది. ఆవల, వేదాంతముని' అనెడి నంజీయర్ ' శ్రీ భాష్యఫక్కి ననుసరించి, 'ఒంబదినాయిరప్పడి' అను వ్యాఖ్యానమును తిరువాయిమొళికిని, కణ్ణినుణ్ శిరుత్తాంబునకును వ్రాసిరి. వారి తర్వాత 'కలివైరిదాసన్' అను నంబిళ్ళ, చాలమంది శిష్యులకు ప్రవచనము చేయఁగా - వారి కాలక్షేపములను శ్రవణగోచర మొనరించుకొనిన 'నడువిల్ తిరువీధిప్పిళ్ళై' సపాదలక్షగను 'పెరియవాచ్చాంబిళ్ళై' శ్రీరామాయణప్రక్రియలో ' ఇరువత్తు నాలాయిరప్పడి' వ్యాఖ్యానమును 'వడక్కుత్తిరువీధి ప్పిళ్ళై' శ్రుత ప్రకాశికాప్రక్రియలో 'ముప్పత్తారాయిరప్పడి' వ్యాఖ్యానమును వ్రాసిరి. నంబిళ్ళై వ్యాఖ్యానము ఒక్క తిరు విరుత్తమునకు మాత్రము లభించుచున్నది. పెరియవాచ్చాంబిళ్ళై కుమారుల నాశ్రయించిన అళగియ మణవాళ జీయరు 'పన్నీరాయిరప్పడి' వ్యాఖ్యానమును, శ్రీ మద్భాగవత ప్రక్రియ ననుసరించి యనంతరము వ్రాసిరి. వీరు - తిరు విరుత్తమును కూడ వ్యాఖ్యానించిరి.

## ఆళ్వారులు — అవతార వైభవము

### ౧. పొయిగై ఆళ్వారులు :

కాంచీ పురమున వేగాసేతు పుష్కరిణియందు, ద్వాపరయుగమున 862901 సంవత్సరములు గతించిన, సిద్ధార్థి సంవత్సర తులా మాసమున, శ్రవణా నక్షత్రముతో గూడిన శుక్లపక్ష అష్టమీ మంగళవార శుభ దినమున, శంఖాంశచే అవతరించిరి. వీరికి కాంచియందలి దేవనాథునియందు భక్తి యధికము.

### ౨. పూదత్తాళ్వారులు :

'మల్లాపురము' అని ప్రాచీన వ్యవహారము గలిగియున్న నేఁటి 'మహాబలిపుర' మందు - పొయిగై యాళ్వారు లవతరించిన మరునాఁడు, ధనిష్ఠా నక్షత్రముతోఁగూడిన నవమీ బుధవాసరమున, గదాంశచే మాధవీ కుసుమమున అవతరించిరి. వీరికి — శ్రీ రంగనాథునియందు ప్రపత్తి యధికము.

### ౩. పేయాళ్వారులు :

'మయూర పురము' అని ప్రాచీన వ్యవహారము కలిగియుండిన నేఁటి మైలాపూరు (మద్రాసు) నందు పూదత్తాళ్వారు లవతరించిన మరునాఁడు శతభిషా నక్షత్రముతో గూడిన దశమీ గురువారమున నందకాంశచే పుష్కరిణియందవతరించిరి.

వీరు మూవురును అయోనిజులు. ద్విజ సంస్కారములు లేకయు-ప్రాకృతము లగు నన్నపానాదులను గ్రహింపక, భగవదనుభవమునే ధారకముగ దేహయాత్ర గడుపుచును చిరకాలము స్వయోగమహిమచే ' అనఁగా - 3,200 సంవత్సరములు భూమిపై జీవించి యుండి, ఆవల సిద్ధి బొందిరి. ఆళ్వారు ఒందఱలో పురాతను లగుటచే వీరలకు ముద లాళ్వారులని వ్యవహారము కల్గినది. వీరు సమకాలికు లగుటయు వీరి రచనలు ఏకావలంబనము లగుటయు కూడ ఈ వ్యవహారమునకు కారణము లైనవి. నమ్మాళ్వారులు వీరలను 'ఓడిత్తిరియుం యోగిగళ్' అని అన్వర్థనామముతో ననుసంధించి వ్యవహరించినట్లు చెప్పుదురు. ఈ మూవురును దేశాటనము సాగించుచు, దైవ యోగముచే ఒకనాఁటి చీఁకటిరాత్రియందు అందఱును 'తిరుకోవలూర్' అను గ్రామము చేరిరి. ధారాపాతముగ వర్షము కురియుచుండఁగా - తల దాఁచుకొనుటకై ఏదైన నొక యాశ్రమమును వెదకుచు, వారు తిరుగ నారంభించి, పోయిగై యాళ్వారు లొకయింటి వాకిట నిలిచి, దీనముగా లోనివారలను బిలిచి తావు నడిగిరి. ఆ గృహము మృకండు ముని యాశ్రమము. అందు మృకండుఁడు తన గృహిణితో నివసించుచుండెను. ఆతఁడు శ్రీకృష్ణ పరమాత్మను గృహార్చయం దారాధించుచుండెను. ఆతఁడు ఆళ్వారుల దీన యాచనమును విని, మన్నించి, తలుపు తెరువఁగా - ఆతఁడు లోనికిఁబోయి, ఇరుకైన నడవలో పరుండెను. ఆ మృకండుఁడు లోనికిఁ బోయెను. ఇంతలో - రెండవవారుకూడ ఆచోటునకె వచ్చి పిలువఁగా - మొదటివారు బదులు చెప్పుచు, ఇరుకైన ఈ చోట ఒక్కరు పండుకొనుటకు మాత్రమే తావు కలదని చెప్పఁగా - రెండవవారు ఆచోట నిరువురు కూర్చుండ వచ్చునే యని యడిగిరి. అంతట తలుపు తెరుఁవగా - లోనికి వచ్చి, ఇరువురును కూర్చుండిరి. ఇంతలో - మూఁడవ వారును అచ్చటికే వచ్చి పిలుచుటయు, లోని యిరువురును ఇరువురు కూర్చుండుటకు మాత్రమే ఇచ్చట తావు కల దని యనఁగా - మూడవవారు ఇరువురు కూర్చొనెడి తావున మూవురు నిలుచుండ వచ్చునే యని యడుగఁగా - తలుపు తెరచినంతట మూవురును ఆ చోటున అతి శ్రమతో నిలుచుండిరి.

తప స్సంపన్నులగు మూవురు భాగవతులు యాదృచ్ఛికముగ నచ్చట చేరుటను పరమాదరముతో కటాక్షించిన మృకండుని యారాధ్య దైవమగు అర్చామూర్తి—ఆ మహానుభావుల పరిష్వంగ సుఖము నభిలషించి, తన రాణులతో గూడి, త్రివిక్రమ రూపియై, వారల నడుమ సాక్షాత్కరించెను. క్రొత్త మనుష్యుల

రాకవలన కలిగిన ఒత్తిడిమాత్రము ఆళ్వారులకు తెలియవచ్చినది కాని, ఆ గాఢాంధకారములో ఆ క్రొత్తగా వచ్చిన వారల రూపము వారలకు కనబడనందున వారలు కలవరపడుచు, తుద కది భగవ స్మాయ యని నిశ్చయించుకొని, తన్మయతతో పూదత్తాళ్వారులు 'వైయందగళియా' అని యారంభించియు, రెండవవారు- 'అన్బేతకళియా' అని యారంభించియు, మూఁడవ వారు- 'తిరుక్కండేన్' అని యారంభించియు వరుసగా మూఁడు వేరువేరు ప్రబంధములను పాడి, భగవానుని సాక్షాత్కారమును ప్రశంసించిరి. ఈ మూఁడు ప్రబంధములే ముదలాయిరమునందలి మూఁడు 'తిరువందాదులు'. వరదుఁడగు భగవానునిఁ జూచి-'ఓ దేవా! మేము ధన్యులము. నీ విప్పుడు మాకు సాక్షాత్కరించిన ఈ చోట నిదే రూపముగ నర్చారూపమున వేంచేసి, తరువాతి తరములవారి ననుగ్రహింపు' మని ప్రార్థించిరి. భగవానుఁ డట్లే నిలిచిపోయెను. ఇంతలో ఈ యలజడిని వినిలోనుండి వచ్చిన మృకండునకును భగవత్సేవాభాగ్యము లభించెను. తదనంతరము ఆళ్వారులును యథాక్రమముగ తమ సంచారమును సాగించిరి.

'తెనుఁగున - 'నడవ' అనుటకు సంస్కృతమున - 'దేహళి' యందురు. దేహళియం దవతరించిన కతమున, ఈ దేవునకు దేహళీశుఁ డనియు వ్యవహారము కల్గినది. అవతార స్వరూపమున త్రివిక్రమ రూపమున నుండుటచే 'త్రివిక్రముఁ' డనియు - 'ఉలగళంద పెరుమాళ్' అనియును ఈ దేవుని బిలుతురు. వేదాంత దేశికుల యనుభవ మిట్లున్నది —

"దీపేన కేన చిదశీత రుచా నిశీథే
స్నేహోపపన్న పరిశుద్ధ గుణార్పితేన
దహ్రావకాశనిబిడం దదృశు ర్భవన్తం
స్వాధ్యాయ యోగ నయనాః శుచయః కవీన్ద్రాః."

"కాసార పూర్వ కవి ముఖ్య విమర్ద జన్మా
పణ్ణా తటేషు సుభగస్య రసో బహూస్తే
త్వ త్పాద పద్మ మధుని త్వ దనన్య భోగ్యే
నూనం సమాశ్రయతి నూతన శర్కరాత్వమ్."

— (దేహళీశ స్తుతి: 6, 7.)

## ౪. తిరుమళిశై యాళ్వారులు :

మహీసారపురము (తిరుమళిశై) అను గ్రామమునందు భృగు వంశజుఁడగు భార్గవులు అను నొక ద్విజోత్తముఁడు కనకాంగియమ్మ అను భార్యతో నివసించు చుండెను. ఆయన చిరకాలము సంతానములేక, సంతాన ప్రాప్తికై యజ్ఞముచేసి, భగవ దనుగ్రహమును పొందెను. కనకాంగియమ్మ గర్భము ధరించి, పండ్రెండు మాసములు గర్భమును మోసి, ఒక మాంస పిండమును కనెను. ఇది ముదలాళ్వారు అవతరించిన ద్వాపరమందలి 857489 విభవ సంవత్సర మకరమాస కృష్ణపక్షమున మఘా నక్షత్రముకూడిన దశమీ గురువాసరము. ఆ భార్గవుఁడు తన దుర్విధికి వగచి, ఆ పిండము నెత్తి, ఒక వస్త్రమునఁ గట్టి, భద్రముగ నొక వేము పొదయందు విడచెను. కాలము గడచి, పండ్రెండు సంవత్సరములు నిండఁగా — సురక్షితముగ నున్న ఆ మాంస పిండమునకు కర చరణా ద్యవయము లేర్పడి, చైతన్యము కలిగి, వృద్ధి జెంద నారంభించెను. ఒకనాఁ డా యడవియందు సంచరించెడి 'తిరువాళన్' అను మేదరి యొకఁడు, అనాథయై పడియున్న ఆ బిడ్డను చూచి కనికరించి, దానినెత్తి తీసికొనిపోయి — 'కుముద వల్లి' అను తన భార్య కిచ్చి, పెంచు మని చెప్పెను. ఆ దంపతులకు బిడ్డలు లేకుండుటచే కూడ వా రెంతయో మక్కువగ బిడ్డను కాపాడుచుండిరి. కాని, ఆ బిడ్డమాత్రము మేదరియింటి అన్నపానములు తాకుటలేదు. ఏకాగ్రతతో భగవ ద్ధ్యానము చేయుచుండెను. ఈ బిడ్డయే — తిరు మళిశై యాళ్వారు లైరి. వీరు సుదర్శనాంశ సంభూతులు. వీరి యోగ్యతను గమ నించిన ఆ గ్రామమందలి వృద్ధ శూద్రుఁ డొకఁడు అప్పు డప్పుడు క్షీరములఁ దెచ్చి, ఆళ్వారుల కిచ్చుచుండెను. ఆళ్వారు లా పాలను త్రాగుచుండి, ఒకనాఁడు అతని యందు కరుణించి, పీతశేషమగు క్షీరమును అతని కిచ్చి, అతనిభార్య కీయవలసిన దని చెప్పిరి. అతఁ డట్లు చేసెను. ఆ పాలను ద్రావిన యా శూద్రభార్య గర్భమును ధరించి, సకాలమున — 'కణి కణ్ణన్' అను పరమ భాగవతోత్తముఁడగు పుత్రుని కనెను. అతఁడు పెరిగి పెద్దయై, ఆళ్వారులయందు భక్తి కలిగి యుండెను. ఒకప్పుడు ఆళ్వారులతో కలసి — 'కణి కణ్ణుఁడు' కాంచీ నగరమునకు పోయి. అచ్చట కాలము గడుపుచుండెను. ఆ యూర — పల్లవరాజుచే యౌవనమం దభి మానింపఁబడి, వార్ధక్యము రాఁగా — త్యజింపఁబడి, దేహయాత్రకై శ్రమపడుచుండెడి దాసి యొక్కతె కలదు. ఆమె — ఆళ్వారులను చూచి, ఆయన భక్తుఁ డని యెఱిఁగి, పరిచర్య చేయ మొదలిడెను. ఇట్లుండ — కొంతకాలమున కా దాసి

యందు కనికరించిన కణికణ్ణుఁడు – 'నీకేమి కావలె' నని యడుగఁగా – ఆమె తన దీన వృత్తమును చెప్పుకొని, తిరిగి రాజాదరమునకు తగినట్లు తనకు యౌవనము కావలెనని యడిగెను. 'అట్లే యగుగాక' యని ఆమె నాతఁ డనుగ్రహింపగా – ఆ యమ నిండు యౌవనముతో నలరారెను. యాదృచ్ఛికముగ నొక్క-నాఁడు పల్లవ ప్రభు వామెను చూచుట తటస్థించగా – రా జామె యందలి మార్పును చూచి, ఆశ్చర్యము చెంది, ఆమెను రావించి, పూర్వమువలె తన యాశ్రయమున నుండు మని కోరెను. ఆమెయు – అతనితో నుండెను. వార్ధక్యమునఁ బడుచున్న రాజు, తన దాసివలె తానును యౌవనము నంది, విషయ సుఖముల ననుభవింపఁగోరి, ఆమె నందుకు మార్గ మడిగెను. ఆమె – తనకు కణికణ్ణుని కృపచే యౌవనము లభించిన చరిత్రము చెప్పఁగా – రాజు విని, సంతసించి, అతని బిలిపించెను. కణికణ్ణుఁడు రా జాస్థానమునకు వచ్చెను రా జాతనిఁ జూచి, తా నాతని బిలిచిన కథను మఱచి, తనపై కవిత్వము చెప్పుమని యాదేశించెను. కణికణ్ణుఁ డట్లు మనుష్యుని బాడుటకు నిరాకరించఁగా–రాజు కోపించి, ఆతనిని మరుసటి ఉదయములోఁగా తన పట్టణము విడచి పోదగునని ఆజ్ఞాపించెను. కణికణ్ణుఁడు అట్లె యని, ఆచార్యులగు ఆళ్వారుల యొద్దకేగి, రాజాజ్ఞను దెలిపి, తన కాజ్ఞనొసంగి పంపుడని వేడెను. భక్తుని వియోగమును సహింపఁ జాలని ఆళ్వారులుకూడ కణికణ్ణుని వెనుకనే ప్రయాణమై, ఆ యూర నున్న వేగాసేతు అనుఅర్చామూర్తినికూడ తమతో రమ్మని యాజ్ఞాపించిరి, వారివెంటనే పట్టణమందలి భాగవతోత్తము లందఱును రాజును నిందించుచు, ఆళ్వారుల ననుసరించి పోసాగిరి. పట్టణము కళా విహీన మయ్యెను. మరునాఁడు రాజు – ఈ అత్యాహితమును తెలిసికొని, తన పరివారముతో ఆళ్వారులు విడిదియున్న ప్రక్క గ్రామమునకు పోయి, అపరాధ క్షమాపణము చేసికొని ప్రార్థించగా, కరుణించి, ఆళ్వారులు తిరిగి అర్చామూర్తి సహితముగ కణికణ్ణునితో కలిసి కంచికి వచ్చిరి. ఆళ్వారుల యభ్యర్థన ననుసరించుటచే – 'వేగాసేతు' పెరుమాళ్ళకు నాఁటనుండి 'యథోక్తకారి' లేక 'శొన్నవణ్ణం శెయ్యుం పెరుమాళ్' అను వ్యవహారము కలిగెను.

"చతురానన సప్తతన్తు గోప్తా
సరితం వేగవతీ మసౌ నిరున్ధన్
పరిపుష్యతి మంగలాని పుంసాం
భగవ ద్భక్తిమతాం యథోక్తకారీ." (వేగాసేతు స్తోత్రమ్ : 5)

ఆళ్వారులు పూర్వ వయసున తిరుమళిశై గ్రామమం దున్నప్పుడు సర్వదా శాస్త్ర పరామర్శము చేయుచుండుట వాడుక. వీ రొకప్పుడు శివ మతమును పరామర్శించుచు, దానియం దాసక్తి కలిగియుండిరి. ఇట్టి స్థితిలో వీరి నను గ్రహించుటకై పే యాళ్వారులు వీరి వద్దకు వచ్చి, వీరితో మాటలాడవలెనని యాశఁజెంది, ధ్యాన నిష్ఠలో నున్న ఆళ్వారులను పలుకరింపఁజాలక, వేచి యుండిరి. ప్రయోజనము లేక పోయెను. ఆళ్వారులు వారితో పలుకలేదు. పే యాళ్వారు లొకయుక్తి నొకదాని పన్ని, ఒక తులసిమొక్కను పెకలించి తెచ్చి, ఆళ్వారుల యెదుట వారు చూచుచుండఁగా ఒక గుంట త్రవ్వి, దానిలో ఆ మొక్కను తల క్రిందుగా ప్రాతి, ఒక చిల్లికుండలో దూరమం దుండి ఉదకమును తెచ్చి, ఆ మొక్క పాదులో పోయుచుండెను. భక్తిసారులు కన్ను దెఱచి, ఆతని చూచి పరిహాసిం చుచు, 'నీకేమి పిచ్చి పట్టినదా? ఎవ్వరైనను తలక్రిందుగా మొక్కను ప్రాతుట కలదా? నీవు తెచ్చు చిల్లికుండలో ఉదకము ఇక్కడకు తెచ్చుటకుముందే జారి పోవునే?' అని ప్రశ్నించెను. పే యాళ్వారు లాతని పరిహాసమునకు సంతసించి— 'నాకు పిచ్చి పట్టలేదు, దేవదేవుఁడగు నారాయణుని విడిచి, నీవు శివ ధ్యాన మొనరించు చున్నావు. మూలమును విడిచి, శాఖ నవలంబించుచున్న నీవే పిచ్చి వాడవు. శివుఁ డాదిగాఁ గల దేవత లిచ్చు ఫలము లీ చిల్లి కుండలోని జలములకు పోలినవి. మోక్షపర్యంత మా ఫలములురావు' అని బదులు చెప్పఁగా — భక్తిసారు లా మాటల యర్థమును గ్రహించి నాఁటినుండి దేవతాంతర చింతనము మాని, పరమ వైష్ణవుఁడై ప్రకాశించెను.

ఒకా నొకప్పుడు శుక్తిసారుఁ డను రసవాది యొకఁడు ఆళ్వారులయొద్ద కేగి తన శక్తిని పొగడుకొనుచు, ఆళ్వారులను తన వశముఁ జేసికొనఁగోరి, ఒక ఇనుప ముక్కను తెచ్చి, దానిని ఓషధీశక్తిచే సువర్ణముగఁ జేసి చూపెను. నిస్పృహులగు ఆళ్వారులు ఆతని నిరిహాసించుచు — తన చెవిలో మలము (గుబిలి) తీసి, ఒక ఇనుప ముక్కపై వేయఁగా — అదియు బంగార మాయెను. భాగవతుల శరీరమందలి మలమునకుసైతము సంకల్ప మాత్రముచే ఏ పదార్థమునైనను ఇచ్చవచ్చినట్లు మార్చవచ్చునని అతనికి నిరూపింపఁగా — అతఁడు లజ్జితుఁడై మరలిపోయెను.

ఒకనాఁడు పార్వతీ పరమేశ్వరు లాకాశమందు విహరించుచు, మహీసార పురక్షేత్రముపైకి రాఁగా—పార్వతి పరమ శివునిఁ జూచి, మహా తపస్సంపన్నుఁడగు ఆళ్వారుల చెంత కేగి, వారి కేదైన వర మీయఁదగునని వేడెను. ఆళ్వారుల చిత్త

వృత్తి నెఱింగిన పరమ శివుఁడు — ఆతఁడు తమ నాదరింపఁడనియు, తా మచ్చటికి పోవుట నిరర్థక మనియు చెప్పినమాట వినక, పార్వతి నిర్బంధించగా - వారిరువురును విమానము దిగి, ఆళ్వారుల యెదుట నిలిచిరి. ఆళ్వారులు వారలను చూచి, తమ రాకకు కారణ మడుగఁగా — వారు ఆళ్వారులను చూచుటకు వచ్చితి మని చెప్పిరి. 'చూచితిరిగదా! ఇఁక పోవచ్చు' నని ఆళ్వారులు బదులు చెప్పఁగా — వారు సంకోచముతో ఆళ్వారుల కేదైన వర మీయగల మని చెప్పిరి. అందు కాళ్వారులు చిరునగవుతో — 'మీ వరములు నా కక్కరలే'దనఁగా — వారు 'యేదైన కోరు' మని నిర్బంధించిరి. అందుకు ఆళ్వారు లిట్లు మూఁడు వరముల నొక్కటి తరువాత నొకటి యడుగ నారంభించిరి. 'నేఁడు మృతిఁజెందెడివానిని రేపటి వఱకు జీవింపఁజేయఁగలవా?' అనునది మొదటి ప్రశ్న. ఆ పని తనది కాదని పరమేశ్వరుఁడు బదులు చెప్పెను. 'ఒకనికి మృత్యువు రాకుండ చేయఁ గలవా?' అనునది రెండవ ప్రశ్న. దీనికిని వెనుకటి ప్రత్యుత్తరమే చెప్పఁబడఁగా — 'మోక్షము నీయఁగలవా?' అని కడపటి ప్రశ్న నడిగెను. మోక్ష ప్రదానార్హత శ్రీమన్నారాయణునదేగాని, తనకు లేదని శివుఁడు బదులు చెప్పెను. భక్తిసారులు స్మిత వదనులై 'నీ వరములు నా కక్కఱలేదు. 'తదా దర్శిత పంథానౌ' అనునట్లు విష్ణుదేవునియాజ్ఞ ననుసరించిన కార్యములను మాత్రమే చేయఁగలిగిన నీవు స్వతంత్రుఁడవు కావు. నే నా విష్ణుదేవు నాశ్రయింతును. నీవు పోవచ్చును!' అని చెప్పఁగా — ఆ దంపతులు మరలిపోయిరి. పరిభూతుఁడగు శివుఁడు ఫాల నేత్రమును తెఱచినంత, ఆళ్వారులు పాద నేత్రమును తెఱచి, తమ తమ పరాక్రమములను చూపిన కథ లిచ్చట నుల్లేఖించుట గ్రంథ విస్తర మగును.

ఒకనాఁడు ఆళ్వారులు - 'పెరుం పులి యూర్' అను గ్రామమునకుఁబోయి, అచ్చట భగవ దాలయమునకు ప్రదక్షిణము చేయుచుండఁగా - అప్పు డచ్చట వేదాధ్యయన మొనర్చుచున్న కొందఱు బ్రాహ్మణులు ఆళ్వారులను జూచి, ఆతఁడు బ్రాహ్మణ సంస్కారములు లేనివాఁడగుటను యెఱిఁగి, ఆతని యెదుట వేదాధ్యయనము చేయ తగదని చెప్పుకొనుచు, అధ్యయనము చెప్పుట మానిరి. ఆళ్వారులు వీథి దాటి పోఁగా-వారలు తాము అధ్యయనము విడచిన చోటు జ్ఞాపకము రాకను, వేదోచ్చారణమే శక్యము కాకను కలవర పడిరి. ఇంతలో - ఆళ్వారు లాయాలయమం దర్చకులు చేయు యాగమునకు బోయి సేవించి, వారివలన అగ్రపూజను స్వీకరించిరి. అచ్చటి ఋత్విక్కులును, సదస్యులును యజమానిపై

కోపించిరి. యజమానుఁడు ఆళ్వారుల మహిమ నెఱింగినవాఁ డగుటచే భగవానుని ప్రార్థింపఁగా - అర్చామూర్తి ఆలయమునందుండి వెలుపలకు వచ్చి, ఆళ్వారులపై శంఖ చక్రములతో సాక్షాత్కరింపఁగా - అందఱును భయపడి, ఆళ్వారులను యజమానుని ప్రశంసించిరి. ఈ సందర్భము వీథిలో కలవరపడుచుండెడి వైదికులకు తెలిసి, వారలకు గల్గిన వేద విస్మృతికికూడ భాగవతాపచారమే కారణమై యుండునని నిశ్చయించి, ఆళ్వారులయొద్ద కేగి, తమ అవమతికి చింతించి, పశ్చాత్తాపమును తెలిపిరి. ఆళ్వారులు చిరు నగవుతో ఆ ప్రక్క బడియున్న ఒక నల్లని వడ్లగింజను చేతిలో దీసికొని, దానిని గోటితో చీల్చి చూపెను. దాని యర్థమును వారెఱిఁగి, తాము అధ్యయనమును విడిచిన చోటు - 'కృష్ణానాం వ్రీహీణాం నఖనిర్భిన్నమ్' అను చోటుగా స్మృతికి దెచ్చుకొని, తమ పాఠమును కొనసాగించిరి. అంత నాళ్వారులు వారలను చూచి, తనకు సకల వేద వేదాంగములు తెలియు ననియు, ద్విజ సంస్కార రహితుఁడగుట ప్రత్యక్షముగా వేదోచ్చారణము చేయరాదనియు చెప్పి, వారల నాశ్వాసపఱచి, తమ త్రోవ బోయిరి. ఇట్టి కథ లింకను అనేకము కలవు. ఆళ్వారు లిట్లు మహిమా సంపన్నులై, రమారమి 2,300 సంవత్సరము లీ భూమియందు జీవించి, కుంభకోణ క్షేత్రమందు సిద్ధిజెందిరి.

౫. పెరియాళ్వారులు :

శ్రీ ధన్వి నవ్య పురము (శ్రీవిల్లిపుత్తూరు) నగరమున కలి 47 వ సంవత్సరమగు క్రోధన వర్ష మిథున మాసమున స్వాతీ నక్షత్రముతోకూడిన శుక్ల ఏకాదశీ భానువార శుభదినమున గరుడాంశచే బ్రాహ్మణ కులమున నవతరించిరి. వీరు - పురశ్శిఖు లగు ద్విజ శ్రేష్ఠులు. తండ్రి ముకుందాచార్యులు. తల్లి - పద్మావతి అమ్మ. అన్న - కులంబియర్. వీరికి నంద వన కైంకర్యమందును, శ్రీ భాగవత - శ్రీ విష్ణు పురాణ పఠనమునందును ప్రపత్తి మెండు. శ్రీవిల్లిపుత్తూరు ఒక చిన్న గ్రామము. దానిని పాండ్య ప్రభువులు పరిపాలించుచుండిరి. ఒకనాటిరాత్రి పాండ్య ప్రభువు చారరూపముతో రాత్రివేళ నగరమందు సంచరించుచు, ఒకవాకిటి అరుఁగుమీద ఇరువురు క్రొత్త మనుష్యులను చూచి, వారలతో కుశల ప్రశ్నల చేయుచుండుటలో వారు —

> " వర్షార్థ మష్టౌ ప్రయతేత మాసాన్ నిశార్ధ మర్థం దివసం యతేత
> వార్ధక్య హేతో ర్వయసా నవేన పరత్ర హేతో రిహ జన్మనా చ. "
>
> — (హితోపదేశము.)

అను శ్లోకమును చెప్పిరి. రాజు తనకు గల్గిన ఐహికములగు సకల సౌభాగ్యములకు పరమ తృప్తిబడసినవాఁ డగుటచే, వారలు చెప్పినట్లు పరలోకమునకై తా నేమియు చేయలేదే యని చింత కలుగఁగా - చకితుఁడై, మరునాఁడు మంత్రుల రావించి, పరలోక హితమునకై తాను చేయఁదలచిన కార్యమునకై, మొదటిదిగ పరదేవతా పారమార్థ్యము నిర్ణయము కావలయునని ఆలోచించి, అట్టి నిర్ణయము నొక విద్వత్సదస్సున తెలియఁగోరి, అట్టి సదస్సును మధురా నగరమందు జరుగునట్లు ఏర్పఱచెను. సదస్సు ఏర్పాటు చేయుటకు రాజ పురోహితు లగు శెల్వ నంబి ప్రధాన ప్రేరకులు. విద్యా శుల్కముకూడ విస్తారముగ సంకల్పింపఁబడెను. నానా దేశములనుండి వాద శూరు లగు పండితులు మధురా నగరము నలంకరించి, ప్రసంగములఁ జేయసాగిరి. భక్త వత్సలుఁడగు వటపత్రశాయి ఆళ్వారులకు అశరీరియై సాక్షాత్కరించి, మధురా నగరమునకుఁబోవ నాజ్ఞాపించెను. *

వైదుష్య పటిమలేని ఆళ్వారులు వెనుకాడఁగా - భగవానుని ప్రేరణముచే అతఁడు మధుర కేగి, వాదించి, వాద గోష్ఠియందు ప్రతి పక్షుల నోడించి, విష్ణువే పరదైవత మని స్థాపించిరి. పాండ్య రాజు సంతసించి, శుల్కము నాళ్వారులకు సమర్పించి, తన పట్టపు టేనుగుపై గజవాహనోత్సవము నమిత వైభవముతో గావించెను. ఆ వైభవమును కటాక్షించుటకు శ్రీ భూ దేవులతో గూడి, గరుడ వాహనారూఢుఁడై శ్రీ మహావిష్ణువు మధురా నగ రాకాశమందు సాక్షాత్కరించుటయు, ఆళ్వారు లా సేవకు తన్మయతఁ జెంది, భగవానునకు దృష్టిదోషము కలుగునను శంకచే 'పల్లాండు' పాడుటయు జరిగినది.

తరువాత - సంతానములేని ఆళ్వారుల నభిమానించి, భూదేవి — ఆండాళ్ రూపముతో తులసీ వనమం దవతరించి, ఆళ్వారుల శిక్షణములో పెరిగి పెద్దదియై, అనన్య చిత్తయై, భగవానుని ప్రేమించి, తాను ధరించిన పుష్పమాలలను భగవానుఁడు ఆశపడునంతటి దశకు భగవానుని చిత్తమును కరగించి, 'ఆముక్త మాల్యద' (శూడిక్కొడుత్త నాచ్చియార్) అనుపేర ప్రసిద్ధయై, రంగనాథుని అర్చామూర్తిని పరిణయ మాడి, భగవత్సాయుజ్యమును పొందుటయు సంభవించెను. ఆండాళ్ పరిణయమైన వెనుక పుత్రీ విరహమునకు క్లేశము చెందిన ఆళ్వారులను రంగనాథుఁడు కరుణించి, యాదేశించగా - ఆళ్వారులు ఆండాళ్ యొక్క విగ్రహమును నిర్మించి, ఆమెతో శ్రీరంగనాథుని యొక్కయు గరుడ భగవానుని యొక్కయు

* స్వప్న మందు సాక్షాత్కరించె ననియు మతాంతరము కలదు.

మూర్తులను సైతము యథా విధిగ ప్రతిష్ఠింపించి, చాల కాల మారాధించుచు వచ్చిరి. దేహావసానమునకు 'తిరుమాలిరుం జోలై' దివ్య క్షేత్రమునకు వచ్చి, 85-వ సంవత్సర ప్రాయమున దేహము చాలించిరి. ఈ గురుతు లన్నియు అచ్చట నేఁడును కలవు.

> "తాత స్తు తే మధుభిదః స్తుతి లేశ వశ్యాత్
> కర్ణామృతైః స్తుతి శతై రనవాప్త పూర్వమ్
> త్వ న్మౌలి గంధ సుభగా ముపహృత్య మాలాం
> లేభే మహత్తర పదానుగుణం ప్రసాదమ్." — (గోదాస్తుతి. 10)

**౬. కులశేఖరాళ్వారులు :**

చేర రాజ్యమున కొల్లి దేశములో - 'తిరువంజిక్కళమ్' అను గ్రామమున అభిషిక్త క్షత్రియ కులమందు పరాభవ సంవత్సరమున కుంభ మాసమున పునర్వసు నక్షత్రముతోగూడిన శుక్ల పక్షమున దశమీ గురువాసర శుభదినమందు కౌస్తుభాంశచే అవతరించిరి. తండ్రి - దృఢవ్రత మహారాజు. అన్న - శేరన్. చోళ చేర పాండ్య దేశములను కులశేఖరుఁడు పాలించెను. రఘురామునియం దీతనికి భక్తి మెండు. బాల్యమునుండియు విరక్తుఁడై, పరమ భాగవతుఁడై యొప్పెను. సంస్కృతమున 'ముకుంద మాల' అను నొక స్తోత్ర గ్రంథమును రచించెను. ఒకప్పుడు శ్రీ రామాయణ మును వినుచున్న ఆళ్వారులు - రాముఁడు పదునాలుగువేల రాక్షసులతో ఏకాకియై యుద్ధమునకు తలపడిన ఘట్టమును వినినంతనే కలవర పడి, తన్మయుఁడై, ఏకాకి యగు రామభద్రునికి సాయముగ తన సేనతో తాను ప్రయాణమై తరలి నట్లును, అతని యప్పటి చిత్త వృత్తిని కనిపెట్టిన పౌరాణికుఁడు బుద్ధిమంతుఁ డగుటవలన, ఒక దూత ముఖమున ఆయుద్ధ మిప్పుడె సమాప్తమై, రాక్షస వధ పూర్తియై, రాముఁడు జయముతో యుద్ధభూమినుండి మరలి రాగా - 'భర్తారం పరిషస్వజే' అనినట్లు జానకి జయార్హుఁడగు రాముని ఆలింగనము చేసికొని గారవించె ననియు చెప్పిన వర్తమానము వినిపింపఁగా - ఆళ్వారు లాశ్వాసము నెంది, యుద్ధ సన్నాహము నుండి విరహితుఁ డాయెననియు - ఐతిహ్యము కలదు.

ఆళ్వారులు వైష్ణవ పక్షపాతియై, ఇతరుల నెవ్వరిని పురస్కరించకుండుటను ఈర్ష్యతో చూచుచు వచ్చుచున్న కొంద అధికారులు ఒకప్పుడు రాజ సౌధము నుండి అమూల్య మగు నొక్క యాభరణమును దొంగిలించి, ఆ చౌర్యము తమ

సౌధమందలి పరిచయముగ సంచరించెడి భాగవతుల వలన జరిగెనని చాడీలు చెప్పిరి. రాజు వారల మోసమును తెలిసికొని, వైష్ణవు లట్టి యతిక్రమము చేయరని తాను శపథము చేసి, శపథమున దృష్టాంత ముఖముగ చూపెను. రాజు ఒక భాండమును తెప్పించి, అం దొక నాగుబామును పెట్టి మూసి, కొన్ని దినములు దాని కాహారము లేకుండ శుష్కింపఁజేసి, అవల ఆ భాండమును సభకు తెప్పించి, తన శపథమును చెప్పుచు, ఆ భాండమున తన చేతి నుంచెను. పాము రాజున కెట్టి యపకృతి చేయకుండఁగా చూచి, సభవా రాశ్చర్య పడిరి. ప్రతి పక్షులును తమ కపటము కార్యకారి కాకుండుట నెఱిఁగి, లజ్జించి, రాజుకు క్షమాపణము చెప్పుకొనిరి.

ఇట్లు 67 సంవత్సరములు రాజ్య మేలి, కులశేఖరులు అంబాసముద్ర సమీప మందలి మన్నారు కోవిల్ గ్రామమందు పరమపదించిరి.

"ఘుష్యతే యస్య నగరే రంగయాత్రా దినే దినే
త మహం శిరసా వందే రాజానం కులశేఖరమ్." — (ముకుంద మాల.)

౭. తిరుప్పాణాళ్వారులు :

శ్రీరంగమునకు సమీపమున 'ఉరైయూర్' గ్రామమందు కలి 120 సంవత్సరములు గడచిన దుర్మతి సంవత్సర వృశ్చిక మాసమున రోహిణీ నక్షత్రము కూడిన కృష్ణపక్ష విదియా బుధవారమందు శ్రీవత్సాంశచే ధాన్యపు కంకియం దవతరించిరి. అయోనిజులై యవతరించి, వివిక్తముగ పడియున్న శిశువు నొక పంచమ కులజుఁడు తెచ్చి పెంచెను. వీరు ద్విజ సంస్కారములు లేకను, ప్రాకృతము లగు నన్నపాదుల స్వీకరించకను భగవన్నామమును పాడుచు, దేహయాత్ర గడుపు చుండిరి. వీరు గాత్రమునను - జంత్రమునను గానము చేయఁగల సమర్థులు. ఒకదిన మున ఆళ్వారులయందు కరుణించి, రంగనాథుఁడు తనకు తీర్థకైంకర్యము చేయు లోకసారంగ ముని యను కైంకర్య పరుని అర్చక ముఖముగ బిలిచి, ఆళ్వారులను తన భుజముపై నెక్కించుకొని, శ్రీరంగమునకు తెమ్మని యాజ్ఞాపించెను. లోక సారంగ ముని ఆళ్వారుల యొద్ద కేగి, భగవ న్నియమనము చెప్పఁగా - ఆళ్వారులు భయముతో పంచముఁడగు తన పాద స్పర్శచే పుణ్యభూమి నపవిత్రము చేయఁజాల నని చెప్పఁగా, భగవ న్నియమనము మేరకు ఆయనను తన భుజముపై నెక్కించుకొని, లోకసారంగ ముని శ్రీరంగమునకు చేర్చెను. రంగనాథుఁ డాళ్వారులం దనుగ్రహించి

తన దివ్య మంగళ విగ్రహమును సాక్షాత్కరింపఁ జేయఁగా - అతఁడు భగవానుని శుభాశ్రయ దివ్య మంగళ విగ్రహమును 'అమలనాది పిరాన్' అని యారంభించి, పది పాశురములలో పాదాది కేశాంతము వర్ణించి పాడ నారంభించి, పదవ దగు 'కొండ ల్వణ్ణనై' పాశురము ననుసంధించుచు భగవానునియందు అంతర్ధానము చెందిరి.

౮. తొండరడిప్పొడియాళ్వారులు :

చోళ దేశ మండలి మండంగుడి గ్రామమున కలి 298 సంవత్సరములు గడచిన ప్రభవ సంవత్సర ధను ర్మాసమున జ్యేష్ఠా నక్షత్రముతో గూడిన కృష్ణపక్ష చతుర్దశీ మంగళవార శుభ దినమున వనమాలాంశచే సామశాఖీయ బ్రాహ్మణ వంశమం దవత రించిరి. తండ్రి వేద విశారదులు. వీరికి బాల్యమందు తలి దండ్రులచే విప్రనారా యణులని నామకరణము చేయఁబడెను. పెరిగి పెద్దయై, ఈయన శ్రీరంగమందు నిత్య నివాసము సంకల్పించుకొని. బ్రహ్మచారియై, భాగవతు లగు శ్రీ వైష్ణవ గృహములలో మధూకరము చేసి జీవించుచు, భగవానునకు తులసీ కైంకర్యము చేయుచుండెను. కావేరికి ఆవలియొడ్డున గల "ఉఱైయూర్" అను గ్రామమున చోళరాజునకు అభిమానమగు దేవ దేవియను నొకదాసి నివసించు చుండెను. ఆ దాసి తన చెలికత్తెలతో నిత్యము శ్రీరంగమునకు వచ్చిపోవు నలవాటు కలదై యుండెను. ఆమె యాతాయాతములలో మార్గమందు ఆళ్వారుల నంద వనము కలదు. ఒకనాఁ డామె నందవనము రాఁగా-దైవ గతిచే వర్షము కురియుచుండెను. ఆళ్వారు లామెను తన యాశ్రమమునకు ఆహ్వానించి, ఉపచరించెను. ఋష్య శృంగునివంటి ఆళ్వారుల ప్రవృత్తిని చూచిన చెలికత్తె, తన నాయకితో ఆళ్వారుల వైరాగ్యమును - ధృతిని ప్రశంసింప మొదలిడెను. అందుకు దేవదేవి పరిహసించి, తా నా బ్రాహ్మణుని తన సామర్థ్యముచే వలపించి, వ్రతభ్రష్టుని చేయఁగలనని ప్రతినఁ జేసి, ప్రయత్నింపసాగెను. ఏదియో యొక వ్యాజము కల్పించుకొని ఆ యమ ప్రతి దినము ఆళ్వారుల యాశ్రమమునకు వచ్చి, తన హావ భావములను ఆళ్వారులపై ప్రదర్శింపసాగెను. ఆళ్వారులకును అనుభవింప వలసిన ప్రారబ్ధ శేష ముండుటచే — దాని ననుభవింపఁ జేయుటకై భగవానుఁడు సంకల్పించిన ఈ విచిత్ర సంఘటనమునకు ఆళ్వారులు క్రమ క్రమముగా లక్ష్యమై, దేవ దేవికి వశుఁడై, తన కైంకర్యమును - అనుష్ఠానమును త్యజించి, ఆమెతో విషయ సుఖముల ననుభవించుచు - సంపూర్ణముగ క్రమముగ శ్రీరంగక్షేత్రమును సైతము

విడచి, ఉరయూరుకే చేరెను. కృత కృత్యయైన దేవ దేవి కొంతకాలమునకు వేశ్యా సహజమగు దౌష్ట్యము నవలంబించి, తనకు శుల్కము నీయక తన యింటికి రారాదని యాతని తరిమి వైచెను. అకించనుఁడగు నాళ్వారులు ద్రవ్యము తెచ్చుటకు శక్తి లేకను – చిరానుభూతమగు నామె స్నేహమును విడచుటకు మనసు రాకను క్లేశపడుచుండెను. ఆ నాఁటితో ఆళ్వారులకు ప్రారబ్ధశేషము నశింపఁగా – శ్రీ రంగనాయకి భగవానునితో భాగవతోత్తములగు నాళ్వారుల ననుగ్రహింప వేడుట తటస్థించెను. భగవానుఁడు సమ్మతించి, ఆ రాత్రి శయనాధివాసమునకు వెనుక తానే ఒక వైష్ణవుని వేషమును ధరించి, సన్నిధిలోని సువర్ణపాత్రము నొకదానిని చేతఁ దీసికొని, దేవ దేవి గృహమునకేఁగి, ఆ పాత్రము నామె కిచ్చి, తాను విప్ర నారాయణుని శిష్యుఁడ ననియు – తన యాచార్యు లీ పాత్రమును శుల్కముగ నీయఁ బంపిరనియు చెప్పి, మరలిపోయెను. సంతోషముతో దేవ దేవి యా రాత్రి ఆళ్వారుల నాదరించెను. మరునాటి ఉదయమున సన్నిధిలో స్వర్ణపాత్ర లేకుండుటను కనిపెట్టిన కైంకర్యపరులు కలవరపడి, వెదకి, ఆ పాత్ర దేవ దేవి యింట నుండుట నెట్లో కనిపెట్టి, ఆమెను నిర్బంధించిరి. ఆమెయు - తన నిరపరాధిత్వమును చెప్పు కొనుచు - ఆళ్వారులచే తన కా పాత్ర మీయఁబడిన చరిత్రము చెప్పెను. రాజభటు లాళ్వారులను బంధించి, నిర్బంధించి, హింసింప సాగిరి. ఇంతలో - భగవానుఁడు అర్చక ముఖమున నావిష్టుఁడై, విప్రనారాయణుని ఏకాంత భక్తిని, ప్రారబ్ధశేషా నుభవమునకై యాతనికిఁ గల్గిన అవాంతర ప్రవృత్తిని, నేఁటి కట్టి ప్రారబ్ధానుభవ పూర్తిని విశదముగ చెప్పి, పాత్రను సన్నిధికి తెప్పించి, ఆళ్వారులను విడిపించెను. నాఁటినుండియు విప్రనారాయణులును – దేవ దేవియు పరమభాగవతులై జీవిత శేషమును గడిపి, కృతార్థులైరి.

ఈయెడ ఆళ్వారులు 'తిరుప్పళ్ళి యెళుచ్చి' యందలి తుది పాశురమున 'ఉన్నడి యార్కాట్పడుత్తాయ్' అను వాక్యముచే తనకు భగవద్భక్తి కలిగి యుండియు దేవ దేవితో ఏకాంత సంగమమువంటి విషమ పరీక్షా సమయములందు ఆ భక్తి తనను కాపాడలేకపోయిన దనియు – భాగవతు లెవ్వరైనను అట్టి సమ యములందు తన కండయై యున్నచో – వారలు తన దుఃస్థితికి పాలుగాకుండ తమ యుపదేశములచే కాపాడియుందురనియు దృఢముగ నమ్మి, భాగవతోప సదనము యొక్క పరమావశ్యకతను – మాహాత్మ్యమును ప్రశంసించిరి.

ఇట్లే, వారి వేరొక ప్రబంధమగు 'తిరుమాలై' యందును 'మేమ్‌పోరుళ్ పోగవిట్టు' 'అడిమైయి ఉక్కడిమై' 'తిరుమటు మార్వనిన్నై' 'వానుళ్వార్' 'పళుదిలా' 'అమరవోర్' అను నారుపాశురము లందును భాగవత శేషత్వము తమకు పరమోద్దేశముగ ననుసంధించిరి. ఇట్లు నూట అయిదు సంవత్సరములు దేహయాత్ర గడిపి, శ్రీరంగమందే పరమపదించిరి.

౯. తిరుమంగై ఆళ్వారులు :

చోళదేశమున 'కురైయలూర్' అనుగ్రామమందు కళ్ళర్ (మ్లేచ్ఛ) కులమున కలి 207 సంవత్సరములు కడచిన నల సంవత్సరమున కార్తీక మాసమందు కృత్తికా నక్షత్రము కూడిన పూర్ణిమా గురువారము శుభ దినమున శార్ఙ్గాంశచే నవతరించిరి. తలిదండ్రులు వీరికి నీలుఁ డని నామకరణము చేసిరి. ఈతఁడు 'తిరు మంగై 'యను నొక చిన్న ప్రదేశమున కధిపతియై యుండి, తంజావూరు ప్రభువులకు సామంతుఁడై యుండెను. ఈతని ధైర్య సాహసములకు మెచ్చిన ప్రభువు ఈతని తమ సేనాధిపతిగఁజేసి, ఆదరించుచు వచ్చిరి. ఇతనికి గుఱ్ఱపు స్వారి చేయుట యందును - కత్తిసాము చేయుట యందును నైపుణ్యా మెక్కువ. కొంతకాలమున కీతఁడు బల గర్వముచే ప్రభువులను సరకు సేయక, వారి కీయవలసిన కప్పమును కట్టక, కాల యాపనము చేయ సాగెను. ప్రభువులు వర్తమానము పంపినను ఆదరించక, రాజ భటులను నిరాకరింపసాగెను. అంతట ఆ బలవంతుని మాయోపాయముచే వశపఱచుకొనఁగోరిన రాజు తానే స్వయముగ నీలుని యొద్దకు స్నేహ భావముతో నున్నట్లు నటించుచు వచ్చి, మాటలాడుచునే - ఆతనిబట్టి ఖైదిగా దీసికొనిపోయి, కారాగృహమున బంధించెను. ఇట్లు నీలునకు కారాగృహవాసము కొంత కాలము గడువఁగా — ఒక రాత్రి కాంచీ వరదుఁడు స్వప్నమందు సాక్షాత్కరించి, నీలు నాశ్వాసపఱచి, కాంచీ నగరమున తన సన్నిధికి సమీపమున నొక్కచోట మహానిధి యొకటి కలదనియు - దానినిఁ గనిపెట్టి త్రవ్వి తెచ్చి, అందులోని ధనముచే రాజు కీయవలసిన పైకమును చెల్లించి, మిగిలిన ద్రవ్యమును సద్వినియోగము చేయు మనియు చెప్పెను. మరునాఁ డాతఁడు స్వప్న వృత్తాంతమును రాజున కెరింగించెను. రాజును - ఆశ్చర్యముతో నీలుని కారాగృహమునుండి విడిపించి, తన భటుల నిచ్చి, ఆతని కాంచికి పంపెను. నీలుఁడు కాంచికి పోయి, వరదుఁడు చెప్పిన గురుతులనుబట్టి నిధికై వెదకెనుగాని, రెండు దినముల వఱకు నిధి యాతని కగుపడక విలపించెను. మఱునాఁడు వరదుఁ డా నిధి యుండు చోటును గురుతు

చూపగా - నీలుఁ డా చోటును త్రవ్వి, అక్కడ లభించిన ద్రవ్యమును తెచ్చి, రాజు నెదుట బెట్టి, స్వీకరింపఁ గోరెను. రాజు సంతసించి, తాను-ముందేల తనకు కప్పము కట్టకుంటివనియు, ఈ ద్రవ్య మిప్పుడు లభించిన తెఱఁగును చెప్పుమని కోరఁగా - అతఁడు వినయముతో - "అయ్యా! లోగడకూడ మీకు కప్పము కట్టకూడదను దురభిప్రాయముతో నేనూరకుండ లేదు. ఆ ద్రవ్య మప్పటి కప్పుడు సాధు సమారాధనమునకై వెచ్చింపఁబడుటచే కట్టలేకపోయితిని. ఈ ద్రవ్యము వరదుని యను గ్రహముచే భూమియందు అయాచితముగ లభించిన" దని చెప్పెను. ఈ చిత్ర చరిత్రము నాకర్ణించిన రాజు సంతసించి, ఆ ద్రవ్యమును త్రిప్పి అతనికే యిచ్చివేసి గౌరవించి పంపెను.

ఆకాలమున "తిరువళ్ళిక్కులం" అను సమీప గ్రామమున నొక పుష్కరిణి యందు అల్లిపుష్పమున నొక యాడుబిడ్డ యవతరించి, ఆ యూర నొక భాగవతునిచే పెంచబడుచుండెను. సంతానములేని ఆ భాగవత దంపతులా బిడ్డను పెంచగా - ఆ యమ పెరుగుచుండెను. ఆమెకు 'కుముద వల్లి' యని తలి దండ్రులు పేరు పెట్టిరి. ఆమె క్రమముగ యువతియై - లోకోత్తర సౌందర్యముతో నలరారు చుండుటను చూచిన నీలుఁ డామెను మోహించి, ఆమెను పరిణయ మాడ గోరి, ఆమె తండ్రికి తన కోర్కెను చెప్పెను. అతఁడు తృప్తి చెందియు - లోకాచారము రీతిని ఆ నిర్ణయము తన కుమార్తెయే చేయవలయు-నని పలికి ఆమెతో కూడ ఈ ప్రస్తావము చేసెను. ఆమెయు - నీలుని శక్తి సామర్థ్యములను పరస్పరము విని యుండుటచే తన సమ్మతిని దెలుపుచు - అతనిని పరిణయ మాడుటకు ముం దాతఁ డాచరించ వలసిన కొన్ని నియమములు పాటింపవలెనని బదులు చెప్పెను. ఆ నియ మములను తప్పక తా ననుసరించుటకు సిద్ధమై యున్నట్లు వాగ్దానము తీసికొని, తన నియమముల నామె ఇట్లని విశదము చేసెను. మొదటి నియమము - అతఁ డొక శ్రీవైష్ణవుని సన్నిధి యందు పంచ సంస్కారములను విధి విహితముగ పొందుటయు, రెండవ నియమము - అతఁడు నియత వ్రతముగ శ్రీవైష్ణవ తదీయా రాధనమును యావజ్జీవ కృత్యముగ సంకల్పించి, ప్రతిదినము నాలుగువేల మంది శ్రీవైష్ణవులకు తదీయారాధన చేయుటయు - ఆమె కోరెను. అందుకు వెంటనే నీలుఁడు సంతోష ముతో నంగీకరించి, నియమ నిర్వహణకు ప్రతిజ్ఞచేసి, అటనుండి "తిరునగై యూర్" (నాచ్చియార్ కోవిల్) దివ్య దేశమున కేఁగి, భగవానుని తనకు శంఖ చక్రాంకనము చేయ బ్రార్థించి, వారివలన శంఖ చక్రాంకనమును పొంది, మరలి

వచ్చి, సమీప మందలి 'మంగై మతం' అనుచోట 'అళకియ శింగర్' స్వామిని ప్రతిష్ఠ జేయించి, భాగవత నిత్య తదీయారాధన కైంకర్యమును ప్రారంభించెను. ఆళ్వారులకు ఆచార్యుఁడైన, శంఖ చక్రాంకనము చేసిన గురుతుగ 'తిరునగైయూర్' దివ్య క్షేత్ర మందలి అర్చావతార మూర్తియగు భగవానునకు చతుర్భుజములు లేక శంఖ చక్రములను ధరించిన రెండు భుజములే కలవని ప్రతీతి. అర్చావతారమున నాచార్య పదవిని లోభించి, ఇచ్చటి మూర్తి మాత్రమే చతుర్భుజములను పరిత్యజించి ద్విభుజములతో నుండెనని తెలియుచున్నది.

ఇట్లు నీలుఁడు కుముదవల్లి కోర్కె ప్రకారము ఆ నియమముల నీవిధముగ ననుష్ఠించి, పరమ భాగవతోత్తముఁడై ఆమెను పరిణయ మాడి, చిరకాలము సంసార సుఖముల ననుభవించుచు - ఏమరుపాటు లేక, నిత్య తదీయారాధన కైంకర్యమును యథా సంకల్పితముగ నెరవేర్చుచు, కాలము గడుపు చుండెను. కొంత కాలమునకు తన యొద్దగల సర్వస్వమును తదీయారాధన క్రింద వ్యయము కాఁగా—నిర్ధనుఁడై ద్రవ్యార్జనమునకు మార్గాంతరము తెలియక, దారులు కొట్టి, అవైష్ణవులగు శ్రీమంతులను దోచి, ద్రవ్యము నార్జించి, ఎటులనో తన వ్రతమునకు అంతరాయము రాకుండ తదీయారాధనమును సాగించు చుండెను. ఆతని కీ పనులందు కుడిభుజముగ సాయపడెడి నలువురు అంత రంగులగు శిష్యులు కూడ నుండిరి. ౧. తోరావళక్కన్ (వాదమందు ఓటమి లేనివాఁడు) ౨. నీర్ మేల్ నడప్పాన్ (నీటిపై నడచు వాఁడు) ౩. తాళూదువాన్ (బిరుదములను ఊదు వాఁడు) ౪. నెళలిల్ ఒదుంగువాన్ (నీడలో నీడయై దాగి నడచెడి వాఁడు) అని వారల పేరులు అన్వర్థములై యమరి యుండును. "ఆడల్ మా" అను అశ్వము కూడ వారి కొకటి యుండెను.

ఇట్లుండ నొకనాఁడు తదీయారాధనకు తనయొద్ద నేమియు లేకుండుటను విచారించుచు, నీలుఁడు అరణ్యమునకు పయనమై, శిష్యులతో సంచరించు చుండెను. ధనికులగు బాటసారు లెవ్వరు గాని యెచ్చట చూచినను కనుబడ లేదు. ఆతఁడు పరమ దుఃఖితుఁడై విచారించు చుండుటను చూచిన భక్త వత్సలుఁడగు భగవానుఁడు కరుణించి, సర్వాభరణములతో నలంకరింపఁబడిన యొక్క బాటసారి వేషమును ధరించి, ఆ యరణ్యమున సంచరించు చుండెను. ఆ బాటసారిని చూచిన అతని శిష్యులు పరుగెత్తి, బాటసారిని చక్కగా పరిశీలించి చూచి, తమ నాయకున కెఱింగింపఁగా - అందఱు కలిసి, బాటసారిని బెదరించి, ఆభరణము

లీయుమని నిర్బధించిరి. పరమ దయాళుడగు భగవాను డేమియు మారు పలుకక ఆభరణము లన్నియు తీసికొన నిచ్చెను. అన్ని యాభరణములను వలచికొనిన నీలుఁడు పాంథుని కాలి వ్రేలి నున్న మట్టెయొకటి అతని శరీరమున మిగిలియుండు టను పరీక్షించి, దానిని తీయ యత్నించగా - అది రాలేదు. అంత నాతఁడు తన పండ్లతో గట్టిగ కరచి, ఆపాదాంగుళీయము నూడబెరికి, భద్ర పఱచుకొని, సొమ్ముల నన్నింటిని ఒక మూట కట్టి యెత్తికొని పొండని శిష్యులకు చెప్పెను. వా రెంత బలముతో మూట నెత్తినను అది భారమై, వారలకు ఎత్తుట కలవి కాకుండి నంతట నీలుఁడే స్వయముగ తన యావ చ్ఛక్తిని వినియోగించి, మూట నెత్త జూచెను. ఆతనికిని సాధ్యము కాలేదు. అంత నాతఁడు కోపోద్రేకమున పాంథుని జూచి—'ఓ పథికుఁడా! ఈ యాభరణములను నేను తీసికొంటిని. ఇది నా సొత్తు. నీ వీ సొమ్ములను నాకు చేరకుండుటకై ఏదియో యొక మంత్రము పెట్టి, వీనిని నేను తీసికొనిపోవుట కలవి కాకుండ చేసియుండవలెను. నీ వా మంత్రమును విడిపించి ఈ మూటను నేను తీసికొని పోవు నట్లు సాయపడుటయే గాక, నీ మంత్రమును నా కుపదేశింప వలయునుకూడ. అట్లుగాక - నీవు కుయుక్తి పన్ని, నన్ను మోసగింతు వేని, ఇదిగో! ఇదే నా ఖడ్గము. దీనికి నిన్ను ఎరచేసి, వధించెదను.' అని బెదరించెను. భగవానుఁ డాతని స్థైర్యమునకు మెచ్చి,— 'ఓ చోరాగ్రేసరా! నా మంత్ర మమోఘ మైనది. తప్పక నే నా మంత్రమును నీ కుపదేశింతును. నీవు స్నానముచేసి, పరిశుద్ధుఁ డవై రమ్ము" అని చెప్పి, అతఁ డట్లు చేయఁగా - దగ్గఱకుఁ దీసికొని, బుజ్జగించి, తిరు మంత్రమును అర్థ సహితముగ నుపదేశించి కృతార్థుని చేసెను. నీలుఁడు భగవానుని పాదాంగుళీయాభరణమును పండ్లతో కరచి తీసినప్పుడే-భగవత్పాదో దకాస్వాదము కలిగి, ఆతఁడు భగవత్కృపకు పాత్రుఁడై, ఉపదేశమునకు అర్హుఁ డాయెను. మంత్రోపదేశమువలన తత్త్వ జ్ఞానముచే పరిశుద్ధాంతరంగుఁడై -"వాడి నేన్ వాడి" మొదలగు పాశురములఁ బాడ నారంభించెను. ఆ నాఁడు వివాహ దివ్యాలంకారములతో పథిక వేషమున సాక్షాత్కరించిన రంగనాథుని - సమీప మందలి "తిరువాలి" యను క్షేత్రమందు ఆళ్వారులు ప్రతిష్ఠింపించి, ఆరాధించుచు వచ్చిరి. నేఁటికిని —"కల్యాణ రంగనాథు" డను పేరిట ఈ దివ్య దేశమందు భగవానునకు వ్యవహారము కలదు.

ఒకప్పుడు ఆళ్వారులు తమ సంచారములో—'శీర్ కాళి' (శియ్యాళి) అను క్షేత్రమునఁ బోవుచుండ, శైవ సమయ వాదులు వాదమునకు గడంగిరి. ఆళ్వా

రులు తమ వాద బలముతో వారి నోడించి, త్రివిక్రమ మూర్తిపై పాడిన పాశుర ముల ఒద్దికకు వారలు మెచ్చి, సమర్పించిన ఒక అపూర్వమగు వేలాయుధము బహుమానముగ స్వీకరించి, దానిని తమకు నిరూపిత స్వరూపముగఁ జేసికొని, జీవిత శేషమున దానిని ధరించుచు వచ్చిరి.

క్రమముగ దివ్యదేశములను పెక్కింటిని సేవించుటలో మార్గవశమున శ్రీరంగ క్షేత్రమునకు వచ్చి, రంగనాథుని ఆలయమునకు ప్రాకారమును నిర్మించుటకై సంకల్పించెను. ప్రాకార నిర్మాణమున కారంభించి, పనులు జరుగుచుండఁగా అంతలో-నాగ పట్టణమున నొక దేవాలయమందు శక్తి విగ్రహ మొక్కటి బంగారుతో చేయఁబడినది కలదని కర్ణాకర్ణిగ విని, అచ్చటి కేగి, తన బుద్ధి బలముచే ఆ విగ్రము నెట్లో సాధించి, దొంగిలించి తెచ్చి, కరగించి, అందుచే లబ్ధమగు విస్తారమైన ద్రవ్య ముచే రంగనాథునకు "అవినాథన్ తిరువీథి" అను గొప్ప ప్రాకారమును (నాల్గవ ప్రాకారమును) - 'ఆయిర క్కాల్ మండపము' (వేయి స్తంభముల మంటపమును) కట్టించెను. ప్రాకారమును నిర్మించునప్పుడు మార్గములో ఋజు రేఖపై తొండరడి ప్పొడి యాళ్వారులచే నిర్మింపఁబడిన నంద వనము అడ్డమురాఁగా – ఆళ్వారుల యందలి ప్రతిపత్తిచే ప్రాకారపు గోడను నంద వనమునకు తప్పించి, త్రిప్పి కట్టించిరి. నేఁటికిని నంద వన హద్దులలో ప్రాకారము వంకర తిరిగి, కనఁబడు చున్నది. అందుకు తొండరడిప్పొడి యాళ్వారులు ప్రీతులై, సంతోష పారవశ్యమున తిరు మంగై యాళ్వారుల ననుగ్రహించి, వారికి - 'అరుళ్ మారి' (కృపా వర్షము) అని ప్రశంసించి, గౌరవించిరి.

కైంకర్యములు పూర్తి చేయునపుడు కర్మకారులకు ఆనాఁటి కానాఁడు భత్యము నిచ్చి, దేహ యాత్రను జరిపించుచు – మాస వర్ష వేతనముల నొకే తూరిగ పని యంతయు పూర్తియైన పిమ్మట నిచ్చుటకు ఒడంబడికయై, పనివారలు కైంకర్యములఁ జేయుచు వచ్చిరి. ప్రాకారాద్యుద్దిష్ట కైంకర్యములు పూర్తి కాగా, వారలు తమ తమ కూలి నీయుడని ఆళ్వారులను ఒత్తిడి చేయసాగిరి. ఆళ్వారులు యుక్తి పన్ని, కూలి వారల నందఱను నమ్మించి, కావేరి కావలి తీరమున ధనము కలదనియు, అచ్చటకు పోవుదమనియుఁ దెల్పి, అందఱను నావ నెక్కించి, నావ కావేరి మధ్యమున జేరిన పిదప తనయొద్ద పైకము లేదనియు చెప్పి, ఆ నావను అమాంతముగ కావేరిలో ముంచివేసెను. అందలి జనులు కావేరియందు మునిఁగి, దేహములు చాలించి, ముక్తి నందిరని ప్రతీతి. నేఁటికిని ఈకావేరీ శాఖను-'చంపునది' అనునర్థ మిచ్చు 'కొల్లిడమ్' అను తమిళ పదముతో వ్యవహరింతురు.

ధర్మదారతో ఆళ్వారు లనేక క్షేత్రములను సేవించి, తన వైదుష్యమును చిరస్థాయి చేసెడి అనేక ప్రబంధములను పాడుచు - తిరిగి కొంతకాలమునకు శ్రీరంగమునకువచ్చి, ఒకానొక కార్తిక పూర్ణిమా శుభ దినమున శ్రీరంగనాథుని యెదుట 'తిరుక్కురుందాండగం' 'తిరునెడుందాండగం' అను స్వ నిర్మితములగు రెండు ప్రబంధములను విన్నవించఁగా — రంగనాథుఁడు సంతసించి, నాఁటి దినము తమకు జరుపఁబడెడి చూర్ణోత్సవమును ఆళ్వారులకు జరుపునట్లాన తిచ్చిరి. అందు కాళ్వారులు సమ్మతింపక, తాను కోరునది తనచే నిర్మింపఁబడిన వేయి స్తంభముల మండపమున (రంగనాథుఁడు) వేంచేసి, నమ్మాళ్వారుల "తిరువాయ్‌మొళి" ని వినుట మాత్రమే యని ప్రార్థించెను. అందుకు రంగనాథుఁ డంగీకరించి, తాము సంకల్పించిన చూర్ణోత్సవ విధానమును మార్పుజేసి, చూర్ణోత్సవ సామగ్రిని 'ఆళ్వార్ తిరునగరి' కి పంపి, ఉత్సవమును ఆ సామగ్రితో నమ్మాళ్వారులకు జరిపించి, నమ్మాళ్వారుల విగ్రహమును మధుర కవులతో సహా శ్రీరంగమునకు రావించి, వైకుంఠ ఏకాదశి యారంభించి, వరుసగా పది దినములు రాత్రులందు అధ్యయ నోత్సవమును వేయి స్తంభముల మంటపమందు సంకల్పించి, రంగనాథుఁడు దివ్య ప్రబంధములను వినెను. పూర్వాచార రీతిని ఆ పది దినములందును వేద పారా యణము జరుపఁబడుచుండుటచే - ఆ వేదాధ్యయనమునకు అవరోధము గాకుండు నట్లు ద్రవిడ వేదాధ్యయనము రాత్రులందు నిర్ణయింపఁబడెను. అందువలననే ఈ యుత్సవమును 'రాపత్తు' అని వ్యవహరింతురు. అధ్యయనోత్సవము పూర్తియై, నమ్మాళ్వారుల విగ్రహమును మధుర కవులు ఆళ్వార్ 'తిరునగరి' కి తీసుకొని పోయిరి. ఇట్లు చాల కాలము ప్రతి సంవత్సర మీ యుత్సవము జరుగు చుండెను. కావేరీ ప్రవాహము యొక్క ఔద్ధత్యము వలన రాక పోకలు స్తంభించుటచే ఆళ్వారులను దూర దేశ మందుండి, సకాలములో శ్రీరంగమునకు తెచ్చుట అసాధ్యమై, చాలకాల మీ యుత్సవము నిలిచిపోవుచుకూడ నుండెను. కొంత కాలము నిలిచి పోవుట అవద్యముగాతోచి, శ్రీ రామానుజ యుగమున నమ్మాళ్వారుల విగ్రహము నొక దానిని శ్రీరంగ దేవాలయమునకై ప్రత్యేకముగ నిర్మించి ప్రతిష్ఠించి, ఆ విగ్రహమునే ఉపయోగించుచు, అధ్యయనోత్సవము జరుపఁ బడినట్లును శ్రీరామా నుజుల కాలములో - ఆళ్వార్ తిరునగరి విగ్రహ సంబంధము శ్రీరంగమునకు విడిచి పోయినట్లును చెప్పుదురు.

తిరుమంగై యాళ్వారులకు తిరువాలి తిరునగరి యందు విగ్రహ ప్రతిష్ఠ చేయఁబడి, ఆరాధనము జరుగుచు వచ్చుచున్నది. అర్చా సమాధి యందు వెలసిన దివ్య మంగళ విగ్రహములలోని కెల్ల ఇచ్చట ఆళ్వారుల బింబము సౌందర్యమున మించిన దని యందురు. రెండవ విగ్రహమును శ్రీ విల్లిపుత్తూర్ ఆండాళుగను, మూఁడవ విగ్రహమును శ్రీ పెరుంబూదూరు ఉడైయవరులను పరిగణింపఁదగు ననియు చెప్పుట కలదు.

'కలియన్' (క్రూరుఁడు) అనియు - 'పరకాలన్' (ఇతర మతముల వారికి కంటకుఁడు) అనియును తిరుమంగై యాళ్వారులకు సార్థకములైన నామాంతరములు కలవు. వీరు 105 సంవత్సరములు భౌతిక దేహముతో సంచరించి, అంత్య కాలమున సిద్ధాశ్రమము అని ప్రసిద్ధిఁ జెందిన 'తిరుక్కురుంగుడి' క్షేత్రమున రంగ నాథుని ఆజ్ఞ ననుసరించి, సిద్ధి పొందిరి. ఆ చోటున వారి జ్ఞాపకచిహ్నముగ ఒక ఆలయము కట్టఁబడి, అందు ఆళ్వారుల విగ్రహము ప్రతిష్ఠింపఁబడి. ఆరాధింపఁ బడుచున్నది.

౧౦. నమ్మాళ్వారులు :

వీరు కురుకాపురి యను దివ్య క్షేత్రమున కలిలో ప్రథమ వత్సరమగు ప్రమాది వర్షమున వృషభ మాసమునందు విశాఖా నక్షత్రముతో గూడిన శుక్ల చతుర్దశీ శుక్రవారమున కర్కాటక లగ్నమున 'వెళ్ళాళర్' అను చతుర్థ జాతియందు విష్వక్సేనాంశచే అవతరించిరి. తండ్రి పేరు 'కారి' యనియు, తల్లి పేరు - 'ఉడైయనంగై' యనియు, తల్లి పుట్టినిల్లు 'తిరువణ్ పరిశారం' అనియు చెప్పుదురు.

కారి తండ్రి- శెందామరై క్కణ్ణన్. వారి తండ్రి అచ్యుతులు. వారి తండ్రి అరంతాంగి. వారి తండ్రి తిరువళుదివళనాడన్.

కారి దంపతులు చిరకాలము సంతానము లేక 'తిరు క్కురుంగుడి' క్షేత్రమున స్వామిని ప్రార్థించి ప్రీతు డగు భగవానుని తమకు పుత్రుఁడై యవతరించు నట్లు కోరిరి. భగవాను డట్లే విష్వక్సేనున కాజ్ఞాపించి, తాను విష్వక్సేనులయం దావిష్టుఁడై, ఆ దంపతుల గర్భమున శిశువై యవతరించెను. ఈయననే - 'నమ్మాళ్వారులు' అందురు. నేఁడును — 'తిరుక్కురుంగుడి' యందు ఆళ్వారుల విగ్రహము ప్రత్యేకముగ లేదు. ఆ క్షేత్ర మందలి అర్చామూర్తియే ఆళ్వారులుగ అవతరించి నట్లు చెప్పుటచే వేరుగ ఆళ్వారుల విగ్రహము ఉండ నవసరము లేక అట్లు ప్రతిష్ఠింపలేదని యందురు.

ఇట్లు జనన మందిన ఆళ్వారులు, జన్మించినది మొదలు ప్రాకృత శిశువు వలె క్షీర పానము సేయుట - మల మూత్ర విసర్జనము సేయుట - ఏడ్చుట మొదలగు మానుష లక్షణములు లేక, మౌనముతో నుండెను. ఈ అయోమయావస్థను పంద్రెండు దినముల కాలము వేచి చూచుచున్న తలిదండ్రులు తమ దురదృష్టమునకై వగచి, ఆ యూరి యందలి ఆదినాథుని సన్నిధికి తీసికొని పోయి, ఆ బిడ్డను గురించిన తమ క్లేశములను భగవానునకు విజ్ఞాపించుకొనఁ దలచి, అటకు బోయిరి. కొంత సేపటికి ఆళ్వారులు వారల దృష్టి పథమును తప్పించుకొని, భూమిపై దొరలుచు, చెంత నున్న చింత చెట్టు మొదలికి పోయి, అందలి చిన్న కోటరమందు ప్రవేశించి, బయటకు రాక, అచటనే ఉండిపోయిరి. ఎప్పటివలె అన్న పానాదుల గ్రహింపక, దేహయాత్ర గడుపుచుండెను. ఈ రీతిగా పదునారు సంవత్సరములు గడచెను.

ఆ కాలమున పరమ భాగవతు లగు మధురకవి యాళ్వారులు తీర్థ యాత్రలఁ జేయుచు ఒకనాఁడు యమునా తీరమున నుండఁగా - దక్షిణ దిశయందొక్క దివ్య తేజము వారికి గోచరించెను. అపూర్వమగు నా తేజమును లక్ష్యముగ బెట్టుకొని, దక్షిణ దిక్కుననే ప్రయాణము సాగించి, క్రమముగ కురుకాపురికి చేరెను. అచ్చట నుండి దక్షిణమున నా తేజస్సు కనఁబడక పోఁగా - అచ్చటి వారల నా యూరి యందలి విశేషములను గూర్చి ప్రశ్నించెను. అందుకు వారలు ఆళ్వారులు విచిత్ర ప్రవృత్తిని చెప్పఁగా - మధుర కవులు తింత్రిణీ వృక్ష మందలి ఆళ్వారులను చూచి, వారి జ్ఞానసంపత్తిని తెలిసికొని, ఆశ్రయించి, తనకు జ్ఞానోపదేశముఁ జేయుమని ప్రార్థించిరి. నమ్మాళ్వారులు సంతసించి, మధుర కవులకు తిరుమంత్రమును, ద్వయ మును, చరమ శ్లోకమును, తిరువాయ్ మొళిని అర్థ సహితముగ నుపదేశించి - 'అవావర' పాశురము నుపదేశించుటతో అవతారమును చాలించిరి. 'తిరువాయ్ మొళి' ఉపదేశ కాలమందు గూడ 'పత్తుడై అడియ వర్' 'ఎమ్మావీట్టు' 'ఉణ్ణిలా వియ' పాశురములనను సంధించుచు, ఒక్కొక్క పాశురమును చెప్పునప్పుడు మోహ వశమున పడిపోయి, ఒక్కొక్క మారును ఆరు మాసములకు తెలివి తెచ్చుకొని, పై గ్రంథమును సాగించుచు వచ్చినట్లు చెప్పుదురు. ఒకే పదునారు సంవత్సరములలో అవతార పరిసమాప్తియును - 'తిరువాయ్ మొళి' ఉపదేశమును జరిగినదని యొక మతము. మౌన ముద్రతో ప్రపంచ సంబంధము లేక యుండి, రెండవ పదునారు సంవత్సరములలో 'తిరువాయ్ మొళి' రచనమును అవతార సమాప్తియు నని మఱియొక మతమును కలదు. ౩౫ సంవత్సరములు మాత్రమే వీరీ లీలా విభూతి నలంకరించి యుండిరి.

మధుర కవులు 'ఆళ్వార్ తిరునగరి' యందు ఆళ్వారుల విగ్రహమును ప్రతిష్ఠించి, రమారమి మూఁడు వేల సంవత్సరము లారాధించిరి. కొంత కాలమునకు 'తిరువాయి మొళి' లుప్తమై పోఁగా-ఆళ్వారులు నాథమునులకు సాక్షాత్కరించి-తిరువాయి మొళి'తో పాటు, తక్కిన మూఁడు ప్రబంధములను కూడ ఉపదేశించిరి.

౧౧. మధురకవి యాళ్వారులు :

వీరు ముదలాళ్వారులకు సమ కాలికులు. ద్వాపర యుగము 863100 సంవత్సరములకు పైఁబడిన విక్రమ సంవత్సరములో – మేష మాసముతో గూడిన చైత్ర శుక్ల దశమీ గురువారము చిత్రా నక్షత్ర యుక్తమగు శుభ దినమున, పాండ్య దేశము నందలి 'తిరుకోళూర్' గ్రామమును, జైమినీయ సామశాఖా బ్రాహ్మణ కుటుంబమునందు గరుడాంశచే నవతరించిరి. జన్మించినది మొదలు విష్ణు భక్తి సంపన్నులై యుండి, కలి యుగమున ననువర్తించి, నమ్మాళ్వారుల నాశ్రయించి, ఆచార్య ప్రతిపత్తి యందలి భక్తి ప్రపత్తులను తమ యనుష్ఠానమున ప్రకటించిరి.

౧౨. ఆండాళ్ :

'శ్రీ విల్లి పుత్తూరు' నందు శ్రీ విష్ణు చిత్తుని తులసీ వనములో - ఒకా నొక కటక మాస పూర్వపక్ష చతుర్థీ పూర్వ ఫల్గునీ నక్షత్ర యుక్త మంగళవారమున, వరీయాన్ నామయోగ, భద్ర కరణ తులా లగ్నమందు భూదేవి యంశచే నవతరించెను.

బాల్యము నుండియు భగవద్భక్తియం దవగాహించి, పరమ భాగవత శిఖామణియై పెరిగి, తా నలంకరించు కొనిన తులసీ దామములకై వటపత్రశాయి ఆశ పడునట్లు ఆ దేవునకు తనపై వ్యామోహమును కల్పింపఁ జేసి, 'తిరుప్పావై' 'నాచ్చియార్ తిరుమొళి' యను రెండు ప్రబంధములను రచించి, శ్రీ వైష్ణవ మతమునకు మహోపకారము చేసి, రంగనాథుని పరిణయ మాడుటకై ధనుర్మాసమున నియతముగా వ్రత మాచరించెను. మార్గ దర్శకమైన ఆ వ్రతము మార్గశిమాసమున శ్రీ వైష్ణవ తిరుమాళిగలలో నేఁటికిని మహా వైభవముగా జరుపఁబడుచునే యున్నది. ఈ వ్రతానుష్ఠాన మారంభించి, శ్రీ కారముఁ జుట్టిన ఆండాళుచే ప్రవచింపఁ బడిన శ్రీ సూక్తి, వ్రత పాలకుల కందఱకును శిరోధార్యమైనది. కనుక, అట్టి శ్రీ సూక్తి యందలి విశిష్ట విశేషములను, వ్రత స్వరూపమును, వ్రతాచరణ విధానమును, వ్రత ఫలమును విశదముగా దెలిసికొనుట – అత్యంత ఫల ప్రదము.



శ్రీ గోదాదేవి (ఆండాళ్)

## ఆండాళ్ శ్రీ సూక్తి

పరిదృశ్య మానములగు నీ విచిత్ర బ్రహ్మాండముల నిర్మాతయు - నిర్వాహకుఁడు నగు నొక చేతనుఁ డుండి తీరవలెనని మన మంగీకరింప వలసి యున్నది. అతఁడే, పరమ పురుషుఁ డగు శ్రీ మన్నారాయణుఁడు. వేదాంతము లితనినే పరమ కారణ మనియు - పరబ్రహ్మ మనియు సిద్ధాంతీకరించి యున్నవి. ఇతఁడు స్వతంత్రుఁ డగుటచే ఈశ్వరుఁ డనఁబడుచున్నాఁడు. ఇతని సత్తను సాధించుటకు ఆగమమునే పరమ సాధనముగ వైదికు లంగీక రింతురు. ఈశ్వరుఁ డొక్కఁడే. పెక్కు రుండుటలో ఔచిత్యము లేదు. చాల దోషములు సంభవించును.

ఈశ్వరుఁడు నిత్యుఁడు, ఆద్యంతములు లేని వాఁడు. పిపీలికాది బ్రహ్మ పర్యంతమైన వివిధములగు శరీరములలో - కర్మపరతంత్రులై, యెనుబది నాలుగు కోటులు భేదములు కలిగి, లెక్కకు మిక్కిలి యగు జీవాత్మలు ప్రవేశించి, జనన జరా మరణములకు లోనై, సుఖ దుఃఖముల ననుభవించును. ఈ చేతనులను సమష్టిగ - 'జీవులు' అని వ్యవహరింపవచ్చును. ఈ జీవులును - ఈశ్వరుని వలెనే నిత్యుఁలు; ఆద్యంతములు లేని వారు. ఈ జీవులు-నిత్యు లనియు, ముక్తు లనియు, బద్ధు లనియు మూఁడు తరగతులకు చెంది యున్నారు.

నిత్యులు - ఏనాఁడు గాని జనన మరణములకు వశము గాక, అస్పృష్ట సంసార గంధులని పిలువఁబడి, ఈశ్వరునితో పాటు - నిత్య విభూతి, త్రిపా ద్విభూతి శ్రీ వైకుంఠము అను నామములతో వ్యవహరింపఁబడు అప్రాకృత దివ్య లోకమున వసియించుచు - 'సదా పశ్యంతి సూరయః' అను నట్లు, భగవ దనుభవము నందు చుందురు.

> "అనన్తో గరుడశ్చైవ విష్వక్సేనః పితామహః
> అనాది వైష్ణవాః పంచ మునిరాడ్వి ఖనా స్తథా." — (ఆనంద సంహిత)

అనునట్లు, అనంతాదు లిట్టివారలు. ముక్తులు కొంత కాలము కర్మ పరతంత్రమగు శరీర సంబంధముచే లీలా విభూతి యను నీ ప్రపంచమున సంసారులై యుండి, భగవ దనుగ్రహముచే పరభక్తి - పరజ్ఞాన - పరమభక్త్యాదుల నలవరచు కొని, ప్రపన్నులై, భగవ దారాధనము చేయుచు, దేహాంతమున నిత్య విభూతి నలంకరించి నట్టి వారలు. వీరలే మన పూర్వాచార్యులు. బద్ధులు-ఈ ప్రపంచమున

సంసారమందు చావు పుట్టుకలకు లోనై, భగవత్ప్రాప్త్యుపాయము ననుష్ఠింపఁజాలక, క్లేశము చెందెడి అభాగ్యులు. బద్ధ జీవుఁ డొక్కొకఁడును మోక్షము చెందుట కర్హుఁడగును. సంసార బంధము చేతనునకు సహజము కాదు. ఈ బంధము-

"అనాది స్సంసారః పురుష మనురుద్ధే గలతి చ." —(సాంఖ్య కారిక)

అనునట్లు చేతనుని ఎప్పుడో బంధించి, అనువర్తించుచున్నదే కాని, అతఁడు తెచ్చి పెట్టుకొనలేదు. ఇది అనాదియే యైనను, దీనికి అంతము మాత్రము కలదు. దాని స్వభావ మట్టి దగుటచే, శాస్త్ర విశ్వాసము గల ధీమంతులీ విషయమున విప్రతిపత్తి చెందుట లేదు. సంసార స్వరూపము అతి భయంకర మగుటచే, దాని ననుభవించిన మతి మంతులు దాని నుండి విడి వడుటకు శాస్త్ర శరణ్యులై యత్నింతురు. స్వ స్వరూప జ్ఞానమును పొంది, సంసార ముక్తులై, మోక్ష సుఖము ననుభవించెడి ప్రదేశము లోకాంతరము. అది అప్రాకృతమైనది. అదియే శ్రీ వైకుంఠము. అందు లక్ష్మీ సహాయుఁడగు శ్రీమన్నారాయణుఁడు నిత్యసూరి పరివృతుఁడై, నివసించి యుండును. మోక్ష సుఖము ఆ దివ్య దంపతులకు నిత్య కైంకర్యము చేయుటయే. ఇట్టి మోక్ష సుఖమే చేతనునకు ఉద్దేశ్య మనునది శాస్త్ర సారము. ఈ మోక్షమును సాధించుటకు రెండే మార్గములను శాస్త్రము నిరూపించినది. మొదటిది - భక్తి యోగము; రెండవది - ప్రపత్తి యోగము. అందు భక్తి యోగము —

"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామే వైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసిమే."

—(భగవద్గీత: 18-65)

అనియు, ప్రపత్తి యోగము .-

"సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః."

—(భగవద్గీత: 18-66)

అనియు - శ్రీకృష్ణ పరమాత్మచే గీతోపనిషత్తున నిష్కర్షింపఁబడినవి. భక్తి యోగము నవలంబించు వారు భక్తు లనియు, ప్రపత్తి యోగము నాచరించువారు ప్రపన్ను లనియు పిలువఁబడుదురు, ఈ యుభయాధికారులును-

"ఆ ప్రయాణా త్తత్రాఽపి హి దృష్టమ్."

— (బ్రహ్మ సూత్రము : 4-1-12)

అనునట్లు, దేహావసాన పర్యంతము భగవ దారాధన రూపముగ స్వ స్వ వర్ణాశ్రమోచిత సకల కర్మలను విధి విహితముగ ఆచరించుచుండవలెను. భక్తి యనఁగా - భగవానునియెడ

"యా ప్రీతి రవివేకానాం విషయే ష్వనపాయినీ."

అనునట్లు నిరతిశయ రూప మగు చింతనము. ఇయ్యది ద్విజాతి మాత్రులకు విహితమై, ద్విజేతరులకు నిషిద్ధమై యున్నది. వారల కిది అవసరము కాదు. ద్విజ జన్మమం దారంభింపఁ బడిన భక్తి యోగము - 'న హి కల్యాణ కృ త్కశ్చిత్' (భ: గీ: 6-40) అనునట్లు ఆరబ్ధ ఫలమై, జన్మాంతరములం దనువర్తించి, ద్విజేతర జన్మమందు పూర్తియై, ఫలపూర్తి నీయవచ్చును. భగవంతుని నిరంతరము చింతించు చున్న రావణుఁడు, కంసుఁడు మొదలగు వారలకు అట్టి చింతనము ప్రీతిరూపము కాక, ద్వేషరూప మగుటచే - దానిని భక్తియని చెప్పుట లేదు.

ప్రపత్తి యోగము భగవానునియందు భర సమర్పణము. ఇది సర్వ సాధా రణము. దీనికి అధికారి నియమము, దేశ నియమము, కాల నియమము, ఎద్దియు లేదు. కాఁగా, భక్తి యోగము కంటె సులభమైన దనియు —

"ఉపాయ స్సులభ స్సోఽయః దుష్కర శ్చ మతో మమ."

అనునట్లు అనుష్ఠానవేళయందు కష్టసాధ్యము కూడ అయి యున్నది. ఇయ్యది —

"ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్య విసర్జనం
రక్షిష్యతీతి విశ్వాసో గోప్తృత్వవరణం తథా
ఆత్మనిక్షేప కార్పణ్యే షడ్విధా శరణాగతిః."

(అహిర్బుధ్న్య సంహిత—అధ్యా : 37-18)

అనియు ఆఱు విధములు కలది. ఆత్మ నిక్షేపమును అంగిగాఁ జేసికొని, ఐదంగములు కలదనియు చెప్పుట కలదు. ప్రపంచ మంతయు భగవ దావాస్యమై, భగవ చ్ఛరీరమై యుండుటచే ఏ చేతనమునకుఁ గాని అహితము చేయక, సకల చేతనములయెడ అనుకూల ప్రవృత్తి కలిగి, భగవ దాజ్ఞా రూపము లగు శాస్త్ర

విహిత కర్మల నాచరించు చుండుటయే ప్రథమాంగ మగు అనుకూల్య సంకల్పము. శాస్త్ర నిషిద్ధములగు కర్మల నాచరింప కుండుట ప్రాతికూల్య విసర్జన మను రెండవ యంగము.

"సకృదేవ ప్రపన్నాయ" "సర్వ ధర్మాన్ పరిత్యజ్య" ఇత్యాది భగవ ద్వాక్యములు సత్యము లను గాఢ విశ్వాసము గలిగి, సంశయము వీడి, భగవానుఁడు రక్షించి తీరునని తెలిసికొనుట మూఁడవ యంగ మగు మహా విశ్వాసము.

"సంసార తన్త్ర వాహిత్వా ద్రక్షాపేక్షా మపేక్షతే."

— (లక్ష్మీ తంత్రము: 17-18)

అనునట్లు అయాచితముగ నెల్లరను స్వీకరించుటలో అవ్యవస్థ కలుగుట చేతను, యుక్తము కానందునను, చేతనుఁడు తన యభీష్టమగు రక్షణ భారమును భగవానునకు నిమిత్త మాత్రముగ నివేదించుట గోప్తృత్వ వరణ మను నాలవ యంగము. చేతనునకు భక్తియోగమందుగాని, ప్రపత్తియోగమందుగాని వలయు అధికారము లేకుండునట్టి దశయు, భగవానుని కంటె సాధనాంతరము లేకుండుటయు నను 'అనన్య గతిత్వమే' కార్పణ్య మను నైదవ యంగము. ఇట్లు అత్యంత పారతంత్ర్య విశిష్ట మగు శేషత్వానుసంధానమే ఆత్మ నిక్షేపము లేక భరన్యాసము. ఇదియే ప్రపత్తి యనఁబడును. షడంగ ప్రపత్తి పక్షములో ఆత్మ నిక్షేప మను నంగియు అంగముగ పరిగణింపఁబడును.

సంసార వ్యాధి పీడితులకు భక్తి ప్రపత్తులు రెండు విధములగు ఔషధము లనియు, మొదటిమందు దేహ యాత్రను వినోదముగఁ గడపి, ముక్తిని విలంబము చేయు ననియు, రెండవది దేహయాత్రను ప్రాసపఱచి, సాద్యస్కముగ ముక్తి నిచ్చు ననియు చెప్పుదురు. ఇది వీనియందు గల మఱియొక వైలక్షణ్యము. భక్తి ప్రపత్తులు రెండును పరస్పర సహకృతములై చేతనున కుపకరించుటయు కలదు.

భక్తిని ప్రశంసించుచు - భక్తిని నాలుగు తరగతులుగ విభజించి, 'భక్తి - పరభక్తి - పరజ్ఞానము - పరమ భక్తి' యని పర్వక్రమమున నుత్తరోత్తర పర్వమం దాదరముఁ జూపుటయు కలదు.

"చతుర్విధా భజన్తే మాం జనా స్సుకృతి నోఽర్జున।
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ।" — (భగవద్గీత: 7-16)

అని చెప్పి, అధికారులను భక్తులుగ పరిగ్రహించిన భగవానుఁడు 'జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్' అనియు- 'వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః' అనియు-నాల్గవ తరగతికి చెందిన జ్ఞాని యనఁబడు నాతఁడు ప్రాకృత కామము లను కోరక, ముక్తిని కోరుటచే నాతని తనకాత్మ యనియు -దుర్లభుఁ డనియు మహాత్ముఁ డనియు ప్రశంసించుటచే, అట్టివాని భక్తి విశేషము పరభక్తియని చెప్పఁ బడెను. నిరంతర మిట్లు పరభక్తి చేయఁగా - 'దర్శయాత్మాన మవ్యయమ్' అని యర్జునుఁడును -'ఒరునాళ్ కాణవారాయే' అని ఆళ్వారులును ఆశించినట్లు భగవ ద్దర్శనము కావలయునని యుత్కంఠచే ప్రార్థింపఁగా, పరమ కారుణికుఁడగు సర్వే శ్వరుఁడు అట్టి భక్తునిపై గల పరమానుగ్రహముతో తత్కాలోచితముగ దర్శన సమానాకార మగు పరిపూర్ణ సాక్షాత్కార మొసఁగగా కలిగిన యనుభవ విశేషము పరజ్ఞాన మని చెప్పఁబడినది.

ఇట్టి పరజ్ఞానము చిరానువృత్తమై, క్రమోపచితము కాఁగా - 'విలాస విక్రాంత పరావరాలయమ్' ఇత్యాది రూపముగ పరమ పురుషుని శ్రీపాదములను నిరంతరముగను, నిరవధికముగను అనుభవింపక, భరింపఁ జాలని యార్తము జనించి, అతి పిపాసా పీడితుఁడగు పురుషుఁడు తచ్ఛాంతికై అగాధ మగు తటాకము నందలి జలము నంతయుఁ ద్రావఁగోరి, తటాలున తటాకమున నురికి, మునిఁగిపోయి నట్లు ఈ దేహ బంధమును విడచి, పరబ్రహ్మమును చేరి - 'ఏష బ్రహ్మ ప్రవిష్టోఽస్మి' అని యానందింపఁ గోరుట పరమ భక్తి యనఁబడుచున్నది. ఈ యనుభవమును నమ్మాళ్వారుల దివ్య ప్రబంధములో 'తిరు వాయ్ మొళి' యందలి దశమ శతక మున నంతిమ దశకమందు విస్తరించి తెలిసికొనఁ దగును. దీనినే ప్రపత్తి యనఁ గూడును.

ఇట్టి పరమ రహస్యములను లోకోజ్జీవనమునకై మహా కావ్య రూపమున పరమ సులభముగ దేశభాషలో రచించిన ఆండాళ్ శ్రీసూక్తిని గుఱించి తెలిసి కొనుటకు ముందు-ఆమె యవతార విశేషమును గుఱించి తెలిసి కొనుట అత్యంత మావశ్యకము.

శ్రీవైకుంఠమున నారాయణుఁడు మహాలక్ష్మి యను సహధర్మచారిణితో- 'భర సింహాసనమై' అను నట్లు మహాభక్త శిఖామణుల మంగళా శాసనములకు లక్ష్యమై ప్రకాశించుచుండ, ఆ మహాలక్ష్మియు - భర్తయగు నారాయణుని వలెనే

సర్వ విధములగు శక్తులు కలదై, సర్వేశ్వరియై యొప్పుచున్నది. ఈ పతి పత్నీ భావ మను దాంపత్య సంబంధము పరిపూర్ణ మగుటచే, వీరలలో ఎన్నఁడును అభిప్రాయ భేదము కలుగుటకు లేశమేని అవకాశము లేదు. "ఇత్థం భూతగుణో హారిః" అనునట్లు ఆ దివ్యదంపతుల స్వరూప మట్టిది.

"సమస్త జననీం వన్దే చైతన్య స్తన్య దాయినీమ్
శ్రేయసీం శ్రీనివాసస్య కరుణా మివ రూపిణీమ్." — (దయా శతకమ్ - 6)

అనునట్లు మహాలక్ష్మి చేతనులకు చైతన్య మను స్తన్యము నిచ్చి, భగవ దాభిముఖ్యమును కల్పించి, 'దేవత్వే దేవ దేహేయం' అనునట్లు భగవానునకు ఛాయ వలె పర వ్యూహాది స్వరూపము లన్నిటియందును సహచారిణియై యుండును. ఈ మెవలెనే భగవానునకు భూదేవి యనియు, నీలాదేవి యనియు, ఇరువురు రాణులు కలరు. వీరలు - ముందు చెప్పఁబడిన నిత్యసూరి గోష్ఠిలో చేరిన చేతనులు. వీరిలో - భూదేవి చరాచరణ భరణ క్షమతకు తానే దృష్టాంతయై, చేతనులందు కర్మానుగుణముగ దండ ధరత్వ లీల నవధరించెడి భగవానుని నిగ్రహమును శాంతి పరచుచు. భగవానుని వామ పార్శ్వమును విడువక కాచి యుండును. ఈ యర్థము మనోహరముగ ఈ క్రింది శ్లోకమున వర్ణింపఁబడుట గమనింపఁ దగినది.

"ఆర్ద్రాపరాధిని జనేఽ ప్యభిరక్షణార్థం
రంగేశ్వరస్య రమయా వినివేద్యమానే
పార్శ్వే పరత్ర భవతీ యది తత్ర నాసీత్
ప్రాయేణ దేవి వదనం పరివర్తితం స్యాత్." — (గోదా స్తుతి – 24)

ఈ యర్థమే —

"వన్దే వృషగిరీశస్య మహిషీం విశ్వ ధారిణీమ్
తత్కృపా ప్రతిఘాతానాం క్షమయా వారణం యయా."

— (దయాశతకము – 7)

అను శ్లోకమందును చూడ నగును, నీలాదేవి - తన 'స్మాయావలోక లవ దర్శిత భావహారి భ్రూమండల ప్రహిత సౌరత మంత్ర శౌండము' లగు ననంగ లీలలచే భగవానుని దృష్టిని తనకై మరల్చి, చేతనుల యపరాధములపై చొరకుండు నట్లు చేసి, చేతనుల కుపకారము చేయును. ఈ యర్థముకూడ —

"నిశామయతు మాం నీలా యద్భోగ పటలైర్ధ్రువమ్
భావితం శ్రీనివాసస్య భక్తదోషే ష్వదర్శనమ్." — (దయా శతకము – 8)

అను శ్లోకమందు చూడ నగును. ఇట్లు రాణు లందఱును ఏమరుపాటు లేక, పరమ పురుషునకు జగ ద్రక్షణ వ్యాపారమందు జాగరూకతతో సాయపడు చుందురు.

"యాభి స్త్వం స్తనబాహూ దృష్టిభి రివ స్వాభిః ప్రియంశ్లాఘసే."
— (శ్రీగుణ రత్న కోశము – 26)

"సాక్షాత్ క్షమాం కరుణయా కమలా మివాన్యాం." — (గోదా స్తుతి – 1)

ఇత్యాది ప్రమాణములందు భూ - నీలాదులు మహాలక్ష్మి యనుట వైభవ వాదములు. లక్ష్మ్యంశము లనుటలో విరోధము లేదు.

ఇట్లుండ ఒకా నొకప్పుడు దేవతలచే ప్రార్థింపఁబడి, మహావిష్ణువు అయోధ్య యందు దశరథు నింట రాముఁడై యవతరింపఁగా, మహాలక్ష్మియు - మిథిలా నగర మున జనకు నింట భూమియందు సీతయై యవతరించి, రాముని పరిణయ మంది, భర్త వెంట అరణ్యమున కేగి - 'అనన్యా రాఘవే ణాహమ్' అను నట్లు సర్వకాల సర్వావస్థ లందును భర్తతో నుండి, సకల విధ కైంకర్యములు చేయుచు, పర మానందము ననుభవించుటను చూచుచున్న భూదేవి, సవతియం దసూయ చెంది, ఏకపత్నీ వ్రత మహిమ ఖ్యాపక మగు ఆ యవతారమందు భగవానుని సమీపించుటకు భయపడి, మఱియొక సదవకాశమునకై ద్వాపరయుగము వఱకు వేచియుండి, భగవానుఁడు కృష్ణుఁడై, మహాలక్ష్మి రుక్మిణియై యవతరింపఁగా, తాను - రాజగు సత్రాజిత్తు నింట సత్యభామయై యవతరించి, చాల సందర్భములందు రుక్మిణితో స్పర్థించి, పూర్వాను వృత్తమగు నీర్ష్యను సాధింపఁ బ్రయత్నించెను. కృష్ణావ తారము ఉపసంహరింపఁబడగా, సత్యభామయు ప్రకృతి భావముఁ జెంది, పూర్వ కృతములగు వ్యతిక్రమములను అసహ్యాపచారములుగఁ దలపోసి, కలవరపడినదై అట్టి క్లేశమును పోగొట్టుకొనుటకై, చిరకాలము చింతించు చుండఁగా, ఒక్కనాడు భగవత్సన్నిధిలో వ్యాఖ్యాన గోష్ఠియందు భగవానుఁ డుపదేశించిన పుష్ప కైంకర్య మహిమను వినుట తటస్థించెను. ఆ కైంకర్య మామె చిత్తము నాకర్షింపఁగా, ఆమె పుష్ప కైంకర్యము చేయ నుత్కంఠ కలిగినదై, భగవానుని యనుమతిఁ

బడసి, పూర్వమువలె రాజునుఁ డగు క్షత్రియు నింటఁ గాక, సత్త్వ నిధియు-పరమ భాగవతోత్తముఁడు నగు శ్రీ విష్ణు చిత్తు నింట తులసీ వనమున అయోనిజయై యవతరించి, అర్చావతారమందు భగవానునకు కైంకర్యము చేసి, తన మనోరథ మును తీర్చుకొనెను.

ఆండాళ్ తన యవతారమును శ్రీ విల్లి పుత్తూరునందు సంకల్పించిన విధా నము కూడ ఇట్లు చెప్పఁబడినది.

ఒకా నొక ప్రళయావసానమున మహావిష్ణువు భూ వరాహ రూపియై, పాతాలమున మునిఁగియున్న భూమి నుద్ధరించి, యథాస్థానమున భద్రపరచి, చేతనులకు నివాసము కల్పించి, ధరణీదేవి నాశ్వాస పరచి వర మడుగు మనఁగా నామె భగవానుని ఆ భూ వరాహ రూపమున నట్లే యర్చారూపియై యుండు నట్లు కోరెను. అట్లే, ధరాదేవి యభ్యర్థనమున శ్రీవిల్లిపుత్తూరునం దుండిపోయెను. నాఁటినుండి, వైఖానసు లగు భృ గ్వాదు లాదేవు నారాధించుచు వచ్చిరి. కొంత కాలమునకు అసురు లచ్చటి సాధువులను హింసింప మొద లిడఁగా, భగవానుఁడు తన చక్రాయుధముచే ఆ యసురుల సంహారించి, దివిజ గంగను రావించి, ఆ పుణ్య జలములచే చక్రాయుధమును క్షాలనము జేసి, ఆ జలముల నచ్చటనే నిలిపెను. ఈ యపదానమునకు జ్ఞాపకముగా ఆయుదకము లిప్పుడు-'తిరు ముక్కుళమ్' అను పేరిట పిలువఁబడుచున్నవి. ఆవల, కొంత కాలమునకు భీకర మగు వరాహరూప మును జూచి, జనులు భయపడుటను గుర్తించి, భూదేవి ప్రార్థింపఁగా, భగవానుఁ డారూపమును ఉపసంహరించుకొని, ఇప్పు డున్న వటపత్ర శాయిరూపియై సాక్షా త్కరించెను. మఱి కొంత కాలమునకు దైవ దుర్విలసితమున నప్పటి పట్టణము శిథిలము కాఁగా, భగవ దాలయము భూమియందు మరుగు పడెను. ఆ విస్మృత నగరమునకు సమీపమున 'పుత్తూరు' అను నొక పల్లెటూరు కలదు. అందు-కిరా తులు నివసించు చుండిరి. ఆ పల్లెలో-మల్లి యను నొక బోయెతకు విల్లి యనియు, కండుఁ డనియు నిరువురు కుమారు లుండిరి. ఒకనాఁ డా కిరాత సోదరులు వేఁటకు పోఁగా, కండుని నొక పులి చంపెను. సోదరుని మృతికి దుఃఖించుచున్న విల్లికి వటపత్రశాయి సాక్షాత్కరించి, ఆతని నోదార్చి, కండుని జంపిన పులియుండు చోటును చూపి, దానిని సంహరించు నుపాయము చెప్పి, కండుని బ్రతికించెను. అట్లే - విల్లియు పులిని వెదకి సంహరించి, పులి డాగియున్న గుహయందు అది దాచి యుంచిన అమూల్య మగు ధన సంచయమును తెచ్చి, ఆ

సోదరులు భగవానునకు ఆలయ - మండప - గోపుర - ప్రాకార - ఆరామ - తటాకాదుల నిర్మించిరి. ఆ కారణమున, జీర్ణోద్ధారము చేయఁబడిన నగరము ఆ కిరాతుల పేరిట 'శ్రీవిల్లిపుత్తూర్' అని ప్రసిద్ధిఁ జెందినది. ఆండాళ్ కూడ క్రొత్త పట్టణ మను నర్థమిచ్చునట్లు - 'అణి పుదువై' అని ఈ దివ్య దేశమును కీర్తించినది.

అవతార స్థల మహిమను తెలిసి కొనిన తర్వాత, ఆండాళ్ వంశ గౌరవము కూడ తెలియఁ దగి యున్నది. 'త్రి శుక్లాః కృశవృత్తయః పాత్రమ్' అనునట్లును- 'యస్య త్రీ ణ్యవదాతాని' అనునట్లును - విద్యా జన్మ కర్మలలో జన్మశుద్ధి ముఖ్యముగ చెప్పఁబడుటచే, తన ఆప్తత్వమును ఆండాళ్ తానే - 'వైంగమలత్తండెరియర్ పట్టరపిరాన్ కోదై' అని చెప్పుకొనినది. పద్మాక్షతులసీదామధారణము పరమై కాంతిచిహ్నముగ చెప్పఁబడినది.

'గోద' యను పదము సంస్కృత భాషయందును, ద్రావిడ భాష యందును అర్థవంతమై యమరినది. సంస్కృత భాషా పదమై నప్పుడు గో + ద అని విగ్రహము కలిగి — 'గో' శబ్దమునకు 'భూమి' యను నర్థము కాఁగా — 'ద' శబ్దమునకు 'ఇచ్చుట' — 'ఛేదించుట' అను నర్థ ద్వయము కలిగి, సమస్త మైనంతట 'భూమిచే ఈయఁబడినది' అనియు - 'భూమియం దవతరించినది' అనియు అర్థము నిచ్చును. మఱియు - 'గో' శబ్దమునకు 'వాక్కులు' - 'కిరణములు' అను నర్థ ద్వయము కలిగి — 'ద' శబ్దమునకు 'ఇచ్చుట' అను నర్థము కాఁగా - 'చక్కని వాక్కుల నిచ్చునది' అనియు — కిరణ శబ్దముచే జ్ఞానము లక్షితమై — 'తత్త్వ జ్ఞానము నొసఁగునది' యనియు — అర్థము నిచ్చును. ఇవియును శక్యార్థకములే. బాల్యము నుండియు భగవ దనుభవ పారవశ్యముచే తత్పరీవాహరూపము లగు ప్రబంధములను నిర్మించి, చేతనులకు ప్రపత్తి సిద్ధాంతమును బోధించుటచే ఆమె — 'జ్ఞాన ప్రద' యగుట తెలియఁదగుదు. ఇట్లే-ఆ గోదాదేవియొక్క ప్రబంధములను సేవించెడి వారలకు కవితా శక్తి కలుగుటయును ఈ క్రింది శ్లోకములలో వ్యక్తమగుచున్నది.

"పాదన్యాసం ప్రథమ మనఘం భారతీ యత్ర చక్రే."

అనియు —

"యస్యాసీ దరవింద సంభవ వధూ మంజీర శింజీరవ
స్పర్ధా దుర్ధర పాదలబ్ధ ఫణితి ర్వాల్మీక జన్మా మునిః."

అనియు-ప్రశంసింపఁబడిన వాల్మీకి కట్టి మహా భాగ్యము గోద సంబంధముచే సిద్ధించుటను —

"వల్మీకత శ్శ్రవణతో వసుధాత్మ నస్తే
జాతో బభూవ స మునిః కవిసార్వభౌమః." — (గోదా స్తుతిః 7)

అని శ్రీ మద్వేదాంత దేశికులు ప్రశంసించిరి. ఇట్లే —

"గోదే వికస్వర ధియాం భవతీ కటాక్షాత్
వాచః స్ఫురన్తి మకరన్ద ముచః కవీనామ్." — (గోదా స్తుతిః 4)

అను ప్రమాణము లిచ్చట అనుసంధేయములు, మఱియు — 'గోద' శబ్దము ద్రావిడ భాషయందు 'కోదై' యను రూపము నందెను. ఈ శబ్దమునకు 'పుష్పదామ' మనియు — 'సుకుమారి' యనియు — 'పుత్రిక' యనియు వేర్వేరు అర్థములు కలవు.

మఱియు-'గోద' అను పేరు వలె ఈ యమకు 'ఆండాళ్' అను వ్యవహారము కూడ గుణ కల్పితముగా వాడఁబడు చున్నది. 'స్త్రీ ప్రాయ మితరం సర్వం' అనునట్లు పురుష చేతనులు భగవ ద్గుణానుభవమును సాకల్యముగఁ జేయఁగోరి, తమ పురుష స్వరూపమును మఱచి, తమయందు స్త్రీత్వము నారోపించుకొని, యనుభవించుటవలెఁ గాక, సహజ స్త్రీత్వముచే గోద తన యకృత్రిమ ప్రేమ రసమున భగవ దనుభవమును చేయఁ గల్గుటచే 'ఆళ్వారుల కంటెను ఎన్ని యో విధముల గొప్పది' యని ప్రశంసింపఁబడినది. ఇందువలన - ఈమె భగవ ద్భక్తి యందు గాఢముగ నవగాహించిన దను నర్థము నిచ్చు 'ఆళన్దాళ్' అను శబ్దముచే వ్యవహరింపఁబడుచున్నది. 'ఆళన్దాళ్' శబ్దమే-'ఆండాళ్' అను రూపమును చెందిన దని యందురు. లేక, చేతనులను పరమ పురుషున కభిముఖులఁ జేసియు, పరమ పురుషుని చేతనుల వంక త్రిప్పియు, ఉభయులకు మధ్య నిలిచి, పురుష కారము చేయుటచే—'ఉభయులను సమకూర్చి యేలునది' అను నర్థమిచ్చు 'ఆండాళ్' అను శబ్దాంతరమే ఒకటి కల దనియు చెప్పుదురు. మొదటి యర్థ మును తెలియఁ జేయు ఈ క్రింది శ్లోకము గమనింపఁ దగినది.

"భోక్తుం తవ ప్రియతమం భవతీవ గోదే
భక్తిం నిజాం ప్రణయ భావనయా గృణన్తః
ఉచ్చావచై ర్విరహ సంగమజై రుదన్తైః
శృంగారయన్తి హృదయం గురవ స్త్వదీయాః." — (గోదా స్తుతిః 8)

మఱియును-ఇట్లే గుణాంతర కల్పితముగ 'శూడిక్కొడుత్త నాచ్చియార్' (శూడిక్కొడుత్తాళ్ ) అను వ్యవహారము కూడ ఆండాళునకు ప్రసిద్ధమై యున్నది. భగవానునకు సమర్పించుటకై విష్ణుచిత్తునిచేఁ గూర్పఁబడి, భద్రపరుపఁబడిన పూ మాలలను ఆయన లేని సమయమున తీసి, తన కొప్పున నలంకరించుకొని, తాను వలచిన ప్రభుఁ డగు వటపత్రశాయి యాదరమును బొందఁ దగినదా యని దర్పణమునఁ బరీక్షించుకొని, సుహితయై, ఆవల కొప్పునుండి సడలించిన దామములను యథాస్థానమునఁ బెట్టగా, ఆ మాలలు ప్రభునకు సమర్పింపఁబడి యాదరింపఁబడుటచే — 'శూడి' యను శబ్దమునకు 'ధరించి' అను నర్థమై, సము దాయమున - 'ధరించిన పూల మాలలను సమర్పించినది' అను నర్థము నిచ్చు 'శూడి క్కొడుత్తాళ్' అను పదము వ్యవహార నామమై యొప్పినది. పై నిర్వచనము లన్నింటిలో - ఈ కట్టకడపటి నామమే భక్తుల చిత్తముల నధికముగ నాకర్షిం చిన కతమున, పండిత ప్రభు వగు శ్రీకృష్ణదేవరాయలు గోదా చరిత్రమును ఉత్తమ ప్రబంధముగ తెలుఁగు భాషలో రచించి, తన ప్రబంధమునకు - 'శూడి క్కొడుత్తాళ్' శబ్దపర్యాయమైన 'ఆముక్త మాల్యద' యని నామకరణము చేసెను.

ఆండాళ్ ద్రవిడ భాషయందు రచించిన రసవత్తమములగు రెండు ప్రబంధ ములలో - 'మార్గళి త్తింగళ్' అని యారంభించి, ముప్పది పాశురములలో నిర్మించిన 'తిరుప్పావై' ప్రబంధము మొదటిదియు - 'తైయొరుతింగళ్' అను యారంభించి, నూటనలువదిమూడు పాశురములలో నిర్మించిన 'నాచ్చియార్ తిరుమొళి' రెండ వదియునై యున్నది. మొదటి ప్రబంధము యొక్క వ్యాఖ్యానమే రెండవ ప్రబంధమై యొప్పుటచే — 'తిరుప్పావై' యందలి తత్త్వమును చెప్పిన 'ఆండాళ్ శ్రీసూక్తి' యని తలఁపవచ్చును. వేదాంతములలో నిష్కర్షింపఁబడిన తత్త్వత్రయ సిద్ధాంతము తేటతెల్లముగ దేశభాషలో పరివర్తనము చేయుటకే - 'తిరుప్పావై' యవతరించిన దనుట - 'శూడిక్కొడుత్త శుడర్క్కొడియే' ఇత్యాది ప్రశంసలచే తెలియుచున్నది.

ప్రబంధ మర్యాద ననుసరించి, తత్త్వ హిత పురుషార్థములను ఈ ప్రబంధము వివరించుచున్నది. అందు, పరమ చేతనుఁడగు నారాయణుఁడు శ్రీసహాయుఁడై, చేతనులకు ప్రాప్యుఁడై, పరమ తత్త్వమై యున్నాఁ డనియు, ఆతని నామ స్మరణము-భజనము-శరణ వరణము చేతనులకు హిత మనియు, దానిచే ప్రీతుఁడగు పరమ పురుషుని మూలమున భగవత్కైంకర్య లాభ మను పురుషార్థము కలుగు

సనియు నిరూపించుట గోదయొక్క సంకల్పము. ఈ గ్రంథము గోదయొక్క అనుభవ పరీవాహము. ఆమె వైదుష్య పటిమచే నిబిడ స్యూతమై, లోకోత్తర మాధుర్యమును చెంది - 'సు సుఖం కర్తు మవ్యయమ్' అనునట్లును పరమ భోగ్యమై- 'తిరుప్పావై' ప్రబంధ రూపముగ నవతరించినది. ఈ ప్రబంధ మందలి ఒక్కొక్క పాశురమును రసికు లగు నధ్యేతలు రసాస్వాదము చేసి యనుభవించు నప్పుడు ఆ యా ఘట్టములను ప్రత్యేకముగా నొక్కొక్క చిత్రముగ తమ హృదయ ఫలకము లందు చిత్రించుకొని, అంతర దృష్టిచే సార్వకాలికముగ దర్శించి యానందింతురు.

"ఆదిరాజ యశోబింబ మాదర్శం ప్రాప్య వాఙ్మయమ్
తేషా మసన్నిధానేఽపి న స్వయం పశ్య నశ్యతి."— (కావ్య దర్శిని: 1 సర్గ)

అను నాచార్య దండి శ్రీసూక్తికి ప్రబంధము పరమోపచితమైన లక్ష్యము కాఁగలదు. ఇందలి కథ నిటు సంగ్రహింపఁ దగును.

కృష్ణావతారము ద్వాపరయుగమున మధురా నగరములో నవతరించిన కృష్ణుఁడు - 'ఒరుత్తి మగనాయ్' పాశురమున చెప్పినట్లు, గోకులమందునందు నింటికి తేఁబడి, కొంతకాల మచ్చట వసియించెను. కృష్ణావతారము తనకు మృత్యువని భయపడిన కంసుఁడు తనకంటఁ బడకుండ, రహస్యముగ బెరుగుచున్న యాతని సంహరించుటకై పలు విధములగు వ్యర్థ ప్రయత్నములు చేసెను. 'ఆత్మానం మానుషం మన్యే' అను నట్లు అవతార పరిసమాప్తి వఱకు అవతార రహస్యమును ప్రకటము చేయక, దాచి యుంచిన రామావతారమందు వలెఁ గాక-'త మద్భుతం బాలక మంబుజేక్షణమ్' అనునట్లు జననము నుండియే అవతార రహస్యమును వెల్లడించి తన ఈశ్వర స్వభావమును అవకాశము కలిగినపుడెల్ల వ్యక్తముగ ప్రకాశింపఁ జేయ సంకల్పించిన కృష్ణభగవానుఁడు తన అతిమానుష శక్తిచే, కంసుని మాయోపాయముల నవలీలగ పరిహరించి, 'స్వజనస్య చ రక్షితా' అను నట్లు గోపులకును, గోపాలకును ఆప్త బంధువై, గోకులమును కాపాడుచుండెను. ఇట్లే—తన దివ్యమోహన సౌందర్యముచే విశేషించి గోప కన్యకల చిత్తముల నాకర్షించి, వారలతో స్వైరముగ విహరించుచుండెను. గోప వృద్ధులు కృష్ణుని చేష్టలం దసూయఁ జెంది, తమ కన్నియలను కృష్ణుని కంట బడకుండ గృహము లందు నిర్బంధించుచు వచ్చిరి. కృష్ణునకీ నిర్బంధ మసహ్యముగఁ దోఁచెను. గోప కన్య లనన్యముగ తన యందు ప్రేమ గల్గియుండుటయే ఇందుకు కారణము.

కాఁగా - గోప కన్యకల బంధము తొలఁగించుటకై కృష్ణుఁ డొక యుపాయమును యోజించి, గోకులమం దనావృష్టిని కల్పించెను. గో ధనులగు గోపకులు అనావృష్టిచే తమ పశు సంపద సన్నగిలగా భయ మంది, త న్నివారణమునకై చింతించి, తమ పూర్వుల యాచారము ననుసరించి, యొక వ్రతమును తమ కన్యకలచే ఆచరింపఁ జేయుటకు నిర్ణయించి, ఉత్పాత భూయిష్ఠ మగు గోకులమందు తమ వ్రతము నిర్విఘ్నముగ పరిసమాప్తి యగుటకు సమర్థుఁడైన కృష్ణుని సాయము నపేక్షించి, అతని నర్థించిరి. కృష్ణుఁడు వారల రాకకు మానసికముగ స్వాగత మొసఁగియు, తా నట్టి భారము వహింపఁ జాలనని వెనుదీయు వానివలె చెప్పుచు, తుదకు అనన్య గతికులగు వారలచే నిర్బంధింపఁబడి, వారల యభ్యర్థనమున కంగీకరించెను. అది మార్గ శీర్ష మాసము. పూర్ణిమా శుభ దినమున వ్రతారంభము పెద్దలచే నిర్ణయింపఁబడినది. ఆ దినమున బ్రాహ్మ ముహూర్తమందు సు ముహూర్తము నిశ్చయింపఁబడినది. వ్రేపల్లె యందలి ఐదు లక్షల ఇండ్లలోని కన్యక లందఱును తప్పక నిర్దిష్ట కాలమున వ్రత సంకల్పము చేసి, తమ తమ ఇండ్లనుండి గోష్ఠిగా బయలుదేరి, కృష్ణుని మందిరమున కేఁగి, అతని వెంట నిడుకొని, వ్రతోపకరణములను దీసికొని, యమునా నదికి వెళ్ళి, అతనితో స్నాన మాడవలయును. ఇదియే- 'నీరాట్ట' మను వ్రతము నాచరించుట. ఇది వారల కార్యక్రమము. ఎవ్వ రైనను ప్రాలుమాలికతో తమ గోష్ఠిలో చేరకుండినంతట, మేల్కొనిన వారలు రానట్టి వారల గృహముల కేఁగి, వారలను మేల్కొలిపి, వారలను సైతము వెంట నిడుకొని పోవలెనని వారల శపథము. ఈ గోష్టిని నిర్వహించు భారము వారిలో మేధావిని యగు నొక కన్యకామణి వహించెను. ఆమె ముందుగా నిద్ర లేచి, తన చెలికత్తియలను బిలువ నారంభింపఁగా, చాలమందిచేరి, ఒక్క గోష్ఠిగా నేర్పడెను. ఆ గోష్ఠి బయలుదేరి, తమ వ్రతోద్దేశము నెలుగెత్తిపాడుచు, వ్రతారాధ్యుఁడు శ్రీమన్నారాయణుఁ డనియు, ఆ వ్రతము ననుష్ఠింపవలసిన ప్రకార మిట్టి దనియు, వ్రతాచరణము వలన దుర్భిక్షము తొలఁగు ననియు చెప్పుచు, తమతో చేరెడి కన్యలను తమతో చేర్చికొనుచు, కృష్ణనామ సంకీర్తనము చేయుచు సాగిపోవుచుండెను. పారఁజూచినంతలో - తమ గోష్ఠిలో చేరఁ దగిన కొందఱు గోష్ఠిలో లే కుండుటను కనిపెట్టి, అట్లు రానివారలను గూడ పిలచుటకై, ఆ గోష్ఠి - క్రమముగ వారల యిండ్ల కేఁగి, వారలను మేల్కొలిపి, తమతో చేర్చుకొని, కృష్ణుని మందిరమునకు బోయి, బహి ర్ద్వారమున కావలియున్న ద్వారపాలకుని బ్రార్థించి, అతని యనుమతిని బడసి, లోని కేఁగి, అచ్చట శయనించియున్న నందుని,

యశోదను నిద్ర లేపి, వారి యనుమతిని లోపల కేఁగి, అచట నిదురించెడి బల భద్రుని బిలిచి, అతని ప్రార్థించి, పురుషకారమునకై మొదట - 'నప్పిన్న పిరాట్టి' యను కృష్ణుని భార్యను బిలిచి, ఆమె నిదురలేవకుండుటను గనిపెట్టి, మఱల ఆదివ్య దంపతుల నిరువురను జేర్చి, సుప్రభాతము పాడిరి. నప్పిన్న పిరాట్టి వారల యందు కరుణించి, ద్వారము తెరువగా, శయనమం దున్న కృష్ణుని, ప్రక్క గల నప్పిన్నను కనులార సేవించి, భగవానుఁడు సింహాసన మధిష్ఠింపఁగా, కృష్ణ చరిత మును సాకల్యముగ కీర్తించి, మంగళాశాసనము చేసి, వ్రతోపకరణములను బడసి, అతనిఁ దోడ్కొని, యమున కేఁగి, స్నాన మాడి, అతనిచే నీయఁబడిన దివ్య భూషణ - దివ్యాంబరాదుల నలంకరించుకొని, వ్రతోద్యాపనకై అతనితో గూడి, విం దారగించిరి. వ్రత ఫలితముగ –

"ఆయు రారోగ్య మైశ్వర్యం భోగాం శ్చైవానుషంగికాన్
దదాతి ధ్యాయినాం నిత్య మపవర్గ ప్రదో హరిః."

అను నట్లును – 'విణ్ణు మాళ్వార్ మణ్ణాడే' అను నట్లును గోప కన్యలు సకల భోగముల ననుభవించిరి. వ్రతమును ప్రేరేపించిన గోప వృద్ధులును – 'శెల్వ చ్చిరు మీర్ గాళ్' 'తింగళ్ తిరుముగత్త చ్చేయిళైయార్' అనునట్లు పరమ భాగవత శిరోభూషణులగు తమ యనుంగు బిడ్డల మూలమున-'తింగళ్ ముమ్మారి పెయ్దు' అనునట్లు సమృద్ధముగ వర్షము కురిసి, పశు సమృద్ధియు, సస్య సమృద్ధియు, విస్తారముగ కలుగఁగా – కృతకృత్యులై, యానందించి రనునది 'తిరుప్పావై' ప్రబంధ మందలి యితి వృత్త సారము.

రామావతార కాలమున దండకారణ్యములో - 'పుంసాం దృష్టి చిత్తాప హారిణమ్' అను నట్లు రఘు సింహుని మోహించిన మహర్షులు కృష్ణావతారమున గోకులములో గోప కన్యలై యవతరించి, బాల్యమునుండియు కృష్ణునితో కలసి మెలసి, అతని గుణ చేష్టితముల ననుభవించుచు పెరుగుచుండిరి. యుక్త వయసు రాఁగా, వారలు - కృష్ణుఁడే తమకు భర్త కావలయునని యాశఁ జెంది, తమ యాశ నెఱవేఱుటకు కాత్యాయనీదేవి నుద్దేశించి, ఒక్క వ్రత మాచరించి, తమ యభీష్టమును పొందిన వ్రత కథ శ్రీ మద్భాగవతమందు కలదు. ఇట్లే - స్కాంద పురాణమున మఱి యొక కథ ఇంచుక మార్పుతో గన్పట్టు చుండెను. ఈ కథలు పై ప్రబంధమునకు మూలముగ నుండ వచ్చు నని పూర్వులు వ్యాఖ్యానించి

యున్నారు. పారమైకాంత్య ధర్మము నుద్ధరించుటకై యవతరించిన భాగవత శిఖామణి యగు విష్ణు చిత్తులు తమ బిడ్డయగు గోదకు వ్రతోపదేశము చేయు నప్పుడు పై కథలను తగు రీతిగ సంస్కరించి చెప్పఁగా, ఈ ప్రబంధ మవతరించినది.

"ఆశిష్టో ద్రఢిష్టో బలిష్ఠః' - 'తస్యేయం సర్వావిత్తస్య
పూర్ణాస్యాత్' - స ఏకో మానుష ఆనన్దః."

అని శ్రుతి నిర్వచించిన మానుషానందమును అనన్య మగు భక్తి భావముతో భగవ దారాధనము చేయువారలు ఈ లోకమున యథా రుచిగ చిరకాల మనుభ వించి, దేహావసాన సమయములో -

"సద్యః శంఖ చక్రధరః శ్యామలాంగ శ్చతుర్భుజో భూత్వా, గగనే గరుడా రూఢః సర్వదేవ నమస్కృతః రవి మండలం భిత్వా, త స్యోపరి చంద్ర మండల మార్గేణ సర్వాన్ లోకా నతీత్య, సత్యస్థం సత్యలోకే ప్రతిష్ఠిత మనాది జగద్బీజ మశేష విశేషం నిత్యానన్ద మమృతరసపానవ త్సర్వదా తృప్తికరం శాశ్వతం పరం జ్యోతిః ప్రవిశతి."

అని కశ్యపుఁడు చెప్పినట్లు, నిత్యానంద మనుభవించుట కీ సంస్కార ముద్దే శింపఁబడినది.

లోకోజ్జీవనమునకై భూమాత గోదయై యవతరించిన రహస్యము ముందే చెప్పఁబడినది. గోద పుట్టినది మొదలు, శైశవమందును తన చిత్తమును భగవానుని యందు లగ్నము చేసి - 'పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్' అను నట్లు సర్వకాల సర్వావస్థ లందును భగవన్నామమునే స్మరించుచు -'ఉణ్ణుంశోఱ్ పరుగు నీర్' అనునట్లు తనకు ధారక భోగ్య పోషకముగ భగవానునే యనుభవించుచు తన్మయతతో కాలము గడుపు చుండెను. కాలము గడువఁగా - గోదా దేవికి పతి సంయోగ మగు వయసు వచ్చెను. ఆమె నొక కుల శీల వృత్త సంపన్నుఁ డగు వరున కిచ్చి - 'ప్రత్యర్పిత న్యాస ఇవాన్తరాత్మా' అనునట్లు తాను సంతోషింప వలె నని తలఁచి, విష్ణు చిత్తులు వరాన్వేషణమునకై చింతించుచుండిరి. ప్రత్యక్షము గను, పరోక్షముగను ప్రసంగించెడి తండ్రి ప్రస్తావములను తెలిసికొనుచున్న ఇంగితజ్ఞ యగు నామె - తండ్రి ప్రయత్నమును వారించుచు, తన ప్రయత్నమును వేరు విధముగ నాయన కెఱింగించుచుండెను. తనకు ప్రాకృతుఁ డగు పురుషుఁ డెవ్వఁ డును భర్త కాఁజాలఁ డనియు, తన యాత్మయు - తన శరీరము కూడ పరమ

పురుషుఁ డగు శ్రీమన్నారాయణుని చరణారవిందములందు సమర్పింపఁబడి యుండుటచే, అట్టి పురుషోత్తముఁడే తనకు వరుఁడై, పరిణయమాడఁగలఁ డనియు ఆమె నిశ్చయమును తన తండ్రికి నివేదించెను. అట్లే - భగవత్కైంకర్య మందలి యుత్కంఠయు, లౌకిక భోగములందు వైముఖ్యమును ఆమెయం దుండుటను గాంచిన విష్ణుచిత్తులు మారు పలుకక, తన వరాన్వేషణ యత్నమును విరమించుకొని, సాక్షియై, భగవత్సంకల్పమున కెదురు చూచు చుండెను. ఆమె - భగవద్విరహమును సహించ లేక, భగవద్గుణానుసంధానముతో పాడినదే - 'నాచ్చియార్ తిరుమొళి' ప్రబంధము. ఇందలి విప్రలంభ శృంగారము వర్ణనాతీతమైనది. ఇందలి యుల్లేఖములు అనన్యాదృశములు. నానాఁటి కామెకు శరీరయాత్ర దుర్భరమైపోవుచుండెను. ఈ దీనావస్థను జూచుచున్న పరిసర వర్తులగు భాగవతోత్తములును, విష్ణుచిత్తులును, దుస్సాధ మగు నామె మనోరథమును గుఱించి బహుభంగుల బరామర్శించి, తాత్కాలికముగ నామె యాశ్వాసము నొందు నటుల పూర్వోక్త వ్రతమును వైష్ణవ పారమ్య బోధకముగాఁ బరిష్కరించి యుపదేశింపఁగా, గోద - జాగరూకతతో విని, తనకు కాలక్షేపమున కీ వ్రతము తగియున్నదని నిశ్చయించుకొని, వ్రతానుష్ఠానమున కుపక్రమించెను. శ్రీవిల్లిపుత్తూరు నగరమును గోకులముగను, వటపత్రశాయి దేవుని కృష్ణుఁడుగను, దేవాలయమును కృష్ణుని మందిరముగను, నగరమందలి సమాన వయసు గల కన్యకలను గోప కన్యకలుగను, తన్ను గోష్ఠిని నిర్వహించెడి నాయికగను ఎంచుకొని, వ్రతమును సాగించి, ఆశ్వాసము చెందుచుండెను. ఒకప్పుడు భగవానునకై కట్టఁబడిన పుష్పమాలలచే తా నలంకరించుకొని, వానిని భగవానున కంపఁ జేయుచుండెను. ఇట్లు చేయఁబడిన వ్రతమునకు ఫలముగ వ్రతాంతమున శ్రీరంగనాథునిచే నాహ్వానింపఁబడి ఆయనకు పరిణయము గావింపఁబడి, తన యభీష్టము సిద్ధింపఁగా, అవతారము నుపసంహరించుకొనెను.

ఆండాళ్ ప్రబంధముల కనేకార్థములు కలవు. శ్రీమద్రామాయణము మొదలుగాఁ గల మహా ప్రబంధములు యథార్థముగ నొక్క కాల విశేషమందు జరిగిన చరిత్రమును బోధించునవే యైనను - ఆ చరిత్రముల నుండి నిగూఢము లగు నర్థాంతరములు కూడ సంగ్రహింపఁ దగును.

"దశేన్ద్రియాననం ఘోరం యో మనో రజనీచరమ్
వివేక శర జాలేన శమం నయతి పండితః." — (సాత్త్వత సంహిత)

అను నట్లును —

"దర్పో దగ్ర దశేన్ద్రియానన మనోనక్తం చరాధిష్ఠితే
దేహేఽస్మిన్ భవసిన్ధునా పరివృతే దీనాం దశామాస్థితః
అద్యత్వే హనుమత్సమేన గురుణా ప్రఖ్యాపితార్థః పుమాన్
లంకారుద్ధ విదేహరాజ తనయా న్యాయేన లాలప్యతే."

— (సంకల్ప సూర్యోదయము)

అనియు - రామాయ ణార్థమును భంగ్యంతరమున శ్రీ వేదాంత దేశికులు వ్యాఖ్యానించినట్లు- 'తిరుప్పావై' ప్రబంధము తత్త్వత్రయ సిద్ధాంతమును వాచ్యము గను, వ్యంగ్యముగను పూర్ణముగ నుపదేశించుచు, ప్రపత్తి యోగమును ప్రత్యేక ముగ బోధించుచున్నది. ఇట్లు సిద్ధ మగు నర్థాంతరమును అంతరార్థ మనియు, వాచ్య మగు నర్థమును శబ్దార్థము లేక బాహ్యార్థ మనియు సంప్రదాయజ్ఞులు వ్యవహరింతురు. ఈ సందర్భమున పై రెండు వ్యవహారములను క్రమముగ స్వాపదేశ మనియు, అస్వాపదేశమనియు, వ్యవహరించుట కలదు.

ఈ ప్రబంధమున - 'పాశురములు' అను భాషా వ్యవహారము గల ముప్పది పద్యములు కలవు. ఐదేసి పాశురము లొక్కొక ప్రకరణముగాఁ జేయఁబడి, ఆఱు ప్రకరణములుగ విభక్తమై యున్నది. ప్రథమ పంచకమున ఉద్దిష్ట వ్రత స్వరూపమును బోధించెడి ఉత్పత్తి విధియు, అంగ ప్రధాన సంబంధ బోధక మగు వినియోగ విధితో జేరి, క్రమ బోధకమగు ప్రయోగ విధియు మొదటి రెండు పాశురము లందు క్రమముగ చెప్పఁబడినవి. మూఁడవ పాశురమందు ఫల సంబంధ బోధక మగు అధికారి విధి యందు గోప వృద్ధు లుద్దేశించిన సువృష్టి ఫలమును, ఐదవ పాశురమున సంయోగ పృథక్త్వ న్యాయముచే అపవర్గ ఫలమును చెప్పఁబడినవి. మఱియును - ఈ యైదవ దగు 'మాయనై మన్ను' పాశురమున వైదిక సకల సంప్రదాయ సిద్ధ మగు తత్త్వ హిత పురుషార్థముల స్వరూపము సంగ్రహముగాఁ జెప్పఁబడినది. తక్కిన ప్రబంధ మంతయు ఈ పాశురమునకు వ్యాఖ్యానమై యున్నదనియు చెప్ప వచ్చును.

ఇందు - రెండు మూఁడు పంచకములలో - చెలికత్తెలను మేల్కొలుపుట, నాలు గైదులలో పురుషకారాన్వేషణము, ఆఱులో - ఉపాయ ప్రార్థనము చెప్పఁ బడియున్నది.

## 'మాయనై' పాశుర విశేషము

'కారణం తు ధ్యేయః' అని వేదాంతములలో కారణమై, ఉపాస్యముగ విధింపఁబడిన పరబ్రహ్మ మగు పర తత్త్వము సౌశీల్య సాగరుఁడై, గోకులమం దవతరించిన శ్రీ కృష్ణుఁడే యనియు - అతనిని భక్తియోగముచేతను, ప్రపత్తి యోగముచేతను ఆరాధించుటయే కర్తవ్య మనియు, ఆ యారాధనముచే ప్రీతుఁ డగు పరమ పురుషుని కైంకర్యమే పురుషార్థ మనియు, ఈ పాశురమున నిష్కర్షిం పఁబడినది. 'మాయనై' ఇత్యాదిచే పర స్వరూపము — 'తూళుదు' 'పాడి' 'చిందిక్క' ఇత్యాదిచే పూర్వోక్త మగు నుపాసనా స్వరూపము - 'పోయ పిళై యుం' ఇత్యాదిచే-'ఉత్తర పూర్వాఘయో రశ్లేష వినాశౌ' 'తద్యథేషీక తూలం' ఇత్యాదిచే చెప్పఁబడిన సకల పాప నివృత్తియుఁ, మోక్షప్రాప్తియు చెప్పఁబడినది.

### తత్త్వము

మఱియు - 'మాయనై' యనుటచే చెప్పఁబడిన కృష్ణాఖ్య పరతత్త్వము సకలావతారకందమైనదియు, అశేష చిద చిత్ప్రకారక మైనదియు, ఉపక్రమోప సంహారాది తాత్పర్య లింగములచే స్పష్ట పరుపఁబడినది. 'నారాయణనే నమక్కే పఱై తరువాన్' 'నాయక ప్పెణ్ పిళ్ళాయ్ నారాయణన్'-'నాత్తత్తుళాయ్ ముడి నారాయణన్' ఇత్యాదులచే మూల మంత్రార్థము సంగ్రహింపఁ బడినది. ఇందలి ఏవకార్థమగు 'నారాయణనే' యందలి ఏవకారముచే, దేవతాంతర - మంత్రాంతర - సాధనాంతర వ్యావృత్తియు చెప్పఁబడినది.

అట్లే - తత్త్వముగ చెప్పఁబడిన నారాయణుఁడు పురుషకారభూత యగు మహాలక్ష్మితో కూడియే ఉపాస్యుఁ డనియు, ఫలప్రదుఁ డనియు, 'మామాయన్ మాదవన్' - 'వంగక్కడల్ కడైన్ద మాదవనై కేశవనై' ఇత్యాదులందు సూచింపఁ బడినది. ఈ నిష్కర్షము క్షీరసాగరమథనా కర్తృత్వమున వ్యక్త మగుటను కడవటి పాశురమున గోదాదేవి స్పష్ట పరచినది. లక్ష్మి సన్నిధిని లేకుండుటను భగవానుఁడు చింతించి, నష్టప్రాయమగు త్రైలోక్యము నుద్ధరించెడి వ్యాజమున మహత్తర మగు ప్రయత్నము చేసి దేవ దానవ యుద్ధమును సంకల్పించి సముద్ర మథనము నారంభించెను. క్షీరోదధిని పాత్రముగను, మంథరాద్రిని కవ్వముగను, వాసుకిని త్రాడుగను జేసి, దేవాసురులను రెండు పక్షములుగ

నిరుపార్శ్వము లందు నుద్యోగింపఁ జేసి, క్షీరోదధిని మథియింపఁ జేసెను. దృఢ మగు నాధారము లేక, మంథర పర్వతము పాతాళమునకు క్రుంగి పోవుచుండ, ఆ పర్వతమును భగవానుఁడు కూర్మ రూపముతో తన పృష్ఠభాగమున పదిల పరచియు, పర్వత మూర్ధ్వమునకు తేలిపోకుండ నూర్ధ్వ పట్టికయై నొక్కి పట్టియు ఉద్దిష్ట పదార్థముల నుత్పత్తి చేయుటకు తగిన తీవ్ర మథన మొనర్చు నిమిత్తము దేవాసురుల బలము చాలకపోఁగా, తానే మథనమును ఫల పర్యవసాయిగ సాధించియు, వలయు పదార్థ జాతము నుద్ధరించి, అందు పరమోద్దిష్టమై యవతరించిన మహాలక్ష్మిని పరిగ్రహించిన చరిత్ర మిచ్చటి 'మాధవ' శబ్దముచే సూచింపఁబడినది. మహాలక్ష్మి యవతరించిన తీరును చూచుచున్న దేవత లందఱును లక్ష్మి రూప లావణ్యములను జూచి భ్రమ జెంది, ఆ యమ తమలో నొక్కొక్కరను వరియింపఁగూడు నని ఒక్కొక్కరును తలపోయుచుండఁగా - 'యయౌ వక్షఃస్థలం హరేః' అను నట్లు ఆమె భగవానుని వక్షఃస్థలమును చేరఁగా చూచి, బ్రహ్మాశాదులు లజ్జ పడి, లక్ష్మీపతిత్త్వ లాభముచే, నారాయణుఁడే దేవాధి దేవుఁ డగునని నిర్ణయించుకొని, ఆ దివ్య దంపతులకు నమస్కరించి, స్వ స్థానముల కేగిరి. అప్పుడే-

"క ఇతి బ్రహ్మణో నామ ఈశోఽహం సర్వదేహినామ్
ఆవాం త వాంగే సంభూతౌ తస్మా త్కేశవ నామవాన్."

— (హరి వంశము : 131-48)

అని భగవానునకు కేశవ నామమును, లక్ష్మీపతిత్వ ప్రయుక్తమైన పర తత్త్వమును ఖ్యాపించిన కథ ఇం దనుసంధేయము, పైయంశమునే నిరూపించుచు, పూర్వాచార్యులు - 'అపాంగా భూయాంసోయ దుపరి పరంబ్రహ్మ తదభూత్' అనియు - 'య దర్థ మంభోధి రమన్థ్య బన్ధి చ, అనియు - 'వేదాన్తా స్తత్వచిన్తా మురభి దురసి యత్పాద చిహ్నై స్తరన్తి' ఇత్యాది సూక్తులతో స్తుతించి యున్నారు.

లక్ష్మి నారాయణ రూపమగు నీ తత్త్వము చేతనులకు మోక్ష ప్రాప్తికి ఉపాయము-ఉపేయమునై యున్న దను నంశము-'కుత్తు విళక్కెరియ' 'మువ్వత్తు మూవర్' పాశురములందు చెప్పఁబడినది. ఈ పురుషకారత్వమను విలక్షణ మగు నాకారాంతరము కల దను నంశము - 'ఉందు మదకళిత్తన్' పాశురమందు చెప్పఁబడినది. ఈ యెడ నిచ్చటి ఉపాయత్వము, ఉపేయత్వము, పురుషకారత్వము నను పదములకు వివరణము తెలియుట అవసర మగును. ఉపాయత్వ మనునది

మోక్ష ప్రధాన సంకల్పాశ్రయత్వము. అనఁగా-ఒకానొక చేతనునకు మోక్షము నిచ్చుటకు అధికారము సహాధికార నియతిచే లక్ష్మీ నారాయణు లిరువురి యందును సమష్టిగ నున్న దనుట చెప్పును. లక్ష్మీ నారాయణు లిరువురును ఏక మనస్కులై సంకల్పింతు రని యర్థము. ఉపేయత్వము కైంకర్య ప్రతిసంబంధిత్వము. అనఁగా-చేతనుఁ డొనర్చెడి కైంకర్యమును స్వీకరించెడి యర్హతను కలిగి యుండుట యనఁ దగును. పురుషకారత్వ మనఁగా - ఘటకత్వము. అనఁగా - చేతనునకు మాతృ స్థానమున నిలిచి, అతనికి భగవ దాభిముఖ్యమును కలుఁగ జేసియు, భగవానునకు గృహిణీ స్థానమున నిలిచి, అతని చేతన రక్షణోన్ముఖుని జేసియు, ఉభయులను కృతకృత్యులఁ జేయుట యగును. పురుషకారమున నన్వయించెడి లక్ష్మికి ఉపాయత్వ కోటియం దన్వయించుటలో ఔచితి లే దని చెప్పి, ఆమెను ఉపేయత్వ కోటిలో మాత్రము చేర్చుటను కొంద ఱాచార్యు లంగీకరింతురు. వీరు లక్ష్మికి విభుత్వమును కూడ అంగీకరింపరు.

ఇచ్చట - 'ఉందు మదగళిత్తన్' పాశురముచే ముందుగా నప్పిన్నపిరాట్టిని మేల్కొలుపుటలో ఆమె పురుషకార ముద్దేశింపఁబడినది. పురుషకారము లక్ష్మికి మాత్రమే అసాధారణాకార మైనను - 'యాభిస్త్వం స్తన బాహు దృష్టిభిః' ఇత్యాది ప్రమాణములచే భూ - నీళాదు లందును సంగతము కాఁగలదు. 'నప్పిన్న పిరాట్టి' నిదుర లేవక పోఁగా - తరువాతి 'కుత్తు విళక్కు' పాశురముచే మహార్హ పర్యంకమున - 'అశిథిల పరిరంభ పరిరంభవ్యాపృ తైకైక దోష్ణోః' అను నట్లు దేహ భేదము తెలియకుండునట్లు గాఢ పరిష్వంగ లీలచే నమరియున్న దివ్యదంపతు లను మేల్కొలిపిరి, భక్తజన ప్రార్థనా వశంవదులై. ఆ దంపతులు మేల్కొని, తమ పరిష్వంగమును వీడి, తమ దివ్యావయవ సౌందర్యము ప్రకాశ మగునట్లు వారలకు సేవ యొసఁగఁగా - వార లా దృశ్యమును సేవించి, తమ కోర్కెలను నివేదించిరి. ఇచ్చటి యుపాయ మగు భగవానుఁడు సిద్ధోపాయమై, సాధ్యోపాయ మగు భక్తి ప్రపత్తుల సిద్ధిని సమకూర్చుట యెఱుఁగునది.

మఱియు నీ తత్త్వము చేతనులతో అపినాభావ సంబంధము కలదై - 'ఈశ్వర స్సర్వ భూతానాం' అను నట్లు అంతర్యామియై యుండుటయే గాక, సకల విధము లగు సంబంధములు కలిగియున్న దను నంశము 'కఱవైగళ్' పాశురమున 'ఉఱవేల్ నమక్కిం గొళిక్క ఒళియాదు' అను మొదలగు వాక్యములచే వ్యక్త పరుపఁబడినది. ఈ సంబంధములు —

"మాతా పితా భ్రాతా నివాస శ్శరణం సుహృద్గతి ర్నారాయణః."

అను శ్రుతియందు సూచింపఁబడియున్నవి. వానినే శరీర శరీరి భావ సంబంధ మనియు - స్వ స్వామి సంబంధ మనియు - నాయకీ నాయక భావ సంబంధ మనియు ఇట్లు గాఢాను బంధమును నిరూపించుచు, అనేక విధములుగ సంప్రదాయజ్ఞు లుల్లేఖించుట కలదు. ఈ యర్థమునే ఆళవందారులు —

"మాతా పితా యువతయ స్తనయా విభూతిః
సర్వం యదేవ నియమేన మదన్వయానామ్
ఆద్యస్యనః కులపతే ర్వకులాభిరామం
శ్రీమ త్తదంఘ్రియుగలం ప్రణమామి మూర్ధ్నా." —(స్తోత్ర రత్నము)

అని భగవానునియందలి వివిధ సంబంధమును ఆచార్య పాదముల యందును అనుసంధించిరి. జీవేశ్వరులకు నవ విధ సంబంధములు కలవని చెప్పి, వానిలో - నాయకీ నాయక భావ సంబంధము అత్యంత మనురూపమైన దనియు-అందువలననే ఆళ్వారులు పెక్కుమంది విప్రలంభ శృంగారము ననుభవించిరనియు చెప్పుట కలదు. శ్రీవిష్ణు చిత్తులు మాత్రము ఒక విలక్షణానుభవముతో తాను మాతృస్థానమం దుండి, భగవానుని పుత్త్ర భావముతో పాశురములఁ బాడిరి.

మఱియును ఈ తత్త్వము —

"సవా ఏష పురుషః పంచధా పంచాత్మా."

అను శ్రుతి ననుసరించి, విష్ణు పురుష సత్యాచ్యుతానిరుద్ధ రూపమున నైదు వ్యూహములుగనై, పర వ్యూహ విభవానంత ర్యామ్య ర్చా స్వరూపమున నైదు ప్రకారములై యున్న విధము ఈ ప్రబంధమున మొదటి పాశురములో చెప్పఁబడినది. మొదటి పాశురమున నారాయణ శబ్దముచే భగవానుని పర స్వరూపమును, రెండవ పాశురమున - 'పార్కడలుళ్' 'పైయత్తుయిన్న' ఇత్యాదిచే క్షీర సాగర శాయి యగు వ్యూహ స్వరూపమును. మూఁడవ పాశురమున - 'ఓంగి ఉలకళన్ద' ఇత్యాదిచే విభవ స్వరూపమగు త్రివిక్రమావతారమును చెప్పఁబడినవి. విభవావ తారము లనేకములలో భక్తుల నధికముగ నాకర్షించినది త్రివిక్రమావతార మైయున్నది. అయాచితముగను - అధికారి తారతమ్యమును పరామర్శింపక 'విచక్రమే పృథివీ మేషః' అను నట్లు మూఁడడుగులచే మూఁడు లోకములను కొలచినపుడు తన పాద న్యాసముచే త్రిలోకము లందలి చరాచరములను పవిత్రితము

చేసి, తన కందలి స్వామిత్వమును గుఱుతువెట్టిన యవతార మగుటచే విభవములం దాదిగ గోదా దేవికి త్రివిక్రమావతారమందు భగవానునకు 'తస్యోదితి నామ' అని చెప్పినట్లు ఉ చ్ఛబ్దమునకు 'తమప్' ప్రత్యయమును చేర్చి - 'ఉత్తమన్' అని కొనియాడినది. ఇంకను, ఇతరావతారములందు వేనియందుఁ గాని ధర్మ సంస్థాపన నిమిత్తముగ శ్రుతి సంహారము రక్తపాతము లేకుండ జరుగు కుండుటయు – ఈ యవతారమం దట్టి సంఘటనములేక అవతార ప్రయోజనము సిద్ధించుటయు ఇందలి మఱి యొక విశేషము భక్తుల నాకర్షించినది.

"అశేష మవిశేషత స్త్రిజగ దంజనా ద్రీశితుః
చరాచర మచీకర చ్చరణ పంకజే నాంకితమ్." — (దయా శతకమ్ : 85)

త్రివిక్రమ రూప ధారి యగు శ్రీనివాసుని పాద కమలములచే, అంతటను జంగమ స్థావర మయ మగు స్వర్గ మర్త్య పాతాళము లనఁబడు మూఁడు జగంబులును ముద్రిత మగునట్లు చేసితివి' అను శ్రీ వేదాంత దేశికుల శ్రీసూక్తి ఇట జ్ఞప్తియం దుంచుకొనునది. అనుష్ఠింపఁబోయెడి తమ వ్రత ఫలముగ పరిణామ మయ్యెడి సస్య సమృద్ధి కూడ త్రివిక్రమ జ్ఞాపకముచే అట్లే వర్ణింపఁబడినది.

ఇట్లే - నృసింహావతారమును గూడ ఆండాళ్ ఎక్కువగ నభిమానించినట్లు మొదటి పాశురమునందలి-'యశోద ఇళం శింగమ్' అను వాక్యము చేతను-'మారి మలై ముళింజిల్' పాశుర రూపము చేతను తెలియుచున్నది.

నృసింహావతారము కూడ గహన మైనది. ఇత రావతారములందు భగవానుఁడు-'స హి దేవై రుదీర్ణస్య' అనునట్లు చాలకాలము అనేకులచే ప్రార్థింపఁబడి, ఒక్క యసురుని సంహరించుట కవతరించెను. నృసింహావతారమునందు అసుర శిశు వగు ప్రహ్లాదుని వాక్యమును తథ్యము చేయుటకై తానుగా –

"భక్తస్య దానవశిశోః పరిపాలనాయ
భద్రాం నృసింహ కుహనా మధిజగ్ముష స్తే
స్తంభైకవర్జ మధునాపి కరీశనూనం
త్రైలోక్య మేత దఖిలం నరసింహ గర్భమ్." — (వరదరాజ పంచాశత్ : 23)

అని చెప్పినట్లు, జగత్తునందలి సకల పదార్థము లందును నృసింహరూపియై ప్రవేశించిన మహిమా విశేషముచే నృసింహావతారము కూడ భక్తుల నాకర్షించు

చున్నది. ప్రహ్లాదుఁడు నృసింహావతారము నెన్నఁడును ప్రార్థింపలేదు. భగవానుఁడు సర్వాంతర్యామి యను వాదమే యాతనిది. ఆతని వాదమున కనుకూలముగనే భగవానుఁడు నృసింహ రూపమును ధరించెను.

మఱియు — 'పుళ్ళుం శిలంబినగాణ్' పాశురమున ఒక్క చోటనే పర వ్యూహాది పంచకము కీర్తింపఁబడినది. 'పుళ్ళరయన్ కోయిల్' ఇత్యాదిచే అర్చావతారమును — 'పేయములై నంజుండు' ఇత్యాదిచే విభవావతారమును 'వెళ్ళత్తరవిల్' ఇత్యాదిచే —

"క్షీరసాగర తరంగ శీకరా సారతారకిత చారుమూర్తయే
భోగిభోగశయనీయ శాయినే మాధవాయ మధువిద్విషే నమః."

— (ముకుంద మాల : 39)

అని చెప్పఁబడిన వ్యూహ స్వరూపమును — 'విత్తినై' యనుటచే మూల కారణ మగు పర స్వరూపమును — 'ఉళ్ళత్తు క్కొండు' ఇత్యాదిచే అంతర్యామి స్వరూపమును సూచించినట్లు చెప్పుదురు. అర్చావతారమందలి సౌలభ్యముచే దాని ప్రాధాన్యమును ప్రకటించుటకై వ్యతిక్రమముగ పాశు రారంభములో అర్చా స్వరూపము నివేశము చేయఁబడినది. ఈయర్థము శ్రీవైఖానస భగవచ్ఛాస్త్రమం దిట్లు నిరూపింపఁబడి యున్నది.

"నిత్యముక్తోప భోగ్యత్వా త్పర వ్యూహాత్మనో హరేః
తత్కాల సన్నికృష్టైక లక్ష్యత్వా ద్విభవాత్మనః
విశుద్ధై ర్యోగ సంసిద్ధై శ్చిన్త్యత్వా దన్తరాత్మనః
అర్చాత్మన్యేవ సర్వేషా మధికారో నిరంకుశః." — (భృగు సంహిత)

శ్రీవైష్ణవ ధర్మశాస్త్రములలో నిరూపింపఁబడినట్లు —

"ఉత్తిష్ఠం శ్చింతయ హరిం వ్రజం శ్చింతయ కేశవమ్
భుజం శ్చింతయ గోవిన్దం స్వపం శ్చింతయ మాధవమ్."— (శౌనక స్మృతి)

అను ధర్మమును గోదాదేవి ఈ ప్రబంధమున ననుసరించినది. 'మునివర్ గళుం యోగిగళుం మెళ్ళ వెళందరి యన్ద పేరరవుమ్' నిద్రమేల్కొను నంతట మహర్షులు హరినామ కీర్తనముఁ జేయుచు, వేచుచుండి రని ఆఱవ పాశుర మందును - 'కూడారై వెల్లుం శీర్ కోవిందా!' 'కుఱై ఒన్ఱు మిల్లాద కోవిందా'

'ఇత్తై పత్తై కొళ్ళా నన్ను కాణ్ కోవిందా!' అని విం దారగించునప్పుడు గోవింద నామ స్మరణ విధియు ఇరువదియేడు – ఇరువదియెనిమిది – ఇరువదితొమ్మిది పాశురములందును చెప్పఁబడినది.

> "రమన్తే యోగినోఽ నన్తే నత్యానన్దే చిదాత్మని
> ఇతి రామ పదేనాఽసౌ పరంబ్రహ్మ భిధీయతే." — (రామతారకోపనిషత్)

అని చెప్పఁబడిన రామ నామ నిర్వచనమును మనసున జీర్ణించు కొనిన గోదాదేవి పన్నెండవ పాశురమందు - 'శినత్తి నాల్ తెన్నిలంగై క్కోమానై చ్చెత్త మనత్తు క్కినియానై' అను సందర్భమున రామ నామమునకు ప్రతిపదముగ పైఁ జెప్పిన నిర్వచనార్థము నిచ్చు 'మనత్తు క్కినియానై' పదమును ప్రయోగించి నది. ఇంకను పరిశీలించిన కొలఁది, ఇట్టి వినోదప్రసంగము లెన్నియో గోదా ప్రబంధమున లభింపఁగలవు.

**హితము:**

ప్రతి పాశురమందును అంతమున వాడఁబడిన 'పఱై' అను పదముచే, సాధ్యోపాయానుష్ఠానమునకు కావలసిన వస్తు సామగ్రియు, జ్ఞానాధ్యాత్మ గుణ సంపత్తియు చెప్పఁబడుచున్నది. మొదటి పాశురమందలి 'తరువాన్' అను పదముచే జీవేశ్వరులకు నారాయణ శబ్దోక్త స్వస్వామి భావ సంబంధముచే భగ వానుఁడు తప్పక -'దదామి బుద్ధియోగం తం' అను నట్లు ఉపాదానము చేయఁ గలఁ డనియు – రెండవ పాశురమందు ద్వయ మంత్రార్థ మగు సాంగ ప్రపత్తి ప్రకారము కూడ సూచింపఁబడుచున్నది. 'పార్కడలుళ్' ఇత్యాదిచే ద్వయ మంత్ర ప్రతిపాద్యుఁ డగు నారాయణుని ద్వయ మంత్ర జపముచేతను, తద్వ్యాఖ్యాన రూపము లగు ఇతర గ్రంథ సంచయములచేతను కీర్తించుట-తదర్థాను సంధానము చేయుట - 'నెయ్యుణ్ణోమ్' ఇత్యాదిచే భగవదాజ్ఞా రూపము లగు శాస్త్రము లలో నిషేధింపఁబడిన కర్మల నాచరింపకుండుట – 'నాట్కాలే' ఇత్యాదిచే కష్ట సాధ్యము లగు ఇతరోపాయములలో మనసును పోనీయకుండుట – 'మలరిట్టు' ఇత్యాదిచే సాధారణ భక్తియోగమం దవగాహింపకుండుట – 'తీక్కుఱళై' ఇత్యాదిచే–'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' అనునట్లు నిషేధింపఁబడిన అసద్గ్రంథ ములతో ప్రొద్దు పుచ్చకుండుట – 'ఐయముం' ఇత్యాదిచే అకించన్య గోప్తృత్వ వరణములు – 'ఉయ్యుమాఱెణ్ణి' ఇత్యాదిచే మహావిశ్వాసము చెప్పఁబడి 'ఆర్ ఎణ్ణి' అనుటలో -'షట్పదోఽయం ద్విఖండః' అని లక్షింపఁబడిన ద్వయ మంత్రము యొక్క అనుసంధానము చెప్పఁబడినది. ఇట్లే –

"ఉపా యోపాయ సన్న్యాగీ మధ్యమాం వృత్తి మాశ్రితః."

— (లక్ష్మీ తంత్రము)

అను నట్లు ఉపా యోపే యోభయ పరిత్యాగము చేసిన ప్రపన్నాధికారి గడుపఁ దగిన దేహ యాత్రా ప్రకారమును ఈ పాశురమందు సంక్షేపించి, సూచింపఁబడి, పై ప్రబంధ మంతయు దీనికి వ్యాఖ్యానము చేయఁబడి — 'తిరుప్పావై' ప్రబంధమున కంత రార్థమై యున్నదని కొందఱందురు. ఈ నిర్వాహములో — 'మైయిట్టెళుదోమ్' ఇత్యాదిచే ఉపేయత్యాగము — 'శెయ్యాదన శెయ్యోం' ఇత్యాదిచే అపాయత్యాగము - 'ఐయముం' ఇత్యాదిచే ఉపాదాన కాలిక మగు నతిథి పూజనము — 'ఉయ్యుం' ఇత్యాదిచే స్వాధ్యాయ యోగకాలములం దైన ఆత్మోజ్జీవన కృత్యములు సూచింపఁబడుచు —

"ద్వాదశాక్షర తత్త్వజ్ఞః చతు ర్వ్యూహ విభాగవిత్
అచ్ఛిద్ర పంచకాలజ్ఞః సవిత్ర స్తారయిష్యతి."

అని ప్రశంసింపఁబడిన పంచకాల పరాయణునియొక్క ప్రవృత్తిని చెప్పుచున్నదనియు వారల మతము. పూర్వాచార్యు లీ ప్రబంధమునకు వారి వారి వైదుష్య విశేషముచే అనేక రీతుల స్వాపదేశార్థము లేక అంతరార్థమును అనుగ్రహించియుండు ప్రకార మిచ్చట విశదీకరించుట గ్రంథవిస్తర మగును.

'ముప్పత్తు మూవర్' పాశురమునందలి 'ఉక్కముం తట్టొళియుం' అనుటచే-వ్రతోపకరణ సామగ్రిలో కొంత భాగమును-'మాలే మణి వణ్ణా' పాశురమందు 'ఞాలత్తై యెల్లాం' ఇత్యాదిచే శంఖ మాదిగాఁ గల మఱి కొంత సామగ్రియు చెప్పఁబడుట కైంకర్య సాధనము లగు ఆ యా సామగ్రిని, అట్లే - భగవత్ప్రాప్తికి అంతరంగోపాయ మగు ప్రపత్తినిగాని చెప్పి, అయ్యవి హితకోటిలో చేరు నని చెప్పఁబడినది.

కలికాలమం దెట్టి యుత్తమాధికారియు కర్మ జ్ఞానాదులచే కడతేరుట యసంభావిత మని నిష్కర్షము నెఱింగిన ఆండాళ్ తన్ను వ్యాజముగాఁ జేసికొని, ముముక్షువుల నుద్దేశించి - 'కరవైగళ్' ఇత్యాదిచే కర్మ యోగమందును - 'అఱివొన్నుం' ఇత్యాదిచే జ్ఞాన ప్రధానములగు జ్ఞాన భక్తి యోగములందును తన కధికారము లేదనియు —

"స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేఽపి యాన్తి పరాంగతిమ్."

— (భ. గీ: 9 - 32)

అని శ్రీకృష్ణభగవానుఁడు నిర్వచించినట్లు సర్వాధికారక మగు ప్రపత్తి యోగమం దన్వయించుటకు కావలసిన అకించన్యము, అనన్యగతిత్వము అను పూర్ణాధికారము తనయందు కల దనియు చెప్పి, ఆ యధికార మే భగవ దనుగ్రహ మున కావశ్యక మని నిరూపించినది. ఈ యర్థమునే —

"పుకలొన్నిల్లావడియేన్ ఉన్నడికీజి మర్న్దు పుకున్దేనే."

అని నమ్మాళ్వారులును —

"న ధర్మనిష్ఠోఽస్మి న చాత్మవేదీ
న భక్తిమాం స్త్వచ్చరణారవిన్దే
అకించనోఽనన్య గతిశ్శరణ్య
స్త్వత్పాదమూలం శరణం ప్రపద్యే." —(స్తోత్ర రత్నము : 22)

అని యామున మునియు తమ రచనలలో స్థిరపఱచిరి.

పురుషార్థము :

భగవానునకు కైంకర్యముచేయుటయే పురుషార్థ మనుట 'వైయత్తు' పాశురమున - 'పరమనడిపాడి' అనియు - 'మాయనై' పాశురమున- మనత్తి నాల్ చిందిక్క' అనియు నామకీర్తనమును చెప్పి, 'శిత్తుం శిరుకాలే' పాశుర మున 'ఉనక్కేనామాట్ చెయిదోమ్' అని కైంకర్యమును - 'మత్తనం కామంగళ్' ఇత్యాదిచే క్షుద్రకామములం దాఁక జనింపకుండుటయు—తమ కుద్దేశ్య మనియు ప్రార్థించినది. ఇట్లే—నమ్మాళ్వారులును —'వళావిలావడిమై శెయ్యవేండు నామ్' అని పాడుటను అనుసంధించునది. కైంకర్య ప్రకారముకూడ భగవానునకు మంగళాశాసనము చేయుటయే యనుట—'అన్నివ్వులగం' పాశురమున చెప్పఁబడి నది. భగవానునకు 'తిరుప్పల్లాండు' పాడి, పెరియాళ్వారు లను అన్వర్థనామ మున ప్రసిద్ధి చెందిన విష్ణుచిత్తుల బిడ్డ యగుటచే ఆండాళునకు మంగళాశాసన ప్రవృత్తి సహజమైనది.

రసవత్తమము లగు నలంకారములను నిర్మించుటలో సిద్ధహస్త యగు ఆండాళ్ 'ఆళి మళై' 'మారి మలై' 'ఓంగి ఉలకళన్ద' 'కింగిణివాయ్చ్చెయిద' పాశురములలో చెప్పిన స్వభావోక్తులు నిరుపమానములు.

'పార్కడలుళ్ పైయిత్తుయిన్నపరమన్' 'ఓంగి ఉళకళన్ద ఉత్తమన్' 'వెళ్ళత్తరవిల్ తుయిల మర్న్దవిత్తు' 'మల్లరై మాట్టియ దేవాదిదేవన్' 'నాత్త

త్తుళాయ్ ముడి నారాయణన్' 'మామాయన్ మాదవన్ వైకుందన్' 'తెన్నిలంగై క్కోమాన్నైచ్చెత్త మనత్తుక్కినియాన్' 'శంగొడు శక్కర మేన్దుం తడక్కైయన్ పంగయక్కణ్ణాన్' 'ఉలగళన్ద ఉమ్బర్ కోమాన్' 'ఉలగినిల్ తోత్తమాయ్ నిన్న. శుడర్' 'ఆవినిలైయాన్' 'ఇరైవన్' ఇత్యాదిప్రయోగము లచ్చటచ్చట సాక్షి ప్రాయములై యమరినవి.

'మత్తెన్న పంచ శయన' శబ్దము భగవచ్ఛాస్త్రమందలి గాఢ పరిచయ ముచే ప్రయోగింపఁబడినది. దీని యర్థము—'పంచశయనాస్తీర్య' అను మరీచి తన వాక్యమును వ్యాఖ్యానించిన విధ మచ్చట చూడదగినది.

శ్రీమద్రామానుజులు నిరంతరము 'తిరుప్పావై' ప్రబంధము ననుసంధించు చుండుటచే వారికి 'తిరుప్పావై జీయర్' అను ప్రసిద్ధి కలిగియుండె నని ప్రతీతి. వా రొకనాఁడు 'తిరుప్పావై' యనుసంధానము చేయుచు – శ్రీరంగమందలి వీథులలో భిక్షకు బోవుచు, పెరియనంబిగారి యింటిముందుకుపోవు సమయమునకు 'ఉందు మదకళిత్తన్' పాశురము పఠించుట తటస్థించెను. పాశురమును ముగించి- 'వందు తిఱవాయ్' అని పలికెడి సమయమున గురువుగారి కోడలు యతిరాజులకు భిక్షను ప్రసాదించుటకై వాకిలి తెఱచి చూచెను. ఆమెను సేవించిన శ్రీమద్రా మానుజులకు ఆదృశ్యము గోదాదేవియొక్క సాక్షాత్కారముగ దోఁచ, ముగ్ధులై ఏకాగ్రతతో భూమియందు వ్రాలెను. గురు స్నుషయు ఆ యుదంతమును నంబి గారికి నివేదించినంతలో, వారు బయట కేఁగి చూచి, తల యూచుచు – 'ఉందు మదగళిత్త పాశురానుసంధానమో!' అని ఆ యనుభవమును ప్రశంసించినట్లు ఒక ఐతిహ్యము కలదు. కాఁగా—ఈ పాశురము నాఁటనుండియు 'ఉడైవరుల పాశుర' మను వ్యవహారము కలిగి, అనుసంధానవేళలందు రెండుసారు లనుసంధింపఁబడు చున్నది.

ఇట్లే – 'మారిమలై' పాశురమందు - 'సింహ విక్రాన్తగామినమ్' అను నట్లు శ్రీరంగక్షేత్రమున రంగనాథుఁడు సన్నిధినుండి వేంచేయునప్పుడు కలిగెడి గంభీరగతి జ్ఞాపక మగుటచే - 'భట్టరు' ఈ పాశురముచే నాకర్షింపఁబడి అభిమా నించినందున, ఇయ్యది - 'భట్టర్ పాశుర' మను వ్యవహారము కలిగి, రెండుమారు లనుసంధింపఁబడుచున్నది.

ఇట్లే – సంప్రదాయ సిద్ధముగ ప్రబంధాద్యంతములందలి రెండు పాశుర ములును, వ్రత ఫలశ్రుతిని చెప్పెడి మూఁడవ పాశురము, భగవన్మందిర ప్రథమ

ప్రవేశమును చెప్పెడి పదునాఱవ పాశురము, మంగళాశాసనము పాడిన ఇరువది నాలవ పాశురము ప్రబంధ సార మగు ఇరువదియేడు - ఇరువదియెనిమిది - ఇరువది తొమ్మిదవ పాశురములును రెండేసి తూరులు పఠింపఁబడుచున్నవి.

'తిరుప్పావై' ప్రబంధమును భగవద్రామానుజ మతానుయాయులు జాతి-కుల-మత-ప్రాంతీయ భేదములను పాటించక, ఐకరూప్యముగ, మహామంత్రముగ నాదరించి, తమ తమ గృహాములందును – అనేక దివ్య క్షేత్రములందును - 'తిరుప్పల్లాండు' తో చేర్చి అనుసంధింతురు.

## తిరునక్షత్ర తనియనులు

పొయిగై ఆళ్వార్ :

"తులాయాం శ్రవణేజాతం కాంచ్యాం కాంచనవారిజాత్
ద్వాపరే పాంచజన్యాంశం సరోయోగిన మాశ్రయే."

"కాంచ్యాం సరసి హేమాబ్జే జాతం కాసారయోగినమ్
కలయే యః శ్రియః పత్యుః రవిం దీప మకల్పయత్."

పూదత్తాళ్వార్ :

"తులా ధనిష్ఠా సంభూతం భూతం కల్లోల మాలినమ్
తీరే ఫుల్లోత్పలే మల్లా పుర్యా మీడే గదాంశజమ్."

"మల్లాపురవరాధీశం మాధవీ కుసుమోద్భవమ్
భూతం నమామి యో విష్ణోః జ్ఞానదీప మకల్పయత్."

పేయాళ్వార్ :

"తులా శతభిష గ్జాతం మయూర పుర కైరవాత్
మహాన్తం మహ దాఖ్యాతం వందే శ్రీనన్దకాంశజమ్."

"దృష్ట్వా తుష్టావయో విష్ణుం రమయా మయిలాధిపమ్
కూపే రక్తోత్పలే జాతం మహ దాహ్వాయ మాశ్రయే."

పెరియాళ్వార్ :

"మిధునే స్వాతిజం విష్ణో రథాంశం ధన్వినఃపురే
ప్రపద్యే శ్వశురం విష్ణో ర్విష్ణుచిత్తం పురశ్శిఖమ్."

"గురుముఖ మనధీత్య ప్రాహవేదా నశేషాన్
నరపతి పరిక్లుప్తం శుల్క మాదాతుకామః
శ్వశుర మమర వంద్యం రంగనాథస్య సాక్షాత్
ద్విజకుల తిలకం తం విష్ణు చిత్తం నమామి."

తిరుమళిశై యాళ్వార్ :

"మఘాయాం మకరే మాసే చక్రాంశం భార్గవోద్భవమ్
మహీసార పురాధీశం భక్తిసార మహం భజే."

"శక్తి పంచమయ విగ్రహాత్మనే
శుక్తి హార జిత చిత్త హారిణే
ముక్తిదాయక మురారి పాదయోః
భక్తిసారమునయే నమో నమః."

కులశేఖరాళ్వార్ :

"కుంభే పునర్వసౌ జాతం కేరళే చోళపట్టణే
కౌస్తుభాంశం ధరాధీశం కులశేఖర మాశ్రయే."

"ఘుష్యతే యస్య నగరే రంగయాత్రా దినే దినే
త మహం శిరసా వందే రాజానం కులశేఖరమ్."

తిరుప్పాణాళ్వార్ :

"వృశ్చికే రోహిణీజాతం శ్రీపాణం నిచుళాపురే
శ్రీ వత్సాంశం గాయకేంద్రం మునివాహన మాశ్రయే."

"శ్రీలోక సారంగ మహామునీంద్ర
స్కంధాధి రూఢం కలయామి నిత్యమ్
కళంక హీనం కమనీయ భక్తం
కవీశ్వరం గాయక సార్వభౌమమ్."

తొండరడిప్పొడి యాళ్వార్ :

"కోదండే జ్యేష్ఠ నక్షత్రే మండంగుడి పురోద్భవమ్
చోళోర్వ్యాం వనమాలాంశం భక్తప ద్రేణు మాశ్రయే."

"తమేవ మత్వా పరవాసుదేవం
రంగేశయం రాజవ దర్హణీయమ్
ప్రాబోధకీం యోఽ కృతసూక్తిమాలాం
భక్తాంఘ్రిరేణుం భగవన్త మీడే."

తిరుమంగై యాళ్వార్ :

"వృశ్చికే కృత్తికా జాతం చతుష్క విశిఖామణిమ్
షట్ప్రబంధకృతం శార్ఙ్గ మూర్తిం కలిహ మాశ్రయే."

"సుధాగా నాబ్దానాం కలియుగ భవానా మపగమే
నశే వర్షే మానే శరది చరమే దైవత గురోః
దినే తారే వహ్నేః శిశిర కిరణే పూర్ణకిరణే
క్షితా వావిర్భూతః కలి రిపు రమే యాత్మమహిమా."

నమ్మాళ్వార్ :

"వృషభే తు విశాఘాయాం కురుకాపురి కారిజమ్
పాండ్యదేశే కవే రానౌ శఠారిం సైన్యపం భజే."

"శ్రీ విజ్ఞాన దినోత్తరేఽహని కలౌ వర్షేప్రమాద్యాహ్వయే
మానే మాధవ నామ్ని భార్గవదినే చరక్షే విశాఖాభిధే
లగ్నే శుద్ధ చతుర్దశీ తిథియుతే శ్రీ మ త్కుళీరేఽపి చ
క్షిత్యాం ప్రాదు రభూ త్పరాంకుశ కవి ర్భాగ్యోదయా న్మాదృశామ్.

మధురకవి యాళ్వార్ :

"మేషే చిత్తా సముద్భూతం పాండ్యదేశే గణాంశకమ్
శ్రీ పరాంకుశ సద్భక్తం మధురం కవి మాశ్రయే."

"హస్తస్థతాళ ద్వితయం ప్రపద్యే శఠారి వాగ్వ్యాస ముదారకీర్తిమ్
మాధుర్య సంశ్లిష్ట కవిత్వయుక్తం మహత్త్వ సంభావితబుద్ధి తత్త్వమ్."

ఆండాళ్ :

"కర్కటే పూర్వఫల్గున్యాం తులసీ కాన నోద్భవామ్
పాండ్యే విశ్వంభరాం గోదాం వందే శ్రీ రంగనాయకీమ్."

"నీళా తుంగ స్తనగిరితటీ సుప్త ముద్బోధ్య కృష్ణం
పారార్థ్యం స్వం శ్రుతి శత శిరస్సిద్ధ మధ్యాపయన్తీ
స్వోచ్ఛిష్టాయాం స్రజి నిగళితం యాబలా త్కృత్య భుంక్తే
గోదా తస్యై నమ ఇద మిదం భూయ ఏ వాస్తుభూయః."

## ఆళ్వారులు - వారి తిరునామ విశేషములు

ఆళ్వారులకు వారి వారి యవతార వైభవాదుల ననుసరించి అనేక నామాంతరములు వ్యవహరింపఁబడుచున్నవి. అవి - అందఱకును అవశ్యము అవగాహనీయములు. అందువలన, ఈ క్రింద పొందుపరుపఁబడుచున్నవి.

### ౧ పొయిగయాళ్వారు :

కాంచీయోగి-పాంచజన్యాంశ యోగి-శ్రవణ యోగి (శ్రవణముని) ప్రథమ యోగి - సరోముని - కాసార యోగి - దీపముని - ఆది యోగి మున్నగునవి.

### ౨ పూదత్తాళ్వారు :

పూత యోగి - ద్వితీయ యోగి - మల్లాపుర యోగి - భూతముని - ఉత్పల ముని - శ్రవిష్ఠాముని - గదాంశ యోగి మున్నగునవి.

### ౩ పేయాళ్వారు :

మహాయోగి - తృతీయ యోగి - భక్తిసారగురు - మయూర పురముని - హ్రాద యోగి - శతభిషక్ యోగి - నందకాంశ యోగి - కూపముని - కోపయోగి కైరవ కూప యోగి మున్నగునవి.

### ౪ తిరుమళిశై యాళ్వారు :

భక్తిసార యోగి - భక్తిసారముని - చతుర్థ యోగి - అతుపాదముని - భార్గవ ముని - దీర్ఘతపోముని - చక్రాంశ యోగి - హరిపాద యోగి - హరిపాదముని - శబర యోగి - యాగముని - మంత్రముని - సిద్ధముని - శాక్యజిత్ యోగి - పన్నగ యోగి - తేజోయోగి - జ్వాలాముని - గుహా యోగి - తీర్థ యోగి - మఖా యోగి - వేత్రకుంజ యోగి - కణికృష్ణగురు మున్నగునవి.

౫ నమ్మాళ్వారు :

శ్రీ శఠకోప - శఠరిపు - వలుదినాదన్ - కురుగూర్ ముని - వకుళాభరణ - తింత్రిణీమూలవాసయోగి - అప్రాకృత మానుష యోగి - కారిమారన్ - మార యోగి - ద్రవిడోపనిషద్ యోగి—సారస్వతముని — దివ్యసూరివర యోగి—విశాఖా యోగి—తామ్రపర్ణిముని—వేదయోగి మున్నగునవి.

౬ మధురకవియాళ్వారు :

మధురకవియోగి - కుముదాంశయోగి - గురుముని - శఠకోప పదముని - షష్ఠయోగి - చిత్తాయోగి - సామవేదముని - వాదికేసరతనయయోగి - తిరుక్కోలూర్ దీపముని మున్నగునవి.

౭ కులశేఖరాళ్వారు :

కులశేఖరభూపాల - కౌస్తుభాంశయోగి - మణియోగి - పునర్వసు ముని - దృఢవ్రత తనయ - రాజ యోగి - రవివంశ ముని — కేరళ యోగి — రామ భక్త యోగి — సప్తమ యోగి—మున్నగునవి.

౮ తిరుప్పాణాళ్వారు :

వీణా యోగి - గాయక యోగి - గాన ముని - కవి యోగి - మునివాహన - శ్రీవత్సాంశ యోగి - మునివాహన ముని - తట ముని - రోహిణీ ముని-నిచుళాపుర యోగి - అష్టమ యోగి మున్నగునవి.

౯ తొండరడిప్పొడియాళ్వారు :

విప్రనారాయణ-విప్రముని- నారాయణ యోగి-మండంగుడిముని- జ్యేష్ఠాతారముని - మాలాకార యోగి - రంగభక్త ముని - రంగముని - శ్రీరంగముని- శ్రీరంగరాజ తనయ యోగి - వనమాలాంశ యోగి - ఆరామ యోగి - ఆరోపిత దోష యోగి - నవమయోగి - మున్నగునవి.

౧౦ పెరియాళ్వారు :

విష్ణుచిత్త యోగి - భట్టనాథ ముని—భట్ట ముని — స్వాతి యోగి—గరుడాంశ యోగి — శుల్క ముని— కనకశుల్క ముని - పరతత్త్వస్థాపక యోగి— గోదాజనక ముని — విష్ణుమతస్థాపనాచార్య — ధన్విపుర యోగి మున్నగునవి.

౧౧ ఆండాళ్ :

శూడిక్కొడుత్త నాచ్చియార్ - శ్రీ గోదాదేవి - విష్ణు చిత్తకన్యా - శ్రీరంగ మహిషీ - రంగమహిషీ - రంగరాజ మహిషీ - భూమిదేవ్యంశదేవీ- కాంతా మణీ -రమా సపత్నీ - దివ్య మహిషీ - నవ మాతా - తులసీ మూల జాతా - ఆముక్త మాల్యదా మున్నగునవి.

౧౨ తిరుమంగై ఆళ్వారు :

పరకాల యోగి - పరాంతక యోగి - అరిదండధర-శాత్రవాంతక యోగి - కార్ముకాంశ యోగి - వసు యోగి - ఉపరిచరవసు యోగి- సేనాపతి యోగి- చోర యోగి - చౌర్యరసిక - కుముదవల్లి రమణ - కలియన్ - కరవాలభీమ యోగి - పరాక్రమ ముని- బౌద్ధ భేదక ముని- అసహాయశూర-మనోహర యోగి- అష్టాక్షర ముని- నారాయణ ముని - రణ ధీర - అన్నదాన రసిక - ఆత్మ యోగి మున్నగునవి.



# తిరుప్పావు

[ శ్రీ గోదాదేవి ద్రావిడ కృతి కనుకృతి ]

'కవి చక్రవర్తి'

శ్రీ దామెర రాజగోపాలరావు

ప్రణుతి

వర్షాంబుద శ్యామల చారుమూర్తిం
కృపానిధిం సేవక పారిజాతమ్
త్రైలోక్య కల్యాణ కరైకదేవం
ప్రణౌమ్యహం వేంకటశైల నాథమ్.

నీలాతుంగ పయోధరాంచన తటిన్ నిద్రించు కృష్ణుం గృపాశీలున్ మేల్కొనఁజేసి, తా శ్రుతి శిరస్సిద్ధాత్మ శేషత్వముం బోలన్ బోధన సేయుచున్, బలిమి నాముక్త ప్రసూనోల్లసన్మాలాబద్ధుని బొందుచున్న యల గోదాదేవి కస్మన్నతుల్.

శ్రీలతో విలసిల్లు వ్రేపల్లెవాడలో
మేలిల్లు కలిమి గల బాలికామణులార!
మహితాభరణలార! మార్గశిర మాసంబు
మిహికాంశు భాసురము మహనీయ వాసరము
చేపట్టి నిశితాశి కాఁ పుండు క్రూరంపు
వ్యాపారుఁడౌ నందగోపాలు కొమరుండు
కలికి తన మొలికించు కనులఁ గలకలలాడు
నలయశోదాదేవి యనుఁగు సింగపుఁ గొదమ
శ్యామాబ్జ గాత్రుండు నరుణాబ్జ నేత్రుండు
సోమ సూర్యులఁబోలు మోము రాజిలువాఁడు
నారాయణుఁడె మనకు నడపుఁ బరవాద్యమును
మీర లీ లోకమ్ము వారెల్ల బొగడఁగా
నారబము సేసి ప్రియమారంగ నీ నోము
నీరాడగాఁ గోరువారందఱును రారె!

ఈ భూమి భాసిలిన యో భాగ్యవతులార!
శోభాకరోజ్జీవ నాభోగ విధ మెన్ని
మనము మన నోమునకు మలసి చేయవలసిన
పనులున్న వవియెల్ల వినుఁడమ్మ! వినుఁడమ్మ!
ఉరగ తల్పమునఁ గలశోదధిని నిదురించు
పరమ పురుషుని దివ్యపాదాబ్జములు గొలిచి,
స్నానములు వేకువనె సలిపి కావించెదము
దాన ధర్మము లోలి నానందమున మేము.
నోము నోఁచిన నాళ్ళ నేమంబు తోడుతను
మేము గ్రోలము పాలు, మేము త్రావమునేయి,
కై సేసికొన మేము కన్నులకుఁ గాటుకను
గై సేసికొన మేము కైశికమ్ముల విరులు,
శిష్టు లొప్పని యట్టి చేఁత చేయము మేము
దుష్టవాక్కులు నోటఁ దొడుగ మేమియు మేము.

పెరిగి ముల్లోకములు పరగఁ గొలిచినయట్టి
పురుషోత్తముని నామములు కీర్తనముసేసి,
మా నోమునకుఁ బూని తాన మాడితి మేని,
నీ నాఁడు నాఁడెల్ల యీతిబాధలు లేక,
నెల మూఁడు వానలును నిబ్బరముగాఁ గురిసి.
బలసియెత్తుగఁ బెరిగి వఱులు పైరుల నడుమఁ
బొరి మీలు త్రుళ్ళంగ, విరియు కలువలలోన
నెఱయు నెఱి తుమ్మెదలు నిదురవోవుచునుండ,
దండిగాఁ గూర్చుండి రెండు చేతులఁబట్టి
పిండంగఁ బొంకంపు బింకంపుఁ జనుకట్ల
నారజము వెదచింద, నౌదార్య మడరొంద,
సారతర ధేనువులు క్షీరధారలు కురిసి,
కడవలను నిండించు గండారు కొట్టముల
నెడతెగని సిరులతో నేపు మీఱెడు నటుల.

ఓ వర్ష నిర్వాహి! ఓహ్యాద్యగంభీర!
ఈవు నీ కరము మా కించుకయు దాఁచకుమ!
జలధి గర్భము నీఁగి సలిల మోలిని ద్రాగి
ఫెళ ఫెళని గర్జించి విష్ణు పదమున కెగసి
కాలోప లక్షిత జగ త్కారణుని మూర్తి
లీల, నీ మే నెల్ల నీల వర్ణము దేల
రమణీయమై యలరు ప్రబల బాహువులు గల
కమల నాభుని కేలఁ గ్రాలు చక్రమువోలెఁ
దళ తళ మెఱసి నీవు దక్షిణావర్తమౌ
పొల పాంచజన్యంబు వలె నిలిచి ఘోషించి
యల్ల శౌర్ఙ్గము కురియు నంపజడి కైవడిని
నెల్లలోకములు సుఖయించుటకు వర్షింపు!
మేము సంతోషమున నీ మార్గ శీర్షంపు
నోమునకు నీరాడఁ దామసింపక నీవు!

ఓ యమ్మలార! మఱుమాయ కాఁడగు వాని
నాయుత్తర మధురకు నాయకుండగు వాని
విమలాంబు గంభీర యమునానదీ తీర
రమణీయ సీమలను రాస సలిపెడు వాని
నల్లగోపకుల కల్యాణదీపం బగుచుఁ
దల్లి గర్భంబునకు నుల్లసంబును గూర్చి
తనరారువాని, శ్రీ దామోదరుని మనము
వనరుహేక్షణలార! పరిశుద్ధలై చేరి
తావి గల యచ్చపుం బూవులను నర్పించి
సేవించి, నోరారఁ గావించి కీర్తనము
నెమ్మదిని భక్తి ధ్యానమ్ము సేసితిమేని
నిమ్ముగాఁ బూర్వోత్తరమ్ములౌ పాపములు
నిప్పులోఁ బడు దూది చొప్పునను నశియించుఁ
జెప్పరే! మఱి వాని చిన్నారి నామములు.

కలకలారావములు కావించుఁ బక్షులదె!
తెలవారుచున్నదిగదే! బాల! లే లెమ్మ!
బాగుగాఁ బక్షీంద్రవాహనుని గుడినుండి
మ్రోగు తెలిసంకు బలుమ్రోఁత వినఁబడలేద?
పెను విసపుఁ జనుఁ బాలు పీల్చివేసినవానిఁ
దనిమాయ శకటమ్ముఁ దాఁచి విఱిచినవానిఁ
బాలసంద్రముపైనఁ బాపరాపానుపున
నోలిమైఁ బవళించి యోగ నిద్రాముద్రఁ
బరగు కారణభూతు భావంబులో నిలిపి
పరమ ఋషులును యోగివరులు నొయ్యన లేచి,
'హరి హరీ' యని పిలువ, న య్యమృత నాదంబ
చొరఁ బాఱి మా మనస్సులఁ జల్లఁ బఱచినది;
కలకలారావములు కావించుఁ బక్షు లదె!
తెలవాఱుచున్నదిగదే! బాల! లే లెమ్మ!

కలిసికొని యేటిరింతలు 'కీచు కీచు' మని
పలుకు పలుకుల నొలుకు కలకలము నెల్లెడల
నో వెఱ్ఱి జవరాల! నీవు వినలేదఁటే!
లేవవే! తెలవాఱి పోవుచున్నదిగదే!
ఘల్లు ఘల్లని మ్రోయఁ గటక మాంగళ్యములు
మొల్ల మగు తావులను జల్లంగఁ గ్రొమ్ముడులు
గొల్ల యిల్లాండ్రు తరి గోలలను గొని చిలుకు
చల్లసేసెడి పెల్లుసడి నీవు వినలేదె?
మమ్మేలు దొరసాని! మా చిన్ని కన్నియరో!
అమ్మనేఁజెల్ల! నారాయణుఁడు కేశవుని
గైవారములు మేము గావించుచుండినను
నీ వాలకించియే నెమ్మిఁ బవళించితివో?
ద్వారంబు తెఱువవే! వచ్చి తేజోవతీ!
బోరనం దెలవాఱిపోవుచున్నది చూడు!

తెల్లవారెను దూర్పుదెస మింటఁగనుగొంటె?
బీళ్ళకై గేదె లదె! వెళ్ళుచున్నవి వడిగ
నిచ్చవచ్చినరీతి నివపుఁ బచ్చికమేయ
నెచ్చెలులు నో మూని నీరాడఁ జనుచుండఁ
జనకుండ వారలను నునిచి నడువీథిలో
నిను బిలువఁగావచ్చి నిలిచియుంటిమి సుమ్ము!
కౌతూహలంబుగల కమలేక్షణా! లెమ్ము!
ప్రీతి వాద్యములు గొని గీతులు మనము పాడి,
హరువము రూపమున వాసించు 'కేశి' యను
ఘోర రాక్షసుఁ బట్టి నోరుచీరినవానిఁ
జేవగల జెట్టిలఁ జిలుకు మార్చినవాని,
దేవదేవుని జేరి దివ్యపాదాబ్జములు
సేవింప, నాతఁ 'డో చెల్ల' యని కృపసేయు;
లేవె, యింకను బవ్వళించి యున్నావఁటే!

ఏపారు రతనాల దీపించు మేడలో
దీపాలు భాసింప, ధూపాలు వాసింప
మును సెజ్జఁ బవ్వళించిన మామ కూఁతురా!
మనవి విని తీయవే! మణి కవాటము గడియ;
లేవవే! తెలవాఱి పోవుచున్నది సూవె!
నీ వాలకించియే నిదురించు చున్నావె?
నీ కూఁతు రోయత్త! మూకయో? చెవిటియొ?
కాకున్న గాటమ్ముగా నిదురపోయినదొ?
కదల నీకెవ్వరైనఁ గాఁ పుండిరో సరస?
అదిగాద? నిదురలోఁ గుదురు మంత్రించిరో?
ఓ యత్త! అట్లైనఁ బోయి, 'వైకుంఠపతి!
మాయావి! మాధవా! మధుసూదనా!' యంచు
నారాయణుని దివ్య నామమ్ములను నీవు
పారాయణము సేసి, వడి నాపె లేపవే;

ఒనరించి మంచి నోమును, స్వర్గ భోగంబు
లనుభవించెడు దాన! అదియేమి న్యాయమే?
మా తల్లి కాన! పోనీ తలుపు తీకుంటె,
మాతోడ నొక మాట మాటాడ రాదఁటే?

వలపులు వెలారించు తులసి మాలికమౌళి
నలరారు చున్నట్టి యతఁడు, నారాయణుఁడు
మనచేత నుతులు గైకొనువాఁడు, వాద్యంబు
మనకుఁ గూర్చెడువాఁడును నగు పుణ్యాత్ముఁచే,
మును మృత్యుముఖమునఁ బడిన కుంభకర్ణుఁ డను
దనుజుండు నీ కోడి, తన మొద్దు నిద్దురను
నీ కిచ్చి పోయెనా? నిబిడ నిద్రాలోల!
గోకులాభరణమా! నీ కొఱకె వేచితిమి:-
తెలవారు చున్నది యదే! నీవు బాగుగాఁ
దెలివి తెచ్చుక వచ్చి తెఱువవే ద్వారంబు!

ఈనిన పసువులతో నెసలారు పలుల తెగ
మానుగాఁ బాలీడి, మాయునటు లరి బలము
దండయాత్రకు వెడలి, ఖండనము గావించి,
యొండు నొచ్చెము లేక యొప్పు మీఱెడు వారు,
గోపాలకుల కులము లోపల నవతరించి,
దీపించుచున్నట్టి యో పసిడి లతకూన!
ఏమమ్మ! వన మయూరి! పుట్టవెలువడెడు
పాముపడ కెన యగు కటిసీమ నొప్పెడుదాన!
విచ్చేయవె! సిరి గల విరిఁబోఁడి! బందు లగు
నెచ్చెలియ లెల్లరును వచ్చి వాకిటఁ జొచ్చి,
భామరో! జలధర శ్యాముఁ డగు శ్రీకృష్ణు
నామములు పాడుచున్నను, గదలక మెదలక
నీ విట్లు లెందులకు నిదురించుచుంటివో,
యావంతయును నీదు భావంబు నెఱుఁగమే!

లేఁ దూడగల గేదే లేఁగకోసం బఱచి
యాదటను వహియించి యద్దానిఁ దలఁచుకొని
పోలఁ బొదుగున నుండి జాలుకొను నెడపడని
పాలతోఁ దడిపి యిలు బందసేయఁగఁ జెలఁగు
తులలేని సంపదలు కలవాని చెల్లెలా!
తలపైనఁ బడుచుండ దట్టంబుగామంచు
చెలియరో! నీదు వాకిలి గడప కతుకుకొని
యలుకతో సుభగలంకాధి పతిని దునిమిన
యా మనోరమణు మే మగ్గించు చుండినను
నేమి పాడియె? ఇంచుకేనిఁ దెఱువవు నోరు!
ఇదియేమి గాటంపు నిదురయొ తెలియదాయెఁ!
బదిమంది నీకొఱకుఁ బడియుండి రమ్మక్క!
ఈ విషయ మూరివా రెల్లరుఁ దెలిసికొనిరి
నీ విఁక నయిన లేచి రావమ్మ! మాయమ్మ!

పక్కినోటిని జీల్చువాని, యుక్కివుఁడైన
యొక్క రక్కసు గిల్లి యుజ్జగించిన వాని
చరితంబు పాడుచును దరణు లెల్లరుఁగూడి
తరలి కందువ చోటు చోరఁబాటినారమ్మ!
అల శుక్రుఁ డుదయించె, నస్తమించెను గురుఁడు
పులుగు లవె! కూయుచుం బోవుచున్నవి సూవె!
నీరేజ సారంగనేత్ర! సమ్మోహనా
కార! కపటము వీడి, కలిసికొని మాతోడ,
నీ పుణ్య దివసమున నెంతేనిఁ జల్లఁగాఁ
దీపారు నీటఁ దిగి తీర్థమాడక నీవు
మృదుశయ్య వెచ్చగా నిదురించుచున్నావె?
అదిగో! తెలవారు చున్నది, లేచి రావమ్మ!
అల శుక్రుఁ డుదయించె, నస్తమించెను గురుఁడు
పులుగు లవె! కూయుచుం బోవుచున్నవి సూవె!

రమణీ మణిరో! మీ పెరటితోఁట బావిలోఁ
గమలములు వికసించెఁ గుముదములు ముకుళించెఁ
గావి పొడిని దడిపిన కప్పడము ధరియించి
దైవారు పరిశుభ్ర దంతముల జియ్యరులు
కుంచె కోలఁగొని తమ కోవెలలు తెరువఁగా
వేంచేయు చున్నారు కాంచరాదోయమ్మ!
'మిమ్ము నేనే వచ్చి మేలు కొలిపెద' నంచు
నమ్మనేఁ జెల్లగా! నమ్మకముగా మాకు
సెల విడిన నెఱకత్తె! సిగ్గు వోవనిదాన!
వెలలేని నుడికార మెలరారు చెలికాన!
వర శంఖ చక్రము లలరు హస్తముల వాని
నరవింద లోచనుని, బురుషోత్తముని గూర్చి
కైవారములు సేయఁగా లేచి రావమ్మ!
నీ వింక నిదియేమి నిదురించుచున్నావు!

చిన్నారి చిఱుత రాచిలుకరో! నిదురించు
చున్నావొ నీ వింక? "ఓహో! నెఱకత్తియలు!
చిడిముడి పడుచు మీరు చీరకుఁడు న, న్నిదే!
నడతెంచు చున్నాను;" నొడికార తనము గల
గడుసరి! తెలుసు ముందుగనె మాకు నీ నోరు;
"గడుసరులు మీరతే! కానిండు నేనెహో!"
మా కడకు నీవు గ్రమ్మన లేచి రావమ్మ!
లేక మఱి వేఱుగా నీకేదయినఁ గలద?
"వచ్చిరో యందఱును?" వచ్చియున్నా రీవు
వచ్చి లెక్కించు కొనవచ్చుఁ జుమి! దిట్ట యగు
వారణంబును బట్టి మారి మసఁగిన వాని
వైరుల బలంబు నఱవఱ సేయఁగలవాని,
మాయావి యగు వాని, మనము కయివారములు
సేయంగఁ బోవలయుఁ జేసేత రావమ్మ!

వ్రజనేతృనందగోపాల గృహరక్షకా
ధ్వజతోరణాంచిత ద్వారపరిపాలకా!
కృపసేసి మణికవాటపు గడియఁ దిగియవే!
కపటమెఱుఁగని గొల్ల కన్నియల మగు మాకు
మాయావి యగువాఁడు, మణివర్ణగాత్రుండు
మ్రోయు పరవాద్యమును మొనయఁజేయుదు నంచు
మానుగా నిన్న నే మాట యిచ్చెనుగాన
వాని మేలుకొలుపులు పాడంగ మే మెల్ల
నతి శుద్ధలమయి యిపు డరుదెంచి యున్నాము;
ప్రతిషేధమును నోటఁబలుకకు తొలుదొలుతనె!
స్వామి! స్నిగ్ధ నిబంధ బంధుర కవాటంబు
మా మీఁదఁ గరుణించి మఱిసీవె తెఱువుమీ!
వ్రజనేతృ నందగోపాల గృహరక్షకా!
ధ్వజతోరణాంచిత ద్వారపరిపాలకా!

జానుగా నంబరమె, సలిలమే, యన్న మే,
దానంబుగావించు శ్రీనందగోపాల!
స్వామి! మేలుకొనుమీ! వంజుల లతా సదృశ
రామా కిసలయాభిరామ! కులదీపమా!
మా యొడయురాల వగు శ్రీయశోదాదేవి!
మాయెడఁ గనికరించి యో యమ్మ! లేవమ్మ!
దివము సర్వంబు భేదించుకొని వ్యాపించి
భువనంబులు గొలిచిన పురుషోత్తమా! కృష్ణ!
దేవాధిదేవ! నిద్రింప కిఁక లేవయ్య
నీవు! మము దయ నేలి, నిద్దంపు టపరంజి
మంజీర మొప్పారు మంగళారుణ చరణ
కంజాతములచేత రంజిల్లుచున్నట్టి
యో వైభవోపేత! దేవ! శ్రీబలరామ!
నీవు నీ తమ్ముఁడును నిదురపోవక లెండు!

స్రవియించు మదముగల సామజంబునుబోలి
పవతురకుఁ బిఱుసనని బాహువీర్యముతోడ,
మేలిల్లు నందగోపాలకుని కోడలా!
నీలమ్మ! తావులు దువాళించు నెఱికురులు
కలదాన! తీయవే తలుపుగడె నీ వింక ;
తెలవాఱుచున్నది యదే! లేచి యెల్లెడలఁ
గూయుచున్నవి కోళ్ళు; గురివెందపందిళ్ళఁ
గూయుచున్నవి సారె గోరువంకలు వింటె?
కందుకమ్మును వ్రేళ్ళసందిటను గలదాన!
కెందామరనుబోలు కేల, నీలాదేవి!
తళతళని రవల కుందనపు గాజులు కదలి
గల గల యను జిలిబిలి గానంబు గావింప,
నామోదచిత్తవై యరుదెంచి తెఱువుమీ!
నీ మనోవల్లభుని నామములు పాడంగ.

చెంత దీపకళికలు కాంతులు పఱపుచుండ,
దంతపుం గోళ్ళ నిద్దంపు మంచముమీఁద
దైవాఱు మృదుపంచతల్పమున శయనించి,
తావులను గుప్పు విరిపూవుగుత్తులతోడఁ
బొత్తుగల కచపాళిఁ బోలయు నీలాదేవి
యుత్తుంగ కుచపాళి నత్తమిలి యున్నట్టి
పరిపుల్లవక్షంబువాఁడ! తెఱువవె వాయి!
పరగఁ గాటుకఁ గ్రాలు వ్రాలు కన్నులదాన!
నీ వల్లభునితోడ నిముసమే నెడబాటు
నీవు మఱి సహియింప నేరకున్నా వహో!
అతఁ డొక్కింత సేపైనఁ బానుపు వీడి
యేతెంచుటకు నకట, యీయకొనకుంటివే!
ఈ విధము వర్తింప నెంతమాత్రము నేని
నీ వంటిదాని కది నిజముగాఁ దగ దమ్మ!

మున్నె సని, ముప్పదిమూఁడుకోట్ల యమరుల
బన్నంబులను బాపు బలశాలి! దయసేసి
మేలుకొనుమీ! నిదుర; మేలు కూర్చెడివాఁడ!
చాలుబడికలవాఁడ! శత్రుకోటికి వనట

నొనగూర్చు నిర్మలుఁడ! ఓ సామి! మేల్కొనవె!
కనక కలశోపమస్తని! పల్లవాధరా!
శ్రీలక్ష్మి! పరిపూర్ణురాల! శాతోదరీ!
నీలమ్మ! కరుణించి నిదుర మేలుకొనవే!

ఆలవట్టము, కంచుటద్దము ప్రసాదించి,
వాలాయముగ నీదు ప్రాణప్రియునితోడ
నాలసింపక మంగళావగాహంబులను
గోలాడఁజేయవే యోయమ్మ మమ్మిపు!
శ్రీలక్ష్మి! పరిపూర్ణురాల! శాతోదరీ!
నీలమ్మ! కరుణించి నిదుర మేలుకొనవే!

పాలుపితుకఁగ నెత్తు భాండములు నిండుకొని
పాలు బోరనఁ బొంగి పైకి పొరలెడు భంగి
నొల్లిమైఁ బా లిచ్చు మేలువలుఁదపుటాలు
చాలగల నందగోపాలు ముద్దులపట్టి!
మేలుకో, భక్తజనపాలన శ్రద్ధాళు!
మేలుకో పరమాత్మ! మేలుకో మా సామి!
పృథివిలో మూర్తిభవించి వెలసినయట్టి
పృథులతేజోరూప! వెస నిదుర లేవయ్య!
వైరు లెల్లరు నీదు పౌరుషమ్మున కోడి
సైరింప లేక నీ శక్తిసామర్థ్యముల;
నీ వాకిటకు వచ్చి నీ పాదపద్మములు
సేవించు కైవడిని, గైవారములుసేసి
యామోదమున మంగళాశాసనముసేసి
మే మందఱముగూడ స్వామి! వచ్చితి మయ్య!

జా నగు జగాజగములోని యేలికలు తమ
మానాభిమానములు పోనాడుకొని వచ్చి

బృందముగ నీ గద్దె క్రిందఁ దార్కొని యున్న
చందమున మేము నిట చనుదెంచియున్నాము;

కింకిణు లటు విరిసిన కెందామరలఁ బోలు
పొంక మగు కెంజాయ పొలుపారు కందోయి

నించు కించుక మా పయిని గటాక్షింపవే!
మించారు చండాంశు మిహికాంశు బింబంబు

లేపారఁ దోఁచు గతి నీ మ్మగు కనుఁగవతో
మాపైఁ గటాక్షింప మా పాపములు మాయు;

జా నగు జగాజగములోని యేలికలు తమ
మానాభిమానములు పోనాడుకొని వచ్చి

బృందముగ నీగద్దె క్రిందఁ దార్కొని యున్న
చందమున మేము నిట చనుదెంచి యున్నాము.

వానకారునయందు సానుమద్దరిలోన,
మానుగా శయనించి మంచి నిద్దురవోవు,
మేటి సింగం బొకఁడు మేల్కాంచి, నిప్పులను
మీఁటు వీక్షణముల సమీక్షించి, తావి గల
జూ లెల్ల నిగుడంగ, నాలుగు దెసలు గదలి,
ధూళి దులుపుకొని, పొందుగ మేను సారించి,
గట్టిగా గర్జించి, గహ్వారంబుననుండి
యట్టె వెల్వడు రీతి, నతసీకుసుమవర్ణ!
దేవ! నీ శయనమందిరమునుండి వెలువడి
నీ వచ్చుటకు వచ్చి, నీ జయప్రదమైన
మేలి సింహాసనము మీఁదను గొలువు సేసి,
చాలసే పయి మేము చనుదెంచియున్న పని
నిమ్మగ విచారించి, నెమ్మికలవాఁడవై
మమ్ముల గృతార్థులను, మహనీయ చేయవే!

'అల్ల నాఁడీ లోక మెల్లఁగొలిచిన నీదు
పల్లవారుణ దివ్యపదమునకు మంగళము!

అం దీవు వేంచేసి సుందరం బగు లంక
మ్రందఁజేసిన నీదు మగఁటిమికి మంగళము!

నేలఁబడి శకటంబు కూలిపోయెడు లీలఁ
గాలఁ దన్నిన నీ పొగడితకును మంగళము!

మీఱి దండపుఁగోల మెయివడిని వత్సంబుఁ
బాఱఁదట్టిన నీదు పదమునకు మంగళము!

దండిగా గొడుగు చందంబునను నిండారఁ
గొండ నెత్తిన నీదు గుణమునకు మంగళము!

అల పగతురను నెల్ల గెలిచి పీఁచ మణఁచుచుఁ
జెలువారు నీ చేతి చివ్వకును మంగళము!'

అని దేవర మగఁటిమిఁ గొనియాడి వాద్యంబు
గొన నేఁడు వచ్చితిమి, కనికరింపవె మమ్ము!

ఒక తెకుఁ గొమరుఁడవై యొప్పుగ నవతరించి,
యొక రేయిలోనె వేఱొక్కతెకు బిడ్డవై,
దాఁకొని యెదుగుచుండఁ దా నోర్వఁగా లేక,
నీకుఁ గీడు తలంప నా కంసుఁ డత్తఱిని
వాని భావము లెల్ల వ్యర్థంబు గావించి,
వాని గర్భములోన వహ్ని పగిది నిలిచిన
స్వామీ! మహాప్రేమశాలి! పురుషోత్తమా!
మేము వచ్చితిమయ్యా; మిమ్ము ప్రార్థింపఁగాఁ;
బర వాద్యమును మాకుఁ గరుణించితివ యేని,
సిరి సైతముఁ గడు నాసింపఁగాఁ దగి యున్న
మీ మహాభాగ్యంబు, మీ బాహువీర్యంబు
మేము గానము సేసి, మీ వియోగమువలనఁ
బ్రాపించి నట్టి యవ్వనట యెల్ల నశింప,
దీపించు నెలమిలోఁ దేలియాడుదు మేము.

స్వామి ! ఆశ్రితకోటి వాత్సల్యభరవర్తి !
ఓ మహేంద్రమణి ప్రభామనోహరమూర్తి !

చెప్పుచుంటిమి మార్గశీర్ష మజ్జన మాడ,
నొప్పిదముగాఁ బెద్ద లొనరించు కార్యములు,

కావలసినవియు, నాకర్ణింపు మవి యెల్ల -
భూవలయ మదరిపోవు నటు ఘోషించు నవి,

పాల వన్నియ నీదు పాంచజన్యముఁ బోలు
మేలు శంఖంబులును; దాల విరివిడి గలిగి

మిక్కిలిం బెద్దదై మీఱు పరవాద్యమును
జక్కగా మంగళాశాసనము పాడువా;

రంద మగు ధ్వజము; కల్యాణ మణిదీపంబు;
చందువా ; వటపత్రశాయి ! దయసేయవే !

స్వామి ! ఆశ్రితకోటి వాత్సల్యభరవర్తి !
ఓ మహేంద్ర మణిప్రభా మనోహరమూర్తి !

అల్ల కూడనివారి నెల్లరను నోడించు
నల్లారుముద్దు కల్యాణగుణములవాఁడ !
గోవిందుఁడా ! మిమ్ము కై వారములు సేసి,
మీవలన నందుకొని మేము పరవాద్యంబు,
లోకంబు కొనియాడు జోకఁగడు లెస్సగా.
మాకు దేవరవారు సేకూర్చు బహుమతులు -
' సూడిగము, బాహుపురి, జుమికీలు, చెవ్వాకు,
పాడగం' బని చెప్పఁబడు పెక్కు తొడవులను
బెట్టుకొందుము మేము; విలువ గల వలువలను
గట్టుకొందుము మేము; నెట్టుకొని యాపైనఁ
బాలు నన్నము మునుఁగు లీల నేతిని గూర్చి,
పోల మోఁచేయి వఱ కోలి నెయి జాఱంగ,
నారగించెద మయ్య ! హాయిగా మిముఁ గూడి
క్షీరాన్నమును మేము చిత్తములు రంజిల్ల.

స్వామీ! పశువుల వెంబడిఁ బోయి కాంతార
సీమలను జేరుకొని జీవించు వారలము;

జ్ఞాన మించుకయేని లేని గొల్లలము, మా
లోన దేవరవారు పూనిక నవతరిలుట

తీపార, మా పుణ్య మేపారుటను గాదె!
లోప మేమియు లేని గోపాలకా! నీకు

మాకుఁ గల యట్టి సంబంధ మిట విడనాడ,
నీకు మాకును గూడ నింతయు నలవి గాదు;

ఏమియుఁ దెలియనట్టి యెల జవ్వనుల మోయి!
ప్రేమాతిశయముచే మేము దేవరవారిఁ

జిన్న పేరఁ బిలిచినఁ జిడిముడి పడక, స్వామి!
మన్నించి దయసేయు మాకుఁ బరవాద్యంబు!

స్వామీ! పశువుల వెంబడిఁబోయి కాంతార
సీమలను చేరుకొని జీవించువారలము.

మేము కడు వేకువనె మేలుకొని యిటు వచ్చి,
స్వామి! నిను సేవించి, తామరల చందాన
రంగారు నీమేల్మి బంగారు టడుగులను
మంగళాశాసనము పొంగి చేయుటయందు,
గోవింద! మాకుఁ గల భావ మాలింపవే!
గోవులను మేపి మనుకులమున నవతరిలిన
నీ వంతరంగపు సేవలను నెమ్మిమై
మావలనఁ జేకొనక పోవఁగా రా దయ్య!
అల్ల పరవాద్యమే యందుకొనఁ గాదు సుమి!
ఎల్లకాలంబు నీ రేడు జన్మంబులను
మాకు నీతోడి సంబంధమె కలుగుఁగాక!
నీకె కైంకర్యములు నెఱిఁ జేయుదుముగాక!
దేవా! యితర వాంఛ లేవి యున్నను వాని
నీవు తొలఁగింపు, మా హృదయసీమలనుండి.

నావలు గలిగినట్టి యా వనధి మథియించు
శ్రీ విభుని గేశవుని, శీతాంశు బింబాస్య
లైన దివ్యాభరణ లరిగి వినుతులు సేసి,
మానుగా వ్రేపల్లెలోనఁ బరవాద్యమును
బడసిన విధానంబు, పుడమికిఁ దొడవు గాఁగ
బెడఁగారు నల్ల శ్రీ విల్లిపుత్తూరులో,
శోభిల్లు పద్మాక్షు సుషిమ మాలికఁ దాల్చు
శ్రీ భట్టనాథు పుత్త్రి యగు గోదాదేవి,
యల సంఘ ద్రవిడమున నానతిచ్చిన యట్టి
యలరు సరి ముప్పదియు, నప్పగిదిఁ దప్ప కిట
నోలి ననుసంధాన మొనరించువా రెల్ల,
నాలుగు మహాగిరులఁ బోలు భుజములు, కెంపుఁ
గనుగవయు, శ్రీ ముఖము, గలిగి యుభయ విభూతి
దనరు శ్రీపతి కృపను గొని సుఖపడుదు రెందు.



కృతి సమర్పణము

శ్రీరంగేశ! భుజంగమేశ సుభగ స్నిగ్ధాంక పర్యంక! గో
దా రాకేందు నిభాననా మధుర చేతః పుష్ప పుష్పంధయా!
కారుణ్యైకనిధాన! భక్తజన రక్షాదక్ష! ఈ గీతికా
హారం బేను ప్రపత్తిమైఁ గొలిచి నీ కర్పించితిం దాల్పవే!



# గోదాస్తుతి

సంస్కృత మూలము :

'కవి తార్కిక సింహ – సర్వతంత్ర స్వతంత్ర'

## శ్రీ వేదాంత దేశికులు

* * *

ఆంధ్రానువాదము :

'సంగీత సాహిత్య కళానిధి'

## శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు

శ్రీ విష్ణుచిత్త కులనందన కల్పవల్లీం
శ్రీ రంగరాజ హరిచందన యోగదృశ్యామ్
సాక్షాత్ క్షమాం కరుణయా కమలా మివాన్యాం
గోదా మనన్య శరణ శ్శరణం ప్రపద్యే.

సిరి గల విష్ణుచిత్త బుధశేఖర సత్కుల నందనమ్మునన్
వరలిన కల్పవల్లి – నిజ నాథునకున్ హరిచందనమ్ము – దా
నరయ క్షమా స్వరూపిణి – దయాగుణమందుఁ బయోధికన్యనాఁ
బరగెడి గోద కే నిదె ప్రపత్తి యొనర్తు ననన్య నిష్ఠమై.

౨

వైదేశిక శ్శ్రుతి గిరా మపి భూయసీనాం
వర్ణేషు మాతి మహిమా న హి మాదృశాంతే
ఇత్థం విదంత మపి మాం సహసైవ గోదే
మౌనద్రుహో ముఖరయన్తి గుణా స్త్వదీయాః.

బలు విపులమ్ములైన తొలుఁ బల్కులకేనియు దవ్వులందుఁ జె
న్నల రెడు నీ మహత్త్వ మరయన్ ననుఁ బోంట్లు వెలార్చు మాటలం
గొలువఁగ రాని దంచు మది గోద! యెఱింగితిఁగాని – నీ గుణ
మ్ములె నను బల్మి బట్టి, ముఖముద్ర సడల్చి ధ్వనింపఁజేసెడిన్.

౩

త్వ త్ప్రియప్రశ్రవణయో రమృతాయమానాం
తుల్యాం త్వదీయ మణి నూపుర శింజితానామ్
గోదే త్వ మేవ జనని త్వ దభిష్టవార్హాం
వాచం ప్రసన్న మధురాం మమ సంవిధేయాః.

వినఁగదె గోద! నీ ప్రియుని వీనులకున్ సుధ యౌచు నీవు దా
ల్చిన రతనంపు టందియలు సేసెడి మంజుల శింజితమ్ముతో
నెన యయి నీదు స్తోత్ర మొనరించుట కర్హములైన తీయ తీ
యని నుడులం బ్రసన్నముల నమ్మరో! నాకు నను గ్రహింపుమా!

౪

కృష్ణాన్వయేన దధతీం యమునానుభావం
తీర్థై ర్యథావ దవగాహ్య సరస్వతీం తే
గోదే వికస్వరధియాం భవతీ కటాక్షాత్
వాచ స్స్ఫురన్తి మకరంద ముచః కవీనామ్.

చెలువుగఁ గృష్ణ సంగమముచే యమునానుభవమ్ము గల్గి వ
ర్తిలు నల నీ సరస్వతిని దీర్థముఖమ్మున మున్కలాడి — నీ
లలిత కటాక్ష వీక్షణములన్ వికసన్మతులైన సత్కవీం
ద్రుల వచనమ్ము లెప్పుడు మధుస్రవ విస్ఫురణమ్ము లయ్యెడున్.

౫

అస్మాదృశా మపకృతౌ చిరదీక్షితానాం
అహ్నాయ దేవి దయతే య దసౌ ముకుందః
త న్నిశ్చితం నియమిత స్తవ మౌళి దామ్నా
తన్త్రీ నినాదమధురై శ్చ గిరాం నిగుంభైః.

స్థిరముగ దుష్టకృత్యముల దీక్ష వహించిన మమ్ముబోఁట్ల స
త్వరగతి నమ్ముకుందుఁడు కృపం గను చేలకొ తెల్ల మయ్యె — నీ
శిరమునఁ దాల్చి యర్పణము సేసిన హారముచే విపంచికా
స్వరములు వోలెఁ దీయ నగు పల్కులచే నియమించి తీవె కా!

౬

శోణాధరేఽసి కుచయో రసి తుంగభద్రా
వాచాం ప్రవాహ నివహోఽసి సరస్వతీ త్వమ్
అప్రాకృతై రసి రసై ర్విరజా స్వభావాత్
గోదాఽపి దేవి కమితు ర్ననుు నర్మదాఽసి.

అమ్మరో! శోణవై తధరమందుఁ గుచమ్ములఁ దుంగభద్రవున్
గమ్మని వాక్ప్రవాహములఁ గాంచితి వీవు సరస్వతీత్వమున్
సమ్మతిఁ బ్రాకృతేతర రసమ్ములచే విరజాత్వమున్ స్వభా
వమ్మునఁ గోద వయ్యు నిజభర్తకు నర్మదవైతి వేమనన్?

౭

వల్మీకత శ్శ్రవణతో వసుధాత్మన స్తే
జాతో బభూవ స మునిః కవి సార్వభౌమః
గోదే కి మద్భుత మిదం య దమీ స్వదంతే
వక్త్రారవింద మకరందనిభాః ప్రబంధాః.

పుడమియె యాత్మ యౌచుఁ గడుఁబొల్చెడి నీ చెవియైన పుట్టకుం
గొడుకగు న మ్మునీశ్వరుఁడు క్షోణి తలిం గవిసార్వభౌముఁడై
యడరెఁ బ్రబంధ మంతయు ముఖాబ్జ మరంద సమానమై రుచిం
చెడిఁగద గోద! యియ్యది విచిత్రముగాదె? వచింపు మమ్మరో!

౮

భోక్తుం తవ ప్రియతమం భవ తీవ గోదే
భక్తిం నిజాం ప్రణయ భావనయా గృణన్తః
ఉచ్చావచై ర్విరహసంగమజై రుదన్తైః
శృంగారయన్తి హృదయం గురవ స్త్వదీయాః.

నీ గురువుల్ నిరంతరము నీవలె నీప్రియుఁడైన శౌరితో
భోగముఁ గోరి — భక్తి భరముం బ్రణయమ్ముగ వెల్వరించి — సం
యోగ వియోగజమ్ము లెవియో పలు చిత్ర విచిత్రవార్తలన్
రాగ రసాప్లుతమ్ముగ నొనర్చిరి వాని హృదంతరాళమున్.

౯

మాత స్సముత్థితవతీ మధి విష్ణుచిత్తం
విశ్వోప జీవ్య మమృతం వచసా దుహానామ్
తాపచ్ఛిదం హిమరుచే రివ మూర్తిమన్యాం
సన్తః పయోధి దుహితు స్సహజాం విదుస్త్వామ్.

పొలు పగు విష్ణుచిత్త భవముం గని — విశ్వజనోపజీవ్యమౌ
పలుకులచేతనే యమృతవర్షిణివై యలరారుచున్న నిన్
దెలియుదు రమ్మ! తాపములు దీర్చెడి చంద్రుని మాఱుమూర్తిగాఁ
గలశ పయోధి కన్యకకు గాదిలి చెల్లెలుగా బుధోత్తముల్.

౧౦

తాతస్తు తే మధుభిద స్స్తుతి లేశవశ్యాత్
కర్ణామృతై స్స్తుతిశతై రనవాప్త పూర్వమ్
త్వ న్మౌలి గంధ సుభగా ముపహృత్య మాలాం
లేభే మహత్తర పదాను గుణం ప్రసాదమ్.

ఇంచుక సేయు స్తోత్రమునకేనిఁ గరంగు రమేశు లెక్కకున్
మించిన స్తోత్రముల్ సలిపి - నెమ్మిశ్రవః ప్రియ మారచించి — మున్
గాంచిన య ప్రసాదమును గాంచెను నీ జనకుండు - త్వ చ్ఛిరో
భ్యంచిత గంధమాల నిడినంత మహత్తర ధామ సిద్ధికై.

౧౧

దిగ్దక్షిణాఽపి పరిపక్త్రిమ పుణ్య లభ్యాత్
సర్వోత్తరా భవతి దేవి తవావతారాత్
యత్రైవ రంగపతినా బహుమాన పూర్వం
నిద్రాలు నాపి నియతం నిహితాః కటాక్షాః.

ఇరవుగ రంగనేత నిదురించియు గారముమైఁ గటాక్షముల్
బరపిన దక్షిణమ్ము పరిపాకదశం గనినట్టి సత్క్రియో
త్కరమునకున్ ఫల మ్మయిన తావక దివ్య సముద్భవమ్ముచేఁ
గరము విశాలమౌ యశముఁ గాంచెనుగా సకలోత్తరమ్ముగన్.

౧౨

ప్రాయేణ దేవి భవతీ వ్యపదేశయోగాత్
గోదావరీ జగదిదం పయసా పునీతే
యస్యాం సమేత్య సమయేషు చిరం నివాసాత్
భాగీరథీ ప్రభృతయోఽపి భవన్తి పుణ్యాః.

దేవి! మదంబ! నీదు వ్యపదేశము సంగతి కల్మిచేసి – గో
దావరి నీట ని జ్జగముఁ దద్దయుఁ బూతముసేయుచెల్ల ప
ర్వావ సరమ్ములం ద్రిపథగాది నదుల్ చిరమందు సమ్మిళ
ద్భావముతో వసించిన కతమ్మునఁ బుణ్యములాయె నెంచఁగన్.

౧౩

నాగేశయ స్సుతను పక్షిరథః కథం తే
జాత స్స్వయం వరపతిః పురుషః పురాణః
ఏవం విధా స్సముచితం ప్రణయం భవత్యాః
సందర్శయన్తి పరిహాస గిర స్సఖీనామ్.

పన్నగమందుఁ బండుకొనుఁ బక్షిరథమ్ము మనోహరాంగి! తా
నెన్నఁ బురాణుఁడౌ పురుషుఁ డీతఁడ? నీ వరియించి ప్రేమఁ జే
కొన్న వ్వాదీశ్వరుండని సఖుల్ గని మేలము లాడువేళ ని
న్నన్న విధమ్మొ నీ ప్రణయ మర్హ మటంచు నెఱుంగఁజేసెడిన్.

౧౪

త్వ ద్భుక్త మాల్య సురభీకృత చారుమౌళేః
హిత్వా భుజాంతర గతా మపి వైజయన్తీమ్
పత్యు స్తవేశ్వరి మిథః ప్రతిఘాతలోలాః
బర్హాతపత్ర రుచి మారచయంతి భృంగాః.

విడచి భుజాంతరాళమున వ్రేలుచు నుండిన వైజయంతి నీ
ముడిచి యొసంగినట్టి సరముల్ ధరియించుటఁ దావు లీను నీ
యొడయని మస్తకమ్ముపయి – నొండొరులుం బ్రతిఘాతలోలతం
దొడరిన తేంట్లు పింఛముల తోరపు ఛత్రము పోల్కిఁ దోఁచెడున్.

౧౫

ఆమోదవ త్యపి సదా హృదయంగమాఽపి
రాగాన్వితాఽపి లలితాఽపి గుణోత్తరాఽపి
మౌలిస్రజా తవ ముకుంద కిరీటభాజా
గోదే భవ త్యధరితా ఖలు వైజయంతీ

గోద! యధః కరింపఁబడి కోల్పడెఁ బోఁణిమి వైజయంతి - యా
మోదము గల్గియుండి సతమున్ హృదయంగమ మయ్యు, భూరి రా
గోదయ సంభృతమ్మును గుణోత్తరమున్ లలితమ్మ నయ్యు నా
శ్రీదయితుండు దాఁ దల ధరించిన నీదు శిర స్సరమ్ముచే.

౧౬

త్వన్మౌలిదామని విభో శ్శిరసా గృహీతే
స్వచ్ఛంద కల్పిత సపీతి రసప్రమోదాః
మంజుస్వనా మధులిహో విదధు స్స్వయం తే
స్వాయం వరం క మపి మంగల తూర్య ఘోషమ్.

రంగవిభుండు నీదగు శిర స్సరముం దలఁ దాల్ప స్వేచ్ఛ సా
రంగమునందు వ్రాలి, మకరందము నొక్కెడఁ గ్రోలి, మోద మా
రంగ మనోహరమ్ముల స్వరమ్ముల నీదు స్వయంవరమ్మునన్
మంగళ తూర్య ఘోషములు మాటి కొనర్చుచు నుండె నమ్మరో!

౧౭

విశ్వాయమాన రజసా కమలేన నాభౌ
వక్షఃస్థలే చ కమలా స్తన చందనేన
ఆమోదితోఽపి నిగమై ర్విభు రంఘ్రియుగ్మే
ధత్తే నతేన శిరసా తవ మౌలి మాలామ్.

కల జగ మెల్ల పుప్పొడిగఁ గ్రాలిన పద్మముచేతఁ బొక్కిటన్
జలనిధి కన్యకా ఘన కుచమ్ముల చందన యుక్తిచే నుర
స్థలమున వేద శీర్షముల సంగతిఁ బాదములందు సౌరభో
జ్జ్వలుఁ డయినన్ విభుండు తలవంచి ధరించెను నీదు హారమున్.

౧౮

చూడాపదేన పరిగృహ్య తవోత్తరీయం
మాలా మపి త్వ దలకై రధివాస్యదత్తామ్
ప్రాయేణ రంగపతి రేష బిభర్తి గోదే
సౌభాగ్య సంప దభిషేక మహాధికారమ్.

వట్టిదికాదు నమ్ము మిది — వల్లెగ నీవు ధరించినట్టి మేల్
పుట్టము నీదు ముంగురుల పొంత గుబుల్ కొను మాలికం దలం
జుట్టుట రంగనాయకుఁడు సుందరతా మహనీయ సంపదన్
బట్టముఁ గట్టుకోఁదగు శుభస్థితికై యధికారి యయ్యెఁ దాన్.

౧౯

తుంగై రకృత్రిమగిర స్స్వయ ముత్తమాంగైః
యం సర్వగంధ ఇతి సాదర ముద్వహన్తి
ఆమోద మన్య మధిగచ్ఛతి మాలికాభిః
సోఽపి త్వదీయ కుటిలాలక వాసితాభిః.

వేదము సర్వగంధుఁ డను విశ్రుతి నున్నత మస్తకమ్ములం
దాదర మొప్ప నెవ్వని స్వయమ్ముగ నుద్వహనమ్ము సేసెనో
గోద! యతండుఁబో కుటిల కుంతల సౌరభ సంభృతమ్ములౌ
నీదు శిరస్స్రజమ్ములఁ గనెన్ మఱియొక్క పరిమళమ్ము దాన్.

౨౦

ధన్యే సమస్తజగతాం పితు రుత్తమాంగే
త్వన్మౌలిమాల్య భరసంభరణేన భూయః
ఇందీవరస్రజ మివాదధతి త్వదీని
ఆకేకరాణి బహుమాన విలోకితాని.

తావక మౌళిమాల్యములు దాల్పఁగ మిక్కిలి ధన్యమైన లో
కావళి కన్నతండ్రి శిరమం దభిమాన పురస్సరమ్ముగా
నీవు నిరంతరమ్ముఁ బ్రసరింపఁగఁ జేసిన ప్రేమదృష్టు లిం
దీవర మాలయో యనఁగ దేవి! మనమ్మునకున్ స్ఫురించెడిన్.

౨౧

రంగేశ్వరస్య చ తవ చ ప్రణయానుబంధాత్
అన్యోన్యమాల్య పరివృత్తి మభిష్టువన్తః
వాచాలయన్తి వసుధే రసికా స్త్రిలోకీం
న్యూనాధికత్వసమతా విషయై ర్వివాదైః.

రంగవిభుండు నీవునుఁ బరస్పరముం బ్రణయానుబద్ధులై
రంగుగ నాచరించిన సరమ్ముల మార్పును మేలుమే లటం
చుం గడు మెచ్చునట్టి సరసుల్ భువనమ్ముల నెల్ల మారు మ్రో
యంగ నొనర్తు రమ్మ! సమతాధికతా లఘుతాదిచర్చలన్.

౨౨

దూర్వాదల ప్రతిమయా తవదేహకాన్త్యా
గోరోచనా రుచిరయా చ రుచేందిరాయాః
ఆసీ దనుజ్ఝిత శిఖావల కంఠశోభం
మాంగల్యదం ప్రణమతాం మధువైరి గాత్రమ్.

పరమ శుభాంగి! మ్రొక్కు లిడువారికి మే లొడఁగూర్చునట్టి శ్రీ
హరి ఘన విగ్రహమ్ము గఱికాకు సమంబగు నీదు మేనివా
మెఱుఁగులు గోరజమ్ము పసమించు రమాసతి దేహకాంతు లొం
దొరులుఁ బెనంగి ప్రబ్బఁగ మయూర గళచ్ఛవి లీనుచుండెడిన్.

౨౩

అర్చ్యం సమర్చ్య నియమై ర్నిగమప్రసూనైః
నాథం త్వయా కమలయాచ సమేయివాంసమ్
మాత శ్చిరం నిరవిశ న్నిజమాధిరాజ్యం
మాన్యా మను ప్రభృతయోఽపి మహీక్షిత స్తే.

కమలయు నీవుఁ గూడి యొడికమ్మునఁ దన్ భజియింపఁ బూజ్య భా
వముఁ గయికొన్న నాథు శ్రుతివాక్యములం బ్రభవించినట్టి సం
యమముల నర్చఁజేసి మను వాదిగ భూపతులెల్ల పెద్ద కా
లమును స్వరాజ్య భోగము నిలంబడఁ గాంచిరికాదె? మాన్యులై.

౨౪

ఆర్ద్రాపరాధిని జనే ప్యభిరక్షణార్థం
రంగేశ్వరస్య రమయా వినివేద్యమానే
పార్శ్వే పరత్ర భవతీ యది తత్ర నస్యాత్
ప్రాయేణ దేవి వదనం పరివర్తితం స్యాత్.

ఇల నపరాధజాల మొనరించుచుఁ ముఖ్య వృత్తియై ప్రవ
ర్తిలెడి జనమ్ము నేన్ గనికరింపఁగ శ్రీసతి రంగనాథుతోఁ
బలికెడివేళ నన్య మగు పార్శ్వమునం దల నీవ లేనిచోఁ
దల నటు ద్రిప్పివైచికొనుఁ దప్పక నాత డటంచు నెంచెదన్.

౨౫

గోదే గుణై రపనయన్ ప్రణతాపరాధాన్
భ్రూక్షేప ఏవ తవ భోగ రసానుకూలః
కర్మానుబంధి ఫల దాన రతస్య భర్తుః
స్వాతన్త్ర్య దుర్వ్యసన మర్మభిదా నిదానమ్.

ప్రణతులు సేయువారి యపరాధము లెల్ల గుణప్రకాశన
మ్మునఁ దొలఁగించు నీ భ్రుకుటి మున్నొనరించిన కర్మకుం ఫల
మ్ము నొసంగు టందు వాంఛ మదిఁ బూనిన నాథు స్వతంత్రతాభర
మ్మను వ్యసన మ్మడంచి యలరారెను భోగరసానుకూలమై.

౨౬

రంగే తటి ద్గుణవతో రమయైవ గోదే
కృష్ణాంబుదస్య ఘటితాం కృపయా సువృష్ట్యా
దౌర్గత్య దుర్విష వినాశ సుధా నదీం త్వాం
సన్తః ప్రపద్య శమయం త్వచిరేణ తాపాన్.

అంబుధికన్య తాను మెఱపౌ హరిమేఘ మొగిం గృపా సువ
ర్షంబు నొసంగ దుర్గతి విషమ్ము హరించు సుధాస్రవంతివై
యంబుజగంధి! రంగపురమందు ఘటిల్లిన నిన్ను సజ్జనుల్
డంబుగ నాశ్రయించి యవిలంబముగాఁగ నణంత్రు తాపముల్.

౨౭

జాతాపరాధ మపి మా మనుకంప్య గోదే
గోప్త్రీ యది త్వమసి యుక్తమిదం భవత్యాః
వాత్సల్య నిర్భరతయా జననీ కుమారం
స్తన్యేన వర్ధయతి దష్ట పయోధరాఽపి.

కొసరుచు నేరపుం బనులు కొల్లలు సేసిననుం గృపా
రసమునఁ దోఁగ జేసి పరిరక్షణసేయుట నీకు యుక్తమౌ
బిసరుహపాణి! వత్సలత పెంపెసలారెడురీతిఁ దల్లి పా
లొసఁగి కుమారుఁ బెంచును బయోధర మాతఁడు గంటువెట్టినన్.

౨౮

శతమఖమణినీలా చారు కల్హారహస్తా
స్తన భర నమితాంగీ సాంద్ర వాత్సల్య సింధుః
అలక వినిహితాభి స్స్రగ్భి రాకృష్టనాథా
విలసతు హృది గోదా విష్ణుచిత్తాత్మజా నః.

తను రుచి నింద్రనీలము విధమ్మునఁ బోల్చి బెడంగు దమ్మికే
లను గ్రహియించి - బల్ కుచభరమ్మున వంగి - యనూన సత్కృపా
వన నిధియై స్వమాల్యముల భర్తృమనమ్మును జూఱలాడు స
జ్జన నుత విష్ణుచిత్త తనుజాత స్ఫురించుత మా మనమ్ములన్.

౨౯

ఇతి వికసితభక్తే రుత్థితాం వేంకటేశాత్
బహు గుణ రమణీయాం వక్తి గోదాస్తుతిం యః
స భవతి బహుమాన్య శ్శ్రీమతో రంగభర్తుః
చరణ కమలసేవాం శాశ్వతీ మభ్యుపైష్యన్.

వికసిత భక్తి సంభరిత వేంకటనాథ ముఖోత్థమై - గుణ
ప్రకర మనోహర మ్మయిన పావని గోదస్తవ మ్మెవండు సా
రెకుఁ బఠియించునో యతఁడు శ్రీమహితుండగు రంగధామ నే
తకు బహు మాన్యుఁడై వడయుఁ దత్పదసేవను శాశ్వతమ్ముగన్.



# శ్రీ వేంకటేశ్వర తారావళి

'భాషా ప్రవీణ - లలిత కవి'

శ్రీమాన్ కొమాండూరి రామానుజాచార్యులు

* * *

శ్రీమద్వేంకట శైలమందిర! నమ శ్శ్రీరస్తు తే సర్వదా
భూమీనాథ! సమేధతాం స్వకరుణాస్ఫూర్తి ర్మయి ప్రత్యహమ్
శ్యామాంభోద సమానగాత్ర! సుషమాసౌభాగ్యమూర్తే! జయ
స్తోమస్స్యాత్ భవతే వినమ్రజనబంధో! వేంకటేశప్రభో!

ఫలమో పుష్పమొ గంధమో తులసియో పానీయమో శాకమో
కలమాన్నంబొ ఘృతంబొ పాలు పెరుగో కర్పూర తాంబూలమో
సులభప్రాప్య పదార్థ మేదయిన సంశుద్ధాత్ములై యిచ్చినన్
గొలువన్ వచ్చిన మెచ్చు తండ్రి! యివె మ్రొక్కుల్ వేంకటేశప్రభూ!

నతగీర్వాణ పరంపరా మకుట లగ్నస్ఫీత రత్నావళీ
ద్యుతి నీరాజిత పాదపద్మ! శ్రితబంధూ! సింధుకన్యాధిపా!
చతు రామ్నాయ రహస్యవేద్య చరితా! సౌజన్యధన్యా! నమ
స్కృతులన్ గైకొని యేలుమయ్య యనురక్తిన్ వేంకటేశప్రభూ!

ఒకటా! రెండ! గతించిపోయినవి యెన్నో జన్మముల్ నేటి కే
నొకసూనంబు భవత్పదాబ్జములపై నుత్సాహితన్ నిల్పనే
రక దుర్వ్యాపృతిఁ జిక్కి స్రుక్కెదము దౌర్భాగ్యంబు వెన్నాడ - మా
మొక మెట్లొప్పును మోక్ష మిమ్మనఁగ బాబూ! వేంకటేశప్రభూ!

భూ నీలా కమలాలయల్ వలపు పెంపుల్ నిపుంప సాపత్న్య రీ
తీ నైకీ భవ దీర్ష్య సంతతము వేధింపంగ, నా గోడులో
లీనంబై తపియించు త్వాదృశున కే లీలన్ విపన్న ప్రజా
దీనోక్తుల్ చెవి కెక్కునో తెలుపు సుంతే వేంకటేశప్రభూ!

శ్రీదేవీ కుచ గంధసారకలిత శ్రీవత్స! రక్షోహరా!
గోదేవీ ఖురధూళి ధూసర లసత్కోటీర! వేదాంత వి
ద్యాదిప్రోక్త మహాస్వరాత్మక! సపర్యాచర్యఁ జేకూర్తు మీ
వే దిక్కై మము బ్రోవు మెల్లపుడుఁ దండ్రీ! వేంకటేశప్రభూ!

దూరీ భూత శుభ ప్రభావము - మహా దుఃఖాళికిం దీవి - దు
ర్వారాహంకృతి పట్టుకొమ్మ - దురిత ప్రారంభ పీఠంబు - ని
స్సారం బుద్ధ తమోహబంధురము సంసారమ్మునన్ గ్రుంకి జ్యో
తీ రూపున్ నినుగొల్వ రున్మదులు భక్తిన్ వేంకటేశప్రభూ!

వనమాలా సురభిన్ జగమ్ము పులకింపన్ భక్తలోకైక జీ
వనమా! లాలిత యుష్మదీయ చరణాబ్జ ద్వంద్వ నిస్తంద్ర సే
వన మార్గమ్ము ఘటింప రమ్ము కరుణాపాథోనిధీ! లోక పా
వన! మా వంతలు దూర దూర మయి పోవన్ వేంకటేశప్రభూ!

తరుణాంభోరుహ సన్నిభం బభయ ముద్రా భద్ర ముద్యత్ప్రభా
కరమౌ నీ కర మూతగా నిడుము భక్తశ్రేణికో వజ్ర పం
జర! దేవవ్రజకుంజరా! కలితమోక్షస్వామి! సామాన్య ని
ర్జరులన్ గొల్చిన లాభ ముండునె పరేశా! వేంకటేశప్రభూ!

నీ కారుణ్య కటాక్ష మెవ్వని రవంతేఁ జెందు, నవ్వాఁడె యీ
లోకైక ప్రభవిష్ణుఁ డాతడె దయాశుండాతఁడే యాచకా
శీ కల్పద్రుమ మాతఁడే విబుధపాళీమౌళి రత్నంబు దే
వా! కల్యాణగుణాంచితా! జగదధీశా! వేంకటేశప్రభూ!

తెలుగుం బల్కుల నూత్న నూత్న రుచులం దీపించు క్రొందేనెలున్
దెలుగుం బిడ్డల సత్కళా గరిమయున్ దేజంబు సౌహార్దమున్
వెలుగుం బాటల దిద్ది తీర్చినవి - నీవే వాని తార్కాణగన్
దెలుగుం భూమి నలంకరించితివి తండ్రీ! వేంకటేశప్రభూ!

జేజే లెందఱులేరు ధారుణిని? మా చిత్తంబు నీయందె బల్
మోజుం బూనెను శ్రీనివాస! యిఁక మా పుణ్యం బగణ్యంబు, ని
ర్వ్యాజంబౌ దయఁ బాపముల్ దులిపి నీ భక్తావళిం బ్రోవు మ
వ్యాజ ప్రేమ సపర్య చేయుదుము దేవా! వేంకటేశప్రభూ!

కరి రక్షించితి-ద్రౌపదిన్ మనిచితిన్-కల్యాణసంధాతనై
పరిపాలించితి మౌని సంఘములఁ దాపంబార్చి మేల్గూర్చి యా
దర మొప్పారఁగ భక్తరక్షణమె నా తాత్పర్యమౌనంటి వా
కరుణం జూపుము వక్త్ర భాసి తిలకాంకా వేంకటేశప్రభూ!

తొలి పల్కుం జవరాలి పాపటకు సిందూరంపుఁ గ్రొంజాయ కెం
పుల సింగారము నించు నీ పద యుగాంభోజాత ధూళీ సము
జ్జ్వల కాశ్మీర పరాగ మౌఁదల వహింపన్ జాలు భాగ్యంబు సం
ధిల జేయంగదె నిత్యపూర్ణ కరుణాబ్ధీ! వేంకటేశప్రభూ!

నీ మందస్మిత మోహనాననము సాంద్రీ భూత కారుణ్య రే
ఖా మాధుర్య కటాక్ష భాసురము - భక్తశ్రేణి సౌభాగ్య లీ
లా మూల మ్మొకసారి చూపగదె యుల్లాసంబు రేకెత్త, మా
లేముల్ లేమిని జెంది రాల వనమాలీ! వేంకటేశప్రభూ

కమలా కామిని క్రొత్త వింత వలపుల్ గల్పింపఁ దద్భవ్య ర
మ్య మృదు స్మేర కపోల పాళి పులకింపన్ ముద్దులన్ ముంచి సౌ
ఖ్యమునన్ జొక్కెడు నీ వుదారమతివై యెదంయుగిన ప్రభా
వము నర్థమ్మొనరించు కోగలవె? దేవా! వేంకటేశప్రభూ!

కొమ్మల్ నెత్తిన మెచ్చెనే గుహునకున్? కుంతీసుతుల్ వాడి గా
లమ్ముల్ వైచిరె? యేల యేలితివి? యేలా యేలవీ దీనులన్
సొమ్మున్ వేడిన చేత లేదనగ వచ్చున్ పాదసేవార్థులన్
పొమ్మంచున్ దఱుమంగ బాడియె? స్వయంభూ! వేంకటేశప్రభూ!

జీతం బే మొసగెన్ కిరీటి తన వాజిశ్రేణిసేవా ప్తికై ?
నీ తాతయ్యకుఁ జుట్టమా ధ్రువుఁడు? నీ నెత్తిన్ వరాల్ పోసెనా
కోతుల్? స్వామి! జయ, స్థిరత్వ, దృఢభక్త్యుత్సాహముల్ గూర్చితా
రీతిన్ మమ్మను బ్రోపరాఁగదవె తండ్రీ! వేంకటేశప్రభూ!

లలితానల్ప ఫణీంద్ర నూత్న మృదుతల్పా! భక్త సందోహ స
త్ఫల సంధాయక దివ్యకల్ప! గళభాస్వ ద్వైజయంతీ మహో
జ్జ్వల మాలా సుమడోలికా నిహిత తల్పా! సద్గుణాకల్ప! మా
యిలువేల్పా! ధృతి నిల్పరాగదె దయాబ్ధీ! వేంకటేశప్రభూ!

లలితంబై - సురభిచ్ఛటా మధురమై - లక్ష్మీప్రదంబై — మహో
జ్జ్వల నానా సుమ చిత్రపత్రయుతమై - త్వ ద్దివ్య కంఠస్థలిన్
గల 'తోమాలియ' గా వసింపఁగల ధాగ్యంబిమ్ము మాణిక్య కుం
డల! మా పున్నెపుఁ బంట పెల్ల తెగఁబండన్ వేంకటేశప్రభూ!

శ్రీలక్ష్మీ ప్రణయానురాగ మధురశ్రీ జొక్కి, లోకైక ర
క్షా లీలన్ విహరించు మూర్తివి - కృపా కల్లోలితోద్యత్కటా
క్షాలిన్ మా పయిఁ జిల్కుమయ్య నరసింహా! తీవ్రరంహా! నమ
జ్జాలోద్ధారణ బద్ధదీక్షిత పరేశా! వేంకటేశప్రభూ!

భక్తత్రాణ పరాయణుండ వగుచున్ బాలింపవేమయ్య! నీ
భక్తత్రాణ పరాయణత్వ బిరుద ప్రాగల్భ్య మే మయ్యెనో!
ముక్తిం గూర్చుము - శక్తి నిమ్ము - దయ పోషింపఁగా రమ్ము నీ
భక్తత్రాణ పదంబు సార్థకత నొప్పన్ వేంకటేశప్రభూ!

గ్రైవేయ ద్యుమణి ద్యుతి స్ఫురిత హార స్థూల హీరప్రభా
శ్రీ విభ్రాజ దురస్థ్సలీ కలిత లక్ష్మీ వీక్షణ జ్యోతికా
జీవం జీవిత నిత్య భక్తతిలక శ్రేణీ మహానంద లీ
లా వేలాయిత పాదమూల! మృదుశీలా! వేంకటేశప్రభూ!

అనఘా! బత్తియె శూన్యమైనను త్వదవ్యాజానురాగంబు ప
ద్దనిసం బోవునె? బిడ్డ యాకలికి మాంద్యం బింత వాటిల్లినన్
స్తనముల్ చేపకయున్నె తల్లికెటులైనన్ మమ్ము పాలింప నీ
పనిరా! సర్వ సుపర్వ వందిత పదాబ్జా! వేంకటేశప్రభూ!

నీ వాద్యుండవు – నిన్ భజింతు – హితముల్ నీచేత గైకొందు – నీ
కై వాక్పూజలొనర్తు – నీ వలన లక్ష్యం బెల్ల సిద్ధించు – నీ
కే వేల్పుల్ సరి వత్తురయ్య? మది నూహింపగ; నీయందె పో
నా విశ్వాసము – లోక రక్షక ముకుందా! వేంకటేశప్రభూ!

చతురోదాత్తమహత్త్వ వైదిక తపస్స్వాధ్యాయ దీక్షాకళా
స్థితి సంపన్నుఁడు కౌశికుం డను మునిశ్రేష్ఠుండు – తద్గోత్ర సం
తతికిం జెందిన వైష్ణవ ప్రవరుఁడన్ రామానుజాచార్యుఁడన్
శ్రితబంధూ! భవదీయ భక్తియుతుఁడన్ శ్రీ వేంకటేశప్రభూ!

* * *

ఇది 'రామానుజ కీర్తి కౌముది' కళాహేవాక మాధ్వీక సం
పదకుం దావల, మిద్ది వైష్ణవ జన ప్రత్యక్ష మందార, మి
య్యది లోకాభ్యుదయైకమూల, మిది కల్యాణ ప్రభాసారముల్
పిదుకన్ వేలుపుగిడ్డి భక్తులకు – దీపించున్ శుభోదర్కమై.





శ్రీ 'కరుణశ్రీ'

వీరి జననము పరీధావి నిజాషాఢము (4-8-1912). జన్మస్థానము గుంటూరు మండలాంతర్గత మగు కొప్పఱ్ఱు గ్రామము.

వీరి అసలు పేరు-శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి. 'కరుణశ్రీ' అనునది వీరి కవితా నామము.

శ్రీ భమిడిపాటి సుబ్రహ్మణ్యశర్మ, శ్రీ కుప్పా శ్రీ ఆంజనేయ శాస్త్రి, శ్రీ వేమూరి సీతారామశాస్త్రి, శ్రీ జమ్ములమడక మాధవరామ శర్మ గారలు వీరి విద్యా గురువులు.

వీరు సంస్కృతాంధ్ర సాహిత్యములలో మిక్కిలి అభినివేశము గలవారు. భావ మధురమైన కవిత్వము నల్లుటలో సిద్ధహస్తులు, ప్రస్తుతము గుంటూరు ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా పనిజేయుచు, రవీంద్ర నగరమున స్థిర నివాస మేర్పఱచుకొనియున్నారు.

**రచనలు:** ఉదయశ్రీ, విజయశ్రీ, కరుణశ్రీ, అరుణ కిరణాలు, ఆనంద లహరి, కరుణామయి, స్వప్నవాసవదత్తము, కల్యాణ కాదంబరి, భారత ప్రతిభ, వీర భారతి, తెలుగు బాల, తెలుగు సీమ, భాస నాటక చక్రము మొదలగునవి.

## శ్రీమాన్ గొట్టుముక్కల రమాకాంతాచార్యులు

ఆంధ్రప్రదేశమునఁ గల సుప్రసిద్ధ దివ్య క్షేత్రములలో నొకటి యగు మంగళగిరి వీరి జన్మస్థానము. జననము 1882. అస్తమయము 1962.

వీరికి సంస్కృతాంధ్ర సాహిత్యములందే గాక, ఆంగ్లభాషా సాహిత్యమునందును అసమానమైన ప్రజ్ఞాపాటవము లుండెడివి. పండిత ప్రకాండులుగా - కవి కంఠీరవులుగా — విమర్శక శిరోమణులుగా వీరు యావద్భారతమునందును విఖ్యాతిని సముపార్జించిరి. ఉభయ వేదాంతములలో వీరికిఁ గల వైదుష్యమును గుర్తించినవా రనేకులు వీరికి సన్మానములఁ జేసి, సత్కారముల గావించి, బిరుదముల నొసంగి, మిక్కిలి ప్రశంసించియుండిరి.

వీరు చాలకాలము రెవెన్యూ డిపార్టుమెంటులో తాలూకా తహశీలుదారుగా ఉద్యోగమును కడు సమర్థతతో నిర్వహించి, విశ్రాంతి వేతన మందుచు, బాపట్లపట్టణములో స్థిర నివాస మేర్పఱచుకొనియుండెడివారు.

వీరు బాల్యముననే అవధానములఁ జేయ నారంభించి, వానిని నైపుణ్యముతో జయప్రదముగా నిర్వహించుచుండెడివారు. ఆ తరుణమునందే, ఇంగ్లీషునుండి 'గ్రేసలిజీ' (Gray's Elegy) ని తెన్గించిరి. సంస్కృతమునుండి యామునాచార్యుల స్తోత్ర రత్నమును, మహా భారతాంతర్గత మగు భగవద్గీతను ఆంధ్రీకరించిరి.

1930, 1933, 1935, 1945, 1949 సంవత్సరములలో – పాటలీపుత్రము, మైసూరు, కాశీ, బొంబాయి పట్టణములందు జరిగిన ప్రాచ్య విద్వన్మహా సభలలోఁ బాల్గొని, వివిధ విషయములపై మహోపన్యాసముల నొసంగి, పండిత ప్రశంసల నందుకొని యుండిరి.

శ్రీవైష్ణవ పత్రిక, కల్యాణి, ప్రపన్న సుధ, ముముక్షువు, రామకృష్ణప్రభ మొదలగు మాస పత్రికలలో వీరి వ్యాసములు విశేషముగా ప్రచురింపఁబడుచు, పాఠకుల మన్ననలకు పాత్రము లగుచుండెడివి.

**రచనలు:** విశ్వ విద్యాలయము, గోకుల నిర్యాణము, అస్తమయము (నాటకము), ఆచార్య స్మృతి మున్నగునవి వీరి తెలుఁగు కృతులు. సంస్కృతములో భగవ దవతార సంగ్రహము, మంగళాద్రి లక్ష్మీ నృసింహ స్తోత్ర రత్నము, యదు గిరీశ ముక్తాహారము. శ్రీనివాస స్తవరాజము, గీతా రహస్య జిజ్ఞాస, సూత్ర మత జిజ్ఞాస, యోగ రహస్య జిజ్ఞాస, భగవ న్మత కౌస్తుభము ఇత్యాదులు. ఆంగ్లభాషలో — 'In the Temple of Truth' (సత్య నికేతనము) అను పేరు గల పద్య కావ్యము. ఇది ఆంగ్ల కవి శేఖరులచే విశేషముగా ప్రశంసింపఁబడినది.



శ్రీమాన్ మేడేపల్లి
వరాహ నరసింహస్వామి

వీరి జననము ఖర సంవత్సర చైత్ర శుద్ధ విదియ (10–4–1891). జన్మస్థానము విజయ నగరము.

వీరు – విజయనగరమునఁ గల కళాశాలయందే ఆంగ్లభాషాభ్యాసము గావించి, బి. ఏ. పరీక్షలో పట్టభద్రు లయిరి. తండ్రిగా రయిన శ్రీమాన్ మేడేపల్లి వేంకట రమణాచార్యులవారివద్ద సంస్కృత సాహిత్యమును, విశిష్టాద్వైత వేదాంతమును అధ్యయనము చేసిరి. స్వయంకృషితో ద్రావిడ దివ్య ప్రబంధము, ముముక్షుప్పడి (తిరుమంత్రార్థము), ఆచార్య హృద యము, భగవ ద్విషయము మొదలగు సంప్రదాయ గ్రంథములలోని విశేషాంశములను గ్రహించిరి.

1912 నుండి 1914 వఱకు – ఇండియన్ మెడికల్ ఇన్స్టిట్యూటులో, రసాయన శాస్త్రపరిశోధన గావించిరి.

1915 నుండి 1946 వఱకు విజయనగరము మహారాజావారి కళాశాలలో – రసాయన శాస్త్రోపన్యాసకులుగా పనిచేసిరి. 1951 నుండి 1964 వఱకు తెలుఁగు భాషా సమితిలో – తెలుఁగు విజ్ఞాన సర్వస్వ సంగ్రాహకులుగా పదవిని నిర్వహించిరి. 1964 నుండి 1966 వఱకు మహారాజావారి స్త్రీల కళాశాలలో రసాయన శాస్త్రోపన్యాసకులుగా ఉద్యోగమును నిర్వహించి, ప్రస్తుతము విజయ నగరమునఁ గల స్వగృహమునందే స్థిర నివాస మేర్పఱచుకొని, తెలుఁగు భాషా సమితివారి ఉపకార వేతనమును స్వీకరించుచు, సంప్రదాయ గ్రంథ రచనకై తమ శేష జీవితమును వినియోగించుచున్నారు.



శ్రీమాన్ వేదాంతం జగన్నాథాచార్యులు

వీరి జననము — జయ నామ సంవత్సర జ్యేష్ఠ బహుళ తదియ (24–6–1894.) జన్మస్థానము — గుంటూరుజిల్లా, తెనాలి తాలూకా, చందవోలు గ్రామము.

వీరు - తిరుపతి సంస్కృత కళాశాలలో భగవ చ్ఛాస్త్ర, అలంకార శాస్త్ర, ధర్మ శాస్త్ర, పూర్వ మీమాంసా శాస్త్రములను, పిఠాపురము మహారాజావారి శాస్త్ర కళాశాలలో — తర్క శాస్త్ర, వేదాంత శాస్త్రములను, బందరు జాతీయ కళాశాలలో వ్యాకరణ శాస్త్రమును అధ్యయనము గావించి, సర్వశాస్త్రములందును ఉత్తీర్ణత నందిరి.

దాదాపు ఇరువది సంవత్సరములపాటు పిఠాపురము మహారాజావారి సంస్థానమున ఆస్థాన పండితులుగా నుండి, తమ ప్రజ్ఞా పాటవములను విశేషముగా ప్రదర్శించి, ప్రభువుల మన్ననలను పొందిరి.

గోవర్ధన పీఠాధిపతులు, మేలుకోట పీఠాధిపతులు మున్నగు మహనీయులచే — 'వేదాంత రత్న' 'న్యాయ రత్నాకర' 'విద్యా భూషణ' 'సాహిత్య రత్న' 'మహా విద్వాన్' అను బిరుదములతో సంభావింపఁబడిరి.

సుప్రసిద్ధ భారతీయ విద్వాంసులును - 'పద్మశ్రీ' 'పద్మభూషణ' బిరుదాలంకృతులును అగు శ్రీ రాధా కుముద ముఖర్జీ (కలకత్తా) వారిచేతను, మహారాజుల చేతను, అనేక యోగ్యతా పత్రములను పొందిరి. అనేక సంస్థానములలో వార్షిక సన్మానముల నందుకొనిరి. మహా పండితులుగా ప్రశంసింపఁబడిరి.

బహుముఖమైన వీరి ప్రతిభా వ్యుత్పత్తులను, ప్రజ్ఞా పాటవములను బాగుగా గుర్తించినవా రనేకులు. అట్టివారిలో — 'ఆర్షవిద్యాలంకార' బిరుదాలంకృతు లగు మాన్యశ్రీ — కల్లూరి చంద్రమౌళి మహోదయులు ముఖ్యులు. కనుకనే, తాము ఆంధ్రప్రదేశ్ దేవాదాయ ధర్మాదాయశాఖలో అమాత్యులుగా నున్న తరుణమున, 1955 లో — శ్రీ చంద్రమౌళి మహోదయులు వీరిని తిరుమల తిరుపతి దేవస్థానములకు ఆస్థాన పండితులుగా నియమింపఁ జేసిరి.

వీ రిపుడు — గుంటూరుజిల్లా, బాపట్లతాలూకా, అప్పికట్ల గ్రామమున — 'బృందావనము'నందు స్థిర నివాస మేర్పఱచుకొని యున్నారు.



శ్రీమాన్ పొడిచేడి శ్రీరంగాచార్యులు

ఆంధ్ర ప్రదేశములో సుప్రసిద్ధ క్షేత్రమైన భద్రాచలము వీరి జన్మస్థానము. జననము — రుధిరోద్గారినామ సంవత్సర ఆషాఢ శుద్ధ త్రయోదశి (26–8–1924).

వీరు భద్రాచలమునఁ గల శ్రీ సీతారామాలయార్చక కుటుంబములోని వారు. తానీషా కాలమున రామదాసుచే కొనిరాఁబడిన వైష్ణవ కుటుంబము వీరిది.

పరమ భాగవతాగ్రేసరులును — శ్రీవేణుగోపాలకృష్ణ పీఠాధిపతులును నగు కీ॥శే॥ శాయనాచార్యులు, కీ॥శే॥ సీతమ్మగారలకు వీరు చతుర్థ పుత్రులు. సుప్రసిద్ధ పాంచరాత్రాగమ శాస్త్ర విద్వాంసు లగు కీ॥శే॥ సీతారామానుజాచార్యులవారికి కనిష్ఠ సోదరులు.

వీరు – కర్షణాదిప్రతిష్ఠాంతమువఱకు దేవ యాజ్ఞికమును, నాలాయిర దివ్య ప్రబంధములను, శ్రీపాంచరాత్ర దివ్యాగమశాస్త్రములను అధ్యయన మొనర్చిరి.

1942 నుండి 1947 వఱకు తిరుపతి సంస్కృత కళాశాలలో సంస్కృత భాష నభ్యసించి, మద్రాసు విశ్వ విద్యాలయమునకు సంబంధించిన 'సాహిత్య శిరోమణి' పరీక్షలో ప్రథమ శ్రేణియందును, స్వయంకృషిచే 'తెలుఁగు విద్వాన్' పరీక్షలో ద్వితీయ శ్రేణియందును ఉత్తీర్ణత నందిరి. చిత్తూరు సంస్కృతభాషా ప్రచారిణీసభ వారిచే 'వేదాంత కోవిద' బిరుదముతో సంభావింపఁబడిరి. అనంతరము హెచ్. యస్. సి. ముగించి, పండిత శిక్షణము పొందిరి. హైదరాబాదు రాజ్య హిందీ ప్రచార సభవారి 'రాష్ట్ర భాషా భూషణ్' హిందీ పరీక్షలో నుత్తీర్ణులైరి.

తెలంగాణా ప్రాంతమందు నల్లగొండజిల్లా కేంద్రమున ప్రభుత్వ సకలార్ధ సాధకోన్నత పాఠశాలలో 1948 నుండి 1963 వఱకు పదునైదు సంవత్సరములు ఆంధ్ర హిందీ భాషలను ఉన్నత కక్ష్యలకు విద్యార్థి జన రంజకముగా బోధించిరి. తెలుఁగు పుస్తకములు లేని ఆ ఉన్నత పాఠశాలలో తెలుఁగు గ్రంథాలయములను నెల కొల్పి, నిరంతర పరిశ్రమతో కొన్నివేల గ్రంథములను సమకూర్చి, విద్యార్థులకు, ఉపాధ్యాయులకు వాని మూలమున నూతన చైతన్యమును గల్గించి, ఆంధ్రభాషా వికాసమునకు దారి తీసిరి. వ్యాస, వక్తృత్వ, నాటక సంఘ – రచనా సంఘములను స్థాపించి, అనేకులగు విద్యార్థులను వక్తలుగా – రచయితలుగా – నటులుగా – గాయకులుగా తీర్చి దిద్దిరి. దేవాలయములలో – కళాశాలలలో – పాఠశాలలలో – రాజకీయ సభలలో మహోదాత్తమైన సాహిత్య రాజకీయ ధార్మిక ప్రవచనములను నూర్లకొలది సంఖ్యలో నొసంగి, ఆ ప్రాంతీయులలో ఒక విశిష్ట పండిత స్థానము నాక్రమించిరి. సచివోత్తములచే పండిత సన్మానములను పొందిరి. హిందీ ప్రచార సభ, ఆంధ్ర సారస్వత పరిషత్తు, త్యాగరాజోత్సవ సంఘము, సంస్కృత భాషా ప్రచార సమితి మొదలగు సంస్థలకు కార్యదర్శిగా వ్యవహరించి, కొన్ని వందలమంది విద్యార్థులకు హిందీ సంస్కృత ప్రమాణ పత్రములను అనేక పర్యాయములు మంత్రి పుంగవులచే ప్రదానము చేయించిరి. శ్రీరామచంద్ర మహాప్రభువుయొక్క దివ్యాదేశముచే, శ్రీ భద్రాచల క్షేత్ర మాహాత్మ్యమును వ్యాస రూపమున రచించి, ప్రచురిత మొనర్చిరి.

అనంతరము 1963 లో – మునగాల, సూర్యాపేట ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయులుగా పనిచేసి, ఉత్తర ప్రదేశ ప్రభుత్వముచే ఆంధ్ర మహా పండితులుగా ఎన్నుకొనఁబడి, ప్రకృతము గోరక్‌పూరు ప్రభుత్వ కళాశాలలోని సాయంకాలీన కక్ష్యలలో ప్రభుత్వోద్యోగులకు తెలుఁగు డిప్లొమా కోర్సుకు శిక్షణ నొసంగుచు, వందలకొలది వయోజనులకు హిందీ భాషా మాధ్యమముచే, ఆంధ్ర భాషను గరపుచున్నారు.

లక్నో, కాన్పూరు, ఆలీగడ్, ఆగ్రా మొదలగు పట్టణములలో – ఆంధ్ర సాహిత్య మాధుర్య గాంభీర్యము లను హిందీ ప్రముఖులకు సాహిత్య సభలలో స్పష్టముగా తెలియఁజేయుచు, కళాశాలలో – విశ్వ విద్యాలయములలో తెలుఁగు భాషకు విశిష్టస్థానము గల్గింప యత్నించుచు, ప్రజాదరణమును పొందుచున్నారు.

నన్నయ, తిక్కన, పోతన, శ్రీనాథాది మహాకవుల హృదయంగమ కవితలను మధుర గానముతో హిందీ శ్రోతలకు చవి జూపించి, 'ఆంధ్ర భాషయే ముఖ్యముగా త్రిభాషా బోధనములో స్వీకరింప దగినది, అను భావమును వారిలో గల్గించుచు, ఆంధ్ర భాషా యోషకు సేవ గావించుచున్నారు.

వీరు – శ్రీవైష్ణవాగమ తంత్రశాస్త్రములలోని రహస్యములను పరిపూర్ణముగ గ్రహించి, ఆ శాస్త్రముల మాహాత్మ్యమును, సంపూర్ణ సత్యమును గుర్తించి, అందలి దివ్యానుభూతుల ననుభవించిరి.

శ్రీపాంచరాత్ర భగవ ద్దివ్య శాస్త్రమును ముక్తకంఠముతో ప్రశంసించుచు, శ్రీవైష్ణవాగమ తంత్ర శాస్త్రములు పరమ సత్యము లనియు. అందలి ఆరాధనా జపోపధ్యానాది విధు లన్నియు ఇహ పరములలో దివ్య ఫలదాయకము లనియు లోకమునకు చాటుచున్న విశాల హృదయులు వీరు.

వీరు మహా మంత్రసిద్ధులు. నిత్య సాధకులు. సంస్కృతాంధ్ర హిందీ భాషలలో గొప్ప వక్తలు. రచయితలు. సాహిత్య – వేదాంతములు, ఆగమ శాస్త్రములు వీరి అభిమాన ధనములు.



శ్రీమాన్ గుదిమెళ్ళ
రామానుజాచార్యులు

వీరి జననము–ఆనంద నామ సంవత్సర జ్యేష్ఠ మాసము (1915). జన్మస్థానము – గుంటూరుజిల్లా, రేపల్లె తాలూకా, ముక్తిపల్లి అగ్రహారము. ప్రస్తుత నివాసము – తెనాలి తాలూకా, నడిగడ్డపాలెములో 'శ్రీ హయగ్రీవ సదనము.'

వీరు ఆచార్య సంపత్తి గల అగ్రహారీకులు. హయగ్రీవోపాసకులు. ఆశు కవులు.

శ్రీవిశిష్టాద్వైత మత ప్రచారక సంఘ సంచాలకులుగా – భక్తి నివేదన పత్రికా సహాయ సంపాదకులుగా - బహు కావ్య నిర్మాతలుగా వీరు దేశమునకు సుపరిచితులు. వీరికి సన్మానము లనేకములు జరిగినవి. పెక్కు బిరుదము లొసంగబడినవి. అయినను, వీరు నిరాడంబరులై, నిరహంకారులై మెలగు చుందురు.

శ్రీ త్రిదండి – శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారితో శ్రీరామ మహాక్రతు నిర్వహణార్థమై ఆసేతు శీతాచలము దాదాపు ఒక పుష్కరకాలముపాటు పర్యటించిన సుకృతవంతులు వీరు.

ఇంతవఱకు వీరిచే రచింపఁబడిన కావ్యములు ఏఁబదింటికి మించి యున్నవి. ఈ కావ్యము లన్నియు మధుర కవితాభిరామములే. వీనిలో కొన్ని - సంప్రదాయ ప్రచారార్థమై రచింప బడిన కావ్యములు. కొన్ని — శ్రీరామభక్తి ప్రచారార్థమై రచింపఁబడిన కావ్యములు. మరికొన్ని – తదితర సాహిత్య రూపముగా రచింప బడిన కావ్యములు.

**సంప్రదాయ కావ్యములు :** భక్తి యోగము, ప్రపత్తి యోగము, ద్వయ మంత్రార్థము, చరమార్థ దీపిక, పల్లాండు వైభవము, మధుర సూక్తి, ఈడు ముత్తమువ్, బదరీనాథ సుప్రభాతము, శ్రీ కూర్మ నాథ సుప్రభాతము ఇత్యాదులు.

**శ్రీ రామాయణ కావ్యములు:** ప్రథమ సర్గ, మా నిషాద, అహం వేద్మి, మైథిలి, మాండవి, ఊర్మిళ, సరమ, శబరి, ఋష్యమూకము, రామ రాజ్యము, శ్రీరామ క్రతువు ఇత్యాదులు.

**ఇతర కృతులు :** ధనుర్దాసుడు, శరద్రాత్రి, గీతా సందేశము, విద్యా విలాసము, మురళీధర విలాసము, శ్రీకాకుళస్వామి శతకము, రఘు కులేంద్ర స్తుతి, పండిత గోష్ఠి, ఆచార్య సంభావన, శ్రీదేవి, యతిరాజ విజయము, శ్రీభాష్య కారులు, స్వర్ణ పూజ, సువర్ణ ధార ఇత్యాదులు.


ప్రొఫెసర్ : యస్వీ జోగారావు

వీరి జన్మస్థానము శ్రీకాకుళముజిల్లా, పార్వతీపురము. జననము విభవ నామ సంవత్సర భాద్రపద బహుళ తృతీయ (2-10-1928).

వీరు — పార్వతీపురము, కాకినాడ, వాల్తేరు పట్టణములలో విద్యాభ్యాసము గావించి, ఆంధ్ర విశ్వకళాపరిషదాంధ్రశాఖలో 1952వ సంవత్సరమున, బి.ఏ. ఆనర్సు పరీక్షయందు ప్రథమ శ్రేణిలో ప్రథములుగా నుత్తీర్ణత నందిరి.

1952-54 సంవత్సరముల నడుమ యూనివర్సిటీ రిసెర్చి ఫెల్లోగా, 1954-56 సంవత్సరముల నడుమ గవర్నమెంటు ఆఫ్ ఇండియా సీనియర్ రిసెర్చి స్కాలరుగా, ఆంధ్ర విశ్వ కళాపరిషత్తులో ఆంధ్రవాఙ్మయ పరిశోధకులుగా పని జేసిరి. 1954—వ సంవత్సరమున అచ్చటనే ఉపన్యాసకులుగా నియోగింపబడిరి.

1957-వ సంవత్సరమున డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ పట్టమును స్వీకరించి, విశ్వకళాపరిషత్తువారు భారత ప్రభుత్వ సహకారముతో ప్రారంభించిన తెలుఁగు వ్యుత్పత్తి పద కోశ నిర్మాణ పథకమునందు ప్రథమ పరిశోధన సాహాయ్యకులుగా నియమింపఁబడిరి.

తదుపరి 1965లో - సోవియట్ ప్రభుత్వముయొక్క ఆహ్వానముపై, భారత సోవియట్ సాంస్కృతిక వినిమయ పథకముక్రింద, లెనిన్‌గ్రాడ్ విశ్వ విద్యాలయములో ఆంధ్రాచార్యులుగా నియుక్తులై, రెండేండ్లపాటు ఆ పదవిని నిర్వహించిరి. ఆ కాలములోనే, సోవియట్ ప్రభుత్వ సహకారముతో - యూరపు, అమెరికా, కెనడా దేశములను కొన్ని సాంస్కృతిక కార్యక్రమ నిర్వహణ సందర్భమున దర్శించిరి.

ప్రకృతము గుంటూరులోని ఆంధ్ర విశ్వ కళా పరిష దనుబంధముగా వెలసిన పరమ పట్టభద్ర కేంద్రము (Post Graduate Centre) నందు తెలుఁగు శాఖ ఆచార్య పదవిని నిర్వహించుచున్నారు.

వీరు పదునాల్గు సంవత్సరముల ప్రాయమునుండియే కవితా వ్యాసంగము, కథానికాది రచనము పత్రికా ముఖమున ప్రకటన మొనరించి ప్రసిద్ధి గాంచిరి. విద్యార్థి దశలో వివిధములైన పోటీ పరీక్షలయందు ప్రథమ బహుమానముల బడసి ప్రస్తుతింపఁబడిరి. తదుపరి సాహిత్య విమర్శ, అముద్రితాంధ్ర వాఙ్మయ పరిశోధనలలో విశేషమైన కృషి యొనర్చి, అశేషమైన యశస్సు నార్జించిరి.

**రచనలు :** ఆంధ్రాంగ్లములందు వివిధ సాహిత్య విషయములపై అనేక వ్యాసములు, ఖండ కావ్యములు (పద్యములు, గేయములు), కథానికలు, నాటికలు బహు పత్రికా ముఖమున వీరివి ప్రకటింపఁ బడినవి. తెలుఁగున 'ఊహాప్రహేళిక' అను నొక విశిష్ట సాహిత్య ప్రక్రియ వీరిచే నూతనముగా సృష్టింపఁబడినది. వీరిచే రచింపఁబడిన 'ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర' అను గ్రంథము భారత ప్రభుత్వామోద సాహాయ్యములతో ఆంధ్ర కళాపరిషత్తు వారిచే ప్రకటింపఁబడినది.

ఇతర కృతులు:

**ముద్రితములు :** (1) పంచ కళ్యాణి (ఖండ కావ్య సంపుటి) (2) సువర్ణశృంఖల (కథానికలు, గల్పికలు) (3) మదన కామేశ్వరి (నాటికల సంపుటి) (4) ఉపనిషత్తు (ఖండ కావ్య సంపుటి) (5) అప్సరస (గేయ నృత్య నాటికల సంపుటి) (6) సప్త తంతువు (7) సారస్వత నీరాజనము (సాహిత్య వ్యాసముల సంపుటములు) (8) అమెరికన్ సాహిత్యచరిత్ర (9) మహాకవి మార్గము (సంస్కృతాంధ్ర భారత విమర్శ నిబంధము).

**అముద్రితములు :** (1) చోమోలుంగ్మా (నవల) (2) లోకాభిరామాయణము (3) కాదంబరీస్వాదము (4) బృహత్సంహిత (అనువాదము) (5) The Popular Theatre of Andhra.



శ్రీ రావూరి ప్రసన్న సత్యనారాయణ

వీరి జన్మ స్థానము - గుంటూరు మండలమును గల కావూరు గ్రామము. జననము 3-8-1938.

వీరు 1946-54 సంవత్సరముల నడుమ — స్వగ్రామమైన కావూరులోనే ప్రాథమికవిద్య నభ్యసించిరి. 1954-56 సంవత్సరముల నడుమ, నిడుబ్రోలు కళాశాలలో ఉన్నతవిద్య నభ్యసించిరి. 1956-59 సంవత్సరముల నడుమ, ఆంధ్ర విశ్వకళా పరిషదాంధ్ర భాషా శాఖలో బి.ఏ. ఆనర్సు తరగతిలో విద్యాభ్యాసము గావించి, ప్రథమ శ్రేణిలో నుత్తీర్ణత నందిరి. 1960-వ సంవత్సరమున ఎం.ఏ. పట్టమును స్వీకరించిరి. 1959-వ సంవత్సరము నందే, ఆంధ్ర విశ్వకళా పరిషదాంధ్ర భాషలో పి. హెచ్. డి. పట్టమునకై, పరిశోధన ప్రారంభించిరి. 1959-60 సంవత్సరముల నడుమ ఆంధ్రాయూనివర్సిటీ రిసెర్చి ఫెల్లోగాను, 1960-63 సంవత్సరముల నడుమ యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ రిసెర్చి స్కాలరుగాను పరిశోధన గావించిరి.

'భక్తి తత్త్వము — ఆంధ్ర వాఙ్మయము' అనునదియే వీరి పరిశోధన విషయము. వైదిక సంస్కృత వాఙ్మయమును పరిశీలించి, అందు వికీర్ణముగఁ గనిపించు భక్తితత్త్వము యొక్క స్వరూపమును ఒక్కచో నిరూపించి, అట్టి భక్తితత్త్వము యొక్క స్వరూపము ఆంధ్ర వాఙ్మయమునం దెట్లున్నదియు నిరూపించుటయే వీరి పరిశోధన లక్ష్యము.

చిన్ననాఁటినుండియు వీరు ఆంధ్ర వాఙ్మయమునెడ విశేషమైన అభిరుచి గలవారు. వివిధ సాహిత్య విషయములపై, సుమారు ఇరువది వ్యాసములు వీరివి పత్రికలలో ప్రచురితములైనవి.



శ్రీ కేశవభొట్ల సుదర్శన వేణుగోపాలమూర్తి

వీరి—జన్మస్థానము కృష్ణా మండలాంతర్గత మగు మొవ్వ గ్రామోప గ్రామ మగు మూలపాలెము. జననము 1905. అస్తమయము 1969.

వీరు — మచిలీపట్టణము నందలి నోబుల్ కాలేజీలో విద్యాభ్యాసము గావించి, బి.ఏ.,పరీక్షలో నుత్తీర్ణత నందిరి. తండ్రిగారైన శ్రీ వేంకటేశ్వరులుగారి యొద్దను, పెదతండ్రిగారైన శ్రీ రాజగోపాలముగారి యొద్దను సంస్కృతాంధ్ర సాహిత్య గ్రంథములను అధ్యయనము చేసిరి. శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారి వద్ద కవితా రీతులను గ్రహించిరి.

విజయవాడ, తెనాలి నగరములలోఁ గల ఉన్నత పాఠశాలలో కొంత కాలము ఆంధ్రాంగ్ల భాషలయందు అధ్యాపకత్వము నెరపి, 1947-వ సంవత్సరమున గుంటూరు హిందూ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా ప్రవేశించి, 1966-వ సంవత్సరము వఱకును ఆ పదవిని నిర్వహించిరి. అనంతరము హైదరాబాదు ఆంధ్ర ఓరియంటల్ కాలేజీలో ఆంధ్ర శాఖయందు అధ్యాపకులుగా చేరి, ఆ పదవిని నిర్వహించుచు, చిరకాలము క్రిందట ప్రారంభించిన సుదర్శన రామాయణ రచనను కొనసాగించి ముగించిరి.

రచనలు:

**ముద్రితములు :**

**పద్యకావ్యములు :** కృష్ణాభ్యుదయము, ఉత్తర లీలలు, పేద మొర, లక్ష్మీ లహరి.

**నాటకములు :** అశోక ధర్మ చక్రము, సహ ధర్మ చారిణి, విజ్ఞాన వ్యాసములు, పూర్వాంధ్రకవులు, నాటక కళ.

**అముద్రితములు :**

**కావ్యములు :** ఖండ కావ్యముల సంపుటి, రాస రామాయణము, శతపత్రేక్షణ, బాల రామాయణము.

**నాటకములు :** జరాసంధ, నిరుపేద, ఆంధ్ర సామ్రాజ్యము, ఊర్వశీ ధనంజయము.

**నాటికలు :** మరణ నిరోధము (Death controle), తెలి మఱుగు.

**నవలలు :** భూతసారధి, తధాగతుఁడు.

**వ్యాకరణము :** సుదర్శన వ్యాకరణము ( భాగ త్రయాత్మకము )

**హరికథ :** కపోతోపాఖ్యానము.

**ముద్రిత గ్రంథములలో —** 'అశోకధర్మచక్రము' అను గ్రంథమును ఆంధ్ర — బెనారస్ యూనివర్సిటీలు బి. ఏ. తరగతికిని, ఉస్మానియా యూనివర్సిటీ ఎం.ఏ. తరగతికిని పాఠ్యగ్రంధముగా కొంతకాల ముండునట్లు నిర్ణయించియున్నవి.

వీరి 'పరశు రామ' నాటకము విజయవాడ రేడియో కేంద్రమున బహిరంగముగా ప్రదర్శింపఁబడుటయే గాక, గుంటూరు జిల్లాలో — మద్రాసు నగరములో — ఇంకను పలు తావులలో ప్రదర్శింపఁబడి, ప్రశంసల నందుకొనియున్నది.

అనేక పండిత పరిషత్తులలో — కవితా గోష్ఠులలో వీరు సత్కారములను పొందుటయే గాక, పెక్కు బిరుదములనుగూడ పొందియుండిరి. కొన్ని మహా సభలకు అగ్రాసనాధిపత్యము వహించి, ఆ యా సభలను జయ ప్రదము గావించి యుండిరి. విద్వత్కవులలో వీరు మంచిపేరును సంపాదించుకొనిరి.



వీరి జన్మస్థానము — గుంటూరుజిల్లా, తెనాలి తాలూకా, మోపఱ్ఱు గ్రామము. జననము - విళంబినామ సంవత్సర కార్తీకమాసము (15–11–1898).

వీరు - తెనాలి, బాపట్ల పట్టణములలోఁ గల పాఠశాలలలో ఉన్నత విద్య నభ్యసించి, 1920 ఆగష్టు 23 వ తేదీన స్కాట్లండు దేశమునకు ప్రయాణించి, అచ్చటి ఎబర్డీన్ విశ్వ విద్యాలయములో వ్యవసాయ శాస్త్ర మధికరించి, పట్టభద్రులై, 1922 లో స్వదేశమునకు తిరిగి వచ్చిరి.

విదేశమునుంచి మాతృదేశమునకు చేరినవెంటనే, గాంధీమహాత్ముని శంఖారావమును విని, ప్రభుత్వో ద్యోగము చేయ నొల్లక, స్వాతంత్ర్యోద్యమములో పాల్గొని, మాతృ దేశముపై అచంచల భక్తివిశ్వాసము లను వెల్లడించిరి.

మాన్యశ్రీ — కల్లూరి చంద్రమౌళి

స్వాతంత్ర్య సమరములో ప్రముఖ పాత్ర వహించి, సత్యాగ్రహ రంగమున పురోగమించి, దీర్ఘకాలము కారాగారవాసము చేసిరి.

కారాగారవాసము చేయు సమయమునందే, పండిత మిత్రుల తోడ్పాటుతోడను—స్వయంకృషితోడను సంస్కృతాంధ్ర సాహిత్యములందు విశేషముగా ప్రవేశమును సంపాదించిరి.

1938 నుండి 1940 వఱకు—గుంటూరుజిల్లాబోర్డు అధ్యక్షులుగా పదవిని నిర్వహించి, మండల ప్రజల మన్ననలకు పాత్రులైరి.

1947 లో — భారతదేశమున కాంగ్రెసు ప్రభుత్వ మేర్పడిన సమయమునందు, ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో 1952 వఱకు అయిదు సంవత్సరములు అమాత్యులుగా నుండి, సహకార సంస్థలను, స్థానిక సంస్థలను తీర్చి దిద్దిరి.

ఆంధ్రరాష్ట్ర మవతరించిన యనంతరము మఱల అమాత్య పదవి నలంకరించి, 1955 నుండి 1956 వఱకు — రెవెన్యూ, దేవాదాయ ధర్మాదాయ శాఖలను నిర్వహించి, ఆ యా శాఖలకు నూతనోత్తేజమును గల్గించిరి.

విశాలాంధ్ర మవతరించిన తదుపరి 1960 నుండి 1962 వఱకు అమాత్య పదవి నధిష్ఠించి, దేవాదాయ ధర్మాదాయ, సహకార శాఖలను కడు సమర్థతతో నిర్వహించిరి.

1947 — 1952 సంవత్సరముల నడుమ మద్రాసులో అమాత్యులుగా నున్న తరుణమునందే వీరు సంస్కృతాంగ్లభాషా విశిష్ట పాండిత్య సమలంకృతులును, 'సంస్కృత సాహితీ వల్లభ' 'సారస్వత సారజ్ఞ' ఇత్యాది బిరుదాలంకృతులును, వంశపరంపరానుగత రామాయణ పారాయణ నిర్వహణ సంపన్నులును, జ్ఞాన వృద్ధులును, వయోవృద్ధులు నగు శ్రీమాన్ టి. సుందరాచారియర్ (బి.ఏ.బి.యల్) గారి సన్నిధిలో శ్రీమద్రామాయణమును

అత్యంత శ్రద్ధాసక్తులతో అధ్యయనము గావించి, అందలి మాధుర్యమును తనివితీర తా మాస్వాదించుటయే గాక 'శ్రీ రామాయణ సుధాలహరి' యను పేర నొక మహా గ్రంథమును రచించి, తన్మూలమున శ్రీమద్రామాయణ మాధుర్యమును ఆంధ్ర మహా జను లందఱకును బాగుగా చవి జూపిరి.

వీరి రామాయణ సుధా లహరిలో – వాల్మీకి హృదయము నవలోకించి, పరమ హర్షము నందిన పశ్చిమ గోదావరీ మండలమున గల తణుకు నగర పండిత మండలి — ఉస్మానియా విశ్వకళాపరిష దుపాధ్యక్షు లగు డాక్టరు సూరి భగవంతముగారి యధ్యక్షతన 1956 లో ఒక మహా సభ నేర్పఱచి, అందు వీరికి సువర్ణ సంశోభితములైన స్వాగతపత్రములను – 'ఆర్షవిద్యాలంకార' బిరుదమును సమర్పించి, సన్మానించిరి.

ఆంధ్రరాష్ట్రావతరణానంతరము అమాత్యులుగా నున్న తరుణమునందే వీరు – శ్రీశైల క్షేత్రమును జీర్ణోద్ధరణ మొనర్పవలెనని నిశ్చయించి, అందుల కొక సంఘమును నెలకొల్పి, గుంటూరు పట్టణమునందే సంపన్ను లగు వారినుండి లక్ష రూపాయలను విరాళముగా సేకరించి, ఆలయ పున రుద్ధరణ కార్య క్రమమును ఆరంభించిరి.

విశాలాంధ్ర మవతరించిన యనంతరము అమాత్యపదవి నధిష్ఠించియున్న సమయమున, ఆంధ్ర ప్రదేశమునఁ గల సుప్రసిద్ధములైన దేవాలయములను పునరుద్ధరింపవలెనని సంకల్పించి, అందుల కొక మహత్తరమైన పథకమును రూపొందించి, భద్రాచలమునఁ గల శ్రీ సీతారామాలయ పునరుద్ధరణకై తాము స్వయముగా మొట్టమొదటనే పదివేల రూపాయిలను సమర్పించిరి. అనంతరము దేశవాసుల నుండి అచిరకాలములో సుమారు 19 లక్షల రూపాయిలను విరాళముగా సేకరించి, శ్రీ భద్రాచల క్షేత్రమును కలియుగ వైకుంఠముగా తీర్చి దిద్దుటకై ఆ ద్రవ్యమును వెచ్చించి, అపర రామదాసుగా విఖ్యాతి నార్జించిరి.

బొంబాయిలో – కె. యం. మున్షీ ప్రభృతులచే సంస్థాపింపఁబడిన సంస్కృత విశ్వకళా పరిష త్పంచమ వార్షిక మహోత్సవమును 1955 లో – తాము ఆంధ్ర రాష్ట్రమునందు అమాత్యులుగా నున్న తరుణమునందే, నాఁటి రాష్ట్రపతి యగు శ్రీ రాజేంద్ర ప్రసాద మహాశయుల అధ్యక్షతన తిరుపతి క్షేత్రములో నేర్పఱచి, భారతదేశమునఁ గల ప్రముఖ పండితుల నెల్లర రావించి, వారి పాండిత్య ప్రకర్షలను బాగుగా నవగత మొనరించుకొని, వారిని సముచిత రీతిని సన్మానించిరి.

కేంద్రప్రభుత్వమువారు నెలకొల్ప నెంచిన ప్రథమ సంస్కృత విశ్వవిద్యాలయమును తిరుపతి క్షేత్రములో సంస్థాపించి, సంస్కృత భాషా వ్యాప్తికి సముద్యమించిరి.

1964 లో తిరుమల తిరుపతి దేవస్థానముల పాలకవర్గమునకు అధ్యక్షులై, తిరుమలలో 'శ్రీ వేంకటేశ్వర ఆర్షసంస్కృతి సదస్సు' అను పేర నొక మహా సంస్థను నెలకొల్పి, తన్మూలమున ప్రతి నిత్యము శ్రీ స్వామివారి సన్నిధానములో చతుర్వేద పారాయణము, శ్రీ వేంకటాచల క్షేత్ర మాహాత్మ్య – భాగవత – రామాయణ పారాయణములు, పురాణ ప్రవచనములు, పండితోపన్యాసములు, హరికథా కాలక్షేపములు, భజన కాలక్షేపములు, సంగీత సభలు మున్నగునవి నిరంతరాయముగా జరుగునట్లు తగిన ఏర్పాటుల గావించిరి.

వీరిపుడు గుంటూరులో – చంద్రమౌళి నగరమున 'తపోవనము' అను నామాంకితమైన స్వగృహమందు స్థిర నివాస మేర్పఱచుకొని, ప్రశాంత వాతావరణములో గ్రంథ రచనా వ్యాసంగమున నిమగ్నులై యున్నారు.

**రచనలు:** (1) రామాయణ సుధాలహరి (2) భారతీయ ప్రతిభ (3) వేదామృతము (4) రైతు — రాజ్యాంగము (5) నానాదేశ రాజ్యాంగములు (6) ఆండాళ్ వైభవము (7) దేవాలయములు (8) మతము – భౌతిక శాస్త్రము (9) పురుషార్థములు (10) సంన్యాసాశ్రమము (11) దివ్య జీవనము (12) ఆచారములు – ఆడంబరములు (13) యుగ సమీక్ష (14) వేద సుధాకరము మున్నగునవి. ఇవియన్నియు ముద్రిత గ్రంథములే. ఇంకను అముద్రిత గ్రంథము లనేకములు కలవు.


డాక్టర్: కందాడ రంగాచార్యులు

వీరి జన్మస్థానము – కృష్ణాజిల్లా – విజయవాడ తాలూకా– పొందుగల గ్రామము. జననము 25–12–1908. అస్తమయము 25–5–1968.

వీరు విజయవాడ హైస్కూలులో స్కూలు ఫైనలు, గుంటూరు కాలేజీలో ఇంటరుమీడియేటు పరీక్షలలో నుత్తీర్ణులై, విశాఖ పట్టణమున గల ఆంధ్ర మెడికల్ కాలేజీలో వైద్య శాస్త్ర మభ్యసించి, 1935–వ సంవత్సరమున యం.బి.బి.యస్. పరీక్షలో నుత్తీర్ణత నందిరి.

1935లో భాగ్య నగరమున వైద్య వృత్తి నారంభించి, అందు దిన దినాభి వృద్ధిని సాధించి. ఒక దశాబ్ద మగుసరికే సాంఘికముగను సాంకేతికముగను హైదరాబాదులోఁ గల సాటి డాక్టర్లలో మేటిగా ప్రశస్తి గాంచిరి.

సంస్కృతమున నాటకాంత సాహిత్యమును, సిద్ధాంత కౌముదిని అధ్యయన మొనర్చి, ఆంధ్ర ప్రబంధముల నవలోకించిరి. భారత, భాగవత, రామాయణాది ప్రాచీన గ్రంథముల నధికరించిరి. ఉపనిషత్తులను, భగవద్గీతలను, భగవ త్తత్త్వ ప్రబోధకములైన త దితర గ్రంథములను పరిశీలించి, త త్సారాంశమును బాగుగా గ్రహించిరి. చక్కని నుడికారముతో తెలుగున కవిత్వ మల్లగల సమర్థతను సంపాదించిరి. భారతీయ సంస్కృతిని ప్రస్తుతించుచు, ఆంధ్ర – ఆంగ్లభాషలలో అనేక వ్యాసములను రచించి, వివిధ పత్రికలలో ప్రచురింపఁజేసిరి.

ఆళ్వారుల దివ్య ప్రబంధములను, మఱి కొన్ని సంప్రదాయ గ్రంథములను పరిశీలించి, త త్సారామృతమును తనివితీర గ్రోలిరి.

శారీరకములైన వ్యాధులనే గాక, మానసికములైన వ్యాధులను సైతము తమ వైద్య – విద్యలచే నివారింపఁగల శక్తిసామర్థ్యములను సంపాదించిరి.

1946లో హైదరాబాదు ఆంధ్ర సారస్వత పరిషత్తుకు, 1944 నుండి 1948 వఱకు హైదరాబాదు శ్రీ వైష్ణవ సంఘమునకు కొంతకాలముపాటు ఉపాధ్యక్షులుగా నుండిరి. ఇండియన్ మెడికల్ అసోసియేషనుకు రాష్ట్ర శాఖలో అధ్యక్షులుగను, కేంద్రశాఖల ఉపాధ్యక్షులుగను పదవులను నిర్వహించిరి.

వైద్య విద్యలో గల విశేషములను, అనుభవములను గ్రహించి వచ్చుటకై వీరిని 1950 లో ఇండియన్ మెడికల్ అసోసియేషనువారు ఎన్నిక చేసి, బ్రిటను, రష్యా, యూరపు దేశములకు బంపిరి. ఆ తరుణమున వీరు వైద్య విద్యలో విశేషానుభవములను సంపాదించి, స్వదేశమున కేతెంచి, తమ వైద్య వృత్తిలో విశేషముగ పురోగమించి వైద్య విద్యా రంగములలో కీర్తి ప్రతిష్ఠల నార్జించిరి.



శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు

వీరి జననము – సిద్ధార్థినామ సంవత్సర ఆషాఢ శుద్ధ ద్వాదశి (1919). జన్మస్థానము గుంటూరు మండలాంతర్గత మగు ఆలపాడు గ్రామము. ప్రస్తుత నివాసము – శ్రీ లక్ష్మీ నారాయణపురము, గుంటూరు – 4.

తండ్రిగారయిన శ్రీమాన్ ధనకుధరం రామానుజాచార్యుల వారి వద్దనే వీరు సంస్కృతాంధ్ర సాహిత్య గ్రంథములను, బాష్య భగవద్విషయాది సంప్రదాయ గ్రంథములను కొంతవఱకు అధ్యయనము చేసిరి.

శ్రీ బూరుగుల వేంకట సుబ్బావధానులుగారి వద్ద వేద విద్య నభ్యసించి, ఉపనిషత్తుల నధికరించి, శ్రౌత – స్మార్త గ్రంథములలోని ప్రక్రియలను గ్రహించిరి.

శ్రీమాన్ వేదాల నారాయణాచార్యులుగారి వద్దను, శ్రీమాన్ 'శిరోమణి' చెలమచెర్ల రంగాచార్యులుగారి వద్దను, శ్రీ బూరుగుల రామకోటి శాస్త్రిగారి వద్దను సంస్కృతములో నాటకాంత సాహిత్య మభ్యసించిరి.

చిట్టిగూడూరు శ్రీ నారసింహ సంస్కృత కళాశాలయందును, తిరుపతి శ్రీ వేంకటేశ్వర సంస్కృత కళాశాలయందును కొంతకాలము విద్యాభ్యాసము గావించి, సంస్కృతాంధ్ర సాహిత్యములలో విశేష ప్రవేశమును సంపాదించిరి.

పశ్చిమ గోదావరీ మండలమునఁగల కొణితివాడ గ్రామవాస్తవ్యులును – పండితప్రకాండులును – భగవచ్ఛాస్త్ర పారంగతులును అగు శ్రీమాన్ పెద్దింటి అప్పల నరసింహాచార్యులవారి వద్దను, తిరుపతికి సమీపముగా గల తిరుచానూరు క్షేత్రములో శ్రీ పద్మావతీ చరణ సేవాపరాయణులుగా – ఆగమ పండితులుగా విఖ్యాతి గాంచిన శ్రీమాన్ ఏ.బి. నారాయణాచార్యుల వారి వద్దను కర్షణాది ప్రతిష్ఠాంతము వఱకు శ్రీ పాంచరాత్రాగమ శాస్త్రమును అధ్యయనము చేసిరి.

విశాఖ మండలమునఁగల ఉపమాక క్షేత్రములో శ్రీ వేంకటేశ్వర చరణ సేవాపరాయణులుగా – ద్రావిడ వేద వేత్తలుగా విఖ్యాతి వహించిన శ్రీమాన్ పీతాంబరం సూర్యనారాయణాచార్యులవారి వద్ద నాలాయిరములో కొంతవఱకు వాచోవిధేయము గావించిరి.

అంతటితో నాగక, స్వయంకృషితో – ఆంగ్ల, హిందీ, తమిళ భాషా సాహిత్యములలో మంచి ప్రవేశమును సంపాదించిరి. తండ్రిగారి వద్ద నేర్చిన ఆయుర్వేద శాస్త్రము నందే గాక, స్వయంకృషితో – జల సూర్యకిరణ ప్రకృతి వైద్య శాస్త్రములందును, హోమియో వైద్య శాస్త్రమునందును, ఆంగ్ల వైద్య శాస్త్రమునందును విశేషానుభవము నార్జించిరి.

శతావధాని – శ్రీవేదాంతం లక్ష్మీకాంతముగారివద్దను, కవిశేఖర – శ్రీకేశవభొట్ల సుదర్శన వేణుగోపాల మూర్తిగారివద్దను ఉభయ భాషలలోగల కవితా విశేషములను గ్రహించిరి. సాహిత్య సామ్రాట్ – శ్రీజమ్ములమడక మాధవరామ శర్మ గారివద్ద సంస్కృతాంధ్రములలోఁ గల మెరుగులను ఆకళించుకొనిరి.

శ్రీమాన్ వరదాచార్యులవారికి విద్యార్థిదశ నుండియే మత సారస్వత విషయములలో అభిరుచి మెండుగా నుండెడిది. ఆ తరుణమునందే — మారుతీ కళ, ఆంధ్ర వార పత్రిక, ఆంధ్రప్రభ, కృష్ణాపత్రిక, వాహిని వంటి ప్రఖ్యాత పత్రికలలో గద్య పద్యాత్మకములైన వీరి రచనలు తరచుగా ప్రచురింపబడుచుండెడివి.

1942–45 సంవత్సరముల నడుమ — 'ప్రపన్న సుధ' అను సారస్వత ధార్మిక మాస పత్రికను వీరు స్వయముగా నడపి, పాఠకలోకమునకు నూతన చైతన్యమును గల్గించిరి.

1945లో – 'శ్రీ వైద్య విద్యా సంస్థానము' అను పేర నొక సంస్థను స్వగ్రామ మగు ఆలపాడులో నెలకొల్పి, తన్మూలమున దాదాపు ఒక పుష్కరకాలము పాటు వైద్య విద్యా రంగములలో ప్రజాసేవ జేసిరి.

1956 లో — 'శ్రీ రామానుజ కీర్తి కౌముది' యనుపేర నొక మహాగ్రంథమును షోడశ కళలతో ప్రకాశింపజేయ నుద్యమించి, కొన్ని సంపుటములను వెలువరించి, భక్తప్రపన్న కోటికి మరువరాని మహానందమును గల్గించిరి. ఈ గ్రంథ ప్రచురణ మహోద్యమము తిరుమల శ్రీనివాస భగవానుని యనుగ్రహ పాత్ర మగుట వీరి భాగ్య విశేషము. అయ్యదియే ప్రస్తుత కౌముదీ ప్రకాశమునకు ప్రధాన కారణము.

శ్రీమాన్ వరదాచార్యులవారు తమ యభిజనమగు ఆలపాడునుండి ఒక దశాబ్దముక్రిందటనే గుంటూరు చేరి, పితృపాదు లగు శ్రీమాన్ రామానుజాచార్యుల వారిచే ప్రతిష్ఠిత మగు శ్రీ లక్ష్మీనారాయణస్వామివారి దేవాలయమును జీర్ణోద్ధరణ మొనరించి, సర్వతోముఖాభివృద్ధి గావించుచు, శ్రీ స్వామివారి నిత్యకైంకర్యమును నిర్వహించుచు, పారంపర్య మగు సంప్రదాయమును సంరక్షించుచు, బహు ముఖములుగా ఘన కార్యములను నిర్వర్తించు చున్నారు.

తిరుమల తిరుపతి దేవస్థానముల మాసపత్రిక, శ్రీ వైష్ణవ పత్రిక, ముముక్షువు, మోక్షసాధని, గీతావాణి, రామకృష్ణప్రభ, రామ దర్శనం, ఆరాధన మొదలగు ధార్మిక మాసపత్రికలలో వీరి వ్యాసము లనేకములు ప్రచురితము లైనవి.

విజయవాడ రేడియో కేంద్రమునుండియు, మద్రాసు రేడియో కేంద్రమునుండియు వీరి ప్రసంగములు, పురాణ ప్రవచనములు, స్వీయ కవితలు మున్నగునవి కొన్ని ప్రసారముచేయఁబడినవి.

1966 వ సంవత్సరమున కాళహస్తిలో జరిగిన ఆగమ శిల్ప పండిత సదస్సుకు ఆహూతులై, అందు వీరు శ్రీ పాంచరాత్ర భగవచ్ఛాస్త్ర ప్రాశస్త్యమును గురించి మహోపన్యాసము నొసంగి, శ్రోతలను రంజింపజేసి, పండిత ప్రశంసల నందుకొనిరి.

సహృదయ రంజకమై, సముజ్జ్వలమై యొప్పు వీరి వచోవిభవమును, భావావేశమును — వక్తృత్వాంశమును ప్రస్ఫుటింపజేయుచు, సముచిత మగు రీతితో నడచుచు, గంభీరమై, రసస్ఫోరకమై, భక్తిభావ సముత్తేజక మగు కమ్మని నుడికారమును సంతరించుకొనిన వీరి రచనలలోని మాధుర్యమును గ్రహించి, సంతుష్టాంతరంగులైన ఆంధ్రప్రదేశ్ ఆస్థానపండితులగు మధ్వ శ్రీ — కాశీ కృష్ణాచార్య మహోదయులు వీరికి — 'ఉపన్యాస రత్న' 'కవితా విశారద' అను బిరుదముల నొసంగిరి.

## రచనలు :

**ముద్రితములు :** (1) మానవ దర్శనము (2) గీతోపదేశము (3) ఆళ్వారులు — దివ్య ప్రబంధములు (పరిశోధనాత్మక గ్రంథము — ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారిచే సంభావితము).

**అముద్రితములు :** (1) స్తోత్ర రామాయణము (పద్య కృతి) (2) శ్రీ విష్ణులీలా విలాసము (నాటిక) మున్నగునవి.



శ్రీమాన్ రొంపిచెర్ల
పార్థసారధి భట్టాచార్యులు

వీరి జననము—మన్మధనామ సంవత్సర భాద్రపద శుద్ధ చతుర్థీ భానువాసరము (8-9-1895). జన్మస్థానము – కృష్ణాజిల్లా, బందరు తాలూకా, ఆకులమన్నాడు గ్రామము.

వీరు — బందరు సమీపమునఁ గల గూడూరు నోబుల్ బ్రాంచి స్కూలులో ప్రాథమిక విద్యను, బందరు నోబుల్ హైస్కూలులో ఆంగ్లవిద్యను అభ్యసించిరి. ఉన్నత పాఠశాలలో విద్యాభ్యాసము చేయు తరుణమునందే సంస్కృత పండితులకడ పంచకావ్యముల జదివి, మత సాహిత్య సంబంధములైన వ్యాసము లనేకముల రచించి, గురువుల మన్ననలకు పాత్రులైరి.

1913-వ సంవత్సరమున తిరుపతి శ్రీవేంకటేశ్వర సంస్కృత కళాశాలలో విద్యార్థిగాఁ జేరి, సిద్ధాంత కౌముదితో విద్యాభ్యాస మారంభించి, కాలక్రమమున సాహిత్య, మీమాంసా, న్యాయశాస్త్రముల నధికరించి, ఆ శాస్త్ర పరీక్షలలో నుత్తీర్ణత నందిరి.

తిరుపతిలో విద్యాభ్యాసము గావించుకొని 1919 లో స్వగ్రామమునకు తిరిగివచ్చు సమయమున, వీరి ప్రతిభను గుర్తించినవారు కొందఱు – తిరుపతి దివ్య క్షేత్రమునందే వీరిని గౌరవింపవలెనని నిశ్చయించి, 'మహోపాధ్యాయ' 'వైయాకరణ కేసరి' బిరుదాలంకృతు లగు శ్రీముష్ణం వైయాకరణ సుబ్బరాయాచార్యులవారి యధ్యక్షతన నొక విద్వస్మహాసభ నేర్పఱచి, అందు వీరికి—'వైయాకరణ పంచానన' అను బిరుదము నొసంగి, వీరిని ఘనముగా సత్కరించిరి.

ఆ బిరుద—సత్కారముల నచ్చట వీరు స్వీకరించి, స్వగ్రామమునకు చేరిన తదుపరి, జ్యేష్ఠ సోదరులైన శ్రీమాన్ శ్రీనివాసాచార్యుల వారి వద్ద శ్రీ భగవ ద్వైఖానస శాస్త్రముల నధికరించిరి.

రాజ గురువులును -- ఉభయ వేదాంత పారంగతులును అగు శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల అప్పలాచార్యులు గారును, 'చతుశ్శాస్త్రవిద్వాన్' 'మహాకవి' బిరుదాలంకృతులగు శ్రీమాన్ కిళాంబి గోపాలకృష్ణమాచార్యులు గారును, మఱికొందఱును నూజివీడు సంస్థానమున ఆస్థాన పండితులుగా నున్న సమయములో – ఆ విద్వాంసులు వీరి ప్రతిభను బాగుగా గుర్తించి, వీరి ప్రతిభా వ్యుత్పత్తులను ఉయ్యూరు ప్రభువులకు స్వయముగా నివేదించి, వారిచే 1922 లో – 'విద్వత్కవి సార్వభౌమ' అను బిరుదము నిప్పించి, సత్కరింపఁజేయుటయేగాక, వీరిని ఉయ్యూరు ఆస్థాన విద్వాంసులుగా కూడ నియమింపఁజేసిరి. తదాది మూఁడు సంవత్సరముల వఱకును వీరు ఆ ప్రభువులతో కలిసిమెలసి, కాలక్షేపము జేయుచు, సంస్కృతమున 'మదనానందభాణమ్' అను గ్రంథమును రచించి, ప్రచురింపఁజేసిరి.

1925-32 సంవత్సరముల నడుమ మద్రాసులో శ్రీమాన్ మఝ్ఝాళి కృష్ణమాచార్యులవారి వద్ద నాలాయిర దివ్యప్రబంధముల నధ్యయనము గావించి, అటనుండి శ్రీరంగ క్షేత్రమునకుఁ జేరి, అచ్చట శ్రీరంగ నారాయణ రామానుజ జీయరుస్వామిగా విఖ్యాతి గాంచియున్న శ్రీమాన్ కారప్పన్‌కాడు దేశిక వరదాచార్యులవారి సమక్షమున 'శ్రీయతీంద్ర ప్రవణచెట్టిచారిటీస్' లో — పలుమారులు భగవ ద్విషయముపై ప్రవచనము గావించి, ఆ మహనీయులచే ప్రశంసాపూర్వకమైన మంగళాశాసనములను బడసిరి.

అటు పిమ్మట వీరు 1943 వ సంవత్సరమున తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యకళాశాలలో — శ్రీ వైఖానస ఆగమ శాస్త్రాధ్యాపనమునకై నియమింపఁబడి, 1955 వఱకును ఆ పదవిని నిర్వహించిరి.

1955 లో వేదపాఠశాలా విభాగము తిరుమలకు మార్చబడిన తరుణమున, ఆపాఠశాలోద్యోగమునుండి వీరు విశ్రాంతి నందిరి.

అనంతరము శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యవిద్యా పరిశోధక కేంద్రమునందు ఆగమ శాస్త్రపరిశోధకులుగా తిరుమల తిరుపతి దేవస్థానాధికారులచే నియుక్తులైరి. కాని, ఒక సంవత్సరకాలము గడచుసరికి, ఆ సంస్థ— శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమువారికి స్వాధీనముచేయఁబడినందున, విశ్వవిద్యాలయ నిబంధనల ననుసరించి వయఃపరిమితి మీరియుండుటచే, వీ రచ్చటినుండి ఉద్యోగ విరమణ చేయవలసి వచ్చెను. అయినను, తిరుమల తిరుపతి దేవస్థానములవారు వీరి బహుముఖ ప్రజ్ఞావిశేషములను బాగుగా గుర్తించినవా రగుటచే, వీరిని విడువ జాలక, ఆ దేవస్థానములకు ఆగమ విద్వాంసులుగా నియమించిరి. త దాది నేఁటివఱకును తిరుమల తిరుపతి దేవస్థానములకు సంబంధించిన నిర్మాణ కార్యక్రమములు, విశేషోత్సవాదులు వీరి సూచనల ననుసరించియే జరుగుచుండుట పరిపాటియైనది.

వీరి ప్రజ్ఞాప్రాభవములు విశ్వవ్యాప్తములైనందున, 1967 లో వీరు రాష్ట్రపతి బహుమానమును పొందగల్గిరి.

భారత రాష్ట్రపతి బహుమాన గ్రహీతలైన వీరిని తిరుపతిక్షేత్రమున శ్రీవైఖానస యువజనమండలివారు 1967 డిశంబరులో — శ్రీమాన్ మాడభూషి అనంతశయనం అయ్యంగారి యధ్వర్యమున 'ఆగమ చక్రవర్తి' అను బిరుదముతో ఘనముగా సన్మానించుటయేగాక, ఒక అభినందన సంచికనుగూడ సర్వాంగసుందరముగా వెలువరించి, త న్మూలమున శ్రీభట్టాచార్య ప్రశస్తిని లోకమునకు స్పష్టముగా వెల్లడించిరి.

అనంతరము 1968 ఫిబ్రవరిలో — ఒంగోలు పట్టణమునందును, జూలై నెలలో నెల్లూరు పట్టణమునందును, ఆగష్టులో బాపట్ల పట్టణమునందును వీరికి మహోన్నతస్థాయిలో సత్కారములు జరుగుటయేగాక, బాపట్ల సన్మాన సభలో వీరికి — 'మహోపాధ్యాయ' అను బిరుదముకూడ సమర్పింపఁబడినది.

ఉదారహృదయు లగు సంపన్నులు విరాళముగా నొసంగిన రు. 1,50,000/=లతో — తిరుమల క్షేత్రమున వీరు నిర్మించిన 'శ్రీవైఖానసాశ్రమము' అనుపేరుగల ధర్మశాల — వీరికి శాశ్వతమైన కీర్తిని చేకూర్చినది.

**రచనలు :** (1) మదనానందభాణమ్ (2) దశవిధహేతు నిరూపణమ్ (3) మరీచి సంహిత (4) ఆనంద సంహిత (5) నీతి రామాయణమ్ (6) శ్రీ భగవ దర్చా ప్రకరణమ్ (7) క్రియాధికారమ్ (8) జ్ఞాన కాండమ్ (9) శ్రీనివాస దీక్షితీయమ్ (10) మంగళాశాసన స్వరమాలిక ఇత్యాదులు.



శ్రీ దామెర రాజగోపాలరావు

వీరి జననము — ప్రమాదీచ నామ సంవత్సర వైశాఖ బహుళ అష్టమీ బుధవారము (1913). జన్మస్థానము — తూర్పుగోదావరి జిల్లా, పిఠాపురము తాలూకా, చిత్రాడ గ్రామము.

వీరు — పిఠాపురమునఁ గల ఉన్నత పాఠశాల యందును, కాకినాడలోఁ గల కళాశాలయందును, మద్రాసులోఁ గల న్యాయ కళాశాల (Law College) యందును ఆంగ్లభాషాభ్యాసము గావించి, బి.ఏ. పరీక్షలో పట్టభద్రులైరి.

తదుపరి — శ్రీ కోపల్లి శివకామేశ్వరరావుగారి వద్దను, శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి గారి వద్దను సంస్కృతాంధ్ర భాషల నభ్యసించి, ఉభయ భాషలయందును వైదుష్యమును సంపాదించి, కళాప్రియులుగా — కళాభిజ్ఞులుగా — కవితా విశారదులుగా విఖ్యాతినార్జించి, విద్వత్కవులచే 'కవి చక్రవర్తి' యను బిరుదమును పొందిరి.

వీరు జన్మతః విశిష్టాద్వైతులు. కావుననే, ప్రస్తుతము కాకినాడ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా నున్న శ్రీమాన్ శ్రీభాష్యం వేంకట అప్పలాచార్యులవారివద్ద, సంప్రదాయ రహస్యములను అచిరకాలముననే గ్రహింప గల్గిరి.

సంగీతమునందును, నాట్యమునందును, శిల్పమునందును అభిరుచిగలవారై, ఆయా కళలలోని విశేషములను స్వయంకృషితో గ్రహించి, సకల కళా విభూషితులుగా పేరెన్నిక గాంచిరి.

**రచనలు :**

**ముద్రితములు :** (1) మేఘ సందేశము (2) సౌందర నందము.

**అముద్రితములు :** 1. మృచ్ఛకటికము (రూపకము – అనువాదము) 2. వసంతసేన (ప్రబంధము) 3. మలహణ చరితమ్ (యక్ష గానము) 4. మొగలాయి భారతము (బృహత్కావ్యము) మొదలగునవి.


శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు

వీరి జననము — రుధిరోద్గారినామ సంవత్సర భాద్రపద శుద్ధ పంచమి (15–9–1923). జన్మస్థానము — కృష్ణాజిల్లాలో గల జగ్గయ్యపేట.

వీరు — ప్రాథమిక విద్యాభ్యాసము పూర్తియైన పిమ్మట, తమ తండ్రి గారయిన శ్రీమాన్ శ్రీమత్తిరుమల నల్లాన్ చక్రవర్తుల సంపత్కుమార జగన్నాథ తిరువేంకటాచార్యులవారివద్దనే సంస్కృతములో నాటకాంత సాహిత్యము, సిద్ధాంత కౌముది, తర్క సంగ్రహము మున్నగువానిని అధ్యయనము చేయుటయేగాక, తిరుమంత్రార్థాది సంప్రదాయ గ్రంథములనుగూడ అత్యంత శ్రద్ధాసక్తులతో నధికరించిరి.

1940 లో - సంగీత విద్యాభ్యాస మారంభించి, శ్రీమాన్ చింక మట్టి కందాడై కేశవాచార్యులవారి వద్దను, 'గాయక సార్వభౌమ' బిరుదా లంకృతులగు శ్రీ పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారి వద్దను సంగీత శాస్త్రములోఁ గల విశేషాంశములను గ్రహించి, గాత్ర సంగీతమునందును, ఫిడేలు వాదనమునందును మిక్కిలి నైపుణ్యమును సంపాదించిరి.

హరికథా కథనమునందుగూడ, తగిన ప్రజ్ఞాపాటవములను సంపాదించి, త్యాగరాజు, గోదాదేవి, రుక్మాంగద మొదలగు హరికథలను పలు తావులలో గానముచేసి, శ్రోతలను తన్మయుల గావించిరి.

ఆంధ్ర, ఆంధ్రేతర రాష్ట్రములలో — ఆంధ్ర దాక్షిణాత్య గాయకాగ్రేసరు లనేకులు గాత్ర కచేరీలు చేయు సందర్భమున కడు శ్రావ్యముగ ఫిడేలు వాయించి, మన్నన లందుకొనిరి.

ఉభయ భాషలలో కావ్య నిర్మాణముచేయఁగల శక్తి సామర్థ్యములను సంపాదించి, ఉభయ వేదాంతములలో నుద్దండ పండితులుగా విఖ్యాతి గడించి, సంగీత సాహిత్యములకు, మత సంప్రదాయములకు ఎనలేని సేవ గావించి, 'సంగీత సాహిత్య కళానిధి' యను బిరుదము పొందిరి.

బహుముఖ ప్రజ్ఞావిశేషములుగలవారయ్యును, నిరాడంబరులుగా — సరస సంభాషణ చతురులుగా — సంప్రదాయ విజ్ఞాన వేత్తలుగా — సహృదయులుగా విరాజిల్లుచుండుటనుబట్టియే, వీరిని ఆకాశవాణివారు సగౌరవముగా ఆహ్వానించి, విజయవాడ రేడియోకేంద్రమున 1948 సంవత్సరమున నిలయ సంగీత విద్వాంసులుగా నియమించియున్నారు.

**రచనలు :**

**ముద్రితములు :** (1) త్యాగరాజ చరిత్ర (2) గోదా త్రింశన్మాల (3) శఠకోప చరిత్రము (4) నారాయణ శతకము (పద్యకావ్యములు).

**అముద్రితములు :** (1) భూ ప్రశంస (2) చంద్రకళా త్రింశత్ (ఇవి రెండును సంస్కృత ఖండ కావ్యములు) (3) నౌకా చరితమ్ (సంస్కృత కావ్యము) (4) బిడాల మోక్షము (ఆంధ్ర వ్యంగ్య కావ్యము) (5) గజేంద్ర మోక్షము (యక్ష గానము) (6) వీరపానము (ఆంధ్ర ఖండ కావ్యము) (7) ఆంధ్ర ముకుందమాల (గేయ కృతి) (8) శ్రీనివాస కల్యాణము (యక్ష గానము) ఇత్యాదులు. ఇవి గాక, సంస్కృ తాంధ్రములలో వీరిచే రచింపఁబడిన కీర్తన లనేకములు కలవు.



శ్రీమాన్ కొమాండూరి
రామానుజాచార్యులు

వీరి జననము — విభవనామ సంవత్సర ఆషాఢబహుళ పంచమీ శుక్రవారము (6–7–1928). జన్మస్థానము — ఒంగోలు మండలమునగల తక్కెళ్ళపాడు అగ్రహారము.

వీరు — పొన్నూరులోఁ గల శ్రీ భావనారాయణస్వామి దేవస్థానమువారి సంస్కృత కళాశాలయందు విద్యాభ్యాసము గావించి, 1957-వ సంవత్సరమున 'భాషా ప్రవీణ' పరీక్షలో నుత్తీర్ణత నందిరి.

విద్యార్థిదశనుండియే ఆంధ్ర భాషలో ననేక ప్రక్రియల ననుసరించి, గద్య పద్యాత్మకములైన రచనలను వెలయించి, వానిని పత్రికలలో ప్రకాశింపఁజేసిరి.

కొంత కాలము శతక వాఙ్మయముపై ప్రత్యేకమైన పరిశోధనఁ గావించిరి.

అనేక తాళపత్ర గ్రంథములను సంపాదించి, వానిపై సమీక్షలు వ్రాసి, 'భారతి' వంటి ప్రఖ్యాత సాహిత్య పత్రికలలో ప్రచురింపఁజేసిరి.

అట్టి సమీక్షల నన్నింటిని ఒకటిగా జేర్చి, 'అజ్ఞాతాంధ్ర కవులు' అనుపేర నొక ప్రత్యేక గ్రంథముగా వెలువరింపవలెనని వీరికి అభిలాష ఉన్నది.

వీరు తమ కష్టకాలమున 'శ్రీ వేంకటేశ్వర కరావలంబ స్తోత్రము'ను గీర్వాణభాషలో రచించిరి.

విజ్ఞాన భిక్ష నిడు మని, నూటపదునారు పద్యములతో — 'మధురాంజలి'ని సంఘటించిరి.

తమ తమ కవితాసౌరభముల నందజేయుఁడని సంస్కృతాంధ్ర కవులకు 'మణిహారము' గూర్చిరి.

కవిసార్వభౌముని కమనీయ కవితా విశేషముల నుగ్గడించుచు — 'శ్రీనాథుడు' అనుపేర నొక సమీక్షా గ్రంథమును గుబాళింపఁజేసిరి.

తమ అభిమాన దైవమగు శ్రీవేంకటేశ్వరస్వామివారిని 'స్తోత్ర పారిజాతము'లతో నర్చించిరి.

శాసనాధారములతో — ప్రాచీన చరిత్రాధారములతో — 'కందుకూరిసీమ' ప్రశస్తిని లోకమునకు వెల్లడింపఁ దలచి, మూఁడు సంవత్సరముల క్రితమే గ్రంథ రచనకు శ్రీకారము జుట్టిరి.

సంస్కృతాంధ్ర భాషల వరివస్య నెరపుటయందును, అతులిత విజ్ఞాన మాధురీ మహిమలచే విరాజిల్లు పండితాఖండుల సేవించుటయందును వీరికి విద్యార్థిదశ నుండియే విశేషమైన ఆసక్తి అలవడియున్నది.

వీరిపుడు నెల్లూరుమండలమునఁ గల కనిగిరిలో — జిల్లాపరిషదత్యున్నత పాఠశాలయందు ప్రధానాంధ్రోపాధ్యాయులుగా పనిచేయుచున్నారు.

# రెండవ భాగములో

# రానున్న రచనలు



౧. **శ్రీనివాస స్తవ రాజము**

శ్రీమాన్ వానమామలై వరదాచార్యులు

౨. **మోక్షసాధనములు - ప్రపత్తిదర్శనము**

శ్రీమాన్ చెలమచెర్లరంగాచార్యులు

౩. **ముకుందమాల**

మధ్వశ్రీ—పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులు

౪. **భాగవత మత వైభవము**

శ్రీమాన్ నిడమర్తి కందాడ గోవిందరాజ శ్రీభాష్యకారాచార్యులు

౫. **పన్నిద్దరాళ్వారులు - నాలాయిర దివ్య ప్రబంధము**

శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు

౬. **పాణయోగి ప్రభావము**

శ్రీమాన్ కొమాండూరు గోపాలకృష్ణమాచార్యులు

౭. **శ్రీ నమ్మాళ్వారుల వైభవము**

శ్రీమాన్ టి.కె.వి.యన్. సుదర్శనాచార్యులు

౮. **వకుళాభరణ సౌరభము**

శ్రీమాన్ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులు

౯. **మధురసూక్తి**

శ్రీమాన్ గుదిమెళ్ళ రామానుజాచార్యులు

౧౦. **కంబ మహాకవి - శఠకోప ప్రశంస**

శ్రీమాన్ తిరుమల పల్లెర్లమూడి నారాయణస్వామి

౧౧. **విష్ణుచిత్తుల కవిత్వము**

శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులు

౧౨. **శ్రీ గోదాసూక్తిమాల**

శ్రీమాన్ మాడభూషి గోపాలాచార్యులు

౧౩. ఆళ్వారుల భక్తిసిద్ధాంత వైశిష్ట్యము

డాక్టర్ : జి.టి. గోపాలకృష్ణనాయుడు

౧౪ పరకాల విలాసము

శ్రీమాన్ నల్లాన్‌చక్రవర్తుల కృష్ణమాచార్యులు

౧౫. దశవిధ వైష్ణవులు

శ్రీమాన్ లంకా వేంకట నరసయ్య సూరి

౧౬. శ్రీ వేంకటేశస్తుతి

శ్రీ వంగవోలు ఆదిశేషశాస్త్రి

